శ్రీ ర స్తు

# తా రా బా యి

---

## మొదటిప్రకరణము

ఉ. ఏమహనీయుఁ గన్గొన నతీంద్రియు లాహితకర్మకుల్ యతి
స్వాములు సర్వయత్నములు సల్పుదు రేతనిఁ బొందలేక యా
ప్రామినుకు ల్వాడిం దిరిగి వచ్చును డెందముతోడ నాపరం
ధాముఁ బరాత్పరు న్మది నుదారముదంబునఁ గొల్తు నెంతయున్.

తా నొకటి దలఁచిన దైవ మొకటితలంచు ననెడిలోకోక్తి సార్థకంబని నేఁడుతోఁచుచున్నది. నాచేసినప్రయత్నము విఫలమగుటయేకాక స్థానభ్రష్టత్వమ్ము పరీభావంబుగూడ సమకూరె. హా! ఆదురాత్ముఁడు నన్నెట్లు మోసపుచ్చినాఁడు! మొదట నర్ధరాజ్యం బిచ్చెదనని వాగ్దానముచేసి సాంత్వవచనంబులతోఁ దనకార్యంబుల సఫలీకరించికొనుచుఁ దుదకు నాకేమియుం నీయక కట్టుగుడ్డలతో వెడలఁగొట్టినాఁడు. ఆకటా! ఆదుష్టుం డిట్లు చేయునని యెఱుంగను. అతనికుమారికయే రాజ్య మేలునఁట. వాని కిట్టి చెడుబుద్ధులు పుట్టుచున్న వేమి! 'చెట్టు చెడుకాలంబునకుఁ గుక్కమూతిపిందెలఁగాచు' నను లోకోక్తి వీనియెడ సార్థక మగుచున్నది. అబలకు రాజ్య మేలునంతటి సామర్థ్య ముండునా? చేతులకు గాజులఁ దొడిగికొని పెరవారలఁజూడ సిగ్గుపడుచు నంతఃపురంబులో వర్తింపఁదగిన స్త్రీ లెక్కడ! కత్తిచేతఁబట్టికొని ప్రాణంబులకైన నాశింపక జంకక యుద్ధరంగంబులయందు శత్రుసైన్యంబుల నెదుర్కొని తద్బలయంతంబుగ వారిఁ జక్కడంచి ప్రజల కుపద్రవంబు గలుగనీకుండ

రాజ్యంబు పాలించు టెక్కడ? నీతినిపుణులును బరాక్రమశాలులును ఆయుధ విద్యాచతురులు నైన యుత్తమరాజపుత్త్రులే తమతమరాజ్యంబులఁ గాపాడి కొనలేక మ్లేచ్ఛభూతముల వాతం బడవేయుచుండఁగా నబలయు, బుద్ధిహీనయు, భయశీలయు నగు నాదుది రాజ్యమె ట్లేలఁగలదు? ఏలఁబూనికొనిన నవి చిరకాలము నిల్చు టెట్లు? ఈరాజ్యంబును దనకుమారి కీయఁబూనుట యామెప్రాణములఁ దీయుటయ గాని వేఱుకాదు. నేనిట్లు నీతిబోధకంబుగ నుత్తరంబువ్రాయఁగా నాయుత్తరము వానికి హితంబుగాఁ దోపలేదు. అవును! చెడఁదలఁచినవానికి బంధువులు కఱపిన హితవచనంబులు విషకల్పములుకావా, పోనిమ్ము వానిగర్వమే వాని నంతంబు పొందింపకమానదు. అతనికిఁ దగినచుట్టములు లేకపోవుటచే నాతనిరాజ్యంబు కాపాడుటకై యిచ్చటికివచ్చి యతనికి యుద్ధములయందు సాహాయ్యముచేయుచు నింతపఱకు నతనియాజ్ఞకు లోఁబడి చేయుమన్న పనిచేయుచు వర్తించితిని. ఇదియంతయు బూడిదలోఁ బోసిన పన్నీర మట్లు వ్యర్థమాయెను. అతనికి నేను దగ్గఱబంధువునుగదా? ఎంతకాలమునుండియో వాని నాశ్రయించి యున్నానుగదా? ఆయభిమానంబుచేతనయిన నాకు రాజ్యం బీయఁదలంపకున్నాఁడు. రాజ్యాధికారము నాకేలరాదో చూతము. అతఁడు దుర్మార్గుఁడై యిచ్చుట కంగీకరింపకపోయిన నాచేతిఖడ్గమే నాకు రాజ్య మప్పగింపఁగలదు. ఒక్కకుటుంబములోఁ గలహము లెందుకని మిగుల విచారించి సామముచే నెన్నిమారులు చెప్పినను వినక 'తాఁబట్టినకుందేటికి మూడేకా' ళ్లనుసామెతను స్థిరపఱుచుచున్నాఁడు. అక్కటా! దీనిమాటకేమి! వానిదురాలాపంబులు నామనంబు నెరియించుచున్నవి. నేను కడుపుకూటికేమో చేరితినఁట. ఉత్తమరాజపుత్త్రునకు నింతకంటె గౌరవహీనతకలదా? శూలములపోటులనైన సహింపవచ్చునుగాని బంధువులాడినకాఱుమాటల సహించుట కష్టము. నేను కడుపుకూటికే చేరితినో లేకయతండు రాజ్యంబు చేయుట కశక్తుఁడగుటంబట్టి యతనికి సాయపడుటకే వచ్చితినో నిష్పక్షపాతబుద్ధితో నాలోచించిన వానికందఱకుఁ దెల్లము కాకమానదు. ఇంక నేనూరకుండుట యుక్తముకాదు. యుద్ధముచేసి యందాతని సంహరించి రాజ్యముచే

కొనవలయుం. అట్లయినఁ గాని నా పౌరుషము వెలువడదు. కనుక కత్తిపట్టికొని యుద్ధము కావించెదను. ఏకాకినైన నేను జతురంగబలసమేతుం డయిన వాని తోఁ బోరఁగలనా? తనబలము నెదిరిబలముం జక్కఁగా నాలోచించి యుద్ధము చేయవలయు. అట్లు చేయనియెడలఁ బ్రాణాపాయకర మగునని నీతి కోవిదులు వక్కాణించుచున్నారు. ఇట్లుండ నేనెట్టులు యుద్ధము చేయఁగలను? కాన దండోపాయము ప్రస్తుతము యుక్తముగాఁ గనిపింపదు. సామోపాయ మవలం బించినచో కార్యము నెఱవేఱుట నిశ్చయమని పెద్దలందురు. కాని యది నాకు వలనుపడదు. ఇప్పుడు నేఁ దిరిగి తోధానగరంబునకుఁ బోయి వారితో మైత్రి చేసి రహస్యముగా నందఱ నాయధీనము కావించికొని యెదురు వేచి వారలఁ జంపి కదా? రాజ్యంబు చేకొనవలయుం. అది యెట్లు సరిపడును? ఆరాజునకుఁ బ్రాణాస్పదమయిన కూఁతును విషము పెట్టి చంపయత్నించిన నన్ను వారలు తిరిగి నమ్ముదురా! అచ్చట వారందఱకు నాదుష్టచేష్టలు రోఁతపుట్టించియుం డఁగా నేనిప్పుడు పోయి వేఁడుకొన్నను వారు చేరఁదీయుదురా? నీతినిపుణుం డగు నారాజంత యవివేకి గాఁడు. మొదటనేఁ దెల్వితక్కువపనిఁ జేసితిని. ఆ రాజపుత్త్రికనుఁ బెంచుచున్నదాదికిఁ దగినంత లంచమిచ్చియామెచేత నాపిల్లను జంపించినచో నామనోరథము తప్పక నెఱవేఱవలసినదే! ఇంతకు నాయవివే కమే నన్నుఁ జెఱిచినది. అట్లే చేసినచో నాపిల్ల తప్పక మృతినొందియుండును. ఆరాజును జేయునదిలేక రాజ్యము నాకే యొసంగును. అయిన నిప్పుడు విచా రించుట గతజలసేతుబంధనమువంటిది. ముందు గర్తవ్య మాలోచింపవలయుఁ గాని యిట్లు విచారించుటవలన లాభమేమి? ప్రస్తుతము సామదండోపాయం బులు ప్రయోక్తవ్యములు కావు. మఱియే రాజపుత్త్రునినైనఁ దోడుగాఁగొని వచ్చి వారల జయింతమన్నను, వారివారి రాజ్యంబులు గాచికొనుటయే మిగులఁ గష్టముగా నుండ నారాజపుత్త్రులు నాకు సాయపడవత్తురా? అయినను బెక్కం డ్రు రాజపుత్త్రుల గౌరవమునకుఁ బాత్రుండైనయా రాజు పైకిఁ గత్తిగట్టెడు రాజ కుమారుఁడే నాకంటికిఁ గనపడఁడాయెను. కావున నీరాజపుత్త్రుల నాశ్రయించి నను లాభములేదు. ఇక్కాలములో హిందూదేశములో మిగుల బలిష్ఠులు న

పాపకార్యములకు వెఱవనివారును దురుష్క ప్రభువులు తప్ప, మఱియెవ్వరును లేరు. నేనుబోయి వారల నాశ్రయించినచో నాకార్యము నెఱవేఱకమానదు. నేను ముందుగా వారియొద్దకుఁబోయి తేనెలొలుకు కులుకుఁ బలుకులచే వారిని నావలలో వేసికొని నాయధీనము చేసికొనవలయును. దుర్మార్గులు మూర్ఖులు నగు నాతురుష్కవీరులు నామాటలకు లోఁబడుదురా? పోనిమ్ము రాజ్యమిచ్చెద నని యాశపెట్టినచో వారు రాజ్యము స్థాపించుకొనుటయందు మిగులఁ గుతూహలముకలవారు గనుక నాకుఁ దోడుపడుదురు. కాని; రాజ్యంబువారలకిచ్చి వేసినచో నేనింత శ్రమపడుటకు లాభమేముండును? పలుకష్టము లనుభవించుటయు, నిజబంధువులప్రాణములఁ దీయనెంచుటయుఁ, బాపంబుల కింతేనియు వెఱవకుండుటయు వీనినన్నింటి నవలంబించుట రాజ్యమపేక్షించియేకదా? ఈ రాజ్యమంతయు మహమ్మదీయులకేయిచ్చినచో శ్రమపడుటతప్ప నాకేమి ప్రయోజన ముండును? పోని మర్ధరాజ్యమిచ్చునట్లు వాగ్దానముచేసినచో మొదట నర్ధరాజ్యంబునకు సంతసించి పుచ్చుకొని తరువాత తక్కినభాగముఁగూడ నాక్రమించికొని నన్నుఁ దఱిమివేసినచో నేనేమిచేయఁగలను? కావున రాజ్యంబు వారలకిచ్చెదనని యాశపెట్టుట యెంతమాత్ర ముచితంబుగాదు. మఱియొకయుపాయమేదైన యోజింపవలయు. మహమ్మదీయులమనంబు నాకర్షించునంతటి యుపాయము నేనెట్లు వెదుకఁగలను! ఒకటిచేసిన బాగుండును...ఆఁ! ఈయుపాయమే మిగుల యుక్తముగానున్నది. హిందూరాజపుత్త్రికల సౌందర్యము నిరుపమానమయినదిగదా! వారిసౌందర్యమెట్టివారల మనస్సులనైన నాకర్షింపకమానదు, కావుననే యల్లాయుద్దీనంతటి మోటువాఁడుఁగూడ హిందూ రాజపుత్త్రికయగు పద్మినియందమునకులోఁబడి పద్మినిఁ దనకు నిచ్చినచో రాజ్యమంతయుం వారి కిచ్చివేసెదనని చెప్పియున్నాఁడు. ఆ కాలపుస్త్రీలలోఁ బద్మిని సౌందర్యమున కెంత ప్రసిద్ధికాంచినదో, యీకాలపుస్త్రీలలో నీరాజపుత్త్రికసౌందర్యమున నంత ప్రసిద్ధికెక్కినది. ఈరాజపుత్త్రిక యొకభాగము. రాజ్యలక్ష్మియొక భాగము. రాజపుత్త్రికాభాగము నిచ్చెదనిన నెట్టితురకలును జేతులుకట్టికొని నాకు దాసానుభూతు లయి తిరుగఁగలరు. కావున రాజపుత్త్రిని వారలు గ్రహిం

చునట్లును రాజ్యలక్ష్మిని నాకొసంగునట్లును వాగ్దానములు చేసికొనవలయును. ఇట్లయినఁగాని నాకార్యము నెఱవేఱదు. నాఁడు నేను విషముపెట్టించినను నారాజపుత్త్రి బ్రతికియున్నదని మిగుల విచారించితిని. ఆమె బ్రతికియుండుటే నాకు మిగుల నుపకరించినది. ఆపిల్లది లేకపోయినచో నాకురాజ్యము లభించుటయే దుర్ఘటమయి యుండును. ఇంక నిప్పుడు విచారింపఁబనిలేదు. అకటా! నేనుత్తమరాజుల కులమునఁ బుట్టి తుచ్ఛులైన మేచ్ఛుల నెట్లుసేవింతును? ఒకవేళ సేవించుటకు నేనిష్టపడినను తక్కిన రాజపుత్త్రులందఱుతలవాచునట్లు తిట్టకమానుదురా? పూర్వము జయచంద్రుఁడు పృథ్వీరాజునకుఁగాకమహమ్మద్ఘోరీకి సహాయపడినాఁడనియేకదా నేటివఱకుఁ బ్రతివారును జెడఁ దిట్టుచున్నారు? తనజాతివాఁడగు పృథ్వీరాజునకుఁ దోడుపడియుండలేదన్నంత మాత్రముననే జయచంద్రుని దిట్టుచుండగా నేను తురకలకు దాసీభూతుండనై కొలుచుచు నుత్తమక్షత్త్రియవంశమందుఁ బుట్టినదియు, సమస్త సద్గుణాకరాలును నాకు బాంధవ్యురాలు నగు నారాజపుత్త్రిని గొనిపోయి కఱకుతురకకుఁ బెండ్లి చేసినచో నన్ను సాటిరాజపుత్త్రులందఱు తిట్టుదురని వేఱేచెప్పవలయునా? చంచలా సదృశములయిన సంపదల, కాసింపక కులయశఃంబుచెడగొట్టకుండ నుండుట మంచిదా? ఆలోచింపవలసియున్నది...ఆఁ—ఆలోచించుటకేమున్నది. ఆలోచించినట్టే యున్నది. పాపంబునకు వెఱచి దుష్కీర్తివచ్చునని వెనుక ముందులాలోచించినచో ధనవంతుఁ డగుటెట్లు? యుద్ధములయందుఁ బెక్కండ్రు హతులగుదురు కావున నందువలన పాపంబుసంభవించునని యాలోచించినచో నీలోకములోనున్న రాజులందఱు తమతమరాజ్యంబులఁగాపాడికొనఁగలరా? కనుక నేనిఁక వెనుక ముందులు చూచికొన లాభము లేదు. పలువురు నిందించిన నిందింతురు కాక, నాకలంపు నేమాన. బలిష్ఠుఁడయిన యొకతురుష్కప్రభువు నాశ్రయించెదను. వానికి నారాజపుత్త్రిని గొనిపోయి పెండ్లిసేసెదను. అందువలన, నాకాతఁడు నాశత్రువులజయించి రాజ్యంబీయకమానఁడు. అప్పుడు నేను సుఖంబుగ రాజ్యమేలుకొందును. ఇప్పుడు నేనేమిపనిచేయవలయు నననాఁ దోధానగరపురాజునకు ముఖ్యమిత్త్రుఁడయియున్న రత్నసింగు నేరీతినైనఁ జంపింపవలయును. ఆవులించినఁ

ద్రేవులు లెక్కపెట్టఁజాలినవాఁడును మహాబుద్ధిమంతుఁడు నగుగోపాలసింగు నిదివఱకే చంపించియున్నానుగదా? వాఁడు చచ్చినప్పుడే శత్రువులబలము సగ మణఁగినది. ఇంక నీరత్న సింహునిగూడఁ దుద ముట్టించినచో శత్రువులబలము నశించినదనియే చెప్పవచ్చును. నేను మఱికొంతకాలము తోధానగరమందుండుట తటస్థించిన వాఁడపలీల నే యమలోకంబున కతిథియయియుండును కానియట్లు జరిగినదికాదు. పోనిమ్ము? ఇప్పుడుమాత్రము వానిపంతము పొందింప లేక పోదునా? అని యిట్టులాలోచించుచు నొకరాజపుత్త్రుఁడు హారావళీపర్వత ప్రాంత గహనంబునఁబడిపోవుచుండెను. అతఁడు యుద్ధోపకరణముల నన్నియుం ధరించియుండెను. అతఁడొకయున్నతాశ్వము నధిరోహించి యుండెను. అతఁడిట్లు కొంతదూరముపోవునప్పటికి సూర్యుం డస్తమించె. చీఁకట్లు కొంచెకొంచె మావరించుచుండెను. ఆరాజపుత్త్రుఁడు ధైర్యశాలియే కాని యంధకారబంధురమయిన సమయమునం దటువంటి సాంద్రారణ్యమునఁబడిపోవుటకు భయపడుచుండెను. అతఁడు పోఁదగినస్థలమచ్చటికి కొకక్రోశమాత్రంబే యున్నది. కాని యట్టిసమయమందు నిమ్నోన్నతమార్గమునంబడిపోవుట నాలుగుక్రోసుల పెట్టునేల యెచ్చుతగ్గులుగా నుండుటచేతను, చీఁకట్లప్పటికప్పుడే యావరించి దారినిబాగుగఁ గనఁబడకుండఁజేయుంటచేతను, హయారూఢుండై పయనముచేయుంట మిగులఁ గష్టముగా నుండెను. అందుచే నారాజపుత్త్రుఁడు తురంగము నవతరించి ప్రయాణముచేయుంట కాలోచించెను గాని పెద్దపులులకు వాసభూతమైయున్నయామడవిలో గాలినడకనుబోయినచోఁ బులివాతంబడుట నిక్కంబని తలంచినవాఁడై హయము నవతరింప నిష్టపడకుండెను. అతఁడు హయారోహణనిపుణత మెండుగఁ గలవాఁడగుటచే నాసైంధవమును మెల్లగా నడపుచుండెను. కాని యాహయము చెవులు నిక్కించి నలుదిక్కులు పొడఁ గాంచుచు, నడుగుదీసి యడుగు పెట్టకుండెను. అదిపూర్వము కాలిసన్నచేసినంతమాత్రముననే వాయువేగముతోఁ బోయెడిది. కాని యిప్పుడు శరీరముపై కశాఘాతంబులు పడుచున్నను, నడుమువంచుచు మందముగా నడువఁ జొచ్చెను. అందుచే మనబాటసారి చేయునది లేక యతి

మందముగాఁ బోవుచుండెను. రాత్రి మీఱుచున్నకొలఁదిని చీఁకట్లధికమైనట్టులే యతనిమానసమందు విచారము హెచ్చఁజొచ్చెను. ఆసమయమందే పూర్వ మాయరణ్యప్రాంతములయందుఁ ఖులులచేఁ జేయఁబడిన నరహత్యలన్నియుం నత నికి జ్ఞప్తికిరాఁదొడగెను. అందుచేనతఁడు ప్రాణంబులు పిడికిటఁ బెట్టుకొని చీమ చిటుక్కుమనిన నలుగడలు పరికించుచుఁబోవుచుండెను. మార్గాయాసంబునఁ బొడమిన చెమ్మటకు భయంబువలని చెమ్మట తోడుపడి యతనిచే సచేలస్నానము చేయించుచుండెను. మనబాటసారి యుద్ధములయం దాఱితేరినవాఁడు కావున నింకను బ్రాణంబులనిల్పి యుంచెనుగాని మఱియొకఁడైనచో నీపాటి కక్కడ నే యమలోకంబునకుఁ బయనంబుగట్టియుండు. ఇట్టిసమయమున మనబాటసా రికి 'ఎవరాహోయెడివారు' అనెడి యొకయెలుంగు కర్ణపథంబునంబడియె. ఆసమ యమున నతనికిఁగలిగిన యానందము పాఠకులుగ్రహింపవలయునేకాని వ్రాయ వలనుపడదు. అతనిప్రాణంబులు మఱలఁగుదుటఁబడఁజొచ్చెను.ఆరెండవబాటసారి యెలుంగువినఁబడినతోడనే తనపయనమునిలుపుచేసినాఁడు కావున రెండవ బాటసారి వేగముగానే యీరాజపుత్రునితో గలిసికొగలిగెను. ఆబాటసారి సమీపించుకొలఁది నతనిభయము దూరమగుచుండెను. ఇంతలో నాక్రొత్త బాటసారి సమీపించి "అయ్యా! మీరెవ్వ" రని యడిగెను. అంత రాజ పుత్త్రుఁ డానందముపట్టజాలక కొంతసేపూరకుండి వానితో నిట్లుసంభాషించె.

రా.—అయ్యా! నేను రాజపుత్త్రుఁడను ఒకకార్యమునిమిత్తము భిల్లవాటికకుఁ బోవుచున్నాను.

బా.—ఇట్టి గాఢాంధకారబంధురంబైన సమయములో నేలపోవుచున్నారు? ఇది మిగుల ప్రమాదకరము. ఈమధ్యనే యొకబాటసారి నొకపులి నోటఁబడవేసికొన్నది.

రా.—అవును నిశ్చయమే, ఈప్రదేశ మిట్టిదియే యని నాకుఁ దెలియును! గాని నేనీవనముఁ జొచ్చునప్పటికిఁ బ్రొద్దుపోయినది! ఏమిచేయుదును?

బా.—మీ రెచ్చటనుండి వచ్చుచున్నారు?

రా. — నేను బోధానగరమునుండి వచ్చుచున్నాను!

బా.—అయ్యారే! ఎంతదూరము పయనముచేసినారు!

రా.— ఇయ్యది దీర్ఘప్రయాణమే రెండుబసలు చేయవలసినది. కాని తొందర కార్యము లుండుటచే నింత త్వరగాఁ బ్రయాణముచేయక తీఱినది కాదు. మీకాపుర మెచ్చట ?

బా.—మానివాసస్థానము భిల్లవాటియే.

రా.—సరియే. చాలసంతోషము. నీ వెచ్చటనుండి వచ్చుచున్నావు ?

బా.—ఈసమీపమందున్న పల్లెలో మా మేనమామ యున్నాఁడు. ఆతని యొద్దకుఁబోయి తిరిగివచ్చుచున్నాను.

రా.—ఇట్టిసమయమం దీప్రాంతములయందుఁ బయనము చేయుట ప్రమాదమని నన్నుమందలించినావే ? నీ వేల యిట్లు ప్రయాణము చేయుచున్నావు.

బా.—మాకట్టిభయ మెంతమాత్రము లేదు ఇప్పుడేకాదు. మంది నిశీథమునందైనను నిర్భయముగా జరింపఁగలము. మా కటువంటిభయమే యుండిన నీప్రాంతములయందుఁ జరింపఁగలమా ?

రా.—మీకింతసాహసము లేనిచో నీయరణ్యమందు నివసించియుండఁగలరా ! గ్రామంబునకు దారిఁదీయుము.

బా.—అయ్యా ! నేనిప్పట్టున గ్రామంబులోనికి రాను. ఈదగ్గర పల్లియలో నొకకార్యము నెఱవేర్పవలసియున్నది. అచ్చటికిఁ బోయెదను. ఇదిగో నిదే యీయూరికిఁబోవుమార్గము (అని పెడత్రోవంబడిపోవుచుండు).

రా.—ఓయి ! నన్నొంటిగా విడిచిపోవుట యుక్తముకాదు. భిల్లవాటికకు మార్గ మేదియో తెలిసికొనలేక చిక్కులలోఁబడియున్నాను. ఇదిగో వేడికొనుచున్నాను. నన్ను భిల్లవాటికకుఁ జేర్పుము. నీకుఁ జాలపున్నెముండును.

# మొదటి ప్రకరణము

బా.—నిశ్చయమే. కాని యొకకార్యంబు నెఱవేర్చికొనఁ బోవుచున్నాను.
ఆకార్య మీరేయి తప్పక జరుపవలసియున్నది. నేనేమిచేయుందును?
రా.—పోనిమ్ము. నన్ను భిల్లవాటికకుఁ జేర్చి, పిమ్మట నీకార్యంబునకై పొమ్ము.
బా.—అట్లు పోవుట చాల ప్రయాసకరము. అట్లేపోయెద. సెలవిండు.
రా.—చూడు. నిలువుము. ఒకమాటచెప్పెద. నీకేమయిన నిచ్చిసంతసింపఁజే
సెదను. రమ్ము. నన్నీయడవినుండి తప్పింపుము.
బా.—ఏ మిచ్చెదరు?
రా.—రెండురూపాయి లిచ్చెదను.
బా.—అట్లుకాదు. నాలుగురూపాయిలకుఁ దక్కువయిన నేనురాను.
రా.—అట్లే యిచ్చెద.
బా.—ఇప్పుడే యీవలయును.
రా.—ప్రస్తుతము దగ్గఱ రొక్కము లేదు. ఊరుచేరగనే యాభిల్లనాయకు
నడిగి యిచ్చెదను.
బా.—అట్లయిన నేనురాను. గ్రామములోనికిఁ బోయిన పిమ్మట యియ్యననిన
నేనేమిచేయుందును?
రా.—నే నట్లుమోసపుచ్చు వాఁడనుకాను. నేనుత్తమరాజపుత్త్రుఁడను. మానోరి
నుండి వెలువడినమాట శిలాలిఖిత మనుకొనుము.
బా.—మీరుచెప్పినమాటలు కృతయుగమునాటివి. ఇప్పుడు రాజపుత్త్రులలో
నెందఱసత్యకంబు లాడుచున్నారుకారు? నాకట్లు పనికిరాదు. ప్రస్తుత
మేమయిన నిచ్చిన వచ్చెద.
రా.—(ఆలోచించి) ఓయీ! ఈయుంగర మందాక నీయొద్దనుంచుము. నీకు
సొమ్మిచ్చినప్పుడు నాకు దిరిగి యిచ్చివేయుము. (అని యిచ్చును)
బా.—(ఆయుంగర మందికొని) నాకీయుంగరమేల? రొక్కమే కావలెను.
రా.—నీకు నమ్మకము నిమిత్తమిచ్చినాను. అది యమూల్యమైన రత్నముతోఁ
గూడియున్నది. నాలుగురూపాయలుచేయకపోదు.

బా.—మీవంటివారి కెంత మూల్యమయినచేయుంను. మావంటివారికి దాని విలువ నాలుగుడబ్బులని తోపకమానదు.

రా.—నీవు గ్రామముచేరగానే రొక్కమిచ్చి యుంగరమును తీసికొనెదను. లెమ్ము. అప్పుడు తప్పక యీవలయును జుమీ!

బా.—ఆ తప్పకయిచ్చెదను. ఇది మాకెందుకుఁ బనికివచ్చును? రొక్కమే కావలయును.

రా.—ఇఁక దారితీయుము. రాత్రి యతిక్రమించుచున్నది.

బా.—(ముందుగ రెండడుగులునడచుచు) అయ్యా! ఇటురండు. (అనిపిలిచి) ఇఁక గుఱ్ఱముపై పయనముచేయుట కష్టము. మీరు దిగి నడిచిన బాగుండును.

రా.—"నీవుచెప్పినమాట నిశ్చయమే; అట్లేచేసెద"నని (హయమునవతరించి కళ్లెపుద్రాఁకు చేతఁబట్టుకొని నడుచుచు.)

బా.—నాలుగడుగులు తొందరగా వేయుఁడు. ఇదిగో వచ్చితిమి. ఈతోఁట దాఁటినచో నూరుచేరినవారమే!

రా.—మీనాయకుఁడు క్షేమముగా నున్నాఁడా?

బా.—క్షేమముగానే యున్నాఁడు. కాని మానాయకునకును మీకును బరిచయ మున్నదా?

రా.—లేకేమి? మాశరీరములు వేఱుగాఁబ్రవర్తించుచున్నవికాని మనస్సొక్కటియే.

బా.—అట్లయిన చాలసంతోషము. మానాయకుని యొద్ద కేమిపనియుండి వచ్చుచున్నారు.

రా.—ఆకార్యము మిగుల రహస్యమయినది. చెప్పవలనుపడదు. తరువాత మీకే తెలియఁగలదు.

బా.—పోనిండు. చెప్పనక్కఱలేదు. నాకు రొక్కమిచ్చినట్లు మా నాయకునితోఁ జెప్పకుఁడు. అట్లయిన మాటవచ్చును.

రా.—చెప్పను. నీవు నాకుపకారముచేయఁగా నీకపకార మొనరింతునా?

అని యిట్లు వారిరువురు సంభాషించుకొనుచు నాలుగుగడియలరాత్రి యగునప్పటికి భిల్లవాటిక ప్రవేశించినతోడనే యాబాటసారి రాజపుత్త్రునకుఁ దమనాయకునియిల్లుచూపి యతనియొద్ద సెలవుఁగైకొని తనగృహమునకుఁ బోవుచు నుంగరముమాట యేమిచేసెదరని యడిగెను. అదివిని రాజపుత్త్రుండు వానిం జూచి "ఓయీ! ఇప్పుడు చాలరాత్రి కావచ్చినది. ఇంతరాత్రివేళ సొమ్ము నొరులనడుగ నిష్టములేదు. రేపుదయముననే రమ్ము నీసొమ్ము నీకిచ్చి నాయుంగరమ్ము గైకొనెద" నని పలికెను; నావుడు వాఁడు వల్లెయని పోయెను.

---

# రెండవ ప్రకరణము

ప్రాగ్దిశాముఖంబున లేగుఱుక్క చూపట్టె. నిశ్శబ్దంబుగానుండు లోకంబంతయుఁ గలకలధ్వనులతో నిండుచుండె. రాత్రించరంబు లగు ఘూకాది జంతువు లాహారంబులఁగొని తమతమనిలయంబుల కరుగుచుండె. తక్కిన సమస్తజంతువులును గోలకోలమని ధ్వనిచేయుచు నలుదిక్కుల కరుగుచుండె. ప్రతిదినమ్ము కట్టె లమ్ముకొని జీవించు వారందఱు నొకరినొకరు బిలుచుకొనుచు మార్గముపొడవునను దమతమ ప్రభావంబుల వర్ణించుకొనుచుఁ బోవుచుండిరి. వ్యవసాయదారులు నాఁగేళ్లను భుజములపై నానించుకొని వృషభంబులఁ దోలుకొనుచు దమతమపొలంబులకుఁ బోవుచుండిరి. తెల్లవారుజాముననే లేచితమబాలురకు వేదమునంతజెప్పిచాలించి బ్రాహ్మణులుస్నానాదులకరుగుచుండిరి. తల్లులు శిశువుల యుఁగ్గుగాఁచిపోసి మంచంబులపై బరుండబెట్టి జోకొట్టుచుండిరి. బాలురు కొందఱు శ్రద్ధాశాలురై వేఁకువనే లేచి తమతమపాఠంబులఁ జదువఁదొడంగిరి. రాత్రియందుఁ బాదుకొనియున్న తిమిరంబు క్రమక్రమంబుగఁ జెల్లాచెదరై జాదగాసి ధనసంపదచందంబున నదృశ్యమగుచుండె. సూర్యభగవానుఁడు క్రమక్రమముగ నొక్కొకసోపానం బెక్కుచు గగనప్రాసాదంబునధిరోహించుచుండె.

అంత దినకరకరప్రసారంబులు మున్ముందుగఁజని యున్నతంబులగు పర్వతశిఖరంబులను వృక్షాగ్రములను నధిరోహించుటంబట్టి యవి బంగారుపూఁతబూసిన చందంబునఁ బ్రకాశింపఁ దొడంగె. చిరకాలముతమ్మెడబాసిన ప్రియుండగుసూర్యుని సందర్శనమాత్రంబున నత్యంతసంతోషాక్రాంత లగుపద్మినులు హిమబిందుసందోహమనెడు నెపంబున నానందబాష్పంబుల వెల్లిగొలుపుచుండె. మృదుమధుర పక్షికలకలంబులచేతను, తుమ్మెదల ఝుంకృతులచేతను, మందమారుతంబులచేతను నాసమయమునజనులకు మిగుల సౌఖ్యావహమైయుండె. ఇట్టితరి నొకరాజపురుషుండు హిరాపళీపర్వతముల కభిముఖుఁడై పోవుచుండెను. అతనికి సుమా రిరువదిసంవత్సరములకంటె నధికప్రాయముండకపోవుటచేనతఁడు యౌవనప్రారంభదశయందున్నాఁడని నిర్ణయింపవచ్చు. ఈయర్థమును నిర్ణయించుటకు వచ్చియుంరానిశ్మశ్రువులే ప్రమాణము. అతనిఫాలభాగము మిగులవిశాలమై యదృష్టమును సూచనజేయుచుండెను. అతనికన్నులాకర్ణాంతదీర్ఘములయి, యతఁడసాధారణపురుషుఁడని తెలుపుచుండెను. అతని బాహువులు స్తంభసదృశములయి దీర్ఘములై మహాపరాక్రమవంతుఁడని ఘోషించుచుండెను. అతనిశరీరంబు దృఢమై సౌందర్యమహితమై యతిమనోహరమైయుండెను. అతనిచూపులే యతని ధైర్యగుణమును వెలువరించుచుండెను. లోహమయమైన కవచమొకటి యాతని శరీరము నావరించియుండెను. అట్టిదె శిరస్త్రాణమొకటి తలపయి విలసిల్లుచుండెను. అతనిముఖముతప్పఁ దక్కినశరీర మింతేనియుఁ గనఁబడమిచే నతఁడు తెల్లనివాఁడో నల్లనివాఁడో చెప్పలేము. అతని మొలయందు భయంకరమైన ఖడ్గమొకటి వ్రేలాడుచుండెను. కేవలము ఖడ్గమేయననేల మఱికొన్ని యుద్ధసాధనములు గూడ మొలచుట్టును వెలయుచుండెను.అతఁడొక పారసీకాశ్వముపైనధిరోహించి పోవుచుండెను. అతఁ డాగుఱ్ఱమును బలుతెఱంగులుగా నడిపించుచుండుటచేతను, ఆతఁ డెట్టివిషమప్రదేశమందైన నవతరింపక యాహయమును బరువెత్తించుచుండుటచేతను, నశ్వారోహణ నిపుణత యతనికి మెండుగలదని నొక్కి వక్కాణింపవచ్చును. పయిని చెప్పఁబడిన లక్షణములఁబట్టి యోజింప నతఁడొకవీరుండనియు, మృగయావిహారార్థ మాపర్వతప్రాంతమున కేఁగుచున్నాఁ

డనియెం జదువరులకుఁ దెలియకపోదు. ఈపురుషుఁడు వేకువజామున నే లేచి, వచ్చియుండుటచే నితఁ డాపర్వతమును సమీపించుచునప్పటికి జలజాప్తుఁడుకూడ నుదయమహీధరమును సమీపించెను. అయ్యడవి మిగుల మనోహరముగానుండెను. రాత్రియందుఁ గురిసిన మంచుబిందువులను వహింపఁజాలక తరుశాఖలు వానిని రాల్చుచుండ నవి రాజకుమారునిపయి గురియుచున్న మల్లెపూవులవానవలెఁ బ్రకాశించుచుండెను. వింతవింతలపక్షుల మధురరుతంబులా రాజకుమారుని స్వాగతము లడుగుచున్నట్లుండెను. ఇట్లెటుచూచినను గన్నులపండువుగఁ గన్పించుచున్న యయ్యడవి చక్కఁదనంబు నారాజపుత్త్రుఁడు వీక్షింపకయే పోవుచుండెను. ఆయ్యరణ్యము మిగుల రమణీయముగా నుండుటచేఁ జూపఱులహృదయంబుల నాకర్షింపఁజాలినదైనను మన రాజకుమారుహృదయమ్ము నట్లు చేయలేకపోయెను. అతండు వేటాడుటయందత్యంతకుతూహలమ్ముగలవాఁడగుటచే నతనికీసౌందర్య మంతగా రుచింపలేదు. అతఁడు గుఱ్ఱమును నడిపించుచు మృగములకయి నల్గడలు పరికించుచుఁ బోవుచుండెను. కాని యాతని కొక్కమృగమైనఁ గానరాదయ్యె. ఇట్లు తన కార్యము విఫలమయినట్లు కనఁబడుటచే నొక్కింతవిచారము హృదయంబునం గదుర, నొక చెట్టుపైఁ దనహయంబునాఁపి యచ్చటఁ బులియడుగు జాడలు గన్పట్టుటచే నతఁడీ "ప్రాంతంబునఁ బులియుండవచ్చు, వెదకెద నని" తలఁచి తనహయము నొక చెట్టుకొమ్మకుఁగట్టి యాజాడఁబట్టి పర్వతమధిరోహింప సమకట్టియుండెను. అంతట "అయ్యో చచ్చితిని! అయ్యో చచ్చితిని" అనునట్టు యెలుంగొకటి యారాజకుమారుని కర్ణపథంబు సొచ్చె. అది వినినతోడనే రాజకుమారుఁడు మిగులఁ దొట్రుపాటొందుచు "అక్కటా! ఎవఁడో మానవుఁడు కష్టదశలోనున్నట్టు వాని కంఠధ్వనియే తెలుపక తెలుపుచున్నది. బులులుండుట నిక్కంబు. శార్దూలముచే నొకమనుష్యుఁడు నిరోధింపఁబడియుండనోపు. వేగముగాఁ జని వానిని రక్షించెద. నందువలన నాకు నాప్రాణిప్రాణముల రక్షించుటవలనఁ గలిగిన పుణ్యంబు చేకూరుటయే కాక, పలుశ్రమచెంది మృగంబులకయి వెదకుచున్న నాకోర్కెసైతము

నెఱవేఱవచ్చునని తలపోసి ఖడ్గంబు చేతఁ ధరించి యశ్వమధిరోహించి యతి త్వరితగమనంబుతో నాధ్వని యేతెంచిన దిక్కు మొగంబయి పోయిచూడ, భయకంపితుఁడయియున్న యొకమానిసి దృగ్గోచరుం డాయెను. అంత నా రాజకుమారుండు వానినిఁజూచి చేసన్నతో భయములే దనిచెప్పి సమీపించి చూచునప్పటికి శార్దూలద్వితయం బతనికిఁ గానవచ్చె. అవి మిక్కిలి భయంకరాకారములు గలవై యుండెను. అవి మార్గమున కిరుప్రక్కలఁ జెఱియొకటి పొంచియుండెను. అప్పురుషుఁ డేమాత్రము కదలినను వెన్నాడి పట్టుకొనుటకు సిద్ధముగానుండెను. ఆపురుషుం డాసంగతి నెఱింగియే యచ్చటనుండి కదలక వానిపయిదృష్టి నిగిడించి చూచుచుండెను. అవియు వాని నట్లేచూచుచుండెను. ఆపురుషుం డేదైనను జెట్టెక్కి జీవనంబు గాపాడికోవలె నని తలంచి నలువంకలు చూచెనుగాని యేపాటిచెట్టేదియుఁ గానరాదయ్యె. అందుచే నతఁ డేమియుఁ జేయఁజాలక స్తంభాకృతిని దాల్చియుండెను. అంత నారాజకుమారుఁడు మెల్లమెల్లఁగ వానిఁ డాసి యాతనికిఁ గనుసన్న చేసి ఖడ్గంబుదూసి పట్టుకొని గుఱ్ఱము నవతరించెను. అతఁ డా హయమునుండి దిగుటయే తడవుగా నాపురుషుం డాహయమునధిరోహించెను. అంత నారాజకుమారుండు మనంబున నింతేనియు జంకక యొక పులినిడాసి చేతికొలఁది నొక్కవ్రేటున దాని నేలను గూలచేసెను. ఆదెబ్బతో నది మృతినొందెను. గాని యాఖడ్గముఁగూడ ముక్కలాయెను. ఇంతలో నారెండవపులివచ్చి వాని పయిపడెను. అయిన నారాజసూనుండు ధైర్యశాలి కావున నింతేనియు భయపడక తన్నుఁ గఱవవచ్చుచున్న యాపులినోటిలోఁ దనచేతిలోనున్న మొండిఖడ్గమును గ్రుచ్చి దవడలు క్రిందికిఁగాని మీఁదికిఁగాని కదలకుండఁ బట్టియుంచి రెండవచేతితో దానితల బ్రద్దలగునట్లు గ్రుద్దుచుండెను. ఇట్లు పదిమార్లు కొట్టినప్పటికిఁ జేయి రక్తసిక్త మాయె. అదిచూచి రాజకుమారుఁడు దానితల పగులుటచే రక్తము స్రవించుచున్నదనియుఁ, నారక్తమే తనచేతికంటికొనె ననియుఁ దలంచెనుగాని వానియభిప్రాయము సరియైనది కాదు. వానిచేతిగోళ్లుపగిలి రక్తమునుఁ బ్రవహించుచుండెను. అందుచే నతఁడు

తన చేతిని దగ్గరగానుంచుకొని పరిశీలించు సమయమున నా బాటసారి యా గుఱ్ఱమును దిగి తన చేతిలోనున్న యినుపకఱ్ఱతో దానితలపయి నాలుగు మోఁదులు మోదెను. అంత నాపుండరీకము నేలఁబడ నారాజకుమారుఁడు దానివలన నపాయము రాదని తెలిసికొని దానినోటిలోనుండి చేతినూడబెఱికికొని యా మొండిఖడ్గముతో దాని నంతము నొందించె. ఇట్లా రాజపుత్త్రుఁడు సాహసంబుతో నాశార్దూలద్వితయంబు నంతంబు నొందించి మిక్కిలి యలత చెందినవాఁడై తనహయంబు నడిపించుకొనుచు వానితో నేదేదియో సంభాషించుచుఁ జని యచ్చటికి సమీపముననున్న యొకనదీతీరంబుచేరి యొకచెట్టు క్రింద విశ్రమించి యా బాటసారిని గూర్చుండుమని నియోగించె. ఆ బాటసారి యట్లు చేసి వాని సాహసధైర్యముల కెంతయుం నచ్చెరువందుచు వాని కిట్లనియె. "ఓ రాజకుమారా! నీధైర్యసాహసంబులు నిరుపమానంబులు. పరోపకారబుద్ధియందు నీకు సాటివచ్చువాఁ డీలోకంబున నుండఁడనియే నా యభిప్రాయము. నీ వీసమయంబున రానిచో నాప్రాణంబులు పోవలసినవే. ఇంతకు నాయందు భగవదనుగ్రహమున్నది" అని పలికి యాతనితో నిట్లు సంభాషించెను.

బా.—రాజకుమారా! నీవాసస్థల మెయ్యది? నీవెవ్వరి కుమారుఁడవు?

రా.—మానివాసస్థానము చిత్తూరు. నేఁ జిత్తూరురాణా యగు రాయమల్లుని కుమారుఁడను.

బా.—చిత్తూరు రాజులవంశమందుఁ బుట్టుటచేతనే నీకిట్టిధైర్యసాహసములు, పరోపకారబుద్ధియుం, బరాక్రమము లభించినవి. లేనిచోఁ గలుగునా! నీవాపులుల నెదుర్కొనునప్పుడే నే ననుకొంటి. అవును, పులికడుపున నెన్నఁడైన మేఁకపిల్లపుట్టునా? నాయనా! ఇక్కడికేల వచ్చితివి?

రా.—మృగయావిహారార్థము వచ్చితిని. కాని యొకమృగమైన నాకుగోచరము కాలేదు. అందుచే విచారించుచుండ నీకంఠధ్వని వినవచ్చినది. నిన్ను రక్షింపఁగలిగితి. మఱియుం నాకుతూహలమునుగూడఁ దీర్చికొంటిని. వహ్వారే! ఈదినము నాకు షడ్రసోపేత మగుభోజనము చేసినట్లున్నది.

బా.—అవును. వీరులకు నిట్టిసాహసకర్మములు తృప్తిగొలుపునట్లు లోకమున మఱి యేవస్తువులును దృష్టిఁ గొలుపఁజాలవు?

రా.—మీరు బైరాగులవలెఁ గన్పట్టుచున్నారు? మీరెచ్చటివారు? ఎచ్చటికిఁ బోవుచు నీపులులకుఁ జిక్కితిరి?

బా.—బైరాగుల కొకస్థలమని నియమములేదు. నేను గద్వారునకుఁ బోవుచు నీపులులకుఁ జిక్కితిని. అప్పుడు చేయునదిలేక చావునకుఁ దెగించి గట్టిగా నఱచినచో నెవరైన నన్ను రక్షింపవత్తు రనుతలంపునఁ గేక వేసితిని. నీదయవలనఁ బ్రతికితిని.

రా.—పూర్వాశ్రమమునందు మీ రెచ్చటివారలు?

బా.—రాజకుమారా! నాపూర్వచరిత్రమంతయు నయోమయముగా నున్నది. దాని నే నిప్పుడు చెప్పఁజాలను. కాని నీవుచేసిన యుపకారమునకుఁగా నీవజ్రపు టుంగరమును కానుకగా నిచ్చుచున్నాను. పుచ్చికొనుము. (అని యీయఁబోవును.)

రా.—'ఆ' ఏమీ! ఈభాగ్యమునకు లంచము గొనవలెనా? దాని నెంత మాత్రము నే స్వీకరింపను.

బా.—అట్లనకుము. ఇది లంచముకాదు. నీపౌరుషమునకు సంతసించి యందు లకుఁ దగిన బహుమానము చేయఁదలంచితిని.

రా.—చిత్తూరు రాణాకుమారుండనైయుండియు నీయొద్దనున్న యీయుంగరమును నేను స్వీకరింతునా?

బా.—బాబా! ఇది యొకతప్పుగాఁ దలంపకుము. ఎంతలేసివారైనను బహుమానముగానిచ్చినది స్వీకరింపవచ్చు. ఇదియుంగాక నేను మిత్రధర్మము ననుసరించి యిచ్చుచున్నాను స్వీకరింపుము.

రా.—అట్లైన నాయొద్దనుండి యేదైన మీరు తీసికొనుఁడు?

బా.—సమస్తసంపదలను విడిచివచ్చిన నాకీవస్తువులతో నేమిప్రయోజనము?

రా.—అట్లైన మొదట నీయుంగరము నేల విడువలేదు?

బా.—ఈయాశ్రమము పుచ్చుకొన్నప్పుడీయుంగరముమీఁది మోహమును విడువలేక కొనివచ్చినానని తలఁచుచున్నావా? లేదులేదు. ఈమధ్య యమునలో స్నానముచేయుచుండ నాకు లభించినది. దాని నూరకపో నిచ్చుటేమి యని తీసితిని దానిని దగినవారికి నీయవలెనని చూచుచుండ నేఁటికి నీవు సంప్రాప్తమైనావు అంతియకాని వేఱుకాదు. ఈ యుంగరమును దీసికొనక తీరదు.

రా.—అట్లైనచోఁ దీసికొందునుగాని యీయుంగరమును మీరుగూడఁ దీసికొనుఁడు. (అని యీయఁబోవును).

బా.—(కొంచెము యోజించి) సరే. తీసికొనెదను. (దానినిఁ దీసికొని) దీని నీవు తీసికొను మని యుంగరమిచ్చును.

రా.—దాని నందుకొని స్వీకరించెను.

బా.—రాజకుమారా! నీయానతిచొప్పున నేను దీసికొనుచున్నాను. దీని నొకస్నేహానుబంధముగాఁ దలంచుచున్నాను. నీవు నట్లే తలంపవలెను.

రా.—అయ్యో! మీవంటివారిస్నేహము మాకెట్లు లభించును? మిమ్ముల బ్రాణస్నేహితులుగా నెంచుకొనుచున్నాను.

బా.—అట్లైన సంతోషమే పోయెదను. అప్పటప్పట నీదర్శనమునకై వచ్చుచుందును. [అని నిష్క్రమించెను].

రాజకుమారుఁ డంతట గగనంబుపైకి దృష్టి నిగుడించి సూర్యుండు గగనమధ్యంబును బొందియుండుటఁజూచి తనపురంబునకుఁ బోయెను.

---

# మూఁడవప్రకరణము

చిత్తూరురాజపుత్రస్థానంబున నుండుసంస్థానంబు లన్నిఁటిలోను మిక్కిలి వాసి కెక్కినది. అయ్యది మహాపరాక్రమశాలులును, సద్గుణవ్రాతభాసమానులు స్వదేశాభిమానులును నగు నుత్తమరాజపుత్రులచేఁ బరిపాలితంబగుటచేతనే దాని కట్టిప్రసిద్ధి కలిగినదని చెప్పవచ్చును. మఱియుఁ దురుష్కప్రభువుల

బలవంతులై యొక్కొక్కప్పుడు దాని నాక్రమించుచున్నను కొద్దిదినంబు లయిన నప్పురిని దమయధికారమం దుంచుకొనలేకపోవుట చిత్తూరురాజుల యసాధారణ ప్రతాపంబువలననే యని చెప్పవలసియున్నది. రాజపుత్రులకుఁ జిత్తూరుపురంబు ప్రాణంబులకంటె నధిక ప్రేమాస్పదము. అందువలననే వార లప్పురంబును వైరివీరులు ముట్టడించినప్పుడు మహాప్రతాపంబుతోఁ బోరాడి తమప్రాణంబుల నయిన నిచ్చుచుండిరి కాని పురంబు నిచ్చుట కిష్టపడలేదు. మఱియు నప్పురంబు నేలు రాజులందఱు నుత్తమోత్తములు. అద్వితీయ ప్రతాపశాలులు. స్వదేశంబు కాపాడునప్పుడు ప్రాణంబులైనఁ దృణప్రాయంబుగాఁ జూచువారు. శరణనివచ్చిన దీర్ఘశత్రువునైన రక్షించునట్టి ఉదారభావము కలవారు. గౌరవప్రధానులు. పరస్త్రీపరధనాపేక్షలు కలయందైన లేనివారు.మహాపాయసమయంబులందైన నన్నృతమాడని సత్యహరిశ్చంద్రులు. స్వదేశమతరక్షణమందు మిగుల బట్టుదల కలవారు. ఈరాజులు దైవభక్తియం దద్వితీయులు. హిందూదేశంబునఁ బరమపవిత్రస్థలంబులం దధిక ప్రేమకలవారు. కావున వీరు తురకలు కాశీగయాదిపుణ్యక్షేత్రంబులఁ జేఱుచున్నసమయంబున సైన్యసమేతంబుగా పోయి ఘోరరణంబు నొనర్చి కాపాడుచుండిరి. ఆపత్కాలంబులందు ధైర్యగుణావలంబనంబు, కలిమియందు క్షమాగుణంబు, సంగ్రామంబులందు భుజాబలంబు, సత్కీర్తిసమార్జనంబునం దాసక్తియు, బుణ్యకార్యాచరణంబులం దనురక్తియు నారాజులకు నైసర్గికంబులు. రాజపుత్రస్త్రీలు సయితము సకలసద్గుణంబులందుఁ బురుషులకుఁ దీసిపోరు. సాధారణముగా స్త్రీలకు వాడబడు పదంబులలో నబలాభీరుపదంబులచే వ్యవహరింపఁదగినవారు కారు. వారిలో నొక్కొక్కసమయంబునందు కరవాలంబు కేలఁ గీలించి శత్రువులతోఁ బోరాడి జయముకొన్నవీరస్త్రీ లెందఱో కలరు. మానంబుకై జీవంబులనైన విడువఁ గుతూహలపడుదురు. సద్గుణవంతురాండ్రగు నారాజపత్నులు భర్తలసుగుణంబులకు వన్నె వెట్టుచుందురు. ఇట్టి మహారాజగుణంబులచేతను తాదృశోత్తమస్త్రీలచేతను సేవనీయు లగు రాజచంద్రులచేఁ బరిపాలితం బయినచిత్తూరు పెక్కుశతాబ్దములవఱకు నిరుపమశోభామహింబుచేఁ బ్రకా

శించెను. అట్టి రాజచంద్రములలో రాయమల్లొకఁడని చెప్పవచ్చును. ఈతఁడు కుంభరాణాయొక్క ద్వితీయపుత్త్రుండు. ఈయన క్రీ.1474 సంవత్సరంబున రాజ్యారూఢుం డయి యద్వితీయమహిమతో రాజ్యంబు పరిపాలించుచుండెను. ఇతఁడు మహాశూరుఁడు. ఈతఁడు మాలవాధీశ్వరుఁడగు ఘయాసుద్దీననుతురుష్క ప్రభువును బూర్తిగ నోడించి కీర్తిఁ గాంచెను. ఈతనికి సంగుఁడు, పృథ్వీరాజు, జయమల్లుఁడు నను ముగ్వురు కుమారులుగలరు. వారిలో సంగుఁడు పరాక్రమశాలియేకాని శాంతిప్రియుఁడు అయినను సంగ్రామ మన వెనుదీయనివాఁడే. పృథ్వీరాజు ప్రతాపంబున నద్వితీయుఁడు. ధైర్యసాహసంబున నాతని కీడువచ్చువా రీలోకంబున లేరని చెప్పవచ్చును. అతనికిఁ గోపంబు వేగంబుగా బొడముచుండు కాని వెంటనే దానిం దొలఁగించుకొనుసామర్థ్యము కలదు. జయమల్లుఁ డన్నలవలె బలపరాక్రమములు గలవాఁడేగాని కుటిలుండు. వీరలు ముగ్వురు నైకమత్యముతోనె యాటలయందు వేటలయందు నాయుధపరిశ్రమలయందుఁ బ్రొద్దుపుచ్చుచుండువారు. వీరిప్రవర్తనలఁ జక్కఁగ నరసి జనులు చాటుచాటున సంగుఁడు రాజ్యంబునకుఁ దగఁడనియుఁ బృథ్వీరాజర్హుండనియుం బక్కాణింపఁ జొచ్చిరి. మఱియుఁ గ్రామంబులోని వారు కొందఱు పృథ్వీరాజును సమీపించి యిష్టాలాపంబులాడుచుఁ బ్రీతిఁగలిగించుచు నాతనిమనస్సును చెడ్డత్రోవను నడిపించిరి. అట్టివారలలో సురేశమల్లుఁడు ప్రధానుఁడు. అతఁడు రాయమల్లునికిఁ దమ్ముఁడు. వాఁడు మిగులఁగ్రూరుఁడు. వాఁ డీరాజపుత్త్రులె కన్యోన్యభేదము గలిగించి వారిచే వారిఁ జంపించి రాజ్యంబు చేకొనవలెనని తలంపుతో నుండెను. కావున వీఁడు పృథ్వీరాజుతోను సంగునితోను స్నేహము చేసి పరోక్షంబునం దొండొరులకుఁ గలహము పెంచుచుండెను. పృథ్వీరాజు మొదట నిర్మలాంతఃకరణము సుస్వభావముగలవాఁడే యయినను దుర్జనులసహవాసంబున దుష్టమార్గంబు నవలంబించె. సంగుఁడు శాంతిప్రియుఁ డగుటచే నతని కీమాటలు కోపోద్దీపితంబులు కాలేదు. కాని పృథ్వీరాజునకుఁ గోపోద్దీపితంబు లగుచుండెను. అయినను దండ్రికి భయపడి సంగునకు ద్రోహమ్ముచేయ సాహసింపకుండెను. జయమల్లుఁడు తరుచుగ నురాజును

ల్లుతో స్నేహ మవలంబించి యాతని ననుసరించి ప్రవర్తించుచు నన్నల నిర్వ్వరను జంపి తనకు రాజ్యం బిచ్చిన నర్ధరాజ్యం బిచ్చెదనని ప్రతినచేసి యొప్పించెను. కాని సూరాజమల్లుఁడు జయమల్లుని వశముగావించుకొని కార్యము నెరవేర్చి కొనిన పిమ్మట జయమల్లునిం దుదముట్టింపఁ దలంచియుండెను. ఈసంగతి యేమి యుం రాయమల్లునకుఁ దెలియదు. ఇట్లు కొంతకాలంబు సనఁ బృథ్వీరాజు ప్రజల వాక్యంబులను సూరాజమల్లుని యుపదేశంబున మనమ్మున నిమిడ్చికొనియుండుటం బట్టి తానే రాజగుట నిక్కంబని తలపోయుచుండెను. ఔరా? దుర్జనసహవాస మెంతపనికిమాలినది ! జననీజనకులు పిల్లల శ్రేయస్సును గోరువారయినచో ముందుగా దుర్జనసహవాసము మాన్పవలయును. ఇట్లుండ నొకనాఁ డాముగ్గురు సోదరులు నొకచో నున్నప్పుడు పృథ్వీరాజు సంగుని యభిప్రాయము గనుఁగొన నెంచి సంగున కిట్లనియె.

పృ.—అన్నయా ! మనతండ్రి యనంతరమున రాజ్యమేలుట నీవా నేనా ?

సం.—అట్లడుగ నేల ? ఎవరేలుట న్యాయమో వారే యేలవచ్చును.

పృ.—న్యాయమునుబట్టి యడుగ లేదు ? సామర్థ్యమునుబట్టి చెప్పుము. రాజ్యమును రక్షింపఁ దగినంతసామర్థ్యము నీకుండవలయుఁ గదా ?

సం.—ఎందుకుండదు. అధిపత్యమువచ్చినప్పుడు సామర్థ్యముగూడ వెంటనే వచ్చు.

పృ.—అదే తెలివితక్కువ మాట. 'కఱవునకు దాసరులైనపదా లెట్లువచ్చు' ననిన లోకోక్తిప్రకారము జ్యేష్ఠపుత్త్రుఁడవుకాన రాజ్యాధికారము సంప్రాప్తమైన నగుఁగాక. దానినిఁ జక్కఁగ రక్షించుకొనఁదగినంత సామర్థ్య మెట్లు రాఁగలదు ?

సం.—పోనిమ్ము. రాజ్యంబు నాకు సంప్రాప్తమైన పిమ్మట నేను రాజ్య మేల లేనిచో నీకే యిచ్చెదను లెమ్ము.

పృ.—రాజ్యమేలలేనిచో యని సందియ మేల ? రాజ్య మేల నీతరముకాదు.

సం.—ఎట్లేలలేనో చూతము.

వృ.—చూడనక్కఱలేదు. నీప్రవర్తనమే సంగతిని రాజ్యంబునకుఁ దగఁడని వేనోళ్ల ఘోషించుచున్నది. నీవు శాంతిప్రియుఁడవు. యుద్ధమనగడగడ వణఁకెదవు. మఱియుం రాజునకుండవలసిన గుణంబులలో నొకటియుం నైన నీయొద్దఁ గానరాదు.

సం.—(చిఱునవ్వునవ్వుచు) తగినయుద్ధము సంభవించునెడ నేభయపడి పగతురకు వెన్నిచ్చినచో నప్పుడు నీవీమాటలాడుము. కాని యిప్పుడు వృథాలాపములతోఁ బనియేమి ?

వృ.—వేఱేయుద్ధము తటస్థింపనక్కఱయే లేదు. చూడు. ఆనాఁడు ఆయరణ్యములో ఏమిజరిగినదో స్మరింపుము. అడవిపంది యనఁగా నేపాటిది ? అది మీఁదికి వచ్చుచుండుట జూచి భయపడి పర్వడి చెట్టెక్కితివి. ఇట్టి పిఱికిపందవు నీవెట్లు రాజ్యమేలఁగలవు ? ఎట్లు యుద్ధముచేసి నీ ప్రజల రక్షింపఁగలవు.

సం.—దాని కేమది యట్లుండనిమ్ము. చేతిలో నాయుధము లేనప్పుడు నేనేమి చేయుఁదును. లేనిచో నే నడవిపందికి భయపడుదునా ?

వృ.—ఆయుధమేల ? చేతులే యాయుధములు. నాలుగుకాళ్లను గేలఁగీలించి నేలఁగొట్టినఁ జావదా ? అంతమాత్రమునకై యాయుధము లేల ? వేయేల ? ఎట్లైన నీకు సాహసముచాలదు.

సం.—ఏమట్లందువు ? నాఁడు నీయెదుట నేకదా యొకపులి నెదుర్కొని ఖండించితిని. ఆసంగతి మఱచితివా ? ఏమి ?

వృ.—అట్టి పులినిజంపుట యెంతపని. ఆఁడుది చంపగలదు. నిద్రించుచుండఁగాఁ జాటుననుండి యల్లనల్లనపోయి ఖండించితివి ? ఇది యేపాటిఘనకార్యము ?

సం.—ఓయీ ! మనకిప్పుడు వృథావాగ్వివాదమేల ?

వృ.—పోనిమ్ము. రాజ్యమునకు మనయిరువురిలో నెవ్వరు తగినవాండురో ? ఇదిగో నీకు రేశమల్లునిచేఁ జెప్పించెదను. రా పోదము. అని వారిరు

వ్వరు బయలువెడలి కొంతదూరముపోయి సురేశమల్లుని గలిసికొని యా ముమ్వురు నొకచోటఁగూర్చుండి యిట్లు ప్రసంగించిరి.

పృ.—బాబయ్యా! మాయిరువురిలో రాజ్యమున కెవ రర్హులో చెప్పుము. పక్షపాత ముండఁగూడదు.

సురే.—(తనమనస్సులో) వహ్వారే? నాకు మంచిసమయము లభించినది. దీనిం బట్టి యోజింపఁ జిరకాలమునుండి నాకోరుచున్న యభిలాషంబు నెఱ వేఱకమానదు. ప్రస్తుతము వీరిరువురికిమఱింతకలహముబెంచి భేదమును గల్పించెదను. అందువలన వీరవలీలగనే వశులగుదురు. పిమ్మట రాజ్యము సులభముగాఁ జిక్కఁగలదు. (ప్రకాశముగా) చిఱునవ్వునవ్వుచు, ఓయీ! నేజెప్పనేల మీకుమాత్రము తెలియదా? నాకు మీరిరువురు గూడ రాజ్యమునకు దగినవారుగాఁ గనఁబడుచున్నారు.

పృ.—అట్లుకాదు. చక్కఁగా నాలోచించి చెప్పవలయును.

సురే.—అట్లైన నేఁ జెప్పినచో మీకుఁ గోపమురాకమానదు. నిజముచెప్పిన నిష్ఠురముగా నుండునని పెద్దలందు రెఱుఁగవా?

పృ.—కోపమేలవచ్చును? మాకుఁ గోపమువచ్చిన నీకుఁబోయెడి దేమి యున్నది? కావున వివరించిచెప్పుము.

సురే.—(తనలో) నేనిప్పుడు పృథివీరా జర్హుఁడనిచెప్పిన సంగుఁడు మాఱు మాటాడక యూరకుండును. అంతతోఁ గలహముచల్లారును. అట్లైన నాతలంచినకార్యము కాదు. సంగుఁడే రాజార్హుఁడని చెప్పినచోఁ బృథ్వీరా జూరకుండక కలహము మఱింత పెంచఁగలఁడు. అందువలన మనకార్యము నెఱవేఱఁగలదు. (ప్రకాశముగా) ఓయీ! అట్లైనచో సంగుఁడే రాజ్యార్హుఁడు.

పృ.—ఎట్టు లాలోచించి చెప్పితివి?

సురే.—నాకెట్లుతోఁచినది చెప్పితిని. సంగుఁడే రాజ్యార్హునివలెఁ గనఁబడు చున్నాఁడు.

పృ.—నీవు పక్షపాతముతోఁ బలుకుచున్నావు. కాని నిజముచెప్పినావు.కావు?
సురే.—నిజమాడిన నిష్ఠురముగా నుండునని నేను మొదటనే చెప్పితినిగదా!
పోని మీసందేహమును దొలఁగించుకొనుటకు వ్యాఘ్రగిరికిఁ బోదము రండు. అక్కడ చారుణీదేవికి నొకయర్చకురాలు కలదు. ఆమె చెప్పిన వాక్యములు వేదవాక్యములని నమ్ముఁడు. ఆమె మనుష్యుని జూడఁగానే వానివృత్తాంతమంతయు సరిగాఁ జెప్పితీఱును. ఆమె సర్వసమర్థురాలు కలది. ఆమె కందఱు సమానులే.

అట్లైన పోదము రండని పృథివీరాజు పల్క వారుముగ్గురు సురేశ మల్లునితోఁగూడి యత్యున్నతములైన తురంగములపైఁ గూర్చుండి యేదియో ప్రసంగించుచు వ్యాఘ్రగిరి కభిముఖులై పోయిరి.

---

# నాలుగవ ప్రకరణము

చిత్తూరునగరమున కాఱు క్రోసులదూరమున నొకచిన్న పర్వతము కలదు. దానిని వ్యాఘ్రగిరియందురు. ఆపర్వతము రాజపుత్రస్థానములో నున్నవానిలో సామాన్యమయినది. ఆపర్వతశిఖరమందు చారుణీదేవి యాలయమొకటి గలదు. అయ్యది చిరకాలముక్రిందటనే కట్టబడియున్నను నూతనముగా నిర్మింపఁ బడినదానివలె నున్నది. ఉత్తరహిందూస్థానములో నున్న దేవాలయములన్నియు మహమ్మద్ఘోరీ మొదలగు తురుష్కవీరులచేఁ బడఁగొట్టఁబడినను నాదేవాలయము వారిచేఁ బడియుండలేదు. అందుచే నా చుట్టుప్రక్కల నున్నవారందఱు దేవీ మహిమకు భయపడి తురకలు రాలేకపోయిరి. కానిచో సమస్తదేవాలయము లను భగ్నము గావించిన తురకలు దీనినిమాత్రము చెనకకుందురా! అని తల పోయుచుఁ దమశక్త్యనుసారముగా దేవికిఁ గానుక లర్పించుచు నతిభక్తితోఁ బ్రవర్తింతురు. ఆదేవాలయ మొకమూలనుండుటచే నాతురకల కంటఁబడక పోవుటంబట్టి దానిని చెఱుపమానిరో లేక కంటఁబడినను దురకలు ధనాభిలాష

కలవారు కావున నాదేవాలయమం దేమియు ధనముండదనితలంచి యుపే క్షించిరేమొ తెలియదమాయిరో, లేక యచ్చటివారలు తలంచుచున్నట్లు చారణీ దేవిమహిమకుఁ గడుభయపడి దానిచెంతకుఁ బోమాయిరో స్థిరపఱిచిచెప్పుటకు వీలులేదుకాని, ఏమియెట్లయినను నావ్యాఘ్రగిరియం దొకదేవాలయముండుట యు నదిశత్రువులచేఁ జెఱుపఁబడకుండెనుండియుండుటయు సత్యము. చిత్తూరు రాణా లాదేవియందు మిక్కిలి భక్తికలవారయి యామె యనుగ్రహముచేతనే తమకంతప్రాభవంబు సంప్రాప్తమైనదని తలంచి యాదేవాలయమునకుఁ బోయి యామెసందర్శనము చేసికొని కానుక లర్పించుచుందురు. మఱియు నాదేవా లయమునకునలువైపులనుండు ప్రాకారకుడ్యంబుశిథిలమైయుండ దానినిజక్కఁగ బాగుచేయించి చక్కని యొకగోపురంబును గట్టించియిచ్చినవారు ప్రభువులే. ఇంతియకాక యాదేవికిఁ గొన్నిభూములనర్పించి యందువలన వచ్చుచున్న కొంతధనమును వ్యయముచేసి దేవికి సమస్తోపచారములుచేయుచుఁ దక్కిన ధనముతో మీరు జీవింపుఁడని చెప్పి యొకబ్రాహ్మణకుటుంబమును నియ మించిరి. ఆచిత్తూరి ప్రభువులయాజ్ఞను శిరసావహించి యాకుటుంబమువారు భక్తిసంయుతులై యావ్యాఘ్రగిరిపైఁ గాపురముండి దేవీపూజనమును గావించు చుండిరి. ఇట్లెంతయోకాలము క్రిందట నేర్పాటుచేయఁబడినను మనము వ్రాయుచున్న కాలమువఱకు నా బ్రాహ్మణసంతతివారు గడుభక్తితోఁ బూ జించుచు వచ్చుచుండిరి. మఱియు వార లిప్పటియర్చకులవలె దేవుని కర్పింపఁ బడుచున్న ద్రవ్యము నెల్లఁ దమ యుందరపోషణకు వ్యయముచేసికొనుచు నా నోరులేని దేవునియెదుట దీపమునయిన నిడక నైవేద్యమునైన నారగింపఁ జేయక యుత్సవాదుల నాచరింపక యున్నవారుకారు. వారలు తమ కేర్పఱుపఁబడిన ధనముకూడ దేవికి వినియోగించి సుంతేనియు లోపము లేకుండ సర్వదా పూజలొనర్చుచుందురు. ఇట్టుచేయుట నాయర్చకులు దేవియనుగ్రహమునకుఁ బాత్రులై లోకములోఁ దక్కినవారికంటె నుత్తము లుగఁ బరిగణింపఁబడుచుందురు. ఆ యర్చకులు సత్యమే పలుకుదురనియు వారలన్నవాక్యము తప్పక యగుచుండు ననియు నచ్చటివారి కందఱకు నొక

పెద్దనమ్మక ముండుటచే నాచుట్టుపట్టులమన్న వారందఱు వారలను దేవతలఁగా భావించికొని వారలకు నమస్కారములు గావించుచుఁ గానుక లర్పించుచు వారివలన మంచిచెడ్డలను దెలిసికొని పోవుచుందురు. సామాన్యజనములేకాక చిత్తూరు ప్రభువులుకూడ నాయర్చకులయొద్దకుఁ బోయి తమకార్యసిద్ధులను గూర్చి యడుగుట యొకయాచారమైయున్నది. అట్లు వారు ముందుగా నర్చకుల సమీపించి తమకార్యముల వారికిఁ దెలియఁజేయుచుందురు. అంత వారు దేవిని జక్కఁగ ధ్యానించి యొక్కనిముస మూరకుండి కార్యము సిద్ధించునో సిద్ధింపదో స్పష్టముగాఁ జెప్పుదురు. వారు సిద్ధించునన్న కార్యము తప్పక సిద్ధించుటయు, సిద్ధింపఁదనిన కార్యము సిద్ధిచెందకుండుటయు నైయున్నది. అందువలన నర్చకులు సిద్ధింపదన్న కార్య మెంతఘనమగు కార్యమయినను దానిని జేయమానుదురు. సిద్ధించునన్న కార్యమును బూనుకొని చేసి యందు సఫలత జెందుదురు. అందుచే నా ప్రభువులుఁకూడ నాయర్చకుల వాక్యములను వేదవాక్యములుగా నెంచుకొనుచుందురు. ఆయర్చకులుపల్కినట్లు కార్యము సఫలమగుచుండుటకు, విఫలమగుచుండుటకుఁ గారణము దేవతానుగ్రహమువలన వారలకుఁ గలిగిన ప్రభావమని యప్పటివారలందఱును యోజించుచుండువారు. కాని యట్లు తలపోయుటకంటె నీరాజపుత్త్రులకు నాయర్చకుల మాటలయందు నమ్మకముండుటచే వారలు కాదన్న కార్యమును గుఱించి చక్కఁగఁ బాటుపడక నిరుత్సాహులైయుండుటచే కార్యము విఫలమగుచున్నదనియు, వారలగునన్న కార్యమును మహాధైర్యమవలంబించి చేయుచుండుటచేఁ గార్యము సఫలమగుచున్నదనియుఁ గార్యముల సిద్ధికిని, నసిద్ధికిని గారణము రాజపుత్త్రుల ధైర్యాధైర్యములే యనియు, నొకకొంద ఱూహించిన నూహింపవచ్చు. కాని యప్పటివార లర్చకుల యసామాన్యప్రభావమేయని తలపోయుట నిక్కము. మనవ్రాయుకథ జరిగియున్నకాలమున నాచారుణీదేవి యొద్ద సరస్వతి యను నొకయబల యర్చకురాలుగా నుండెను. ఆమె మిగుల యోగ్యురాలు. ఆమె సంతతము దేవత కుపచారములకై పాటుపడుచుండును. ఆమె ప్రాతఃకాలమున దేవాలయమును జక్కఁగఁ దుడిచి నీళ్లు చిలుక.

రించి ముగ్గులు పెట్టి యచ్చట నున్నపాత్రము లన్నియుం శుభ్రము గావించి పిమ్మటఁ బుష్పములకై పూవులతోఁటలోనికిఁ బోయి చక్కనిపువ్వు లేరి తెచ్చి యామెకుఁ బూజచేసి యవసరమైన నైవేద్యమును గావించి యనంతరము వంటచేసి యప్పదార్థమును దేవికి నివేదించి తరువాతఁ దా నుపయోగించుచుండును. ఇట్టుండ నొకనాఁ డామె పుష్పములకై పోయియుండఁగా నల్వురు రాజపుత్త్రు లశ్వారూఢులై వచ్చి యప్పర్వతముక్రింద నున్నవృక్షములకుఁ దమహయములను బంధించి పర్వత మధిరోహించి ముందుగా దేవీనిలయంబు నకుఁ బోయి నమస్కారంబులు కావించి వారివారికి వచ్చిన స్తుతిశ్లోకములఁ బఠించి యాసమీపమున నున్న అర్చకురాలి నిలయమునకుఁ బోయిరి. కాని యామె వారికి దృష్టిగోచర కాలేదు. వార లచ్చటివారినడుగఁగాఁగొంతవఱకు వేచియుండినచో నామె వచ్చునని చెప్పిరి. ఆమాటలువిని యారాజపుత్త్రులు లోనికిఁ బ్రవేశించిరి. అందుఁ బృథివీరాజును, జయమల్లుఁడును ముందుగాఁ బోయి యాయర్చకురాలిశయ్యపైఁ గూర్చుండిరి. సంగుఁ డాసమీపముననున్న యొకపులిచర్మముపై గూర్చుండెను.

సురాజమల్లుడు సంగుని కొకప్రక్కను గూర్చుండియుండెను. ఇట్టుండ నాయర్చకురాలు తాఁ గోసినపుష్పములను దేవాలయమునందుంచి తనమందిర మునకు వచ్చెను. అంత నావచ్చుచున్నయామెకు నానల్వురురాజపుత్త్రులు నమస్కరించి తమవచ్చినకార్యమును దెలుపఁగా నామె నిర్భయముగా నిట్లనెను. ఓయీ! చిత్తూరుప్రభువులు తఱుచుగాఁ బులిచర్మముపైఁ గూర్చుండియే న్యాయాన్యాయములను దీర్చుచుందురు. ఈసంగుఁ డట్టి చర్మముపై నధివసించెనుగాన యీతఁడు తప్పక రాణా కాఁగలఁడు. మఱియుం నీసురాజమల్లుఁ గూడ నాచర్మము నంటి కూర్చుండియున్నాఁడు కావున నీతనికి రాజ్యమేల్లైన సంప్రాప్తము కాఁగలదు. కాని వీరిరువురు నెన్నటికి రాజ్యమును బొంద లేరని పలికెను. ఆయ్యర్చకురాలిమాటలు తనచెవులకు ములుకులవలె నాఁటి నందున పృథ్వీరాజు లోపలనుండి వచ్చుచున్నకోపము నాపికొనలేక ఖడ్గమును దాల్చి "చూతము సంగుఁ డెట్లు రా జగునో" అని పలుకుచు సాకరణాతి

ముతో నాసంగుని నొప్పించెను. అంత నాతండు నూరకుండక తన ఖడ్గమును బాణితలంబునఁ గీలించి యుద్ధమునకు నిలువఁబడి తనఖడ్గముతోఁ బృథ్వీరాజును గొట్టెను. కాని యతఁడు జాగరూకుఁ డైయున్నందున నావ్రేటును దప్పించుకొనియె. ఇట్లు వారిరువురు పెనఁగుచుండఁగా నాయర్బకురాలు భయపడి పర్విడిపోయి దేవాలయము ప్రవేశించి కవాటము బంధించుకొనియెను.

అంత సురేశమల్లూరకుండక లేచి వారిరువురిని వారింపసమకట్టి సంగుని తన వెనుకకుఁ దీసికొని వద్దని వారించుచుఁ బృథివీరాజును గొట్టెను. మూర్తిమంతమైన కోపమువలెనున్న పృథ్వీరాజు వానిదెబ్బను సరకుఁగొనక దాని మాటుననున్న సంగునిఁ గొట్టఁగా నదిసురాజమల్లునికిఁ దగిలి యాసంగుని కంటికిఁ దగిలెను. ఆదెబ్బతో నాతని కన్నంధమయ్యెను. పృథ్వీరాజు తన్నుఁ గొట్టినదెబ్బకుఁ దాళఁజాలక కోపాతిరేకంబున నాతనితో ఘోరంబుగఁ బోరాడుచుండెను. ఆసమయమున జయమల్లూరకుండక పృథ్వీరాజు పక్షము వహించి తనచేతనైనసాయము చేయుచుండెను. అంత సంగుఁడు తా నచ్చట నుండినఁ బ్రాణముపోవుట సిద్ధమనితలంచి మెల్లమెల్లగఁ గొండదిగి తన యశ్వముపైఁ గూర్చుండి పర్విడం జొచ్చెను. అది జయమల్లుచూచి సురాజమల్లు పృథివీరాజు యుద్ధములో నొకరినొకరు చంపుకొందురనియు, నింతకుఁ బూర్వము కలహమున నలఁతచెందియున్నాఁడు కావున తా వానిని వెంబడించి చంపి నచో రాజ్యంబు తనకే దక్కునన్న దురభిప్రాయంబుతోఁ గొండదిగి తన హయము నారోహించి సంగుని వెంబడించెను. కాని యాతఁడు ముందుగా బయలువెడలినవాఁడు కావున జయమల్లాతనిఁ గలిసికొనలేకపోయెను. అయినను దన ప్రయత్నము విడువక తనహయమును వాయువేగమునఁ బర్వెత్తించుచు జయమల్లు పయనము చేయుచుండెను. ఇచ్చట నీ యిరువురు రాజపుత్త్రులు ఘోరంబుగఁ బోరి కాయంబులు గాయంబులు గావించుకొని మిగుల నలఁత చెంది చెంతయొకతట్టునఁ గూర్చుండి విశ్రమించిరి అప్పుడు పృథ్వీరాజు సురాజమల్లుని జూచి వధార్హుం డెవఁడో వాఁడు తప్పించుకొని పోయెను. నీతోఁ బోరాడిన నాకుఁ గలుగులాభం బెద్ది? అని పలికి తనకత్తి నొఱలోఁ జేర్చి

కొంత నపసరించి హయము నధిరోహించి తన పురంబునకు మరలెను. పిమ్మట
సురేశమల్లుఁడును తనహయము నధిరోహించి పృథ్వీరాజు వెనువెంటనే ఖురం
బున కరుదెంచెను. అట్లు సంగుఁడు ముందును జయమల్లుఁడు వెనుకను బర్విడఁ
జొచ్చిరి. అంత సంగుఁడు తాను మిగుల నలయిక చెందియుండుటయుఁ దన
వెనుక రౌద్రాకారుండయి జయమల్లుఁడు వచ్చుచుండుటయుఁ జూచి తన
ప్రాణము దక్కుట దుర్లభమని తలంచి పోవుచుండెను. ఆ సమయంబున
నతనికి రాహుతోరువంశజుఁడగు నొకరాజపుత్త్రుఁడు గోచరమగుడు సంగుఁడు
దనయుదంతము తెలియఁజెప్పి తన్నుఁ గాపాడవలయునని వేడుకొనెను. అంత
నాతఁ డతనిఁ జూచి దయార్ద్రహృదయుఁడై సంగుని నొకరహస్యప్రదేశమున
డాఁచి తాను జయమల్లు నెదుర్కొనియె. అంత జయమల్లుఁ డతనితోఁ
ఘోరాతిఘోరముగఁ బోరి వానినిఁ దుదముట్టించి సంగుఁడు గనఁబడునేమో
వెదకెనుగాని యెచ్చటను గానరాఁడయ్యె. అందువలన జయమల్లుఁడు నిరాశ
చేసికొని శరీరమంతట గాయములు తగిలించుకొని చిత్తూరునకుఁ బోయెను.
ఆసంగుఁడా రాజపుత్త్రుఁడు జయమల్లుతో యుద్ధముచేయుచున్నయవసరమున
నిదియె సమయమనియెంచి చిత్తూరునకువచ్చిన తనప్రాణములు నిలుచుట కష్ట
మనియెంచి యెచ్చటికో పాఱిపోయెను.

---

# అయిదవ ప్రకరణము.

ఉత్తరహిందూస్థానంబునం గల ప్రసిద్ధదేశంబులలో మాళవదేశంబొకటి
యని చెప్పవచ్చు. అది రాజపుత్రస్థానంబునకును వింధ్యపర్వతమునకును మధ్య
ప్రదేశంబున నున్నది. ఆదేశంబు బలపరాక్రమశాలులును, విద్వాంసులును,
మహోదారులును నగునుత్తమభూపాలురచేఁ బాలింపఁబడి మహాప్రసిద్ధి కాం
చెను. ఆదేశము నొక్కొక్కరాజు పాలించునప్పు డొక్కొక్కపురము రాజధానిగా
నుండెడిది. ఆదేశమును మొదట పురమారవంశస్థుఁ డగు ఉపేంద్రుం డేలు
చుండెడివాఁడు. ఆకాలంబునకు నాదేశంబును రాజధాని ధారానగరము. అయిం

హేంద్రుని కాలవతరమువాడు ముంజరాజు. అతండును ధారానగరమును రాజధానిగాఁ జేసికొనియే మాళవదేశమును బరిపాలించెను. అతనియనంతరమున భోజరాజు మాళవరాజ్యభారము వహించెను. అమ్మహానుభావుండు సమస్తవిద్యలకు నిలయభూతుఁడై సకల కవీశ్వరులచేత నుపమానంబుగఁ గైకొనఁబడుచున్నాఁడు. అతఁడు సంస్కృతకవిత్వమందు నిపుణుఁడు. అతని కాలములో సంస్కృతభాషయందుఁ గవిత్వమును మిగుల నభివృద్ధిచెందెను. రాజావలంబన మున్నప్పుడు భాష లభివృద్ధిచెందుట కేమియాశ్చర్యము! అమహాత్ముఁడు పెక్కుకవీశ్వరుల కాశ్రయభూతుండై కల్పవృక్షంబువలెఁ బ్రకాశించె. అతని యనంతర మేరాజు కాలములోను సంస్కృతభాష కంతయభివృద్ధి గలుగలేదు. తరువాత నుదయాదిత్యుఁడు లక్షణదేవు త్రిపుర మొదలగురాజు లాదేశమును గాలాజరపురమును రాజధానిగఁ జేసికొని పరిపాలించిరి. పిమ్మట నాల్తమష్ యను తురుష్కప్రభువు 1282-వ సంవత్సరంబున హిందూప్రభువుల నోడించి యుజ్జయినీపురంబును దనస్వాధీనంబుఁ గావించుకొనెను. కాని తరువాత హిందూరాజులు తిరిగి వశము గావించుకొనిరి.

ఇట్లు మాళవదేశము కొంత కాలము స్వాతంత్ర్యముకలదై కొంత కాలము పారతంత్ర్యములకలదై యుండెడిది. పారతంత్ర్యమందున్నప్పుడు ఢిల్లీ చక్రవర్తులకు వశమైయుండెడిది. ఢిల్లీనగరమును ఫెరోజషా పరిపాలించు కాలంబున డిలేవరుఖా యతనివలన ధారానగరంబును బహుమతిగాఁబడసి తనయధీన ముకావించుకొని ఢిల్లీకి సామంతప్రభువై యుండె. తరువాత నతనివంశస్థులు ఢిల్లీచక్రవర్తి బలిష్ఠుఁడైనప్పుడు ఢిల్లీకి సామంతులై కప్పముకట్టుచు వారు దుర్బలులైనప్పుడు స్వతంత్రులై ధిక్కరించుచుండిరి. ఢిల్లీపురము లోడీవంశస్థుల ప్రభుత్వములో నున్న కాలంబున వారు పూర్వముఢిల్లీరాజ్యంబునకధీనంబులైన దేశంబులన్నియు, నిలుపుకొనఁదగినంతసామర్థ్యంబు లేనివారగుటంబట్టి కొన్నికొన్ని దేశంబులు స్వతంత్రంబులయ్యెను. అందులో నీమాళవదేశమొకటి. ఘయాజుద్దీ నను తురుష్కప్రభువు మాళవదేశపు సుల్తానై తన దేశమునకెల్లల యందున్న రాజపుత్రసంస్థానంబుల వశంబుగావించుకొనుటకుఁ జూచుచుండె.

కాని రాజపుత్రులు బలిష్ఠులై యుండుటంబట్టి తనకోర్కె నిష్ఫలంబగుచుండె. ఇతం డొకపర్యాయంబు చిత్తూరిపైకి దాడివెడలగా చిత్తూరున కధీశ్వరుం డైన రాయమల్లుఁడు తనసైన్యంబుతో వాని నెదుర్కొని పూర్తిగనోడించి ముప్పుత్రిప్పులంబెట్టి మూఁడుచేరల నీరుద్రావించె. ఈసుల్తాను రాజపుత్రులవల నఁ దనకు సంప్రాప్తమైన పరాజయంబునకు మిగులవగచుచుఁ జేయునదిలేక తనదేశమునకుమరలె, కాని యెప్పుడైన రాజపుత్రులనోడించి తనకిచుకఁబాపు కొనవలెనని నిశ్చయించి యదరువేచి యుండెను. మఱియు నతఁడా రాజ పుత్రులపరాక్రమంబు గన్నులారఁ గన్నవాఁడు గనుక వారివలన నెప్పుడైన తనరాజ్యంబున కపాయంబు సంభవించునేమో యనిసందియమందుచుఁ దగిన ప్రయత్నంబులు చేసికొనుచుండెను. ఇట్లొకప్రక్క రాజపుత్రులవలన భయం బుబాధించుచున్నను, రెండవప్రక్క రాజపుత్రులరాజ్యంబులఁగొనవలె నన్న తలంపుగూడ బాధింపకపోలేదు. అందుచే నితఁడు కొందఱు రాజపుత్రులతో స్నేహంబుచేసి రాజపుత్రసంస్థానంబునందలి రహస్యంబులనెల్లఁ గనుగొను చుండు. ఇతం డొకనా డొంటిగాఁగూర్చుండి యెద్దియో యాలోచించుచుం డఁగా నొకరాజభటుం డేతెంచి వందనంబులుగావించి "దేవా! యొకరాజ పుత్రుం డొకయుత్తుంగతురంగంబు నధివసించివచ్చి మనసింహద్వార మలంక రించి తమదర్శన మభిలషించుచున్నాఁ డేమిసెలవు?" నావుఁడు సుల్తా నాతనిఁదోతెమ్మన నతం డట్టులొనర్చె. అంత నారాజపుత్రుఁడు సుల్తానుచే నుచితమర్యాదల నంది యుచితాసనంబునఁగూర్చుండిన పిమ్మట నతనితో సుల్తా నిట్లు ప్రసంగించెను.

సు.—రాజపుత్రా! నీ నివాసస్థల మెచ్చట?

రా.—మాది తోధానగరము.

సు.—నీపేరేమి!

రా.—నాపేరు దామోదరసిం గనిపిలుచుచుందురు.

సు.—ఎందులకై వచ్చితివి ?

రా.—తమతోఁ గొన్నిరహస్యంపువిషయంబుల మాటాడుటకు.

సు.—ఏరాజపుత్త్రునొద్దనుండియైన రాయబారిగ వచ్చినావా?

రా.—లేదు. ఇఁక తుచ్ఛులైనరాజపుత్త్రుల సేవింపనని శపథంబు కావించితిని.

సు.—(నవ్వుచు) నీరాజపుత్త్రుల నీవే నిందించుకొనుచున్నావేమి?

రా.—నాకు నావారనియుఁ బెఱవారనియు భేదంబులేదు. సద్గుణవంతులై న్యాయమార్గావలంబులై యున్నవా రితరజాతివారైనను నాజాతివారిఁగానే తలంతు. దుర్గుణులై యన్యాయావలంబులయి యున్నవారలు నాజాతివారినైనఁ బరులఁగాఁ దలంతు. నేను గుణన్యాయంబులఁ బట్టియే నాజాతివారని యితరజాతివారని భావింతును గాని కేవలంబు జాతులఁబట్టికాదు.

సు.—వహ్వారే! బాగుబాగు. యుక్తముగాఁ బలికినావు కాని మీ రాజపుత్త్రులు పరాక్రమంబునను న్యాయాన్యాయపరిశీలనంబునను సుప్రసిద్ధులని ప్రసిద్ధి కలదే!

రా.—ఆప్రసిద్ధి పూర్వకాలంబునాటిది. ఇప్పటి రాజపుత్త్రులకు న్యాయమనియు, నన్యాయమనియు లేదు. ఉచ్చనీచంబులు మునుమున్నె నశించినవి. చెట్టుపేరుచెప్పి కాయలమ్ముకొను నట్లు పూర్వుల ప్రసిద్ధినే వాడుకొనుచున్నారు. ఇప్పటి రాజపుత్త్రులకేమి? ప్రసిద్ధి కలుగుటేమి?

సు.—(పెద్దనవ్వునవ్వి) అవును బాగుగఁ జెప్పితివి. మీరాజపుత్త్రులు డంబంబులు చెప్పుకొనువారని నే ననుకొనుచున్నాను. అది నిశ్చయమే?

రా.—రాజపుత్త్రులు మేడిపండ్లవలె పైడంబములు చూపు వారే. లోపల నెన్ని లోపంబులున్నవో మీ కేమి తెలియును?

సు.—సరే పురుషులడంబ మిఁక బట్టబయలైనది. రాజపుత్త్రస్త్రీలు సౌందర్యంబున నిరుపమానురాండ్రని వినియున్నాను. అందలి తత్త్వమేమి?

రా.—(తనలో) వహ్వారే! మిక్కిలి మంచిసమయము లభించినది. 'అడఁబోయినతీర్థం బెదురాయె' నన్నట్టు లేప్రసంగము నేఁ దేదలంచియున్నానో, యీతం డాప్రసంగంబునే తెచ్చె. ఇఁక నేఁ గృతకృత్యుండఁ గావచ్చు. (ప్రకాశముగా) అయ్యది నిక్కువంబె. రాజపుత్త్రస్త్రీల

యందున్న సౌందర్యము సురాంగనలకుసైతము కలుగనేరదని కత్తి పట్టుకొని ప్రమాణంబు గావించెదను.

సు.— ఆశ్చర్యపడుచు) ఇప్పటి రాజపుత్రస్త్రీలలో సౌందర్యంబున సుప్రసిద్ధురా లెవరు?

రా.—తారాబాయి యను నామె సుప్రసిద్ధురాలని చెప్పవచ్చు.

సు.—ఆమె ఎవరిపుత్రిక?

రా.—తోధానగరపు రాజగు సూరథాన్రాయుల కుమారిక.

సు.—ఆరాజు నీకు బంధువా?

రా.—ఔను. నాతండ్రియు సూరథానురాయుల తండ్రియు సేకోదరులు.

సు.—మీరిరువురు బంధువులా? (అని యేదియో యాలోచించుచుండ)

రా.—ఎందుల కట్టాలోచించుచున్నారు? ఆలోచింప నవసరములేదు. తమ యభిప్రాయము గనుగొంటి. మీకారాజపుత్రియం దభిలాషయున్నం దెల్పుఁడు. తప్పక గొనివచ్చి తమకర్పింతును.

సు.—ఎట్లు గొనిరాఁగలవు?

రా.—ఉపాయంబులమాట నడుగవలసిన యవసరంబు లేదు. గొనివచ్చిన పిమ్మటఁ దమకే తెలియును.

సు.—నాకు హిందూరాజపుత్రికను బరిణయ మాడవలెనన్న యభిలాష చిరకాలమునుండి బాధించుచున్నది. కాని నెఱవేఱినదికాదు.

రా.—ఇఁక మీకోర్కె నెఱవేఱినదనియె నమ్ముఁడు? ఇదిగో శపథము చేయుచున్నాను. సూర్యుఁడు పడమట నుదయంబైన నగునేమోకాని శపథంబు తిరుగనేరదు. మఱియు నావచ్చిన ప్రయోజనంబు గూడఁ దెలియఁజెప్పెద నవధరింపుఁడు. సూరథాన్రాయుఁడు మిగులఁ గుటిలుఁడు. మొదటఁ దనయనంతరంబు నా కర్ధరాజ్యం బొసంగెద నని పలికి నమ్మించి నేఁడు నా కేమియు నొసంగక తనకుమారికకే యొసంగునఁట. ఇప్పటి రాజపుత్రులన్యాయం బెట్టున్నదో తమయుల్లంబునకుఁ దెల్లంబై యున్నదా! అంత నే నూరకుండక నీతిబోధకంబు లగు

వాక్యంబులతో నొకయుత్తరంబు వ్రాసియుంప నది గనుఁగొని యూరా
జాజ్యధారలచేఁ బ్రజ్వరిల్లు వీతిహోత్రంబు చందంబున మండిపడి
న న్ననరానివాక్యంబు లాడి పురంబునుండి వెడలఁగొట్టె. నాకవమా
నంబుకంటె మరణంబె యుత్తమం బై కన్పట్టుచు. అందువలన నట
నుండఁజాలక పురంబు వెడలివచ్చి "నాకసి యెట్లు దీర్చుకొనఁ గలను?
ఎవ్వని నాశ్రయించిన నాకు రాజ్యంబు సంప్రాప్తంబగు? అట్టి
బలాఢ్యుం డగు ప్రభు వెవ్వండు? దీనవత్సలుండును, ఆశ్రితపోష
కుండు నగు రాజసత్తముం డెవండు? ఎవ్వనినాశ్రయించిన నామనో
రథం బవితథం బగు?" నని తలపోయుచు రాజుల వేర్వేఱఁ
బేర్కొనుచు వారందఱి నసమర్థులుగా నిశ్చయించి సుగుణంబులను
నసాధారణ సామర్థ్యమును విని మీరే మదీయకార్యంబు నెఱవేర్ప
సమర్థు లని సిద్ధాంతించి మీదర్శనంబున కేతెంచితి. మీ యభీష్టంబు
నెఱవేర్చుట కెంతమాత్రంబు సందియంబు లేదు. మీరును నామనో
రథం బీడేర్పఁ బ్రార్థితులు. ఇందులకు మీరు పూనుకొనినచో మీ కా
కన్యకారత్నంబు లభియించుటయు గాక చిరకాలంబు నుండి మీతో
బద్ధవైరం బై యున్నచిత్తూరురాజ్యంబుగూడ మీయధీనము గాక
మానదు. అది యెట్లో వివరించెద. సావధానులై యాలింపుఁడు.
మీ రభిలషించిన కన్యామణితండ్రి రాయమల్లునకు స్నేహితుండు,
మఱియు నతఁడు రాయమల్లునకు సామంతుండై యున్నాఁడు. మనము
తోధానగరంబుపైకి దాడివెడలినచో నాతని కాతఁడు తోడ్పడ య
త్నించు. అందుచే నతఁడు సైన్యంబుతో నచటికిఁ బోవు. ఆ సమయం
బున మనము కొంతసైన్యంబును బంపి చిత్తూరును వశంబు కావించుకొన
వచ్చు. అంతమాత్రంబునఁ జిత్తూరువంశంబగునా యని సందియపడ
నవసరంబు లేదు. నా ప్రియమిత్రుండును మహాబలశాలియుం బ్రతిభావం
తుండు నగు సురాజమల్లుం డనురాజపుత్త్రుఁడు చిత్తూరునందుండి రాజ
కుటుంబములో భేదంబు గల్పించి యంతఃకలహంబులఁ బెంచుచున్నాఁ

డు. మఱియుఁ బెక్కుమాయోపాయంబులఁ బన్నియున్నారము. అవి యన్నియు ఫలింపకమానవు. ఇట్టింతగఁ గలహంబులతో నిండియుండు రాజ్యంబు జర్ఝరీభూతం బగునదీతీరంబున నున్నవృక్షంబుచందంబునఁ దనంత తానె యధఃపతితం బగునని చెప్పవలసినప్పుడు మహాబలోద్ధూతంబై యధఃపతితంబగునని వేఱ చెప్పవలయునా! అని యివ్విధంబున నుపన్యసింప నప్పలుకులన్ని చెవులకు నమృతధారాపాతంబుల చందంబగుడు నానందము పట్టఁజాలక సుల్తాను కొంత సేపూరకుండి యిట్లనియె. "రాజపుత్త్రా! నీవాక్యంబులు మిగుల యుక్తంబుగా నున్నవి. పెక్కండ్ర రాజపుత్త్రులఁ జేరఁదీసితింగాని నీవలె యుక్తియుక్తంబుగాఁ బలుకువారు లేరు. మానసంబున నానంద ముప్పతిల్లె. నీ మనోరథంబు తప్పక నెరవేర్చెద. నా యభిలాషంబుగూడఁ దీర్చుము. నీవు మాపురంబున నివసించి శత్రుపురంబునకుఁ జారులఁ బుత్తెంచుచు నెప్పటిసమాచారం బప్పుడె తెలిసికొనుచు నవశ్యకార్యంబు లగుకార్యంబుల నెఱవేర్చుచు నుండుము. సమయంబు చూచి తోధానగరంబుపై దాడి వెడలుదము. రాజకన్యకను రప్పింపంగూడ యత్నించుచుండు" మనిపల్కి యాతనికిఁ దగినసౌధంబు నొకదాని నొసంగి యాదరింప నతండును బరమానందంబుతో వర్తించుచుఁ దనయభిలాషంబు నెఱవేర్చికొనఁ బాటుపడుచు రాజానుగ్రహంబునకుఁ బాత్రుండయి కాలంబు గడుపుచుండె.

---

# ఆఱవ ప్రకరణము

కాల మెప్పుడు నొక్కరీతిగ నుండదు. అది నిమ్నోన్నతంబయిన భూమి వంటిది. అట్టిభూమియందుఁ బ్రవర్తించుజంతువు లొకప్పు డున్నతపదమందుండి మఱొక్కమా రధఃపదంబున నుండునట్లు కాలానుసారులయిన జంతువు లొకఱి యనేకసుఖంబులను, మహాగౌరవమును, మహాధికారంబును, సకలసుతి

పాత్రతయుం గలవారయియుండి తదనంతరమందె పలుదుఃఖములకును, నప మానంబునకు, సకలనిందా పాత్రతకు బాలగుచుందురు. ఇంతయును మూలంబు కాలంబు. మానవులు మఱ్ఱిగ్రాటిచే మహావృషభంబుల లొంగఁదీసికొనుచు న్నట్లు కాలంబు సమస్తజంతువులను లొంగఁదీసికొనివర్తించు. కాలము నెవ్వరు నతిక్రమింపలేరు, అయ్యది యసాధారణసామర్థ్యమ్ముకలది. అయ్యది జంతు వులఁ బలుమార్గంబులఁ ద్రొక్కించు. కొందఱికిసుఖమొసంగు. కొందఱికి దుఃఖంబునిచ్చు. మఱికొందఱికి ధనంబొడఁగూర్చు. ఇంకొకకొందఱను దరి ద్రులఁగా నొనర్చు. ఒక కొందఱికి శత్రువిజయంబు నిచ్చు. మఱికొందఱను శత్రువుల బాఱిఁబడవేయు. మానవునకు శత్రువులెవ్వరు ? కొందఱు ధన మప హరించినవారును, దన్నుఁ గొట్టినవారును, దన్ను నిందించినవారును, దనకప కారం బొనర్చినవారును,శత్రువు లని తలంచుచున్నారు.వీరుబాహ్యశత్రువులు కావచ్చును. వీరు బాహ్యశత్రువులు, ఈబాహ్యశత్రువులు కలకాలము శత్రు వులై యుండరు. ఒకప్పుడు మిత్రులైకూడ నుండవచ్చును. నిమిత్తమునుబట్టి శత్రువులైనవారు నిమిత్తము నశింపఁగానె మిత్రులగుచుందురు. మఱియు నీశత్రువు లెప్పుడో కాని బాధించుచుండరు. కాని యీబాహ్యశత్రువులకంటె నధిక బలవంతులై యెల్లపుడు మానవులనాశ్రయించి బాధించుశత్రువులుకలరు. వారంతశ్శత్రువులనియు సహజశత్రువులనియుఁ బిలువఁబడుదురు. వారు కామ క్రోధ లోభ మోహమదమాత్సర్యంబు లను నామంబులతో నొప్పుచుండు వారు. వీరందఱు బలంబున నొకరికొకరు తీసిపోరు. వీరు మానవుల ముప్పు త్రిప్పులం బెట్టుచుందురు. ఒకప్పుడయినను మానవుల విడిచియుండరు. వీరి నరిషడ్వర్గమనియుఁ బిలుతురు. ఈ యరిషడ్వర్గంబులలోఁ గ్రోధం బొకటి యని తెలిసినదికదా ? ఈక్రోధంబు మానవుల సమాశ్రయించి పెక్కు చెడు మార్గంబులఁ ద్రొక్కించు. హితకరమయిన మిత్రవాక్యంబుల విషకల్పంబుగాఁ జూపించు. ప్రాణాస్పదులయిన బంధువులనయినఁ బరమశత్రువులఁగాఁ దలఁ పించు అది యుక్తాయుక్తవివేకం బను దీపంబునార్పు మారుతంబువంటిది మానవులఁ బాడుచేయ నింతకంటె నుత్కృష్టమైనది మఱియొకటిలేదు. క్రోధం

బునకు వశుండుకానివాఁడే ధన్యుండు. అట్టివారిని క్రోధంబేమియుఁ జేయలేదు. కాని తనకు వశులయినవారి నావేశించి గ్రహగ్రస్తులచందంబున నాడించు. నోట ననరానివాక్యంబులఁ బ్రేలించు. పలువిధంబు లగు వికారచేష్టలఁ జేయించు. ఇట్టి క్రోధం బొకనాఁ డనివార్యమై చిత్తూరు రాణాయగు రాయమల్లు నాశ్రయించె. ఆరాయమల్లుఁ గొలువుకూటంబునఁ గూర్చుండి కోపోద్దీపితుండయి యగ్నిహోత్రంబుచందంబునఁ బ్రజ్వలింపఁ జొచ్చె. ముఖంబును గనుగొనలు కెంపుగదిరియుండె. కోపాతిశయంబున శరీరంబు కంపించుచుండె. సభలోనున్నవా రొకరుచు నాతనివంకఁ జూడఁజాలక మొగంబువంచుకొని యుండిరి. ఒకండు నొక్కమాటయుఁ బలుక సాహసింపకుండిరి. ఇంత యేల? పూర్వము రాయమల్లునెడ నత్యంతపరిచయంబుగల మిత్రులు సయితము మౌనం బవలంబించిరి. క్రోధకారణంబునఁ గడువెఱచుచుండిరి. అంత రాయమల్లుండు కొంతవర కిట్లు మిన్నకుండి గంభీరభాషణంబుల నిట్లనియె. "ఓరీ! చండాలుఁడా! ఎంతపనిచేసితివి? నీబుద్ధియెక్కడ బుగ్గయినది! యుక్తాయుక్తవిచారంబు వలదా! చిత్తూరు వారివంశంబనుచంద్రబింబంబునకుఁ గలంకమువలె దాపరించినావేమిరా? చిత్తూరు రాజు లెంతయు సద్గుణులనిపించుకొని ప్రసిద్ధి కెక్కినారు. నీ వట్టివారలగర్భంబునంబుట్టి వంశంబున కప్రతిష్ఠ తెచ్చినావు. ఇట్టిదుర్గుణంబులు కలవాఁడవు నాకేల పుత్త్రుండవయి జన్మించినావు? అవగుణుండయిన పుత్త్రుండు తండ్రిపాలిటి శత్రువని వేఱ చెప్పవలయునా? సర్వవిధంబులఁ బిల్లశ్రేయస్సు గోరుచున్న జననీజనకులఁ దృణప్రాయంబుగాఁ జూచుట యుక్తంబుకాదని తలంప వద్దా? నీకు సుంతేనియుం బుద్ధియున్నదా? నీవంటి బలవంతులు చిత్తూరివారి వంశంబునఁ బుట్టలేదో? వారు నీవలె దుష్టబుద్ధులయి రాజ్యం బపేక్షించి జనకుల నిరాకరించి పితృసదృశుండగు జ్యేష్ఠసోదరుఁ జంపఁ బ్రయత్నించినారా? వంశమర్యాదలఁ గొంచెమేనియుఁ నిలుపుకొనవద్దా? చనువిచ్చినంతమాత్రంబునఁ గ్రిందుమీఁదుచూడక ప్రవర్తింపవచ్చునా? ఆసంగుఁ డెట్టి సద్గుణంబులు గలవాఁడు వాని ప్రవర్తన మెంతమంచిది? వానికున్న యోగ్యత యెవ్వరికిఁ గలదు? ఆ నిరుపమానబుద్ధి

యు, నాపితృమాతృభక్తియు, నాపరాక్రమము నాసుజనవందనీయగుణంబులు,
నావినయసంపద యీసంగునికే గలదు గాని మఱెవ్వరికిఁగలదు! చిరకాలంబు
నుండి మహానీయులచేఁ బరిపాలింపఁబడి ప్రఖ్యాతిగాంచిన చిత్తూరురాజ్యం
బేలుటకు సంగుఁడె యర్హుండుకాని నీవంటిదుష్టగుణుండా యర్హుండు? అట్టి
సద్గుణుతోఁ బోరాడి వానిని గ్రుడ్డివానిఁగాఁజేసి చిత్తూరుఁ జేరకుండఁజేసిన
దురాత్ముండవు? అట్టి నీమొగంబుఁజూచినఁ బాపంబువచ్చు. నాపురంబున
నుండఁదగినవాఁడవుకావు. ఇటనుండి లేచిపొమ్ము. ఱేపటి యుదయంబున నీ
వీపురంబున నున్నట్టు దెలిసినచోఁ దగినపని చేయించెద. నీవు కలహప్రియుం
డవు. కావున నెచ్చటికయినఁ బోయి యెవరితోనైనఁ బోరాడుచు బ్రతు
కుము." అని యిట్లతికోపంబునఁ బలికిన గంభీరభాషణంబులువిని సభాసదు
లందఱు నొకరిమొగం బొకరు చూచుకొనుచు నేమియుం మాటాడక యుండిరి.
అంత సభలోనున్నపృథ్వీరాజు తండ్రివాక్యంబులు శత్రువులశూలఘాతంబుల
కంటె నెక్కుడుగా నొప్పింప నవమానంబుచేఁ బొడముకోపంబు నడంచికొని
తన తెలివితక్కువకు వగచుచు లేచి నిలువఁబడి యంజలిఘటించి యిట్లనియె.
"ఓ మహారాజా! నీవు చెప్పిన వాక్యంబులన్నియుం సత్యంబులు. మహాపరా
ధంబు గావించినానని నేనును పశ్చాత్తాపముచెందుచునే యున్నాను. ఈయప
రాధంబు క్షమింపుఁడు సంగుం డెచ్చటనున్నాఁడో కొనివచ్చి తమ కర్పిం
చెద. ఈతప్పిదంబు క్షమించి నన్నుఁ బురంబుననుండి వెడలఁగొట్టకుఁడు. అట్లు
కాక పొమ్మనిన నిప్పుడే లేచిపోయెద. మీరు వెడలఁగొట్టించు నంతవఱకు
నుండువాఁడఁ గాను. పృథ్వీరాజంత గౌరవహీనుండుకాఁడు." నావుడు
సభాసదులందఱు నతని వాక్యంబున కనుమతించి నుతించిరి. కాని రాయమల్లుఁ
డు హృదయంబునఁ గాఠిన్యంబువహించి పృథ్వీరాజునుఁ జూచి యిట్లనియె.
"చాలు చాలు. నీ విప్పుడు వినయవాక్యంబు లాడినంతమాత్రంబున సంతసిం
చువాఁడను గాను. ఆసంగుని వెదకి కొనివచ్చి యర్పించెదనని చెప్పుచున్నావు.
వానిని బరదేశములందయిన నుండనీవా? ఏమి? ఆనాముద్దులపట్టి యగు
సంగుని కపకారముగావించి విదేశగతునిగాఁ జేసిన దుష్టుండవగు నీవాక్యంబుల

నిం లేనియుం నమ్మను. నీవు క్షమింపఁ దగినవాఁడవు కావు. వెంటనే నా పురంబు నుండి లేచి పొమ్ము” అనిన విని పృథ్వీరాజు మారుమాటాడక సభనుండి లేచి వెడలిపోయెను. అప్పుడు సభలోనున్న రాజపుత్త్రులు కొందఱు రాయమల్లుని కోపంబువారించి పృథ్వీరాజునందు దయార్ద్రహృదయుం గావింప నెంచి పలు విధంబుల హితోపదేశంబుచేసిరి గాని, క్రోధావిష్టమానసుండయిన రాయ మల్లుని చెవులఁ బడినవికావు. క్రోధప్రభావమెట్టిదో చూచితిరా? పిమ్మటరాయ మల్లుండు సభనుండి దిగ్గనలేచి యంతఃపురంబునకుఁ బోయె. అంత సభాసదు లును దమతమ మందిరముల కరిగిరి. పిమ్మట పృథ్వీరాజు తన యకార్యకరణం బునకుఁ బలువిధంబులఁ బశ్చాత్తాపంబునొందుచుఁ, దండ్రి జేసిన యవమానం బునకును సహింపఁజాలక ఘనకార్యంబులఁజేసి తండ్రి మెప్పువడసి యతనిచే నాహూతుండనైనంగాని చిత్తూరు ద్రొక్కనని శపథంబుచేసి పలయుం యుద్ధ సాధనంబులఁగైకొని నల్వురు పరిచారకులతోఁ గూడి యారాత్రియే చిత్తూరు నుండి వెడలిపోయె. చదువరులారా! పృథ్వీరాజు సోదరునితోఁ బోరాడుటం బట్టి దుష్టగుణుండని తలంపరాదు. అతని ప్రవర్తనంబునుగూర్చి కొంచెము చర్చింపవలసి యున్నది. పృథ్వీరాజు మిగుల బలవంతుఁడు పరాక్రమశాలి నిరుపమానసాహసధైర్యంబులు గలవాఁడు. అతండు పూనుకొన్నచో రాయ మల్లాదుల నందఱ జయించి చిత్తూరు వశంబు గావించుకొనఁదగినంత బలా ఢ్యుండు. అట్టి నిరుపమాన పరాక్రమవంతుండైనను, దన్నుఁ దండ్రిసభలో దుస్సహవాక్యంబు లాడిన నుం లేనియుఁ గినుక చెందెనా? తండ్రిమాటకు మాఱాడెనా? పృథ్వీరాజు దుష్టుండేయయిన సభలోఁ దన్ను దూఱుచున్న తండ్రిని జంప నేలపూనుకొనఁడు? అతని కంతబలంబు లేకపోలేదే? కావునఁ బృథ్వీరాజు దుష్టుండని యోజింపఁదగదు. అతండు మిగుల యోగ్యుండు. అతండు సద్గుణంబులు గలవాఁడే. అతనికిఁ బితృమాతృభక్తి లేకపోలేదు. అతని ప్రవర్తన లోకులచే నుతింపఁ దగియుండకపోలేదు. కాని యతని గుణంబు లన్నియుం దుష్టసహవాసంబున మారిపోయినవి. నదీజలంబు మొదట మాధుర్య గుణంబు కలదయినను సముద్ర సంపర్కముగలిగిన పిమ్మట మొదటిగుణంబు

నిలుచునా? నిర్మలజలంబు పంకిలంబగు భూతలంబుఁ జెందినచో నిర్మలత్వంబు నిలుచునా? నిలువదు. అట్లె పృథ్వీరాజు సద్గుణంబులన్నియు సురేశమల్లాది దుష్ట సహవాసంబున దుష్టంబులైనవి. వారల యుపదేశంబున నతని మానసంబు ఋజుత్వంబును వదలి కుటిలత్వంబు నొందినది. దుష్టుల ప్రోత్సాహంబుననే తన సోదరునితోఁ బోరాటము సలిపె. ఆతండు బుద్ధిమంతుండయి సద్గుణవంతుఁ డయి యుండినచో దుష్టసహవాసం బేల చేయవలయును? దుష్టుల యుపదేశం బేల చెవిఁ బెట్టవలెను? అని యడిగిన యడుగవచ్చు. అందులకు సమాధానంబు లేక పోలేదు. పృథ్వీరాజు చిఱుతప్రాయంబువాఁడు గాని పెద్దవాఁడు కాఁడు. యుక్తాయుక్తవివేచనమం దంతసామర్థ్యంబు లేనివాఁడు. చిఱుతప్రాయంబువారికిఁ బరులుపదేశించు వాక్యంబులు వినుటయందుఁ గుతూహలంబె కాని వారి వాక్యంబులు హితంబులో యహితంబులో వారికిఁ దెలియవు. మఱియు నట్టి దశయందున్నవారు తమ్ము నుతించువారినే ప్రియులుగా నెంతురు. తమ్ము నుతించినచో వారుప్పొంగిపోయి పరు లేమి యుపదేశింతురో దానినే వింతురు. దానినే యాచరింతురు. ఇది చిఱుతప్రాయంబు వారి స్వభావము. అట్లే పృథ్వీరాజును సురేశమల్లాది దుష్టుల యుపదేశంబె చెఱిచినది. చిఱుతప్రాయంబున మానవులబుద్ధి యొకమార్గంబని నియమం బుండదు. మెఱుపు దీవెవలె చంచలం బై యుండు. దాని నొక గ్రుడ్డివానితోఁ బోల్పవచ్చు. గ్రుడ్డివాఁడు మార్గదర్శి ననుసరించి పోవుచుండు. మార్గదర్శి మంచివాఁడైన మంచి మార్గంబు చూపును. లేక వాఁడు దుష్టుండయిన గర్తయుతంబయిన మార్గంబు చూపు. మార్గదర్శి ననుసరించుటే చీఁకునకు స్వభావంబు కావున నాయా మార్గంబులం బోయి యాయా ఫలంబు చెందు. ఫలానుభవం బయినపిమ్మట నే మార్గదర్శి చెడ్డవాఁడో మంచివాఁడో తెలిసికొనును గాని ముందుగఁ దెలిసికొనలేఁడు. అట్లే చిఱుతప్రాయంబువారు దుష్టసహాయులై దుష్టమార్గ మవలంబింతురు. సజ్జనసహాయులైన సన్మార్గము నవలంబింతురు. వారలకీ లాభనష్టంబులు తత్తత్ఫలం బనుభూతంబైన తరువాతనే తెలిసికొనఁగలరు గాని ముందుగాఁ దెలిసికొనలేరు కావున జననీజనకులకుఁ దమపిల్లలు దుష్టసహవా

సంబు చేయకుండ నుండునట్లు చేయుంట విధియైయున్నది. అట్లు తలిదండ్రులు తమ సంతతివిషయమున జాగరూకులై యుండనిచోఁ బెక్కులపాయంబులకుఁ బాత్రులై యుందురు. తా మపాయంబు లొందుటయే కాక బిడ్డలఁ జెఱిచినవారును నగుదురు. ఇంతియకాక మానవుల బుద్ధి సుమార్గ దుర్మార్గములఁ ద్రొక్కుటకుఁ బ్రధానంబు చిన్నతనంబు. అప్పు డేమార్గముగ నడుగిడిన నామార్గమ్ముననే పోవుచుండు. ఇందుల కొకదృష్టాంతము చూపెద. అయోమార్గంబును ధూమశకటంబును నందఱు జూచియున్నారు. ఆ పొగబండి నిలుచుస్థానమునకు(Station)వచ్చుచుండు. అప్పు డందుండు ప్రధానాప్రధానమార్గంబులఁ (Main line & Loop line) బడిపోవుటకు మార్గవిభాజకస్థలంబు (Point) ప్రధానంబు. అచ్చట నేమార్గంబుఁ బ్రవేశించిన నందే పోవును. అట్లే చిన్నతనంబు మార్గవిభాజకస్థలము (Point) వంటిది. అక్కడ బాలుర బుద్ధి నేమార్గమందు ప్రవేశించిన నందే పోవుచుండు. కావున నన్నివిధంబుల నాలోచించిచూడఁ బృథ్వీరాజాదులు చెడుటకు ముఖ్యకారణము రాయమల్లుని యజాగ్రత్త యని చెప్పవలసి యున్నది.

---

# పదవ ప్రకరణము

రాజపుత్త్రస్థానంబులోఁ దోధానగరంబని చిన్నసంస్థానం బొకటి కలదు. అది చిత్తూరునకు లోఁబడిన సంస్థానంబులలో నొకటి. దానిని సూరథాన్రాయు లనురాజపుత్త్రుండు పాలించుచుండెను. అతండు మిగుల మంచి సత్ప్రవర్తనగలవాఁడు, మహోదారుండు, సద్గుణవంతుండు. అతనికిఁ బుత్త్రసంతతి లేదు. కాని పుత్త్రికయొకతె గలదు. ఆమెను దారాభాయి యని పిలుచుచుందురు. ఆ కన్యామణి లోకములోని సౌందర్యవతులలో నొకతె యని చెప్పవలసి యున్నది. ఆమెకుఁ గేవల సౌందర్యంబే కాక సద్గుణసమృద్ధికూడ గలదు. ఆమె బాలచంద్రరేఖచందంబున దినదిన ప్రవర్ధమాన యగుచుఁ గిలకిల నవ్వు తల్లిదండ్రులకు హృదయామోదంబు గావించుచు వచ్చియు రాని ముద్దు

పలుకులచే జననీజనకుల వీనులకు విందుగావించుచు శిరీషకుసుమసదృశంబగు శరీరసంస్పర్శంబువలన స్పర్శేంద్రియసుఖంబు గలిగించుచు నుండెను. సద్గుణ వంతురాలగు భార్యను ముద్దులు మూటగట్టు కుమారికను, నిష్కంటకంబగు రాజ్యంబును, జూచుకొని రాయలానందాంబుధిలోఁ దొప్ప దోఁగుచున్న సమయంబున నాతనిభార్య రోగపీడితయై కాలధర్మంబు నొంది యతని దుఃఖ సముద్రంబున ముంచె. అవు నెవ్వరికైన నానందంబు స్థిరమై యుండునా! అది పున్నమనాఁటి వెన్నెలవంటిది. సంప్రాప్తంబై శీఘ్రకాలంబులోనే నశించు. అంత నారాజపుత్రుండు విచారపరీతుండై దుస్సహాపత్నీవియోగ పీడితుండైనను, నా భార్యయందున్న ప్రేమాతిశయంబునఁ బునర్వివాహంబు చేసికొన నిష్టపడక నారాజపుత్రిక ముద్దువాక్యంబులు వినుచు నాయానందం బున గాలంబు గడపుచుండె. ఆకాలంబున హిందూదేశంబు కలహాభూయి ష్ఠంబై యుంటఁబట్టి తనరాజ్యసంరక్షణలోఁ దనకు సహాయభూతురాలై యుండుటకై కుమారిక కాయుధవిద్య నేర్పుచుండెను.

మఱియుం సర్వకాలంబులం దామెను దనవెంట ద్రిప్పికొనుచు, రాజ కీయవ్యవహారంబులను రాజనీతియందును నిపుణురాలిగాఁ జేయుచుండె. ఆమెయుం నవలీలనే తండ్రి చెప్పుచున్న విద్యలయందు నిరూపమానురాలై యా తని కానందమ్ము గొలుపుచుండె. ఆ తారాబాయి యిట్లు సద్గుణంబులచేతను, సత్ప్రవర్తనచేతను, పితృభక్తిచేతను, వినయసంపదచేతను, నాయుధ విద్యా చాతుర్యంబుచేతను, జనకుని యవ్యాజప్రేమ కాస్పదురాలయ్యె. ఆరాయలును దనకుమారిని ప్రాణపదంబుగా నెంచి పెంచుచు నామెకుఁ దోడుగా నుండు టకై తన మేనకోడలగు రమాబాయి యనుచిన్నదానిని గొని వచ్చి యింట నుంచుకొనియె. ఆ యిరువురు బాలికలును సంతసంబుగ కలిసి తిరుగుచు నాట లాడుచు, నొక్కొకమారు పూవులతోఁట కరిగి విహరించుచు, నొక మాఱు చదువుకొనుచుండిరి. ఇట్లనవరతంబు గృహాలక్ష్మివలెఁ దిరుగుచున్న కూఁతుం గాంచి యారాయలు భార్యావియోగజనితదుఃఖంబు మఱచిపోయె. ఇట్లుండ నాతని సంస్థానంబున దామోదర సింగనురాజపుత్రుఁ డొకఁ డుండెడివాఁడు.

వాఁడు మిగుల క్రూరుఁడు. సూరథాన్రాయలకు బంధువు. వాఁడు చిరకాలంబు నుండియు సంస్థానంబు నాశ్రయించి యుండె. అతఁడు రాయలకు యుద్ధము నందు సహాయుఁడై యతని యనుగ్రహంబునకుఁ బాత్రుండాయె. అందుచే నితం డారాయ లొంటిగానున్న సమయంబున నతనిఁ జేరి యిట్లనుచుండెడి వాఁడు. "అయ్యా! మీరును నేనును నొకవంశంబునఁ బుట్టినవారము. మీకుఁ బుత్త్రసంతతి లేదుగాన నన్నుఁ గుమారునిగా భావించి భవదనంతరంబున రాజ్యంబు నాకొసఁగుఁడు. మీపుత్త్రిక నొక రాకొమరున కిచ్చి పెండ్లి చేసి రాజ్యం బామెకిచ్చినను మనవంశంబు పేరుండదు కదా! బుద్ధిమంతులైన తమ కిది తెల్లంబు కాక మాన"దని యుపదేశింప నాతఁడు మందహాసంబు చేయుచు మోమోటంబుచే బ్రతిషేధింపలేక 'ఓయీ! నాయనంతరంబునఁ గదా! అప్పటి సంగతి చూచుకొందము. ఇప్పటినుండియు నాలోచింప నేల?" యని పలుకుచుండె. అది విని దామోదరుండు రాయలు తనకు రాజ్యం బిచ్చుట నిశ్చయం బని యుండె. అంత రాయలు తారాబాయి యుక్తవయస్కురా లగుటఁ జూచి పెండ్లిచేసి యారాజ్యం బామెకు నల్లునకు నీవలెనన్న తన తలంపును మంత్రియగు గోపాలసింగుతో నుడువ, అది యుక్తం బని చెప్పి యామెకుఁ దగిన వరుని సంపాదింపఁ బ్రయత్నించుచుండె. ఈ యుదంతమ్ము క్రమక్రమంబుగా దామోదరుని చెవిఁ బడియె. అంత వాఁడు సూరథానునొద్దకుఁ బోయి హితోపదేశంబు చేసెఁ గాని యతఁ డిందులకు సమాధానంబు చెప్పక మఱియొక ప్రసంగంబు దెచ్చి మాటాడుచుండెడివాఁడు. మఱొక్కప్పుడు దామోదరుం డీప్రసంగంబు దేఁగానే "తలనొప్పిగా నున్నది. ఇందు విషయంబై మఱియొకమారు ప్రసంగింత"మని చెప్పి పంపుచుండెడి వాఁడు. ఇందువలన దామోదరుని యాసవిడిచి చనలేదు. ఒకప్పు డీదామోదరుండు గోపాలసింగుతో నిందులకై ప్రసంగింప నతండు మోమోటంబు విడిచి కడుపునఁ బుట్టిన బిడ్డకు రాజ్యంబీయక యొక్కవంశంబున జనించినారమని నీకును నాకును రాజ్యం బొసంగునా? ఏమి యీవెఱ్ఱితనంబు" అని నుడువ నతండు మాఱుచెప్పలేక తన మందిరంబునకుఁ బోయి "సూరథానులకుఁ దనకు

రాజ్యం బీయవలె నని తలంపున్నది. కాని గోపాలసింగే దాని కంతరాయంబు గల్పించుచున్నాఁడు. లేనిచో నీతఁడన్న వచనంబు సూరధానుఁ డేలచెప్పఁడు." అని యోజించి గోపాలసింగు రాజద్రోహంబు చేయుచున్నట్టు లొకయుత్తరంబు కల్పించి యందులకుఁ దగిన సాక్ష్యమిప్పించి రాయలకాతనిపై కోపం బుద్భవింపఁజేసి గోపాలసింగును జంపించె. అనంతరంబు దామోదరుండు సూరధానుల నడుగఁగా నాతండును గోపాలసింగు చెప్పినట్లె నుడివె. రాయల తెలివితక్కువ యిట విశదమగుచున్నది. ఈమాట మొదటనే చెప్పిన దామోదరుండు నిరాశ చేసికొనియుండు. రాయల మోమోటంబె యింత దెచ్చినది. అందుచే నతం డచ్చటనుండి వెడలిపోయి విషప్రయోగంబుచేఁ దారాబాయిని జంపయత్నింప సారహస్యంబు బట్టబయలాయె. అంత సూరధానులు మిగులఁగోపించి తనయూరి నుండి వెడలఁగొట్టె. అందువలన నప్పురంబు బాసి మాళవరాజు నాశ్రయించిన దామోదరునియుదంతంబు చదువరులకుఁ దెలిసియేయున్నది. అనంతరము రాయలు తనకు సహాయభూతుండైన దామోదరుండు తన్నువిడిచి పోవుటచేతను తనకుఁ గుడిభుజంబువలెనున్న గోపాలసింగు చంపఁబడియుండుటచేతను దన రాజ్యంబు ఱెక్కలులేనిపక్షివలె నున్నట్టు గనుఁగొని శత్రువు లెవ్వరేని తన రాజ్యంబుపైఁ బడి స్వాధీనంబు గావించుకొందురేమోయన్నభీతిచే డెందంబున గొందలపడుచుండెను. మఱియుఁ దనతోఁ గలహించిపోయిన దామోదరుని కుటిలత్వంబును మాయోపాయవిశారదత్వంబును నెఱింగినవాఁడు గావున నతని వలనఁ దన కపాయం బెప్పుడైనను రాక మానదని నిశ్చయించుకొని యుండెను. అందువలన రాయలు త్వరలోఁ దనకూఁతును మహావీరుఁడైన రాజకుమారున కొసంగి యిల్లఱికముంచుకొనవలెనని చూచుచుండెను. కాని తా ననుకొన్నట్టులు సౌందర్యవంతుఁడును పరాక్రమశాలియు నగురాకుమారుండు లభింపలేదు. అయిన నా ప్రయత్నంబువదలక చారులఁబంచి రాజస్థానంబుల వెదకించుచుండె. మఱియుఁ దనరాజ్యంబునకుఁ బ్రధానభూతులగు వారిరువురులు లేకపోవుటంబట్టి రాజకీయవ్యవహారంబులన్నియుఁ నిలిచిపోయె. తాను స్వయముగాఁ జూచుకొను నంతయోపిక లేదు. అందువలన చిరకాలంబుననుండి తన రాజ్యంబును కనిపెట్టికొని

యున్నవాఁడును, నిరుపమాన పరాక్రమశాలియు, మహాశేముషీమంతుండును, ప్రభుహితైకతత్పరుండును, గోపాలసింగునకుఁ బినతండ్రి కుమారుండు నగు రత్నసింగును రాజ్యవ్యవహారంబులఁ జక్కపరుప నియమించె. అంత నాతండును దన శేముషీవిశేషంబున వ్యవహారంబులనన్నియుఁ జక్కపెట్టుచునందలి తత్త్వంబును రాయలకు నెఱింగింపుచు నాతనియెడ నధికమగు భక్తినుంచుచుఁ బ్రవర్తించుచుండె. రాయ లతని బుద్ధిచాతుర్యంబునకు సంతసించుచుండెను గాని తాను విశ్వాసపాత్రులని నమ్మికొనియుండిన గోపాలదామోదరులు రాజద్రోహులయి యుండుటంబట్టి రత్నసింగుపై నమ్మకమున్నట్టు పైకి నటించుచున్నను నంతరంగంబున నమ్మలేదు. అందువలన నధికారంబంతయును రత్నసింగుచేతిలో విడిచిపెట్టక తనయానలేక యేపనినైనం జేయరాదని గట్టియుత్తరువు చేసె. రత్నసింగు కుటిలుండు కాఁడు. అతఁడు దుర్గుణవంతుండు కాఁడు. అతనికి రాజ్యంబు బాగు చేయవలెనన్న తలంపే కాని మఱియొక తలంపు లేదు. అందువలన నతండు రాయలు తన్ను విశ్వాసపాత్రునిగా నెంచకుండుట కనిపెట్టి యతని విశ్వాసంబునకుఁ బాత్రుండు కావలెనని తలంచి రాత్రిందివంబులు కష్టపడి పనిచేయుచుండెను. ఇందువలన రాయల కించుకనమ్మకము గలుగఁజొచ్చె. అంత నొకనాఁడు రాయలును రత్నసింగు నొకచోటఁ గూర్చుండి ప్రసంగించుచుండ రాయలతని కిట్లనిరి.

రా.—దామోదరుం డిప్పు డెచ్చటనున్నాఁడో తెలియునా?

ర.—తెలియును. మాళవదేశపు సుల్తాను నాశ్రయించినాఁడఁట.

రా.—వాఁడు మిగుల కుటిలుఁడు. ఎప్పు డేయపాయము గలిగించునో యని నాహృదయంబు బెదరుచున్నది.

ర.—అవును తమరు చెప్పిన ట్లతఁడు బహుదుర్మార్గుఁడు. మాయోపాయవిశారదుండు. అట్టి వానితోఁ గలహించియుండుటకన్నఁ గలిసియుండుట మంచిది.

రా.—అట్టి దుర్మార్గునితోఁ గలిసియుండుట యెట్లు సరిపడును. నాకుఁ బ్రాణాస్పదురాలగు మాతను జంపింప యత్నించినాఁడు. నీ వెఱుంగవా? అట్టి దుర్మార్గునితో సంధియేమి? ఎంతమాత్రంబు తగదు.

ర.—అదియు నిశ్చయంబె. వానిపా త్రహిపాత్తువంటిది. ఎప్పు డేయపాయం
బు కలిగించునో? అట్టివానితో విరోధించుట గూడఁ గొఱవితోఁ దలఁ
గోకుకొనుటవంటిదే.

రా.—అవును నిశ్చయంబె మొదట నట్టి వానినిఁ జేరఁదీయుటె పొరపాటు.

ర.—పోనిండు. ఇప్పుడు మనసైన్యమును సంసిద్ధము చేసికొనియున్నచో
దామోదరుని కంత భయపడనవసరములేదు.

రా.—అట్లె చేయుము. మఱియును మన తారాబాయికిఁ దగిన రాజపుత్త్రునిఁ
గొనివచ్చి పెండ్లిచేసినచో నింతేనియు భయపడ నవసరంబులేదు. కాని
తగినవాఁడు లభింపకున్నాఁడు.

ర.—లభింపకేమి? చిత్తూరురాణాకుమారుండు పృథ్వీరాజు తారాబాయికిఁ
దగినవాఁడు. మఱియుఁ జిత్తూరివారితో మనముసంబంధంబు చేసికొన్న
చో దేవతలకైన భయపడ నవసరంబులేదు.

రా.—అవును. వారు పెద్దవారు. మనము పిల్లనిచ్చెదమన్న నిష్టపడుదురో
యిష్టపడరో ?

ర.— ఇష్టపడకేమి? అమూల్యం బగు దివ్యరత్నంబిచ్చెదమన్న సమ్మతింపనివెఱ్ఱి
యుండునా.

రా.—ఉండఁడు. నిశ్చయంబే. ఇంతకుఁ బూర్వంబే నే నాతని గుణంబులు
వినియున్నాను. నాకుమారికయు నాతనియందె మనంబు ప్రవేశపెట్టి
నట్లు వినియున్నాను. కాని యీ సందేహంబుచేతనే యాతనికై
ప్రయత్నింపలేదు.

ర.—అట్టిసందియంబు విడువుఁడు. మనము తప్పక ప్రయత్నంబు చేయుం
దము. ఈమధ్య చారులను పంపియున్నారు కాఁబోలునే, ఏమయినది

రా.—చారులనుఁ జిత్తూరునకుఁ బంపలేదు. తక్కిన సంస్థానంబులకుఁ బంపి
నాము. ఆయారాజపుత్త్రులపటంబులఁ గొనివచ్చినారు, కానివారిలో సౌం
దర్యవంతులకు సద్గుణపరాక్రమంబులు లేవు. సౌందర్యసద్గుణంబులున్న

వారలకుఁబరాక్రమంబు లేదు.పరాక్రమంబున్న వారికి సౌందర్యసద్గుణంబులు లేవు. అందుచే నొక్కండును దగినట్టు లుండ లేదు.

ర.—మీమనోరథంబునకుఁ దగినవాఁడు పృథ్వీరాజు గాని మఱొక్కండు లేఁడు. చిత్తూరువృత్తాంతము మనము కనుగొనవలెను.

రా.—అట్లయినఁ జారులను బంపుదమా ?

ర.— ఇప్పుడు పంపనక్కఱలేదు. చారులకు దేశవృత్తాంత మంతయుఁ దెలిసియుండును. వారి నొకమారు రప్పింపుఁడు.

రా —మంచిదే (అనిపలికి) ఎవరక్కడ ?

భటుఁడు—(ప్రవేశించి) ఏమి సెలవు.

రా.—చారుల రప్పింపుము.

భ.—చిత్తము (అని నిష్క్రమించి కొనివచ్చును).

చారులు—(ప్రవేశించి) దేవా! ఏమిసెలవు.

రా.—మీకు జిత్తూరువృత్తాంత మేమయినఁ దెలియునా ?

చా.— తెలియ కేమి ? తెలియును. ఏమికావలెను.

రా.—చిత్తూరు రాణాకుమారునిఁ బృథ్వీరాజు నెఱుంగుదురా?

చా.—ఎఱుంగ కేమి? ఆయనవృత్తాంతము చక్కఁగఁ దెలియచెప్పెదము. అవధరింపుడు. ఈమధ్య పృథ్వీరాజు జ్యేష్ఠసోదరుం డైనసంగునితోఁ గలహించి యతని విదేశగతునిగాఁ జేసెననియు,నందులకుఁ దండ్రియూరినుండి వెడలిపొమ్మన నూరువిడచి పోయినట్టును వినియున్నాము.

రా.—(రత్నసింహుంజూచి)ఓయీ ' 'లింగముగట్టగానే పిడుగుపడిన'దనునట్లు మనముతలంపఁగానిట్టి యశుభవృత్తాంత మే తెంచినదేమి?ఏమి చేయుదము?

ర.—దేవా! అది యశుభవృత్తాంతము కాదు. ఇదిమన కెంతయు మంచిదే.పృథ్వీరాజు నిలువనీడ యయిన లేకుండ దిరుగుచునే దేని రాజ్యంబునకై వెదకుచుండును. అతని మనము వెదకించి పిల్ల నిచ్చి రాజ్య మిచ్చెదమన్న నెత్తితోఁ ద్రొక్కొనును. ఇకార్యంబు మనకు మిగుల ననుకూలమయినది. ఇది.

వరకు మీకుండుసందియంబుకూడ నీమారు తొలఁగిపోవచ్చు. కావున చారులఁబంపుడు.

రా.—నీవు చెప్పినది యుక్తమే. (అనిపల్కి చారులం జూచి పృథ్వీరాజు వృత్తాంతంబును జక్కఁగ నరసిరండు పొండని చెప్పిపంపి రత్నసింహునకు సెలవిచ్చి తనమందిరంబునకుఁబోయె.

---

# ఎనిమిదవ ప్రకరణము

గద్వారుదుర్గము రాజపుత్రస్థానంబున నున్న బలిష్ఠదుర్గంబులలో నొకటి. అయ్యది హారావళీపర్వతపాదము నాక్రమించి యున్నది. ఆదుర్గంబు చిత్తూరు ప్రభువులపరిపాలనములో నుండెడిది. కాని రాయమల్లుని జ్యేష్ఠసోదరుఁ డగు నుదయసింగు తండ్రియైన కుంభరాణాను జంపి రాజ్యంబాక్రమించుకొని పరిపాలించుకాలంబున నాదుర్గంబును మీనవంశసంభూతు లగురాజులు వశంబు గావించుకొని యేలుచుండిరి. దాని నుదయసింగు స్వాధీనము కావించుకొన లేకపోయె. అతని తరువాత రాజ్యంబునకు వచ్చిన రాయమల్లుయున వారల జయించి దానిఁ దనయధీనంబు చేసికొనలేకపోయె. అందుచే నారాజులు నిరాటంకంబుగాఁ బరిపాలించుచుండిరి. ఆదుర్గం బున్నతంబులగు ప్రాకారంబులచే నావరింపఁబడియుండుటచేతను, పర్వతదుర్గంబగుటచేతను, శత్రువుల కసాధ్యంబై యున్నది. ఆదుర్గంబున దేవాలయం బొకటికలదు. ఆదేవాలయంబున కొకపార్శ్వంబున నొకమంటపంబును, దానిననుసరించి కొన్నిగదులును గట్టఁబడినవి. ఆమంటపంబును, నాగదులును, శిష్యప్రశిష్యవర్గంబులతోఁ గూడిన యోగీశ్వరు లాక్రమించుకొని యుందురు. అచ్చటి యోగీశ్వరులలో సదాశివుఁ డనునొక యోగిపుంగవుఁడు గలఁడు. అతఁడు నిరుపమానప్రతిభాశాలి యనియు, నుదారమయిన జ్ఞానసంపదగలవాఁడనియు నచ్చటియోగిజనులందఱు చెప్పుకొనుచుండిరి. ఆమహాత్మునికిఁ బరోపకారచింతయుఁ బరబ్రహ్మచింతయుఁ దప్ప నన్యచింత యేమియు లేదు. అతం డచ్చటియోగిజనంబులతో సర్వదా యేదియో ప్రసంగించుచుఁ గాలక్షేపంబు చేయుచుండు. అతఁడు వనమూలికావైద్యంబునకుఁ

బెట్టినదిపేరు. అందుచే గ్రామస్థు లెవ్వరేని రోగపీడితులైనచో బోయి మందిచ్చి కుదుర్చుచుండు. అందువలన నాగ్రామస్థులు పెక్కండ్రతనికి మిత్రులైరి. అందుచే వారేదియో యొక సమయంబున నాతని సందర్శించినఁగాని యుండలేరు. ఆగ్రామస్థులలో "ఓజూ"డను వర్తకుం డొకఁడు కలఁడు. వాఁడాదుర్గంబుననున్న వర్తకులలోనెల్ల ధనవంతుఁడు. వాఁడు సచ్చిదానందయోగితో నధికస్నేహంబు పాటించి వర్తించుచుండె. ఆయోజుం డొకనాఁటి రాత్రి వచ్చి సచ్చిదానందయోగికి నమస్కరించి తసనుమంబునఁ గూర్చుండఁ జూచి యోగి యిట్లు ప్రసంగించె.

స.—ఓయీ! గ్రామంబున విశేషంబు లేమి ?

ఓ.—ఏమిచెప్పుదు! ఈదుర్గంబున జీవించుట మిగులఁ గష్టంబుగా నున్నది.

స.—కారణమేమి?

ఓ.—దొంగలబాధ! కన్ను మూసినఁజాలు. కడుపులోఁ బెట్టికొనిన ధనంబునైనను దొంగిలించికొని పోవుచున్నారు. అందుచే రాత్రులయందు జాగరణంబు చేయుచున్నాము.

స.—రాజభటులు రాత్రులందు గ్రామంబునఁ దిరిగి దొంగతనంబుల నడగింపరా?

ఓ.—అయ్యా! రాజభటులనుండి తప్పించుకొనుటయే మిగుల గష్టముగా నున్నది.

స.—రాజు పరిశీలించి శిక్షింపఁడా?

ఓ.—శిక్షించినఁ దిరిగి శిక్షింతురేమో యని భయపడుచుండును.

స.—రాజంత చేతఁగానివాఁడా?

ఓ.—కాకేమి! అంత దుర్బలుఁడు నంతపిఱికివాఁడు మఱొక్కరుండు లేఁడు.

స.—అట్లయిన నిట్టిచోట నివసించుట మిగులఁ గష్టమే!

ఓ.—నాకష్టము భగవంతుఁ డెఱుఁగును. నేను స్వయముగా జీతము లిచ్చి కొంతసైన్యము నుంచుకొన్నాను.

స.—అట్లయిన నీవు రాజవెందుకుఁ గాఁగూడదు ?

ఓ.—వలదు. వలదు. రాజ్య మక్కఱలేదు. నాసొమ్ము నాకుఁ దక్కినఁజాలు!

స.—పోనిమ్ము. మఱియొక్క రాజకుమారు నిందులకు రప్పింపఁ గూడదా?

ఓ.—ఏమో! అతఁ డెట్టివాఁడగునో! ఈ రాజులు మమ్ము సొమ్మునకై బాధింప లేదు. వారువచ్చి మాధనంబులఁ గూడ లాగికొనిరఁ జేసెడిదేమి?

అని యిట్లు కొంతసేపు ప్రసంగించి యతనియొద్ద సెలవుగైకొని తనమందిరమునకుఁ బోయెను. అంత సచ్చిదానందుం డొంటిగాఁ గూర్చుండి యుప్పటికి గొన్నిదినంబుల క్రిందటఁ దనశిష్యులు గొనివచ్చిన చిత్రాంగ వృత్తాంతంబును గుఱించి యాలోచింపుచుఁ దనలోఁ దానిట్లనుకొనెను. "అక్కటా! నా తలంచినకార్యము పృథ్వీరాజు నెరవేర్పఁగలవాఁడని మది నమ్మియుంటిని. గాని యాతనిజాడలేమియుఁ దెలియనయ్యె. రాజస్థానంబునంతయు గాలించివచ్చిన నా శిష్యులకుఁ గనుపడలేదు. ఒకవేళ నతండు రాజస్థానంబును విడిచిపోయెనేమో? లేక యతఁడు మిగుల సాహసవంతుఁడు, నభిమానవంతుఁడును గాన తండ్రి తన్నాడిన పరుషభాషణంబులకు సహింపలేక ఖడ్గంబుతోఁ బొడిచికొని ప్రాణంబుల విడిచిపెట్టి యుండఁడుగదా? అట్లయిన నాతలంపు తయం వ్యర్థమగును. మఱియొక రాజకుమారునితో స్నేహింతమన్న ధైర్యసాహసాదులచే నతనిబోలు వాఁడు మఱియొక్కఁడేడీ? అని యిట్లాలోచించుచున్న సమయంబున, ముగ్గురు పురుషులు ప్రవేశించి యోగికి నమస్కారంబులు గావించి నిలచిన వారికిఁ దన శిష్యులుగా నెఱిఁగి గదిలోనికిఁ గొనిపోయి యిట్లు ప్రసంగించె.

యో.—ఓరీ! నీవు పోయినచోట వింతలేమి?

శి.—అయ్యా! నే నేమని చెప్పుదు? మాళవదేశపు సుల్తానువద్ద దామోదరు ప్రభ వెలుఁగుచున్నది.

యో.—అతండు చేయు రహస్యాలోచన లేమైనఁ దెలిసినవా?

శి.—దామోదరుఁడును సుల్తానును ప్రసంగించుచుండ వినిన యొక సేవకునవలన నొక లోసంగి రహస్యంబు తెలిసికొనివచ్చితిని.

యో.—ఆరహస్యంబు లేమి?

శి.—తారాబాయిని సుల్తానున కిచ్చి పెండ్లిచేయుదునని యతని సంతసింపఁ జేసి యతని సహాయంబునఁ దోధానగరంబును జయింప నూహించు చున్నాఁడు.

యో.—అందులకు సుల్తా నేమనెను?

శి.—మిగుల సంతసించి దానిని జయించుటకుఁ బ్రతిన వట్టెనఁట.

యో.—అక్కటా! దుర్మార్గుఁ డెంత ప్రయత్నము వై నున్నాఁడు? ఇంక విశేషంబుల నుడువుము.

శి.—ఇంతియగాదు. రత్నసింహునిఁ జంపఁ బ్రయత్నించుచున్నాఁడఁట.

యో.—అట్లయిన రత్నసింగు వచ్చినవాఁడే? వాని మాయోపాయంబులఁ దెలిసికొనుట మిగులఁగష్టము. ఇఁక నేమివిశేషంబులు?

శి.—ఏమని చెప్పుదును? రాయమల్లు నోడించి చిత్తూరు జయించి సుల్తానున కొసంగుటకు నిశ్చయించి సురేశమల్లునిఁ బ్రోత్సాహ పఱిచెనఁట. అందులకు వాఁడు సమ్మతించియే రాజపుత్త్రులకుఁ బోరాటంబు కల్పించినాఁ డఁట.

యో.—హా!దుర్మార్గుం డెంతపని చేసినాఁడు? రాజపుత్త్రులకుఁ బోరాటము గల్పించుటకు మూలము వీఁడా? అక్కటా! ఈమారు చిత్తూరు గూడ మహమ్మదీయుల కధీనంబగుట నిక్కంబు. ఇఁకఁ జెప్పవలసిన దేమి?

శి.—ఏమియుంలేదు. ఇంతే నాకుఁ దెలిసిన సమాచారము.

యో.—అట్లయిన నీపనిమీఁద నీవుపోయి మాళవవృత్తాంతంబు దెలుపుచుం డుము.

శి.—చిత్తమని నిష్క్రమించును.

యో.— రెండవవానిని బిలిచి యిట్లు ప్రసంగించె. ఓరీ! నీవేఁగినచోట విశే షంబు లేమి?

శి.—మనము విన్న సంగతి సత్యమే. రాయమల్లు పృథ్వీరాజును గోపింప నెటకో పోయెనఁట. వానివృత్తాంత మేమియుఁ దెలియలేదు.

యో.—సు రేకమల్లు నుదంత మెట్లున్నది?

శి.—రాయమల్లు సంగుండుసు బృథ్వీరాజును జిత్తూరు విడిచిపోవుటచే సురేక మల్లుని దనకు సహాయముగాఁ జేకొని యున్నాఁడఁట. అధికారమంతయుం వానిచేతిలో నిడె నని విన్నాను.

యో.—రాయమల్లు మోసపోయినాఁడు. ఇంక నతని విపదంబుధియందు మునిఁగినవానిఁగా నెంచవలసియున్నది. ఇంకను సమాచారమేమి?

శి.—ఇదియో నాకనిపట్టిన సమాచారము.

యో.—అట్లయిన నీవు నీపనిమీఁదఁ బొమ్ము. (అని వానిఁ బంపి మూఁడవ వానిఁ బిలిచి యిట్లనియె) ఓరీ! నీ సమాచారమేమి?

శి.—దేవా! తోఢానగరంబునకుఁ బోయితి. దామోదరుండును గోపాలసింగును లేకపోవుటచే మనకు శత్రువులవలన నపాయము మూడుటనిక్కంబని యందలి జనులు తలంచుచున్నారు.

యో.—సూరథానుఁడేమిజేయుచున్నాఁడు?

శి.—అతండు శత్రువులవలన భయంబునుజెంది రత్నసింగున కధికారమిచ్చి సైన్యమును సిద్ధముగానుంచు మని యానతిచ్చెనఁట.

యో.—కరువాత యుదంతమేమి?

శి.—రత్నసింగందులకు సమ్మతించి మిగుల జాగరూకుఁడై యున్నాఁడఁట.

యో.—ఇంక నేమివిశేషంబులు?

శి.—రాయలును రత్నసింగు నాలోచించి తారాబాయిని పృథ్వీరాజున కిచ్చి దలంచి చిత్తూరు విడిచిపోయినట్లు తెలిసికొని చారులఁ బంపి శోధించుచున్నారఁట.

యో.—అట్లయిన బృథ్వీరాజు నుదంతము మనకును దెలియఁగలదు. నీవు తోఢానగరంబునకుఁ బోయి పృథ్వీరాజు నుదంతమును దెలిసికొని మాకుఁ దెలుపుము.

శి.—చిత్తమట్లేచేసెద! కాని సేవకుం డొక్కయపరాధంబు గావించికొనివచ్చినాఁడు, క్షమింపుఁడు.

యో — అదేమి? చెప్పుము.

శి — అది తమశిష్యుండొనర్పందగినది కాదు. చెప్ప సిగ్గగుచున్నది.

యో — అయినను చెప్పుము. క్షమించెదను.

శి — దొంగతనంబు చేసితాను.

యో.— అట్టి పాడుకార్యమేల చేసితివి?

శి.— ఏమిచెప్పుదును! నా పూర్వజన్మదుష్కృతమే నన్నట్లు ప్రేరణచేసినది.

యో.— ఏమి దొంగిలించితివి.

శి.— వజ్రపు టుంగరము.

యో.— ఎవరిది? ఎక్కడ దొంగలించినావు.

శి.— వారెవ్వరో నాకుం దెలియదు. వారును నేను గలిసివచ్చునప్పుడు మార్గమధ్యమున నున్న పల్లియం దొక్కచోం బండుకొనియున్నాను. మార్గాయాసంబుచే వారలు మైమఱచి నిద్రించుచుండిరి.

యో.— అంత నీవేల నిద్రింపలేదు.

శి.— నాకు సరిగా నిద్దురపట్టమిచే మేల్కొనియుండి వారివైపుచూడ వారిలో నొకనిచేత నీయుంగరంబు నక్షత్రంబువలె మెఱయుచున్నది. దానిని వదలలేక దురాశచే నెత్తుకొని వచ్చితి.

యో.— చేసినదొంగతనము నేలచెప్పితివి?

శి — అయ్యా! నేనిదివఱకెన్నడు నిట్టిచెడ్డపని చేయలేదు. అందుచే నీకృత్యము చేసినప్పటినుండియు నా యంతరాత్మ పడుచున్న సంతాపమునకు మేర లేదు. ఇది నాయొద్దనున్న నాకీసంతాపము చల్లారదు. కావునం దమరిదిపుచ్చుకొండు (అని యీయంబోవును.)

యో.— అయ్యో! దొంగసొమ్ము నాకేల?

శి.— అట్లుకాదు తమరు స్వీకరింపకతీరదు. (అని నిర్బంధము జేయును).

యో.— పుచ్చుకొని దీపము నొద్దకుంబోయి పరిశీలించిచూచెను. అట్లుచూచిన పిమ్మట నాయోగికిం బుట్టుసంతసంబునకు హద్దులేదు. అందులకుంగారణం బేమో తెలిసికొనలేము. అయ్యది యమూల్యంబగుటచే నతనికట్టిసంత

సము గలినదని యూహింతమన్న సర్వమ్ము విడిచి సన్న్యాసియైతిరుగువాఁడీయుంగరంబు చూచినంతమాత్రమున సంతసించునా? సత్ప్రవర్తనుండగు నా సచ్చిదానందయోగి మొదట దొంగసొమ్ము నాకేల? యని నిషేధించి యతినిర్బంధమున విచారించుచుఁ బుచ్చుకొని సంతసంబు జెందునా? కావున నయ్యది కారణంబు కాదు. తరువాతి యందంతంబువలనఁ దెలియం నేమో? చూతము. అనంతరమాయోగి శిష్యుం జూచి యిట్లనియె.

యో.—ఓరీ! నీవెప్పు డీపని చేసితివి?

శి.—గతించినరాత్రి తెల్లవారుజామున.

యో.—ఆస్థల మిచ్చటికెంతదూరముండును?

శి.—సుమా, రెనిమిది క్రోసులు.

యో.—ఆయూరున కొకసారిపోవలసియున్నది. తెల్లవారుజామున వచ్చినన్ను మేల్కొలుపు. పోదము. పోయిపరుండు మని పంపి తానును తనశయనంబు చేరి నిదురించె.

---

# తొమ్మిదవప్రకరణము

కలవాణి.—తారా! విచారపరీతురాలవై యున్నట్లు గన్పట్టుచున్నావు. కతమేమి?

తా.—విచారమున్నది కనుక నాకారణంబు చెప్పనా?

క.—లేదన్నంతమాత్రమున నమ్ముదునా? నీవు విచారించుచున్నట్లు నీముఖమే చెప్పక చెప్పుచున్నది.

తా.—ఇప్పుడే నిద్రనుండిలేచితిని. అందువలన నాముఖము నీ కట్లు కనఁబడుచున్న దేమో?

క.—అట్టిసమయంబున నెట్టులుండువో! అదియుం నాకుఁ దెలియును. నీవేదో పెద్ద విచారంబు జెందుచున్నట్లు తోఁచుచున్నది. చెప్పుము.

తా.—ఓసీ! నాజనకుఁడు నన్నింతకాలము కడుపులోఁబెట్టుకొని పెంచుచుండ నాకు విచారమెక్కడిదే?

క.—అవును. నిజము చెప్పితివి. ఇంతకాలము "నిరపాయంబుగా నున్నాను. ఇఁకమీఁద నెట్లుండునో" యని విచారంబు కలిగినఁ గలుగవచ్చు నే వచ్చునప్పటికి నీవాలోచించుచున్నది చెప్పుము.

తా.—(తనలో) ఇది విచారకారణముం జెప్పినఁగాని విడువదు. (ప్రకాశముగా,) చెలీ! నీకుమాత్రము దెలియునా? ఆదుర్మార్గునివలనఁ గలిగెడి బాధ నెట్లు తప్పించుకొందునా యని విచారించుచున్నాను.

క.—వాఁ డెవఁడు? మన్మథుఁడా?

తా.—(కోపముతో) వాఁడుకాదు, వానితండ్రి నామంబులచే వ్యవహరింపం బడువాఁడు.

క.—(ఆలోచించుచు) ఎవఁడే?

తా.—వాని పేరు చెప్పుట కిష్టపడను.

క.—ఎవఁడే! అట్టిదుర్మార్గుఁడు నాకుఁ దెలియ లేదు.

తా.—ఎవఁ డని యడిగెద వేమి? దామోదరుఁడు.

క.—ఏల విచారించెదు పృథ్వీరాజుం జేపట్టితి వేని నీ వారాకుమారునికిఁగాని మారునికిఁగాని భయపడ నవసరము లేదు.

తా.—(తనలో) అవును. పృథ్వీరాజుం జేపట్టినచో సింహమ్ముసొత్తు నక్కలూ నలపాలు గానట్టులు నేనాదుర్మార్గులపా లెట్టగుదును. (ప్రకాశముగా) చెలీ! ఆకార్యము మిగుల దుర్ఘటంబు. అంతభాగ్యమెక్కడ? నా కెక్కడ! లభించుట యెక్కడ! అతనిపై నాశ వదలుకొన్నదాన.

క.—ఎందుచే వదలుకొన్నదానవు?

తా.—అతం డెచ్చటను గనఁబడకపోవుటచే.

క.—(నవ్వుచు) ఎచ్చటను గనఁబడ లేవందు వేమి? ఇచ్చటనే యున్నాఁడు.

తా.—(సంతోషముతో) ఎచ్చట? ఎచ్చట?

క.—ఎచ్చటనా? నీహృదయంబునందు.

తా.—(కోపము నభినయించుచు) చాలు, చాలు నీపరిహాసవాక్యంబులు!

క.—పరిహాసంబుకాదు. నిజముగాఁజెప్పు, నీహృదయమందు లేఁడా?

తా.—మౌనంబుదాల్చి యూరకుండును.

క.—ఇంక నొకచోటఁ గూడ నున్నాఁడు.

తా.—(తనలో) పృథ్వీరాజును నావలె మఱి యేరాజకన్యకయైన వరించి యున్నదికాఁబోలును? (ప్రకాశముగా) మఱెచ్చట?

క.—చిత్రపటంబునందు.

తా.—ఆచిత్రపటమే నన్నిట్లు విచారంబునం ద్రోయుచున్నది. లేనిచో విచారమే యుండకపోను.

క.—సుందరీ! విచారింపకుము. ఈరాజనందనుఁడు నీకన్నులకు విందొనర్పఁ గలఁడు. నీవిచారంబుల నన్నింటిం దొలఁగింపఁగలఁడు. నిన్ను వరింపఁ గలఁడు

తా.—అంత "అవునవును. నీ వన్నమాట నిశ్చయంబె" (అన్నధ్వని యేతెంచు).

క.—(ఆధ్వని నాలకించి) తారా! కార్యంబు నెఱవేఱుట నిశ్చయంబు చూడుము. ఉపశ్రుతివాక్య మెట్లువచ్చినదో? అట్టిది శుభసూచక మని తలపోయుము.

తా.—ఓసీ! మన ప్రసంగంబు విని యెవరైన నిట్లు పల్కినారేమో?

క.—లేదులేదు. వారలు చాలదూరమందున్నవారు. వాక్యంబులు వినుము. మాటలాడుచున్నారు (అని వినుచుందురు).

తా.—చెలీ! "అవునవును" నీవన్నమాట నిశ్చయంబే? పీరిచ్చటనున్నారు.

క.—(ఆలకించి) చెలీ! రమాబాయియు చెలికత్తెయు వననిమిత్తము వచ్చు చున్నట్లు తోఁచుచున్నది.

తా.—అవును.

క.—సుందరీ! నీకార్యంబు నెఱవేఱుట సిద్ధము

తా.—ఏమో! నాకు నమ్మకములేదు. అతని వెదుకఁబోయినచారులు విఫల ప్రయత్నులయి వచ్చినారఁట. అంతభాగ్యము లభించునా?

క.—అంతమాత్రంబుచే నిరాశ చేసికొనరాదు. నీజనకులు మరలఁ జాదులఁబంపి నారు. ఈపర్యాయ మాతనిజాడలు తప్పక తెలియఁబడకమానవు?

తా.—ఏమో! భగవదనుగ్రహ మెట్లున్నదో?

క.—నీయందు భగవదనుగ్రహము పూర్తిగ నున్నది. విచారంబు నొందకుము అందువలన నవనీతకోమలమయిన నీశరీరంబు చెడిపోవును. ఒకమారు గృహారామంబున విహరించివత్తము రమ్ము. నీమనంబున విచారంబు తొలంగి చనును.

తా.—అట్లే (అని లేచి పోవుచుందురు).

క.—అంతచాలుచాలు,మీస్నేహంబు. నన్నుఁబిలువకుండవచ్చుట యుచితమా? నన్నుఁగూర్చి యేదోచెప్పుకొనుట కిట్లువచ్చినారు. తెలిసినది లెండని వడివడిగా నడచి రమాబాయి చెలికత్తెతో వీరియొద్దకు వచ్చె.

తా.—ఎందులకు మామీఁద నిట్టినేరముల నారోపింతువు? నిన్ను నుద్దేశించి యేమిమాటలాడుకొందుము?

ర.—ఏమిటియా? నాకుఁ జాలినంతయందము లేదని నేను, మంచిదానను గానని యేం.

తా.—కలవాణీ! చూచితివా? దీనిప్రసంగ' మేమైన వచ్చినదా?

క.—(రమాబాయిం జూచి) ఓసీ! నీ వెందుల కనుమాన మొందెదవు? తారాబాయి మునుపటివలె నిన్నుఁగూర్చియు నన్నుఁగూర్చియు మాట్లాడు చునుకొనుచున్నావా? అట్టియవస్థ గడచినది.

ర.—(ఆవాక్యమును సరకుగొనక) అట్లయినఁ దొంటిరీతిగా నన్నెందులకుఁ బిలిచినారుకారు?

క.—నేనుఁ దారయుఁ మాటలాడుకొనుచు నిచ్చటకు వచ్చితిమి. మాటలసందడిని నీమాట మఱచితిమి. అంతమాత్రంబుచే ననుమానంబు చెందకుము.

తా.—(కలవాణింజూచి) ఓసీ! ఎంతముద్దరాలవే? నీగూఢాశయంబులు

నాకుఁ దెలియక పోవు. ఎందుకు మాటిమాటికిఁ బరిహాసంబులు కలుగు దువు నేనెప్పుడు నీవన్నట్లు ప్రవర్తింపలేదు ?

క.—చెలీ ! పరిహాసవాక్యంబు లసత్యవాక్యంబు లని తలంపకుము.

ర.—(నాలు గడుగులిడి) క్రిందఁ బ్రాకుచున్న మల్లీలతను దీసి పందిరికెక్కించి, చెలీ ! ఈమల్లీలత యెంతబాగుగఁ బ్రకాశించుచున్నదో చూడుము.

తా.—అవును. నిశ్చయమే. పండితులు, లతలు, సదాశ్రయణంబు లేనిచోఁ జక్కఁగఁ బ్రకాశింపరు.

క.—ముఖ్యమైనది విడిచినావు.

తా.—(గ్రహించి, జనాంతికముగా) "సదాశ్రయేణ శోభంతే పండితా వనితా లతా" అన్నటుల మీరు గూడ సాశ్రయంబు గలిగినచో మిగులఁ బ్రకాశింతు రని చెప్పి మమ్ము నెకసక్కెము లాడుచున్నది (ప్రకాశముగా) చాలు చాలు. తెలిసినది నీవు కష్టపడి చెప్ప నక్కఱలేదు.

ర.—(నాలుగడుగులు నడిచి రత్నంబుతోఁ జెక్కిన, సింహంబు జూచి) చెలులారా ! ఈరత్నసింహం బెంతభయంకరముగా నున్నదో ! చూచి తిరా ?

క.—అవును. రత్నసింహజనితమైనభయంబు నీకుండిన నుండవచ్చు గాని మాకట్టిభయము లేదు.

తా.—(కొంచెము నడచి) కలవాణీ ! మన రమాబాయిమనంబు రత్నసింహాప హృతంబయినది. కావుననే మనంబు నాకర్షించుకొని రాలేకున్నది. రమ్ము పోదము.

క.—ఒకరిచే మనం బపహృతంబయినప్పుడు దాని నాకర్షించుకొనుట కష్ట ముగదా ? అందఱకు నది యనుభూతమే.

తా.—(తనలో) నన్నుఁగూడ నెత్తిపొడుచుచున్నది. అని తలంచి మాటాడ యట్లు పోవుచుండు.

ర.—(తనలో) తారాబాయి, కలవాణి, వీరిరువురు రత్నసింహపదమును శ్లేషించి, రత్నసింహుఁడనియం నర్థముచెప్పి యెకసక్కెములాడు.

చున్నారు. (ప్రకాశముగా, చెలీ! ఆక్షేప చాలు లేదు. మీయభి
ప్రాయంబు నాకుఁ దెలియకపోలేదు!

క.—ఆక్షేప యిప్పుడేమి తెలియుం? ముందుముందు తెలియఁగలదు. ప్రస్తుత
మాక్షేప మనస్సంకల్పితంబు మాత్రమే.
(కలవాణివాక్యము ముగియకుండగనే.)

తా.—ఇటురండు. ఈతటాకముచెంత గూర్చుండుము.

ర.—చేరఁబోయి, అవ్వను. ఈతటాకము పుండరీకాదివిలసితంబయి తారా
వాదవిలసితమయిన యాకసముపగిది నున్నది చూడుము.

క.—(వారల సమీపించి) మనరమాబాయి యెంతయుఁ జక్కఁగ వర్ణించినది.
అవ్వ నీసరోవర మట్లె ప్రకాశించుచున్నది.

తా.—పాపము చూడుఁడు, ఈయుత్పలంబు లెట్లు ముకుళించియున్నవో?

క.—అవును నిజమే కాని. తారానాథు నభ్యుదయంబున నివియన్నియుఁ
జక్కఁగ వికసించును.

ర.—కలవాణీ! నీవు చెప్పినట్లు తారానాథుఁ డుదయించిన నీయుత్పలంబులే
కావు. మఱికొన్ని యుత్పలంబులుకూడ వికసించును.

తా.—(తనలో) వీరిరువురు నన్ను పరిహసించుచున్నారు. నాపేరు తార. కాన
నాకధిపతి యగు పృథ్వీరాజుసందర్శనంబు గలిగిన నా నేత్రోత్పలం
బులు వికసించుచున్నవన్నయభిప్రాయము స్పష్టమగుచున్నది. ఇందులకుఁ
దగినట్లు సమాధానము చెప్పవలయును. (ప్రకాశంబుగా) కలవాణీ!
మీవాక్యంబు లెంతయు యుక్తంబులయియున్నవి. కాని యిందొక్కటి
చిత్రము.

క.—ఆ చిత్రమేమి?

తా.—తారానాథదర్శనంబునఁ గవ్వలు వికసించుట సహజమే కాని రత్న
సింహదర్శనంబు గలుగునప్పుడు కలువలు వికసించుట.

క.—(చప్పటలు చఱచుచు. నవ్వుచు) బాగుబాగు. చక్కఁగ సమర్థించితివి.
(అని రమాబాయివైపు చూపును.)

ర.—(చిన్నపోయి) మందహాసంబు చేయుచు, మఱియొక్క దిక్కున కరుగుచుండును.

తా.—రమా! కోపమాయేమి? (అని యామెను సమీపించును.)

ర.—(ఆమెను సమీపించి) కోపమున కేమున్నది? పరిహాసము లాడుకొన్నంత మాత్రమునఁ గోపము వచ్చునా? (అని సరసభాషణంబు లాడుచు) వారొకరిచేతి నొకరూనుకొని మల్లీ జాతీ కుసుమంబులఁ గోసి యలంకరించుకొనుచు, నతికుతుకంబున విహరించుచుండిరి. ఆసమయంబున "ఓకలవాణీ! రండు రండు. రాజుగారి సెలవగుచున్నది" అని యొక యెలుంగు వీతెంచినది. అంతఁ తారాబాయి మొదలగువారాయెలుంగు నాలకించి వనవిహారంబు చాలించి రాజదర్శనంబునకుం బోయిరి.

---

# పదియవ ప్రకరణము

లోకములోఁ గష్టమెంతో సుఖమంత. సుఖమెంతయో కష్టమంత. ఈ రెండును గావటికుండలచందంబున సమానంబులై యుండు. కొందఱు సుఖమల్పమనియుఁ, దుఃఖ మధికంబనియుఁ దలంతురు. సుఖకాలము ముదావహమగుటచే వేగముగ గతించునట్లాభాసించు. దుఃఖము దుస్సహంబయియుండుటచేఁ జిరకాలస్థాయిగ నున్నట్లుతోఁచు. అంతియకాని యవి యల్పాధికంబులై యుండవు. ఇవి లోకములోని వారికెల్లరకుఁ బర్యాయంబునఁ బ్రాప్తంబు లగుచుండు కావునఁ గొందఱు కష్టంబు లనుభవింపవలసినప్పుడు మఱికొందఱు సుఖం బనుభవింపవలసియుండు. ఇవి తెలిసికొని సుఖదుఃఖంబులు ప్రాప్తించునప్పుడు పండితులు మోదఖేదంబులం జెందరు. పామరులు కష్టకాలమప్పుడు దుఃఖంబుఁ జెంది సౌఖ్యకాలమప్పుడు సంతసంబు జెందుదురు. ఇది మిగుల బుద్ధిహీనతను దెలియఁజేయును. ఆకష్టసుఖంబులు నియతంబులు కావు. అవి. నక్తందివంబులవంటివి. రాత్రి శాశ్వతముగానుండునా? కాక పగలుశాశ్వతముగా.

మండునా? ఉండవు. అట్లే కష్టము శాశ్వతముగానుండదు. సుఖంబు శాశ్వతముగానుండదు. ఇట్టి యీ సుఖదుఃఖంబులకై మోహఖేదంబులఁ జెందనేల ? మఱియు రాత్రి యహంబున సూచించు. అహము రాత్రిని సూచించు. అట్లే సుఖంబు కష్టంబును కష్టంబు సుఖంబును సూచించుచుండు. అట్టి కష్టసుఖంబులు దైవాధీనంబులు. వాని గుఱించి విచారింపనేల ? విచారించినను లాభంబు లేదు. దైవగతి యమేయము. దాని నెవ్వరు దెలిసికొనలేరు నా కిట్టిదశ పట్టునని స్వప్నమందైన నెఱుంగుదునా ? సరిగా భోజనంబు లేకపోవుటచే దేహంబు కృశించుచున్నది అవయవంబుల పటుత్వంబు తగ్గుచున్నది. నాకు నాల్గయిదుదినంబులనుండి భోజనము లేకపోవుటచేత నే నడుగుదీసి యడుగిడ శక్తిలేకున్నాను. సతత మన్నంబు తినక ఫలమూలాదులతోఁ గాలంబు గడపు మునీశ్వరు లెట్టుగాఁ బ్రవర్తింపఁగలరో? వారు మనస్సు నెట్లు నిలకడగానుంచి కొనఁగలరో ? నాకబ్బురంబగుచున్నది. అక్కటా! వృత్తులలో మునివృత్తి మిగులఁగష్టము. తనివితీర భుజించినపిమ్మట నెట్టి కార్యంబుల నయిన నాచరింపవచ్చును. కాని యట్టి భోజనంబు లేనిచో నూరక కూర్చుండి కాలము గడపుమన్నను కష్టంబే? నేను మొదట మునివృత్తి నవలంబించుట యుక్తంబని తలంచితిని గాని నాకిప్పు డది భయంకరముగాఁ గాన్పట్టుచున్నది. యుద్ధమందు కరవాలంబు కేలఁగీలించి శత్రువీరుల నఱకుచు వారిచే నఱకఁబడి కాయంబునకుఁ గాయంబులు దవిలించుకొనుట నాకు భయంబును గొలుపదు. కాని యిది నన్ను మిగుల భీతుం జేయుచున్నయది. మేము కొనివచ్చిన ధనమంతయుం సెలవయినది. ఇంక మాయొద్ద ధనము సుంతేనియుం లేదు. వజ్రపుటుంగరము విక్రయించి యింకఁ గొంతకాలము గడపవచ్చునని తలంప దాని నేదురాత్ముఁడో తస్కరించినాఁడు. ఎప్పుడును రాత్రియందు సరిగా నిద్దురపట్టుటలేదు. నాఁ డావస్తువు పోవుటకే కాఁబోలు నంత గాఢనిద్ర యావేశించినది. పెద్దమ్మ దేవత కటాక్షంబున్నఁ జేతివస్తువునైనం గోలుపోవుదు రనిచెప్పుటకు సందియముండునా ? గతించినదానికి విచారింపనవసరములేదు. కావున నీతలంపు విడిచి ప్రస్తుత క్షేమార్జనోద్దనయిన గొలువునకుఁ గుదిరియుండుట మంచిది కాని తుచ్ఛమైన

షుహామ్మదీయుల సేవింపనొల్లి. కాశ్మీరదేశంబును క్షత్రియులు పరిపాలించు చున్నారని వినియున్నాను. అచ్చటికిఁ బోవుట కర్తవ్యంబని తనతో వచ్చు చున్న వారితోఁ బలుకుచు నొకపురుషుండు ప్రయాణము చేయుచుండె. అంత "అయ్యా! అపోయెడివారెవ్వరు? నిలుండు నిలుండు" అను శబ్దమొకటి పుట్టెంచె. అది విని యాబాటసారులు నిలువఁబడి వెనుకకుఁ దిరిగిచూడ నిరువురు పురుషులు వచ్చుజాడ గానఁబడిరి. వా రెవ్వరో యని యోజించు సమయమున దఱిసి వారినందఱఁ బరీక్షించిచూచి వారిలో నొకనితో నిట్లనిరి.

రెండవవాఁడు.—అయ్యా! నన్నెచ్చటనైనఁ జూచినట్టు జ్ఞప్తి యున్నదా?

మొదటివాఁడు.—(అతనిఁజూచి) జ్ఞప్తిలేదు. మీరెవరో నాకుఁ దెలియదు. ఎందుకు మమ్ము నిలిపినారు?

రెం.—కొన్ని సంగతులు మాటాడవలసి యున్నవి.

మొ.—ప్రసంగింపుఁడు.

రెం.—నీవు రామమల్లుని కుమారుండవు కావా?

మొ.—నన్ను మీరెక్కడఁ జూచినారు?

రెం.—బాబా! నీవు మఱచితివిగాని నే వేయిజన్మంబులకైన మఱతునా? నాఁడు నీవెంతయుపకారము జేసినావు!

మొ.—ఎంత యుపకారము చేసితినో నాకేమియుం జ్ఞప్తిలేదు.

రెం.—నాప్రాణంబుల రక్షించినావు.

మొ.—ఎవనినుండి?

రెం.—భయంకరమయిన పులులనుండి.

మొ.—(స్మృతి నభినయించుచు) (ఆకాశముపైఁ జూచుచు) ఆఁ! జ్ఞప్తికి వచ్చినది. నేను మఱచిపోయితి. నాకు మీరు మిత్రసత్తములు (అని చేయిపట్టుకొనుచు).

రెం.—కాకేమి? మిత్రుండ వయిననీసందర్శనంబు నాకమితానందంబు గొలుపు చున్నది. ఎచ్చటికిఁ బోవుచున్నారు?

మొ.—కాశ్మీరదేశంబునకు.

శెం.—ఎందులకు ?

మొ.—ఆరాజు నాశ్రయించి యేదయిన నుద్యోగంబు సంపాదించికొనుటకు.

శెం.—ఉద్యోగంబునకై ఇంతదూర మేఁగవలయునా ?

మొ.—రాజస్థానంబునను ండ నిష్టంబు లేదు. అందుచే నంతదూర మేఁగవలసి వచ్చినది.

శెం.—రాజస్థానంబున నీవు చేయవలసిన కృత్యంబు లెన్నియో గలవు. దీనిని నీవు విడువ వలనుపడదు.

మొ.—అట్టికార్యంబు లేవి ?

శెం.—తరువాత చెప్పెద.

మొ.—ప్రస్తుతంబు మే మేమి చేయవలయును ?

శెం.—గద్వారుదుర్గంబునకు రండు.

మొ.—వచ్చిననేమి ? ఉద్యోగము లభించునా ?

శెం.—(నవ్వుచు) ఉద్యోగంబే కాదు. రాజ్యంబే !

మొ.—అచ్చటి యుదంతమేమి ? మీవృత్తాంతమేమి ? మే మిట్లు వచ్చుచున్నామని మీ కెట్లు తెలిసినది ? చెప్పుఁడు.

శెం.—అయ్యా ! ఆయుదంతంబంతయుఁ జెప్పెద వినుఁడు. నేను గద్వారు దుర్గమందుండుదును. నాకు రాజపుత్రులందనురాగంబెచ్చు. అందులో జిత్తూరు రాణాలపై నున్న యనురాగంబునకు మేరలేదు. అందులకు వారి సత్ప్రవర్తనంబే కారణంబు. నాఁడు నీతో స్నేహంబు చేసి గద్వారు ప్రవేశించి పిమ్మట నీయుదంతమునకై నా శిష్యులఁ జిత్తూరునకు బంపితి. వారు తిరిగివచ్చి నీవు సంగునితోఁ బోట్లాడితి వనియు, రాయమల్లుండులకుఁ గోపించి నిన్ను పురంబుననుండి వెడలఁగొట్టెననియుఁ జెప్పిరి. అందులకు నే మిగుల విచారపరీతుండనై నీకొఱకు రాజస్థానంబు నంతను వెదకించితి. కాని నీ వీయరణ్యంబుల నుండుటం గాఁబోలు. మచ్ఛిష్యులు నిన్ను గనుఁగొనలేకపోయిరి. కాని నే వెనుక నీ కిచ్చిన యుంగరంబు నా శిష్యుండు గొనివచ్చి తనచోరత్వంబు క్షమింపుఁడని వేఁడుకొని

నా కోసంగె. అంత దానిం జూచి నీయుంగరంబుగా భావించి నీవృత్తాంత మింకఁ దెలియునని యపరిమితానందంబు బూని యా తెల్లవాఱుజామున లేచి ప్రయాణంబొనర్చి సర్వస్థలంబులఁ గ్రుమ్మరుచుఁ గన్నవారి నెల్ల నడుగుచువచ్చి యెట్టకేలకు నీసందర్శనమాచరించితి. కృతకృత్యుండనైతి. నా శ్రమంబు సఫలంబయ్యె. గద్వారుదుర్గంబు పూర్వము చిత్తూరువారి పరిపాలనలోనుండెడిది. ఆదుర్గంబు మాపెదతండ్రి యుదయసింగు రాణా యయినకాలంబున మానవంశజాతులగు రాజులు వశంబుగావించు కొనియున్నారు. మాతండ్రియయినను వారినిజయించి స్వాధీనంబు చేసి కొనలేకపోయినాఁడు. దాని నీవిప్పుడు వశంబు గావించికొనుము. సైన్యసమేతుండగు రాయమల్లు స్వాధీనము చేసికొనలేని గద్వారు దుర్గంబు నేనెట్లువశంబుగావించుకోఁగలనను సందియంబుం బొయ్యుము. ఈసమయంబున నారాజుల జయించుట మిక్కిలిసులభము. ఆరాజులు దుర్గంబును సరిగాఁ బాలింపలేకున్నారు. దొంగతనంబులు హెచ్చు చున్నవి. ప్రజలు తమతమవస్తువులం గాపాడుకొనలేక దొంగలవాతం బడ వేఁగుచున్నారు. ఆరాజునకుఁ జోరత్వంబు వారించు నంతటి సామర్థ్యంబయినలేదు. మిక్కిలి పిఱికివాఁడు. నీవు ప్రచ్ఛన్నవేషండ వయి నాతోరమ్ము. నిన్ను దుర్గంబులోనికిఁ గొనిపోదు. సమయంబు జూచి వారలఁజంపి రాజ్యం బాక్రమించుకొనవచ్చు. మఱియు నందు ఓజాండను వర్తకుం డొకఁడు గలఁడు. అతఁడు మిగుల మంచివాఁడు. అతనికిఁ గొంతసైన్యంబుగలదు. అతఁడు నాకుఁ బరమాప్తుండు. అతండు మనకు సహాయపడకమానఁడు గద్వారు నీవుజయించుటవలన నీవు రాజ వగుటయేకాక యింకొకలాభంబుగూడగలదు. ఈయుదంతమ్ము రాయ మల్లువిన్నచో మిగులనానందించి నీయసాధారణసామర్థ్యంబునకు మెచ్చి కొని, పూర్వక్రోధంబువిడిచి చేరఁదీయకమానఁడు. చిత్తూరునకుఁ గూడ గొప్పముప్పొకటి రాఁదలంచియున్నది. దామోదరసింగు మాళవరాజు నాశ్రయించి యతనికిఁ జిత్తూరుజయించి యిచ్చెదనని ప్రతినపట్టెనఁట.

మఱియును సురేశమల్లు దామోదరప్రేరితుండయి నీకు, సంగునకు విరోధముగల్పించినాఁడు. మీ రిరువు రిట్లు విదేశగతులగుటంజూచి సురేశమల్లు రాయమల్లునకు నిక్కంపు హితుండుంబోలె వర్తించుచు నతనియనుగ్రహంబును సంపాదించి యధికారంబును బొంది వర్తించుచున్నాఁడట. అందువలనఁ జిత్తూరునకు ముప్పువాటిల్లుట నిక్కంబు. మనము సమయంబుగని పెట్టియుండి యాముప్పును దప్పింపవలసియున్నది. మఱియు దామోదరుండు రాజ్యాభిలాషియై తారాబాయినిగొనిపోయి సుల్తానున కర్పించి సూరధానుల సంహరించి తోధానగరంబు గొనం దలంచియున్నాఁడు. ఆదుర్మార్గుఁడు రాజపుత్త్రకులంబునంబుట్టిన రాజపుత్త్రులందఱకును సిగ్గు గలిగించుచున్నాఁడు. ఉత్తమరాజపుత్త్రికను మ్లేచ్ఛులకుఁ గొనిపోయి యిచ్చుచుండుటఁ జూచి యూరకుండుట యుక్తంబుకాదు కదా ? ఆ తోధానగరంబు మీరాజ్యంబులోనిది. మీరాజ్యంబులోనున్నవారి కిడుమప్రాప్తించునపుడు వారించుట మీకు విహితధర్మంబు. మఱియును సూరధానులు నీధైర్యసాహసాదులను సద్గుణంబులనువిని తనకూఁతును నీ కర్పింపఁదలంచి నీకై వెదకించుచున్నట్లు నాశిష్యుం డొకండు చెప్పియున్నాఁడు. ఆ తారాబాయి నిరుపమాన సౌందర్యవంతురాలు. అధికపరాక్రమశాలి. ఆయుధవిద్యానిపుణురాలు. అట్టి యువతినిఁ బెండ్లాడుట నీభాగ్యం బెంతయుఁ గొనియాడవలసియున్నది. ఇన్ని కార్యంబులు నీవు చేయవలసియుండ రాజస్థానంబును విడిచిపోవుట తగునా ? నీవు కాశ్మీరంబున నున్న నీవర్తమానంబు లెట్లు తెలియు ? కాన గద్వారునకు రమ్ము. ఇకార్యంబుల సాధింపుము. నీసత్కీర్తి నల్దిక్కుల నింపుము. చిరకాలంబు నుండి సచ్చరిత్రులచేఁ బరిపాలింపఁబడి మహాఖ్యాతిఁగాంచిన చిత్తూరు మ్లేచ్ఛులవశంబు గాకుండఁ జేయుము" అనిపల్కిన నాతని పల్కుల నాలకించి పృథ్వీరా జిట్లనియె. ఓయోగివర్యా ! రాజపుత్త్రులందును జిత్తూరునందు నింతకృపారసంబుగలిగి ప్రవర్తించు మహానుభావుండ

వయిన నీకు వందనంబు లర్పించుచున్నాను. మీసందర్శనంబు లభించి నందులకు మిగుల నానందించుచున్నాను. స్వరాజ్యంబు రక్షించుటలో మీరు చేయుచున్నంతప్రయత్నం బేభూపాలుండును నేమంత్రిసత్తముండును చేసి ప్రవర్తింపలేడు. అట్టులే యయిన వారివారిరాజ్యంబుల కట్టిదురవస్థ బట్టనే పట్టదు. నాయుంగరంబు తస్కరుం డెవ్వఁడో హరించెనని విచారించితి. ఆయుంగరంబే మన యిర్వురకు సంఘటనం బొనరించినది. ఆయుంగరంబును మీశిష్యుండు గొనివచ్చి మీ కొసంగకున్నను, మీరు వెంటనే గదలివచ్చి నన్నుఁ గలియకపోయినను మీరు పైనివచించిన యాపదలన్నియుం సంప్రాప్తంబులు గావలసినవే. నా కీయుదంతం బేమియుఁ దెలియమిచే నేఁ గాశ్మీరంబునకుఁ బోవుచున్నాను. మీరు నుడివిన ట్లంతదూరంబుననున్న నేను దామోదరుని మాయోపాయం బెట్లు తెలిసికొనఁగలను? నేఁడు సుదినము. మీవంటిహితుని మఱొకనిం జూడ. మీరుచెప్పిన గార్యంబులన్నియుఁ జక్కఁ జేయుదు. మహానుభావులరయిన మీరు నాకు నిక్కంపుహితులరై యుండ నాకేమి లోపము? మీ యాజ్ఞచొప్పునఁ బ్రవర్తింతును. యుద్ధంబులందు నా పరాక్రమంబు వెలువరింతును. మిక్కిలి పరిశుభ్రమయిన కీర్తినివరింతునని మహావినయంబుతోఁ బలుకుచున్న పృథ్వీరాజునకుఁ దనయొద్దనున్న యంగుళీయకంబు నొసంగి యోగి యతనిం జూచి "ఓయీ! ముందుగాఁ బోయి గద్వారువశంబు గావించికొందము రమ్ము. ఆదుర్గంబున మనము నునికిపట్టుగాఁ జేసికొని తక్కినకార్యంబులు సాధింపవచ్చును. రండు గద్వారునకుఁ బోదమని చెప్పి ప్రచ్ఛన్నవేషులయిన వారితోఁ గలిసి గద్వారునకుఁబోయి మఠప్రవేశం బొనర్చె.

---

# పదునొకొండవ ప్రకరణము

సకలమానవులకును మిగుల నబ్బురంబుగొలుపు వస్తువేది? కొందఱు గడియారమనియుఁ, గొందఱు ధూమశకటంబనియు, మఱికొందఱు విద్యుచ్ఛక్తి

యంత్రంబులనియు, నింకొకకొందఱు తంత్రీవార్తలనియు, వేఱొకకొందఱు ప్రపంచకమనియు నుడువుదురు. ఇవియన్నియు నాశ్చర్యకరంబులే. కాని యత్యాశ్చర్యకరంబులగునవి కావు. అట్టిది యొకటియున్నది. అది రాత్రులం దందఱకు ననుభూతంబగుచుండు. దాని కున్న సామర్థ్యము మఱియొకదానికి లేదు. అది ధనవంతుని దరిద్రునిగాఁ జేయు. పరమదరిద్రునిఁ గుబేరునిగాఁ జేయు. అంతఃపురంబులందున్నవాని మహారణ్యగతునిగాఁ జేయు. మహారణ్యగతుఁడైనవాని శుద్ధాంతవర్తినిగాఁ జేయు, ఒకమాఱు కొండనెక్కించు ఒకమారు గోతిలోఁ ద్రోయును. ఒకపఱి యేనుఁగు నెక్కించు, మఱియొకమాఱు ఖరవాహనునిగాఁ జేయు. ఒకసారి విచారసాగరంబులో ముంచు, ఒకతేప నానందాంబుధి నోలలాడించు. ఒకమాటు నవ్వించు, ఒకమా ఱేడ్పించు. ఒకపర్యాయము మిత్రుని శత్రువుగాఁ జేయు, మఱియొకపర్యాయము శత్రువును మిత్రునిగాఁ జేయు. ఒకమారు మహాపర్వతమునైన బంతిగాఁ గూలించునంతటి బలవంతునిగాఁ జేయు. ఒకమా ఱెటునున్న గడ్డిపోచ నటువేయలేనంత దుర్బలునిగాఁ జేయు. ఒకమాఱు స్వర్గాదిలోకంబులఁ ద్రిప్పుచు మానవుని స్వస్థానంబునుండి కదలనీకుండఁగనే సకలపదార్థంబులం జూపుచుండు. సకలస్థలంబులం ద్రిప్పుచుండు. సకలమార్గంబుల నడిపించు. అది యేదియో చదువరులు గ్రహించియే యుందురు. అయ్యది స్వప్నము. దాని ప్రభావము నిరుపమానమయినది. అయ్యది యిట్లు వర్ణింపఁబడినది

మ. ఒకమాఱేనియుఁ జూడకున్న మనమం దూహింపకున్నన్ మఱిం
కొకలోకంబుననున్న దుర్ఘటములై యున్నం దగన్ స్వప్నముల్
సకలార్థంబులఁ దెచ్చిచూపును యథాస్థానంబునం దుండ ధా
తకునైనన్నుతియింపఁగా దరమె తత్సామర్థ్యమున్ భూవరా.

సర్వానుభూతం బయినదీనింగూర్చి యింతకంటెఁ జెప్పనక్కఱ లేదు. అయినను దీని ప్రభావము నొకమాఱు గనుఁగొందము. సూరథానులు కొంచెము వయస్సుమీఱినవాఁడు. అతనికిఁ బగలు నిద్రించెడు నలవాటుకలదు. అందుచే నతఁడు తనయంతఃపురంబున హంసతూలికాతల్పంబుపయి నిద్రించెను. కావలి

భటు లాతనికి నిద్దురబట్టినతోడనే తలుపులుబంధించిపోయి ద్వారంబులను గాచికొనియుండిరి.ఆరక్షకభటు లొక్కొక్కమాఱునిశ్శబ్దంబుగాఁబోయి యాతండు మేల్కొనునేమో యని చూచుచుండిరి. కాని యతఁడు గుఱకపెట్టి నిద్రించు చుండెను. అందుచే వారలు దిరిగిపోయి ద్వారంబులయొద్ద ఖడ్గధారులై భద్ర ముగాఁ గాపుండిరి. అంతలోపుననుండి అయ్యో! అంత యాపదవచ్చినది.చచ్చి తిని. చచ్చితిని. ఓరీ! దురాత్మా! రత్నసింహా! ఆప్తుండ వని విశ్వసించియుండ నీవును దామోదరగోపాలసింహులవలె విశ్వాసఘాతకుండవైనా వేమిరా?నన్నుఁ జంపకుము. చంపకుము. ఓరీ జయరాము! ఏదేదీకత్తి! రయంబునఁ దెమ్ము! తెమ్ము-తెమ్ము-తెమ్ము - తెమ్ము-తేతే ఏ ఏ ఏ ఏ ...... అను వికృతధ్వని ఏతెంచి ద్వారపాలురకర్ణబిలంబులఁ దాఁకెను. వా రాధ్వనివిని త్రుళ్ళిపడిరి. నిశ్చేష్టితు లైరి. ప్రభువునకు శత్రువులనుండి యపాయము మూఁడినదని తలంచిరి. ఒకరికిని బొందెలో ప్రాణంబులు లేవు.పూర్వము పదిపర్యాయములు గదిలోనికిపోయివచ్చి నవారిలో నొక్కఁడును బోసాహసింపకుండె. తా మచ్చటనున్న ప్రాణంబులు పోవునని కొందఱు పర్విడిరి. కొందఱు ధైర్యమువహించి కారణ మూహించు చుండిరి. అంత జయరా మనెడు ముఖ్యభటుఁడు కరవాలంబుఁ కేలఁగీలించి తలుపుదీసి లోనికిఁ బ్రవేశించెను. రాజు హంసతూలికాతల్పంబును, సమీ పించె. కాని సూరధాను లాతల్పమందు గానరాఁడు. అంత వానికిఁ హృదయము కంపింపఁ జొచ్చె. గవాక్షములన్నియుం మూయఁబడియుండఁగా రాజె ట్లెచ్చటికిఁబోయెనని చింతించుచుండె. అట్లు వీఁడు పరిశీలించుచుండ సూరధాను లొకగవాక్షమును సమీపించి తలుపుదీయఁ బ్రయత్నించుచుండె. జయరా మతని గనిపెట్టి యాతనిసమీపించి యాగవాక్షంబునుదెఱచి తనప్రభు వును జూచెను. అట్లాతఁడులేచి తల్పంబుడిగ్గి గవాక్షముసమీపించి దాని తెరవఁ జేతులుజాచుచున్నను నతఁడు కన్నులను మూసియేయుండెను. ఒంటిఁ జెమ్మట లొకయేఱై పాఱుచుండెను.జయరాము తట్టిపిలిచెను గాని యతండు ప్రత్యుత్తర మీయలేదు. అతనియొంట నెచ్చటను గాయమున్నట్లుకనుపడలేదు. అప్పు డతని కపాయంబుగలుగలేదని నిశ్చయించి గొనిపోయి తల్పంబుపయి గూర్చుండఁబెట్టి

మేల్కొలిపెను. అంత సూరధానులు కొంతసేపటికిఁ గన్నులువిచ్చిచూచెను. కాని యతనికి నిద్రాప్రవృత్తిపూర్తిగ మరలకపోవుటచేఁ దనయెదుట ఖడ్గపాణి యైయున్న జయరామును రత్నసింహునిగాఁ దలంచెను. అతఁడు తన్ను ఖడ్గముతో ఛేదించుచున్నట్లుభావించె. "ఓరీ! దురాత్మా! రత్నసింహా! అధికారమంతయు నీకిచ్చినందులకుఁ దగిన ప్రాయశ్చిత్తంబుచేసితివిరా! నిష్కారణముగా నన్నుఁ జంపవద్దు. నా కొక యాయుధంబును గొనిరమ్ము. పిమ్మట నిరువురము ఖడ్గపాణులమై పోరాడుదము" అని మరల గట్టిగా నఱచెను. అంత జయరాము తన ప్రభువునకు నిద్దురమత్తు పూర్తిగావదలలేదని నిశ్చయించి తగిన ప్రయత్నంబులచే నతని మేల్కొలుపుచుండెను. అంత నొక్కొకభటుఁడే లోపలికి రాజొచ్చెను.అట్లు కొంతసేపటికి మందిరాంతరంబు రాజభటమయంబై చూపట్టె.వీరల కలకలధ్వనినిబట్టియు, జయరాము చేసిన ప్రయత్నంబులంబట్టియు సూరధానులు మేల్కొనెను. అప్పటి కతనికి లోకజ్ఞానంబుగలిగినది. మనుష్యులపొల్తి పట్టఁదగియుండె. ఆభూపాలుండు వారలనందఱనుగాంచి నిట్టూర్పుపుచ్చి తనస్వప్నవృత్తాంతంబును స్మరించుకొని తానుభయఁపడి కేకలు వేసియుండుట చేతనే వారందఱువచ్చి రని భావించికొని తనకుఁదానే విస్మయంబుచెందుచు జయరామందక్క తక్కినపరిచారకులనందఱ నంపివేసి యాభూపాలుండు తాఁగన్న దుస్స్వప్నంబు తప్పక చెట్టలుపుట్టింపకమానదని భయఁపడుచుండెను. సుస్వప్న దుస్స్వప్నంబులు తప్పక తత్తత్ఫలదాయకంబులగునని యతనికిఁ బెద్దనమ్మకంబు కలదు. పూర్వము పురోహితులు చెప్పిన దుస్స్వప్నోపశమన మంత్రము జ్ఞప్తికి వచ్చె. అందుచే నాతఁడు దూర్వాంకురంబులు దెప్పించి,

"శ్లో. సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా,
సర్వం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్ననాశనీ."

యనెడి మంత్రమును ముమ్మారుచ్చరించి దూర్వాంకురంబులఁ దూర్పుగాఁ బాఱవైచివచ్చి తల్పంబుపైఁ గూర్చుండి జయరామున కిట్లనియె. "ఓరీ! ఎంతబాధను బొందితివిరా! నేను మిమ్ములనందఱను దిరిగిచూతునని తలంచలేదు. నాముద్దుకుమారి యెక్కడ? వేగముగా బిలిచికొనిరమ్ము, పొమ్ము"

నాపుడు జయరాము గృహారామమునందుఁ గుతుకంబుతో విహరించుచున్న తారాబాయిని బిలిచికొనివచ్చె. తారాబాయి వనవిహారంబు సల్పుచుండుటయు నాసమయంబున జనకాజ్ఞయైన దని వేగంబుగా రావలయునని భటుండువచ్చి పిల్చుటయుఁ, నంత తారాబాయి వనవిహారంబు చాలించి జనకనికటంబునకుఁ బోవుటయుఁ జదువరులు చదివియున్నారు. అట్లువచ్చుచున్న గారాబుపుత్త్రి కను జేరఁదీసి దగ్గరగాఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లు సంభాషించెను.

సూర.—కుమారీ ! ఈ నేత్రంబులతో నిన్నుఁజూతు ననుకొనలేదు.

తారా.—నాయనా ! అంత యుపద్రవ మేమి వచ్చినది ?

సూ.—ఒక దుస్స్వప్నంబుఁ గాంచితిని.

తా.—అదేమి ?

సూ.—ఏమిచెప్పుదు, తలంచుకొన్న గుండె చెక్కలగుచున్నది. నాకే యిట్టి భయంబును గలిగించుచున్నది. నీకెంతభయంబును గలిగించునో ?

తా.—స్వప్నవృత్తాంతంబునకు భయపడనేల ? భయఁపడను జెప్పుడు.

సూ.—మనరత్నసింహుండుకూడ దురకలతో నేకీభవించి నిన్నుజెఱఁగొనిపోయి నట్లును, ఈరత్నసింహుఁడు భయంకరంబగు కరవాలంబు కీలించివచ్చి నన్ను నఱకఁబోయినట్లును, రాజ్యంబు దామోదరవశంబైనట్లును, నొక స్వప్నంబుగాంచితి.

తా.—జనకా ! దీనికి వగవనేల ? స్వప్నంబు లెప్పుడైన సత్యంబులగునా ? నాయందలి ప్రేమాతిశయంబుకలదై మీమానసంబు సంతతము నాకుఁ దురకలవలన నపాయంబువాటిల్లు ననితలంచుచుండుటచేతను దామోదరుండేమిచేయునో యని సర్వదా యాలోచించుచుండుటచేతను మీ కిట్టిస్వప్నంబుకలిగె. అంతమాత్రంబునకు భయపడనేల ?

సూ.—అట్లనకుము. నీవు చిన్నదానవగుటచే ననుభవంబుచాలక యిట్లనుచున్నావు. కాని స్వప్నంబులు కష్టకఫలదాయకంబు లని యెంచుము.

తా.—పోనిం డట్లనుకొన్నను యింతకుఁ బూర్వముపూత్ర మందులకై విచారించుచుండలేదా ? క్రొత్తవిచారంబునకుఁ గారణంబులేదే ?

సూ.—లేకేమి ! ఉన్నది.

తా.—ఆకారణంబు నుడువుఁడు.

సూ.—రత్నసింహునివలన మనకుఁ దప్పక యిక్కట్టు ప్రాప్తించునని తలంచెద !

తా.—(చెవులుమూసికొని) హరహరా ! ఎంతమాటాడినారు. రత్నసింహుని మత మెంతమంచిది ! అతనివలన మనకు నిక్కట్టులు ప్రాప్తించునని కాదు తొలఁగంగవచ్చునని చెప్పవచ్చును.

సూ.—నీకు లోకానుభవంబు చాలదు. పూర్వము గోపాలసింగు ప్రవర్తనము మొదటమంచిదికాదా ! తుద కెట్లుపరిణమించినదో యెఱుంగవా ?

తా.—అవును. ఒక్కఁడు దురాత్ముఁడని యందఱు దుర్మార్గులే యగుదురా ? చక్కఁగయోజింప రత్నసింహుని యంతఃకరణం బతినిర్మలంబు. ఎంత మాత్రము కుటిలత్వము వహింపదు.

సూ.—నీమాటలఁ నా కెంతేనియుఁ రుచింపకున్నవి.

తా.—ఎందుచేత ?

సూ.—నీ వనుభవంబు చాలనిమాటలు చెప్పుదువు.

తా.—జనకా ! ఏల మీ రిట్లుసెలవిచ్చెదరు ? పూర్వ మాలోచనసమయము లందు నన్నుఁ బిలిచి నాచెప్పినయోచన మిక్కిలి యుచితంబని గ్రహించినారు కారా? అట్లెన్నిపర్యాయములు జరుగలేదు. అప్పు డనుభవంబు గలమాటలా ? ఇప్పుడు కావా? మిమ్ముల నాస్వప్నవృత్తాంతమె నావాక్యంబుల మఱియొక్కరీతిగాఁ దోపించుచున్నది.

సూ.—ఏవో ! నీతివాక్యంబులు పలికితివి కాని నాకవి చెవికెక్కకున్నవి.

తా.—పోనిం డేమిచేయందము ?

సూ.—రత్నసింహుని నుద్యోగమునుండి తప్పింతము.

తా.—తప్పించి చేసెడిదేమి ?

సూ.—మఱొక్కని యోగ్యుండగు రాజపుత్త్రుని నాపనియందు నియోగింతము.

—రత్నసింహుని తప్పించుటకుఁ గారణంబు వద్దా?

—కారణంబు లేకేమి! ఉన్నది.

—(నవ్వుచు) మీస్వప్నవృత్తాంతమా?

—అవును. కాఁగూడదా.

—సరియే! నేఁటి కతనిఁ దప్పింపవచ్చును. ఈపర్యాయము నేను దమకు ద్రోహంబు చేసినట్టు స్వప్నంబువచ్చినచో నన్ను డేమిచేయుదురు?

—(తెల తెలపోవుచు) అట్టిస్వప్నము రానేరాదు.

—ఎందుకురాదు! నేను మీగారాబు పుత్త్రికను గనుక నట్టిస్వప్నము రాదు కాబోలు. రత్నసింహుండు పెఱవాఁడు. కావున నట్టిస్వప్నంబు యుక్తమైనది. వాదొక్క మనవికలదు. అవధరింపుము.

—చెప్పుము.

—తగినంత కారణంబులేకుండ నెట్టివానినైన నుద్యోగంబునుండి తప్పించుట యుక్తంబుకాదు. అట్టి కారణంబుగూడ మనకుఁ బ్రత్యక్షంబుగ గన్పట్టవలయు. అంతియకాని పరులుచెప్పెడివాక్యంబులు స్వప్నవృత్తాంతంబు కారణంబుగాఁ జేకొనుట యుక్తముకాదు. స్వప్నంబున కొకమార్గమనిలేదు. శత్రుని మిత్రునిగాఁ దోపించు. మిత్రుని శత్రునిగాఁ దోపించు. వాని నమ్మికొని శత్రునిమిత్రునిగాఁ జేకొనుటకాని మిత్రుని శత్రునిగాఁ జేకొనుటకాని తగదు. స్వప్నంబున శత్రువుగాఁ దోఁచినవాని నెల్ల బహిష్కృతుని జేసినచో జనులు ప్రభువునం దనురాగంబు విడుతురు. అందువలన రాజ్యంబునకపాయంబు సంభవింపకమానదు. ప్రజానురాగములేని రాజు రాజ్యము తెగినవేళ్లతోనున్న మహావృక్షమువంటిది. కావున నాయాలోచన యెంతమాత్రము యుక్తంబుకాదు. మఱియు రత్నసింగునం దుత్తమ మంత్రిగుణంబులన్నియుఁ గానవచ్చుచున్నవి. అతఁడు బలపరాక్రమమునందు నిరుపమానుండు. గోపాలసింగు పోయిన పిమ్మట నతనికంటె నధికుం డీతండు వచ్చెనుగాన మన కాలోపంబు తెలియలేదు. కానిచో మనము పలుపాట్లు పడవలసివచ్చును. ఇంతటి వాఁడు మనకు లభింపఁడు. ఒకవేళ లభించినను రాజభక్తితత్పరుండై

రాజ్యంబును మనలను నిరపాయంబుగా రక్షింపుచున్న రత్నసింహుని నిష్కారణంబుగాఁ బొమ్మనుట యుక్తకార్యంబు కాదు. అట్లు చేయుట కొఱవితో తలగోకుకొనుటవంటిది. ఈ రత్నసింహుండును దామోదరుండు నేకమైనచో మన కిడుములు ప్రాప్తించుట నిక్కంబు. మీకితనిపై ననుమానంబున్నచో గూఢముగా నాతని ప్రవర్తన మరయుచుండుఁడు. పట్టణముచుట్టు రక్షకభటులనుంచి రత్నసింహునకును మఱియొకనికి నుత్తర ప్రత్యుత్తరంబులు జరుగుచున్నవేమో గనిపెట్టుఁడు. అందులకుఁ దగిన కాగితంబులు లభించినచోఁ బిమ్మట మీ తలంపు నెఱవేర్పవచ్చును. అని యిట్లు యుక్తియుక్తంబుగాఁ బలికిన కుమారిపలుకులకు మాఱాడ లేక తలయూఁచి యంశముల కంగీకరించి యీయుదంత మెవ్వరికిఁ దెలియకుండ గుప్తము కావించి రత్నసింహునుగంతము గుమారికనుగూడ నరయుమని చెప్పి కాలము గడుపుచుండె.

---

# పండ్రెండవ ప్రకరణము

తోధానగరము తోధాసంస్థానంబునకు రాజధాని. అది నగరంబులలో లెక్కపెట్టఁదగినది. అందు భవానీదేవాలయగోపురంబున కౌన్నత్యంబున నీడు వచ్చునది మఱియొకటిలేదు. అప్పురమందు రాజుగారిసౌధంబులే కాక వర్తకుల సౌధంబులుకూడ మిగులనున్నతంబులై చూపఱ కానందంబు గొలుపుచుండును. అందు మిక్కిలి వెడల్పయిన రాజవీథియొకటి కలదు. అది యంగడివీథియనియుఁ బిలువఁబడును. ఆవీథి కిరుప్రక్కలయందు మేడలుతప్ప నొకటయిన పెంకుటిల్లు లేదు. ఆ మేడలందు వర్తకులు మిగుల నమూల్యములైన వస్తువులుంచుకొని యమ్ముచుందురు. వేయేల ఆ వీథియందు విలువగల రత్నంబులు మొదలుకొని తృణంబువఱకు గల సకలపదార్థంబుల నమ్ముచుందురు. ఒకనాఁడు వర్తకు లింటభోజనంబు చేసి యెనిమిదిగంటలకు వచ్చి తమతమ వస్తుజాతము బైకిఁగొని వచ్చి చుట్టునుంచుకొని యిట్టిటు తిరుగుచున్న బాటసారులను బిలుచుచుఁ దమ వస్తువులఁ గొనుఁడనుచునుండిరి. ఆయూరిలో సారంగుఁ డను వర్తకుం డొకఁడు.

కలఁడు. అతఁడు సాధారణవర్తకుఁడు. మిగులఁ గ్రూరుఁడు. అతనికున్నంత యాశ మఱియొకనికి లేదు. వాఁడు మార్గమందుఁ బోవుచున్న క్రొత్త బాటసారులను వెదకుచుండును. వాఁడు మాటలపోగు. వాని దుకాణంబుపైకి వచ్చినవాఁడు వస్తువుల కొనకుండపోలేఁడు. వానికంఠధ్వని యద్భుతమయినది. వాఁడు పట్టుబట్టలను, విలువగల నూలుబట్టల నమ్ముచుండును. వాఁడు "అయ్యా! రండు రండు. వెలస్వల్పము, ఫలమధికము. చౌకగాఁ నిచ్చుచున్నాను" అని గంభీరకంఠనినాదంబుతో బాటసారులను బిల్చుచు నమ్ముకొనుచుండె. అంత బాటసారి యొకఁ డామార్గంబునఁ బోవుచుండెను. వాఁడు ముసలివాఁడేకాని బలిష్ఠుఁడు. వాఁడు చీలమండలుదగులునట్టు లోకపట్టంగరకా దొడిగికొనెను. వాఁడు పెద్దధనవంతునివలె గన్పట్టుచుండె. మఱియుం వాఁ డాయూరివానివలెఁ దోపలేదు. అంత సారంగుఁ డాపోవుచున్న బాటసారినిజూచి వానియొద్దనుండి ధనంబులాగనూహించి "ఏమండీ! బట్టలు కొనరా? రండు రండు" అని పిలిచెను. అంత వాఁడును వచ్చికూర్చుండెను అంత.

వ.—అయ్యా! మీపేరేమి?

బా.—నాపేరు మహమ్మదుసాహె బనియందురు.

వ.—మీరు బట్టలుకొందురా?

బా.—అవును. మీకొట్టుమీఁద నెట్టిబట్టలున్నవి?

వ.—పట్టుబట్టలు, విలువగల నూలుబట్టలు.

బా.—మీవద్ద చైనా పట్టుబట్ట లున్నవా?

వ.—ఉన్నవి. ఓరీవెంకా! పట్టుబట్టలుగొనిరా? (అన వాఁడు తెచ్చి ముందు బెట్టును. వర్తకుఁ డాబట్టలఁ దీసి కనఁబఱచును).

బా.—(ఒకదానిఁ దీసికొని) గజ మెంత వెలకిచ్చెదరు?

వ.—(తనలో) ఎంతచెప్పుదు? వీఁ డెంతకయినఁ గొనునట్టులున్నది. (ప్రకాశముగా) గజము మూఁడున్నరరూపాయి.

బా.—మిక్కుటంబగువెల పెట్టినావు. ఇది యింతవెలచేయునా?

వ.—సాహేబుగారు! బట్టచూడుఁడు ఇట్టిబట్ట మఱియెక్కడను దొరకదు. చూడుఁడు. నేనబద్ధమాడను. ఇదిగో గజమునకు నాల్గురూపాయిలిచ్చెద నాకుఁ దెచ్చిపెట్టుఁడు. (అని పెట్టెలో రూపాయిలఁదీసి యీయఁ బోవును.)

బా.—మేము వర్తకులము కాము. ఎంతకిచ్చెదవో నిజముచెప్పు.

వ.—మీరు మీకుఁ దోఁచినమట్టు కడుగుఁడు. కోపములేదు.

బా.—గజము రెండున్నరరూపాయిచొప్పున యిచ్చెదవా?

వ.—(తనలో) గజమునకు రూపాయిలాభమున్నది. తక్కినయఆరూపాయి యిచ్చునేమో చూతము. (ప్రకాశముగా) సాహేబుగారు! మీవంటి వారును బేరములాడుదురె! మూఁడురూపాయిలు చేసికొండు రండు.

బా.—సరే. అట్లేయిచ్చెదను. కొలిచి చింపుము.

వ.—ఎన్నిగజములు.

బా.—పదిగజము లుండవలెను లేనిచో పాగాకు సరిపడదు.

వ.—(తప్పుగాఁగొలిచి) యొకగజముతగ్గించి బాటసారి చేతికిచ్చును.

బా.—పాగాచుట్టుకొందునా?

వ.—(తన కధికలాభము వచ్చినందుల కానందముతోఁ బొంగిపోయి) చిత్తము (అని యంగీకరించును).

బా.—(ఆపట్టుబట్టను బాగాగా జుట్టుకొనును).

వ.—అయ్యా! యీసారి మీరు ఢిల్లీపాదుషావలె నున్నారు.

బా.—ఏదీయద్దము. (అని తీసికొని మీసము చక్కచేసికొనుచు) వహ్వారే! బాగుగా చెప్పితివి.

అని యాబాటసారి యానందంబున మునింగి వర్తకుని దుకాణంబుపైఁ గూర్చుండి తన జేబులోనున్న పొగచుట్టదీసి నిప్పుముట్టించి పీల్చుచు నాధూమమును వర్తకుని మొగముమీఁద వదలుచు, మంచి మంచిమాటలాడి వర్తకుని సంతసింపఁజేయుచు నిట్లొకగంటకాలంబు గడపె. వర్తకుండును మంచిమాట

లాడి యాబాటసారికి సంతసము గలిగించి, యింకను వానిచేఁగొనిపింపవలయు నని యాలోచించుచుండె. అంత నాబాటసారి లేచి, వర్తకునిం జూచి, "సాహుకారుగారూ! దయయుంచుఁడు పోయివచ్చెదను.

వ.—మాకిచ్చెడి సొమ్మేది?

బా.—ఓయీ! ఎన్నిమార్లు పుచ్చుకొనియెదవు?

వ.—ఏమీ! మీరు నాకు సొమ్మిచ్చినారా?

బా.—ఏమిరా! సొమ్మివ్వకుండ బట్ట నెట్టిచ్చెదవురా?

వ.—(గుండె బాదుకొనుచు) నమ్మకముపై నిచ్చినాను. అంతియకాని మాకు సొమ్మీలేదు.

బా.—నేను సొమ్మంత నిచ్చితిని. ఇంక మాట్లాడకు, నోటిపండ్లూడును.

అంత వర్తకుండు చేయునదిలేక (ఆదారినిఁ బోవుచున్న రాజభటులఁ జూచి జరిగినయందంతయుఁదెలిపి, మాసొమ్ము మాకిప్పింపుఁడని వేఁడికొని నాల్గు రూపాయిల వారిచేతిలోఁ బెట్టెను) అంత వారు సంతసించుచువచ్చి యాబాటసారితో నిట్లు సంభాషించిరి.

రా.—ఓయి! నీపేరేమి?

బా.—నాకు తెలియదు.

రా.—తిన్నగాఁజెప్పెదవా! లేక ఠాణాకు నడతువా?

బా.—నాపేరు నాకు తెలియదు. నేను చెప్పను. రమ్మనినచో ఠాణాకు వచ్చెదను.

రా.—సరియె. నడువుము. అక్కడ నాలుగు తుపాకి మడుగుపోటులతో నీవే చెప్పెదవు. (అని నలుగురురాజభటులు న్యాయస్థలంబునకుఁ గొనిపోయిరి) సూరధాను లావాఁడు వీరుపోవునప్పటికి సింహాసనంబుపైఁ గూర్చుండియుండె. అంతనొకరాజభటుఁడు ప్రభువునకు నమస్కరించి యావృత్తాంతంబు విన్నవించె. అది సూరధానులువిని తనయెదుటికి వర్తకుని బాటసారిని బిలిపించి యడుగఁగా, బట్టకొని సొమ్మిచ్చితినని బాటసారియు, సొమ్మీలేదని వర్తకుండును నుడివిరి. అంతసూరధానులు బాటసారిఁజూచి నీపేరేమి? నీవెచ్చటివాఁడవు?

బా.—నా పేరు నాకు తెలియదు. నా నివాసస్థలము చెప్పను.

సూ.—నీవు చెప్పనిచో శిక్షించెద.

బా.—న్యాయ మనితోఁచిన శిక్షింపుఁడు.

సూ.—(రాజభటులంజూచి) ఓయీ! చూచెదరేమి?

రా.—చిత్తము (అని) ఒక్కమా రా బాటసారిపైఁబడి యాతని యొంటి వస్త్రంబులు దీయుచుండ వాఁ డందుల కంగీకరింపక వారితోఁ బోర నారంభించె. అంత రాజభటులు నల్వురు నేకీభవించి గట్టిగా మర్దించిరి బాటసారి రోదనము చేయుచు, క్షమించుఁడు. క్షమించుఁడు. నావృత్తాంతము చెప్పెద నని వేఁడుకొన నారంభించె. ఇంతకుముందు త్రోపులాటలో వాని మొలనున్న తోలుసంచియొకటి క్రిందఁబడెను. దాని నొరులుచూడకుండ సంగ్రహింపఁజూచుచుండ దాని నొకరాజభటుండు చూచి పట్టుకొనెను. కాని యా బాటసారి మిగుల నేడ్చుచు నా రాజభటుని చేతిలోనిది నిర్బంధము చేఁ దీసికొని, రాజసన్నిధికిం బోయి యిట్లు విన్నవించె. "అయ్యా! నేనొక సేవకుండను, మా నివాసస్థలము ఘూర్జరదేశము. ఇచ్చటికి దగ్గరనున్న యొకగ్రామంబున బంధువులున్నారు. అచ్చటికిఁబోయి తిరిగి మాదేశంబున కేఁగుచు నీపురంబు వచ్చితిని. ఇచ్చట వర్తకునియొద్దఁ బట్టువస్త్రంబునుగొని సొమ్మిచ్చితిని. ఇంతకుఁదప్ప నాకేమియుఁ దెలియదు." అని దీనాతిదీనముగా నేడ్వసాగెను. అంత రాజు వీనివైఖరి గనిపెట్టి "వీఁ డనుమానపురుషుని వలెఁ గనఁబట్టుచున్నాఁడు. వీనియొద్ద నుత్తరంబులేమయిన నున్నవేమో గనుఁగొనుఁడు" నావుఁడు రాజభటులు వానిమూటనువిప్పి పరిశీలించిరి. కాని యందేమియుఁ గానరాలేదు. అంత రాజభటులలో నొకఁడు "నీయొద్ద తోలుసంచి చూపుము. దానిఁ బరిశీలించి నీకొసంగెదము" అనిపల్కె. "అది నే నీజాలను అందు నిలువఁగలరత్నంబు లున్నవి. నాప్రాణమైన నొసంగుదుఁగాని, నాసంచి నీఁజాలను" అని బాటసారిపలుకుచుండ విని సూరథానులు వాని కిట్లనియె. "ఓయీ!

నీరత్నములు మాకక్కఱలేదు. సంచి యొసంగుము. చూచి యిచ్చి వేయుదుము.

బా.—నాప్రాణ మందులో నున్నది. నే నీయను.

మా.—నీకు భయంబులేదు. చూడనిమ్ము (అనిపల్కి రాజభటుల నియమించె) అంత రాజభటులు వానిఁబట్టుకొని మొలయందున్న తోలుసంచిని కొని వచ్చి రాజునకిచ్చిరి. అది రాజు విచ్చిచూడ నందొక యుత్తరంబు గన్పట్టె. దానిం గొని చదివిచూచి యత్యద్భుతపడి (బాటసారిం జూచి) ఓరీ! నిజముచెప్పెదవా? ప్రాణము లిచ్చెదవా?

బా.—(గడగడ వణకుచు) ప్రాణముల రక్షించెద మని వాగ్దానముచేసినచో నిజము చెప్పెద.

రా.—చెప్పు. నిను విడిచిపెట్టెదను.

బా.—అయ్యా! నేను దామోదరుభృత్యుండను. నాపేరు శంకరుఁడందురు. అతనియాజ్ఞ చొప్పున నొకయుత్తరంబు రత్నసింహునకొసంగి యతని వలన నీయుత్తరంబును గొనిపోవుచున్నాను.

రా.—(విని క్రోధానలంబున మండిపడి భటునిఁజూచి) ఓరీ! రత్నసింహుని వెంటనే కొనిరమ్ము.

భ.—చిత్తము (అని వానిని వెంటనే కొనివచ్చును)

ర.—(వచ్చి నమస్కరించి) దేవా! యేమిసెలవు?

రా.—(చుఱచుఱఁ జూచుచు) నీకును దామోదరునికిని నుత్తర ప్రత్యుత్తరంబులు జరుగుచున్నవా?

ర.—లేదులేదు. పరమశత్రువునకు నుత్తరము వ్రాయుదునా!

రా.—(ఉత్తరమునుజూపి) ఈచేవ్రాలెవరిది?

ర.—(చూచి) ఈచేవ్రాలు నాదానివలె నున్నది. కాని నా కీసంగతి యెంతమాత్రమునుఁ దెలియదు. ఎవరో దుర్మార్గులు నాచేవ్రాలు చేసియుందురు.

రా.—దీనివ్రాసిన వారెవ్వరు?

ర.—నాకుఁ దెలియదు.

రా.—తెలియదందువేమి? నిజము చెప్పుము.

ర.—సప్రమాణంబుగా వచించుచున్నాను. నా కెంతమాత్రము దీనితత్త్వము తెలియదు.

రా.—(బాటసారిం జూచి) ఓయీ! ఈయుత్తర మెవ్వ రిచ్చిరి?

బా.—(రత్నసింహుంజూచి) యూరకుండును.

రా.—నీకు భయములేదు. చెప్పుము.

బా.—రత్నసింహుం డిచ్చినాఁడు.

రా.—ఇది వ్రాసినవా రెవరు?

బా.—మాధవసింగుచే వ్రాయించినాఁడు.

రా.—(భటునిజూచి) ఓరీ! మాధవసింగును దోడ్తెమ్ము.

భ.—చిత్తము. (అని పోయి గొనివచ్చును)

మా.—(నమస్కరించి) దేవా! ఏమిసెలవు?

రా.—ఈ యుత్తరంబు నీవు వ్రాసినదికాదా?

మా.—అవును నేవ్రాసినదే.

రా.—ఇట్టి రాజద్రోహపుటుత్తర మేల వ్రాసినావు?

మా.—ఏమిచేయుందు అధికారిచెప్పినప్పుడు చేయుచున్న బాగుండునా?

రా.—ఎవ రాయధికారి?

మా.—రత్నసింహుఁడు.

రా.—రత్నసింహుఁడు నీచేత నిది వ్రాయించెనా?

మా.—అవును. ఈవృత్తాంతమును దమకుఁ దెలియకుండ రహస్యముగా నుంపవలసినదని నాకుఁ గొంతసొమ్ము నీఁబోఁగా నేనంగీకరింపలేదు. అతండే వ్రాయించినాఁడు.

మా.—(రత్నసింహుంజూచి) ఏమిచెప్పెదవు?

ర.—అయ్యో! ఈయుదంతము నాకేమియుఁ దెలియదు. (అనిపలికి మాధవసింహుంజూచి) ఓరీ! దురాత్మా! ఈ యుత్తరము నీచే వ్రాయించితినా?

మా.—అవును. వ్రాయించినావు.

ర.—(రాజుంజూచి) అయ్యా! ఇది యత్యద్భుతంబుగనున్నది. ఈబాటసారిని జూచినట్టియున నాకు జ్ఞప్తిలేదు. ఈయుత్తరంబుగూడ నే వ్రాయ లేదు. వ్రాయింపలేదు.

రా.— పోనిమ్ము. దామోదరుం డేదయిన యుత్తరంబు వ్రాసెనా?

ర.— లేదు లేదు.

మా.—(రాజుంజూచి) అయ్యా! ఇతం డసత్యమాడుచున్నాఁడు. ఆయుత్త రము నతఁడు దాఁచినాఁడు.

రా.—(రత్నసింహుం జూచి) ఏమి చెప్పెదవు? ఆయుత్తర మెక్కడ దాఁచి తివి?

ర.— అక్కటా? ఆయుత్తరంబే యెఱుఁగను! దాఁచినస్థల మెట్లుచెప్పుదును?

రా.— (మాధవసింహుంజూచి) ఆయుత్తరమెవరు దాఁచిరో యెఱుఁగుదువా?

మా.— ఎఱుఁగ కేమి? రత్నసింగే దాఁచినాఁడు.

ర.—(మాధవుం జూచి) ఓదురాత్మా! నే నాయుత్తరంబును దాఁచినానా?

మా.— దాఁచినావు కావా?

ర.— ఎక్కడ?

మా.— నీవు పండుకొను పాన్పుక్రిందనున్న తోలుసంచిలో.

ర.— (రాజుఁజూచి) అయ్యా! ఇదియంతయు మోసముగానున్నది. ఆతోలు సంచి నే నెఱుఁగను. దుర్మార్గు లెవ్వరైనం గిట్టక నాగృహంబునం బెట్టినారేమో! నాకుఁ దెలియదు.

రా.—(భటులంజూచి) రత్నసింహుని వానిమందిరంబునకుఁ దీసికొనిపోయి యతనిపాన్పుక్రిందనున్న చర్మభస్త్రికను గొనిరండు.

భ.— చిత్తమట్లే చేయువారము. (అని పలికి రత్నసింహునితోఁగూడ వాని మందిరంబునకుఁబోయి పాన్పుక్రిందనున్న యాసంచిని గొనివచ్చి, రాజున కిత్తురు) అంత రత్నసింహుం డాశ్చర్యమగ్నుండై మ్రానుపడి యుండును.

రా.—(దానివిచ్చి) ఉత్తరంబు నొకదానిఁదీసి చదువుకొని (తెరలుతెరలు

గావచ్చు కోపము నాఁపికొని రత్నసింహునిం జూచి) ఓరీ ! దురాత్మా ! రత్నసింహా! రాజ్యంబు జయించి నీవును దామోదరుండును పంచుకొనువారలా ? మీవంటికృతఘ్నులను మఱియెవ్వరిఁ గానను. ఇంతకాలంబు నాద్రవ్యంబుఁ దిని తుదకు నాకుత్తుకనే గోయఁ దలంచితివా ? నీవిట్టివాఁడవని నే మొదటనే యనుకొన్నవాఁడను. ఇందుగుఱించి యేమి చెప్పెదవు ?

ర.—(చేతులు జోడించి) దేవా ! దైవసాక్షిగాఁ జెప్పుచున్నాను. నా కీయంశంత మేమియుఁ దెలియదు. మాధవసింగు నామందిరంబునకుఁ బలుమారు వచ్చుచుండుట గలదు. ఈమాధవసింగు దామోదరసింగు లైక్యమొంది యీకార్యము చేసినారేమో ? నాకేమియుఁ దెలియదు. న్యాయంబును బాగుగఁ బరిశీలింపుఁడు. ఎప్పుడును దమయాజ్ఞకు బద్ధుండనే !

రా.—ఎందుల కీనక్కవినయంబులు ! నీగృహమందుఁ బ్రవర్తిల్లిన కార్యంబు నీకుఁ దెలియదా ? మాధవసింగును బాటసారియుం జెప్పుచున్నారు. అవి యన్నియుం నసత్యములనుకొందము. వారు త్తరంబుల దెచ్చి నీగృహంబున నుంచిన నుంచవచ్చు. కాని నీచేతఁ జేవ్రాలు చేయింపలేరుకదా? కావున నిదియంతయుం సత్యంబు. నీచేవ్రాలే యిదియంతయుం సత్యంబని స్థాపించుచున్నది. ఓరీ దుర్మార్గా ! ఎంతపని చేసితివి! ఇంతటి దుష్టుండవని యెఱుంగనే! అధికారంబిచ్చినంతమాత్రమునఁ గన్నులు తలకెక్కినవి. అందువలన యుక్తాయుక్తంబు లెఱుంగక రాజద్రోహంబు చేసి రాజ్యాభిలాషివైతివా ? నన్ను జయించి నారాజ్యంబు దీసికొన నీవంటివా రెందఱు కావలెను ? సూరధానులు దుర్బలుండని తలంచుచుంటివా ? మఱియుం నీవు రాజద్రోహివి. నీవు సద్యోవధార్హుండవు. నీప్రాణంబులు పుచ్చుకొనవలసినదేకాని, నాకు ముఖ్యస్నేహితుండును వృద్ధుండు నగు మీతండ్రి మొగంబుఁజూచి యట్టులొనర్ప నిష్టపడకున్నాను. ఇట్టివాఁడవు పురంబున నుండరాదు. శీఘ్రంబుగ లేచి

పొమ్ము. నిన్ను క్షమించితిని. (అని భటులం జూచి) ఓయీ! వీనిసంక
దలన్నియుఁ బుచ్చికొని ముండనంబు గావించి యూరేగించి కట్టుబట్ట
లతోఁ బురంబునుండి వెడలఁగొట్టుఁడు (అని యానతిచ్చె.)

భ.—చిత్తము. అట్లేచేసెదము (అని వానిఁ గొనిపోదురు).

అంత సూరధానులు బాటసారింజూచి వాఁడు వర్తకుని వంచించియుండు ననితలఁచి నలిగి పాడయియున్న పట్టుబట్ట నిప్పించె. పిమ్మట రాజు బాట సారిం జూచి. ఓరీ! నీవు బలుదుర్మార్గుఁడవు. నీవు యావజ్జీవంబును కారా గృహంబున నుండఁదగినవాఁడవు. అయినను మొదటజేసిన వాగ్దానము చెల్లించు నిమిత్తము నిన్ను విడుచుచున్నాను. అనివాని వదలివేసెను. అంత వర్తకుండును పట్టుబట్టదీసికొని తనకు లాభంబులేకపోవుటయేగాక మొదటి వెలయయిన వచ్చునో రాదోయని విచారించుచుఁ దనయింటికేఁబోయె. పిమ్మట సూరధానులు మాధవసింగును క్షమించి రాజ్యమును దానే స్వయంబుగఁ జూచికొన నారంభించెను.

---

# పదుమూఁడవ ప్రకరణము

అఖిలప్రపంచంబునంగల జీవరాశులస్నిఁటియందు సర్వసమత్వంబును సమానకృపారసంబును గలవాఁడని యెన్నఁబడుచున్న భగవంతునికి నయిశమం పక్షపాతంబును గఠినత్వంబుం గలుగుచుండఁ దక్కుఁగల తుచ్ఛమానవుల సంగతిఁజెప్పనేల!లోచనగోచరంబులగు జీవజంతువులన్నిఁటిని దానె పుట్టించు చుండుటంబట్టి యిజ్జీవులందఱు నాతనికిఁ బిడ్డలవంటివారే కదా! ధారుణిలో మొఱకగు - మానిసిసహితము తన సంతతిలో నొక్కనినొక్కరీతిగ మఱొ క్కని మఱొక్కరీతిగఁ జూడ నోడుననిచెప్ప నొప్పునప్డు అసాధారణ ప్రజ్ఞుఁడును, సర్వజ్ఞుండును, సమస్తసద్గుణభాస్వరుండును నగునీశ్వరుండు తన సంతతియగు నీజీవితతిలో నొక్కొక్కని నొక్కొక్కవిధమునఁ జూచుట యన్యాయంబని చెప్పుటకు సందియమున్నదా? కొందఱు ధనదునైన ధిక్కరించు ధనవంతులు, మఱికొందఱు కడుపునిండ నొకనాడైనఁ గూడెఱుంగని నిరు

పేదలు. కొందఱొరులయుసురులనైనఁ దీయింపఁగల యధికారముగలవారు. ఒక కొందఱు స్వకాయకష్టార్జితంబగు విత్తంబు నుపయోగించుచుఁ దనయింట గుడిచి కూర్చుండనైన స్వాతంత్ర్యములేనివారుల చూడుఁడు! సృష్టి యెంత విషమముగా నున్నదో! దీనినంతయుఁ జక్కఁగఁ బరిశీలింప భగవంతుని పక్షపాతంబు వెల్లడికాక మానునా? పోనిమ్ము, ధనవంతులగు మానవులైన బుద్ధిగలిగి నిరుపేదలను దమసోదరులుగ నెంచి దయయుంచి పోషింపక కఠినహృదయులై, యదయులై, కఱకుటమ్ములఁ బోలు వచనమ్ములచే గంటొనర్చుచు ధనజనితమదాంధులై క్రిందుమీఁదుచూడక వరలుచుందురు. అధికారియగు వాఁడును, నధికారపదమెక్కఁగనే గరువము తలకెక్కుటచే నొరుల తృణంబుల వలెం జూచుచు "నేను నొకభృత్యుఁడనే" నా పైయధికారి నన్నుఁ దూల పలికినప్పుడు నాడెందం బెంతకుందునో, నేను నాక్రిందివారల వదురునప్పుడు వారు నట్టేవగతురుగదా? యనియోజింపక తానే ప్రభూత్తముండని విఱ్ఱవీగుచు మావంటి చిన్నయుద్యోగుల నతతమ్ము పలుపాట్లు పొందించుచుండ వార లధికారులఁట! మేము భృత్యులమఁట. మేము మాకరణీయంబుల నెఱవేర్చుకొనుచున్నను, వారి యింటిపనులన్నింటిం గూడ నొనర్చి రాత్రిందివంబులు వారి వెంట కుక్కలవలె దిరుగవలెనఁట. ఔరా! ఏమీ! యీదురన్యాయము? మొన్న వచ్చినాఁడో లేదోకాని యీపాడుముండకొడుకు రాజానుగ్రహంబు వడసి చిరకాలమునుండి సంస్థానమును గనిపెట్టికొనియున్న మమ్ము నతిక్రమించి సర్వాధికారము తనదేయని పలుకుచున్నాఁడే? అక్కటా! ఈదుర్మార్గుఁడు మాదృశుల ప్రాణవాయువుల హరింపఁ ద్రాచుపామువలె దాపరించెనే! మాటిమాటికి నొడయనితోఁ జెప్పి యుద్యోగము లూడఁ బెఱుకుదునని భయపఱచుచు మాచే నన్ని కార్యములఁ జేయించుకొనుచున్నాఁడు. మే మిట్లొనరించుచున్నందులకు మాకింతయన్నము కడుపునిండ నొసంగిన మెసంగి యాపయి నెన్నికష్టంబులనైన నవలీల నెఱవేర్పమా? అందులకింతయయిన నెదనెంచఁడు. ప్రతిదిన మొక్కయుత్తరమువ్రాసి మాకిచ్చి ప్రతిగ్రామంబునకు మమ్ము దగులుచుండు. ఈమధ్యను తో ధాకుఁబోయి దీర్ఘప్రయాణముజేసి వచ్చితిని. కాళ్లు లాగుచున్నవి.

మఱియొక్కని నాకు మాఱుగ నంపుమని యెంతప్రార్థించినను నిర్దయుండై వినఁడు. నేనే భృత్యులందఱిలోను విశ్వాసపాత్రుఁడనఁట! ఈరహస్యంపుటుత్తరంబును నేనే కొనిపోవలయునఁట! హారావళీపర్వతంబులలో నున్నభిల్లవాటి యెక్కడ? మాళవదేశమెక్కడ? ఇంతదవ్వుపయనంబు రెండుదినంబులఁ జేయనగునే? గమనాగమనంబుల కథమము నాలుగుదినంబులైనఁ బట్టదా? ఆఁకటినహృదయుండు రెండుదినంబులకే బత్తెమొసంగెనుకదా! తక్కిన రెండు దినములెట్లు పొట్ట నింపుకొందును? నాకిచ్చెడి నాలుగురూకలలో నీత్రోవబత్తెములకుఁగూడ నుపయోగించుకొనవలసినచో నింటనున్న యాలుఁబిడ్డ లోగిరము లేక మలమల మాడవలసినవారే కదా? నక్తందివంబులు పలుపాట్లు బడుచున్నను దిన్నంతయన్నంబు లభింపనిచో నిఁక నెట్లు బ్రతుకుదును? భార్యాపుత్త్రాదుల నెట్లు మనుపుదును? ఈబత్తెమునే దినద్వయంబునకు సరిపుచ్చుకొనెదనని యివ్విధంబునఁ దనలోఁదాను గొణుగుకొనుచు, సుమారేఁబదివత్సరంబులు ప్రాయముగల యొకమానిసి ప్రయాణము చేయుచుండెను. జగమ్మంధకారబంధురంబుకాక మున్నె యేదేనొకగ్రామంబు చేరఁదలఁచి కడువడిపోవుచుండుటచేత ముందుతట్టు నిగిడింపఁబడినదృష్టి వెనుకతట్టున కొకసారియైనఁ బఱపనే లేదు. ఆతనికథయంతయుం వీనులవిందుగ నతికుతుకంబున వినుచు దవుదవ్వులనుండి వెన్నంటివచ్చుచున్న యొకపురుషుం డాతని సంబోధించి యాతనితో నిట్లు సంభాషించె.

బా.—నీవెందులకయి విచారించుచున్నావు? నీచరిత్ర విన్నంతమాత్రముననే నాహృదయంబు నీరగుచున్నది. నీ వెవఁడవు? ఎచ్చటికిఁ బోవుచున్నావు.

ము.—(అదివిని నిశ్చేష్టితుండయి తనలో) అక్కటా! నావృత్తాంతము వీరికిఁ దెలిసెనేమో? ఎవ్వరులేరుగదా యని వెనుకముందులు చూడక గట్టిగా మాటలాడఁ జొచ్చితిని. మహారాజుగారి యుద్యోగస్థుని మిగుల నిందించితిని. వీఁ డీయుదంత మేమైన నాకుటిలాత్మునకుఁ దెలియఁజేసినచో మండిపడి నన్ను శిక్షించినశిక్షించు లేనిచో నుద్యోగమునైన నూడఁ

వేఁడుకొను. కనుక మునుముందుగ నీతనియుదంతము దెలిసికొని నావాక్యంబు లీతనికిఁ బూర్తిగాఁ దెలిసినచో నెరితోఁ జెప్పవద్దని ప్రతిమాలుకొనవలెను. తెలియనిచో నపాయము లేనేలేదు. అని నిశ్చయించికొని (ప్రకాశముగా) అయ్యా! నాయడిగిన ప్రశ్నల కుత్తరంబులిచ్చితివేని పిమ్మట నాయుదంతంబుఁ జెప్పెద.

బా.—అడుగుము. నాకుఁ దెలిసినచో బదులు చెప్పెద.

ము.—నీ వెవఁడవు?

బా.—నే రాజపుత్త్రుఁడను.

ము.—(తనలో) ఆకటా! రాజపుత్త్రుండనని పలుకుచున్నాఁడు. నే నెవ్వరినింత వఱకు నిందించితినో వాఁడును రాజపుత్త్రుఁడే. ఒకవేళ నామాటలీతనికి వినఁబడియుండునేమో! తెలిసికొనెద (ప్రకాశముగా) నీ వెంత దూరమునుండి నన్ను వెంబడించి వచ్చుచున్నావు?

బా.—ఇప్పుడే నిన్నుఁ గలిసికొంటిని. "నక్తందివములు కష్టపడినను దిన్నంత తిండి లభింపనిచో నెట్లు బ్రదుకుదు" నని పల్కినప్పుడు నిన్ను సమీపించితిని.

ము.—(ఆలోచించి తనలో) ఆ! ఇది కడపటఁ బల్కినవాక్యము. అప్పటి నుండి నాదురవస్థను గుఱించియె విచారించితిగాన యేయుద్యోగస్థుని దిట్టలేదు. కావున నీతనివలన నపాయముండదు. (ప్రకాశముగా) నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?

బా.—నే గద్వారుదుర్గమునుండి.

ము.—ఎక్కడికిఁ బోవుచున్నావు?

బా.—మా నివాసస్థలంబగు జయపురమునకుఁ బోవుచున్నాను.

ము.—(తనలో) ఈ ప్రాంతమువాఁడు కాఁడు గావున నే భయపడ నవసరము లేదు. (ప్రకాశముగా) గద్వారున కేల పోయితివి?

బా.—అచ్చట నామేనమామ యున్నాఁడు. అతనిఁ బట్టి యేదో యుద్యోగము సంపాదించికొనవలెనని.

మ.—సరియె. నా కీయరణ్యప్రాంతమునఁ దోడైనందులకు మిగుల సంతసించుచున్నాను.

బా.—నేను నట్లే సంతసించుచున్నాను. మీ నివాసస్థలమెక్కడ?

మ.—మా నివాసస్థలము మాళవదేశము.

బా.—మీ రేకులజులు?

మ.—మహమ్మదీయులము.

బా.—అక్కడ నీ వేయుద్యోగమునం దున్నావు?

మ.—ఏమియుద్యోగము? కాటి యుద్యోగము. ఆదేశాధిపతి సేవకుండను.

బా.—నీవు చేసెడిపనియేమి?

మ.—ఉత్తరములఁ బట్టుకొని దేశదేశంబులం దిరుగుట.

బా.—ఇప్పు డెచ్చటికిఁ బోవుచున్నావు?

మ.—భిల్లవాటికకు.

బా.—ఏపనిమీఁద?

మ.—మారాజు కూఁతురునకుఁ బెండ్లిజరుగును. రాజునకు మిత్రుండగు భిల్లనాథునిఁ బిలుచుటకు.

బా.—ఉత్తరమేమియుఁ గొనిపోలేదా?

మ.—లేదు.

బా.—మీరాజుగారియొద్ద దామోదరసింగున్నాఁడని విన్నాను. క్షేమముగా నున్నాఁడా?

మ.—దామోదరసింగును నీ వేమెఱుఁగుదువు?

బా.—ఎఱుఁగకేమి? అతఁడు మాచుట్టమే?

మ.—అట్లయిన, వీరిని వారిని ననుసరింపనేల? పోయి యాతని నాశ్రయింపరాదా?

బా.—ఆశ్రయించిన నేమగు?

మ.—గొప్పయుద్యోగమిప్పింపఁగలఁడు.

బా.—అట్టి సామర్థ్యమాతనికిఁ గలదా?

ము.—లేకేమి? మాప్రభు వాతని యిష్టానుసారముగాఁ బ్రవర్తించు.

బా.—ఆహా! ఏమీ! నా పుణ్యము? నాయదృష్టవశమువననే నిన్నుఁ జూడఁ గాంచితి. నేఁడు సుదినము. మాదామోదరు వృత్తాంతము తెలిసినందున మఱింత సంతసము గలుగుచున్నది.

ము.—మాదేశ మెప్పుడు వచ్చెదరు?

బా.—కొద్దిదినములలోనె వచ్చెదను.

అని యిట్లు వీరు ప్రసంగించుకొనుచు నడచుచుఁబోయి యొకగ్రామమును జేరిరి. అప్పటికి సూర్యుం డస్తమయంబునొందె. అందుచే నాగ్రామంబున నుంటయే యుచితంబని భావించి రాజపుత్త్రుండు మహమ్మదీయున కిట్లనియె. "ఓయీ! నీ విప్పుడు భిల్లవాటికకు బోలేవు. ఈప్రాంతంబు లడవులచేఁ గడలు కొనుచుండుటంబట్టి శార్దూలాదిఘాతుకమృగభూయిష్ఠంబగుట నిక్కంబు. ఇయ్యెడనుగూడఁ దిమిరావృతంబై యెట్టివారికైన భీతిఁ గొలుపుచున్నది. ఇట్టితరి నొంటిగ నేగుట శ్రేయస్కరంబుగాదు. ఈరాత్రి నీగ్రామంబునఁ గడపి తెలువాత లేచి యరుగుము. నేను నట్ల యొనరింతు. పిమ్మట నీయిష్టం" బనియూరకున్న నావృద్ధుఁ డాతనివచనంబులు తనకు హితకరంబుగాఁ దోఁచుటచే నట్లే యిచ్చటఁబుచ్చుటయుత్తమంబని తలపోసి యందుల కంగీకరించెను. అంత వారిరువురు గ్రామముఁ బ్రవేశించిరి. ఆగ్రామము మలినపదార్థములకు నిలయభూతమైయుండి రోఁత పుట్టించుచుండెను. మనబాటసారు లాగ్రామమునకుఁ బోయినకాలము వేసవికాలము కావున వారదృష్టవంతులని చెప్పవలసియున్నది. లేక వర్షకాలమందే యాగ్రామము చేరినచో నయ్యూరనివసించుటకంటె నరకకూపమున నివసించుట యుచితమని తలంచియుందురు. అట్లుగానిచోఁ దిమిరావృతంబై, ఘాతుక మృగసంకులంబగుటచే ప్రాణాపాయకరంబై, భయంకరంబైయున్న యడవిలోనైన నిద్రింపఁదలంచినఁ దలంతురుగాని యాయూరచుండ నిష్టపడకయుందురు. ఆగ్రామంబున నొకటిరెండు మాత్రమే పెంకుటిండ్లు గలవు. కాని తక్కినవన్నియుఁ బూరిండ్లే? ఒక యింటికైనఁ గూర్చుండఁదగినంతయరుగులేదు. ఆయిండ్లయిన వేఱువేఱుగా

నుండక క్రిక్కిరిసియుండె. రెండుగజములయెత్తుగల ముండ్లకంచె యొకటి ప్రతియింటిచుట్టు నావరించియుండె. అయ్యది యరణ్యప్రాంత మగుటచే ఘాతుకమృగంబులకు భయంబుచెంది యాగ్రామస్థులు తమతమపసులమందలం దమతమయిండ్లయెదుటనే గట్టుచుందురు. అందుచే విస్తారమైన దుర్వాసన కుం దావైయుండె. ఆగ్రామమందున్న యొకయింటివారికైన పరిశుభ్రవాయువు లభింపదు. ఒకవేళ పరిశుభ్రవాయువు పైనుండివచ్చినను నాగ్రామసంపర్క ముచేం జెడుననుటకు సందియంబులేదు. మఱియుం వీధులొకప్పుడు దుడువంబడ మిచే మలినవస్తువులతో నిండి కాలిడుటకైన యర్హత లేకుండెను. మనబాట సారు లిరువురు నగరంబులందుం ద్రిష్టువారలగుటంబట్టి యాగ్రామంబు చూడగనె యారాత్రియం దెట్టు నివసింపంగలుగుదుమని తలంచుచు దుర్వా యువు లోనికిం బోకుండ నిశ్వాసవాయువును నిరోధించి కొంతదూరమునడచి యాగ్రామమునకు జీవనాధారంబైన యొకతటాకంబుం బొడంగాంచిరి. ఆ యూరివా రాతటాకజలంబును స్నానపానాదుల కుపయోగించుచుందురు. ఆతటాకంబునకు రక్షకభటులు లేకపోవుటచే నందఱు విచ్చలవిడిగ నందుం జొచ్చి యీందులాడుచు వస్త్రక్షాలనంబుల నొనర్చుచుందురు. ఇంతియకాక యాయూరిపసులమందలుగూడ నందుదిగివిహరించుటంబట్టి యుదకము మిగుల చెడియున్నది. ఆయుదకంబును యాయూరివా రమృతప్రాయంబుగం దలంచి కొనిపోయి పానాదుల కుపయోగించుచుందురు. మనబాటసారు లాయుదకం బునకు రోంతం జెంది మఱికొంతదూరము నడచునప్పటికి రచ్చచావడి యొకటి గానంబడియె. అయ్యది గ్రామములోని ప్రతిమందిరంబుకంటెను మిగుల శుభ్రముగానున్నది. దానిని గన్నులవిందుగాం జూచి యందు విడిచిరి. అంత రాజపుత్త్రుండు తురకను గాంచి "యాంకలి మిగుల బాధించుచున్నది. ఈ రాత్రి యెట్లయిన వంటజేసికొని భుజింపనిచో రేపు పయనంబుచేయుట కష్టము నీవేమి యాలోచించితివి" నావుడు పరమలోభియగువాం డాతని వచనంబులు తనకు హితకరంబుగాం దోంచుటచే నారేయి నచ్చటం బుచ్చ నిశ్చ యించి యప్పటిభోజనంబునకు నతనియుండి యేమైన లాగవలెనని తలంచి తన

చీదఱికము దెలుప నతండు కరుణారసార్ద్రచిత్తుండై వాని కిట్లనియె. "ఓయీ! అందులకు నీవెంతమాత్రము వగవకుము. నాయొద్దఁ బదిరూకలున్నవి. ఈపూటకు నీకు భోజనంబునకుఁ దగినసొమ్ము నేనే యిచ్చెదగాని యీయూరఁ బూటకూళ్లయిల్లు లేదుగాన నీరెండురూపాయీలు గొనిపోయి మనయిరువురకుం దగినవస్తుజాతమ్ము గొనిరమ్మనిపంప నాముదుసలివాఁ డత్యంతసంతోషాక్రాంతస్వాంతుండై యతనియుదారత్వము నగ్గించుచుఁబోయెను. ఆయూర గొనుటకు వస్తుజాతము నమ్మునది యొక్కదుకాణముమాత్రమే యుండినందున నావర్తకుఁడు రూప్యమునకు మూఁడురూప్యములు లాభముచూచికొని యమ్ముచు మోసంబున జనులకుత్తుకలు తరించుచున్నను, నదితెలియక యాయూరివారందఱు వానివచనంబు వేదవచనంబుగా నమ్మి యతఁ డెంతచెప్పిన నంతసొమ్ముచు జెల్లించి పోవుచుండుటచే నితఁ డాయూరు చేరునప్పుడు మిగుల దరిద్రుఁడైనను కొద్దిదినంబులలోనె కుబేరతుల్యుండాయెను అందుచే నతఁడు పలురకములగు వస్తువులఁ దెప్పించి వాణిజ్య మభివృద్ధిచేసియుండుటచే నాతనియొద్ద వస్తువులఁ గొనకపోయినను జూచియైన సంతోషింపవచ్చునని యాయూరిజనులలోఁ జెక్కుం డ్రక్కుడనే కాలముగడుపుచు నుండుటచేతను, కొనవచ్చినజనంబులు గూడఁ జుట్టుముట్టియుండుటచేతను, మనబాటసారి యెంతోసేపటికిగాని వస్తువులుసంపాదించి ధర్మశాలకు రాలేకపోయెను. పిమ్మట నీయిరువురు బాటసారులును పచనముగావించుకొని భుజించి యిష్టకథాలాపంబులఁ గొంతకాలంబు పుచ్చునప్పుడు రాజపుత్త్రున కామహమ్మదీయుం డిట్లనియె.

"అయ్యా! మీరు నాకుఁజేసిన యుపకారంబు వేయిజన్మంబులకైనను మఱవను. ఈరాత్రి నాకుఁ దగినంత సహాయము చేసినందులకు నేను మిగుల సంతసించుచున్నాను. కాని నాకోర్కె యింకొకటి యున్నది. నెఱవేర్చవలెను. సారాయిత్రాగి చాలకాలమైనది. నాయొద్ద సొమ్ములేదు. ఏమైన నిచ్చినచోఁ జాలసంతసింతును." అని వేడుచుండ రాజపుత్త్రుం డాముదుసలియందు దయఁదలఁచి యెనిమిదణాలిచ్చెను. అంత వాఁడు పరుగుపరుగునఁ బోయి సారాయికొట్టుచేరి యాద్రవ్యము ' వానిచేతిలోఁబెట్టి సారాయి

తృప్తిగఁ ద్రావివచ్చి రచ్చసావడిలోఁ జేరెను. పిమ్మట వాఁడు కొంతసేపు వికారపుఁజేష్టను చేయుచు పైమఱచి నిద్రించెను. రాజపుత్త్రుండు వాఁడు మదోన్మత్తుండై యుండుటచూచి యామందసలిమూట నెవరైనహరింతు రేమోయని జాగ్రత్తపఱచి సుఖంబుగ నిద్రించి ప్రభాతంబునలేచి వాని మూటవానికిచ్చె. అంత వాఁ డామూట కైకొని వానిని నుతించుచు నొండొరులకీడ్కొలిపికొని తమమార్గంబుల ననుసరించి పోయిరి.

# పదునాలవ ప్రకరణము

గవ్వారుదుర్గంబున మనోహరంబగు నొకపూఁదోఁట కలదు. అయ్యది పూఁదోఁటయని పిలువఁబడుచున్నను కేవలము పూమొక్కలకే కాక సుందరంబులును ఛాయాప్రధానంబులగు వృక్షంబులకుఁగూడ నిక్కయై యుండెను. తమరాజు ప్రతిదినము విహరింపవచ్చుచుండుటచేఁ దోఁటమాలీలు మొక్కలకుఁజాలినంతజలము కట్టుటయందును, నెప్పుడుపడిన పండుటాకు లప్పుడే తుడిచి పాఱవైచి శుభ్రపఱచుటయందును మిగుల శ్రద్ధాళువులై యుండుటంబట్టి తోఁట మిగులనభివృద్ధిలోనికి వచ్చుటయేకాక యందెందుఁజూచినను గనువారికి గన్నులపండువుగా నుండెను. అందొక కోనేరుకలదు, అయ్యది యెల్లప్పుడు నిర్మలజలపూరితంబై యాపూవులతోఁటకు జీవనమిచ్చి పోషించుచుండును. దానితీరంబులు చక్కని నల్లఱాతిపలకలచేఁ గట్టఁబడిన సోపానపరంపరలుకలవై చూపఱులకానందము గొలుపునవియు, దిగువారికి సుఖముగలిగించునవియునై యున్నవి. ఇంతేకాదు. వర్షపాతంబుచేఁ దీరంబుననున్న మన్నుగరఁగి యందులోఁబడి తజ్జలంబు కలుషత్వమందకుండ గాపాడుటలోఁగూడ సమర్థములై యున్నవని చెప్పవలసియున్నది. ఆకాసారంబు దక్షిణతీరంబున సుందరమగు సౌధరాజం బొకటి యొప్పుచుండె. తక్కినతీరంబులం దట్టి సౌధంబులు లేవు కాని జాతీలతాదులచే నావృతములై తమ్ముచేరువారికిఁ జల్లఁదనంబును సౌరభ్యంబును నొసఁగుచున్న పూపందిరులు మాత్రము కలవు. ఆపందిరుల క్రింద పటికఱాపలకలచే నమర్పఁబడిన తిన్నెలుకలవు. ఆవేదికలందు గూర్చుండవచ్చు

వారికిం దమపరిభాగమందుఁ బ్రాకియున్న జాతీలతలు వికసితకుసుమంబులు గలవై కనులకు విందుగొలుపుచుండఁగా నాకాసారంబు మీఁదనుండి ప్రసరించుచుఁ దరంగ భంగంబులచే మీఁదికి నెగయుజలపరమాణువుల వహించి చల్లని మంద మారుత మాలింగనముచేసి తనమిత్రభావమును వెలువరించుచుండును విహారార్థ మరుదెంచినవారి కానందము గొలుపు స్థలంబు లందెన్నియో గలవు. రాజుగారు వచ్చినప్పుడు కాక తదితరకాలంబులం దాదుర్గంబునందలివారుకూడ వచ్చి యందు విహరించి తజ్జనితానందంబునంది పోవుచుందురు. ఈపూవులతోఁట పృథ్వీరాజు గద్వారుదుర్గము వశముకావించుకొనుటకుఁ బూర్వమునుండియుం నున్నప్పటికి నంతగా వృద్ధిఁజెందియుండలేదు. కాని పృథ్వీరాజందు ప్రవేశించి నది మొదలు దానివిప్రాణపదంబుగ నెంచుకొని మిక్కిలి వృద్ధిలోనికిఁ దెచ్చెను. అతండు ప్రతిదిన మారామంబును జూడక యుండలేఁడు. అందుచే నొక నాఁడు పృథ్వీరాజా పూవులతోఁటఁజొచ్చి మనోహరస్థలంబుల విహరించు చుండ సూర్యుం డపరాంబుధిఁజొచ్చె. సాంధ్యరాగం బాకసంబునఁ గ్రమ్మి మిగుల వింతగాఁ గానవచ్చుచుండె. విహంగసంతానంబులు తమకులాయంబు లనుఁ జేరుచుండె. తమంబులు వ్యాపించి జగమ్మంధకార బంధురముగాఁ జేయ దొడంగె. కాని యాయారామంబునందలి మార్గంబుల కిరుప్రక్కల నొప్పి యున్న స్తంభంబుల శిరోభాగంబులఁ జెలంగు దీపంబు లాతమంబును బూర్తి గాఁ జేరనీలేదు. సాయంతనవాయువులు మెల్ల మెల్లనఁ జనుదెంచి జంతువుల యలంతను దొలఁగించుచుండె. పుష్పంబుల మరందమును ద్రావిత్రావి మత్తిల్లిన మధుకరబృందంబు లందందు నిదురించుచు మలయమారుత ప్రసారంబునఁ దత్తత్కుసుమంబులు గదులుచుండుటఁబట్టి చప్పున మేల్కాంచి యంబరంబున కెగసి ధ్వనిచేయుచున్నవాని ఝంకారమ్ములు పక్షి కోలాహలధ్వనులచే మిళి తంబులయి వాతపోతంబుచేఁ గంపించుచున్న యాకుల చప్పుడులచే సంవర్ధితం బులయి నల్గడల వ్యాపించుచుండె. ఆసమయంబున రాజకుమారుం డందు దిరు గులాడుచు నెవ్వరితోను మాటలాడక మనంబున నెద్దియో యాలోచించు చుండె. ఇట్లతఁడు కార్యాలోచనసముద్రంబులో మునింగియున్న వాఁడగు టంబట్టి కాలాతీతంబయిన గుఱితింపలేకయో లేక కాలాతీతం బయినట్లు

తెలిసియుఁ గార్యనిశ్చయంబగునంతవరకు నటనుండి కదల కిష్టములేకయో కాని నిజమందిరంబునకుఁ బో నెంతమాత్రము ప్రయత్నింపలేదు. అతనితో వచ్చిన సేవకులు పలుమాఱు ప్రయాణయత్నంబులు చేసిరికాని ప్రభువునభిప్రాయంబు గనిపెట్టి విసుగుదలచే లోలోపల నేదియో గొణుగుకొనుచున్నను పైకేమియు ననలేక మిన్నకుండిరి. ఇట్లు కొంతతడవుచున్నపిమ్మటఁ బృథ్వీరాజు సౌధాభిముఖుండై పరిచారకులు వెంటనడచిరా వచ్చుచుండె. అతఁడట్లు వచ్చునపుడు తన్నెవరో బిలిచినట్లు వినవచ్చె. అందువలన నతఁడట్టె నిలిచి వెనుకకుఁ దిరిగిచూచి, వెనుకఁ బరిచారకులను దప్ప మఱియొకరింగానక మరల నా శబ్దంబు వినవలె ననుతలంపుతో జాగరూకుండై వినుచుండె. కాని మధుకరాదినినాదంబులుఁ దప్ప మఱేమియు వినరాలేదు. అంతరాజకుమారుండు మరల మందగమనంబునఁ బదిగజములదూరముచనునప్పటికి వెనుకటిచందంబునధ్వనియే తెంచె. అది వెనుకటికంటె కొంచెము స్ఫుటముగా వినవచ్చె. కాని పోల్పదగినంత స్పష్టముగా లేదు. అది రాజకుమారుం డాలకించి నిలిచి నీను లొగ్గియుండెను. కాని మరల నేదియుం రాలేదు. రాజానుచరులు తమ రాజునకుఁ బదిబారలదూరముగా నుండి మెల్లమెల్లఁగా సంభాషించుకొనుచు వచ్చుచున్నందున నావిన వచ్చుధ్వని వారు వినరైరి. అందుచేఁ దమరాజు నిలుచుండుటయుఁ దిరిగి నడుచుటయుఁగాంచి వెనుకటివలెఁ దనలోఁ దా నేదియు యోచించుకొనుచున్నాఁడని తలంచిరి. కాని యేదియో యొకని నాదమే తెంచి నిలిపెనని తలంపలేక పోయిరి. అంత రాజకుమారుండు తనలో "ఆ! నన్ను బిలిచెడివా రెవ్వరు. నామిత్రుం డూరనుండినచో నన్ను బిలిచియున్నాఁడని భావింపఁదగు. ఆతండు గ్రామంబున లేనప్పు డతఁడని యెట్లు భావింతును. ఆతండు గానిచో నన్నింత చనవుగాఁ బిలుచువారెవ్వరైయుందురు?" అని మఱి నాలుగడుగు లిడునప్పుటికి "కుమారా! నిలువుము నిలువుము" అన్న ధ్వని వీతెంచె. అదివిని తన మిత్రుండు పిలుచుట నిక్కంబెయని తలంచుచుండ నొక పురుషుం డెదురుగ వచ్చి యాతనికనులకు విందొనర్చె. ఆతఁడు పొడుగైనశరీరముకలవాఁడు. అతనిబాహువులు జానువుల పర్యంతము వ్రేలాడుచుండెను. అతని జటాఝ

జాపము పశ్చాద్భాగంబును గప్పియుండెను. తక్కినభాగము చిఱుతపులి చర్మంబుచే నావృతంబైయుండెను. అందుచే నాఁడీకటిలో నాతనిఁ జూడ గాంచినవారు భూతమనియో, పిశాచమనియో భావింపకమానరు. భావించి భయపడకమానరు. అట్లు వికృతాకారంబులోనున్నను రాజపుత్రుం డతనిని గుఱితించి తనమిత్రుండైన సదాశివయోగిగా భావించి చేతులు జోడించి:—

రా.—స్వామీ ! వందనంబులు.

స.—కుమారా ! దీర్ఘాయుర్దాయము కలవాఁడవై వర్ధిల్లుము.

రా.—స్వామీ ! దేశాంతరమునుండి యెప్పుడు వచ్చినారు ?

స.—దేశాంతరమునుండి యిదె వచ్చుచున్నాను. తొందరపనులు కొన్ని యున్నవి. వానినిగూర్చి నీతో మాట్లాడఁదలచి నీసౌధమునకుఁ బోయి యిచ్చటనున్నావని యాలించి నీయొద్దకే తెంచితిని. మామతంబునకై సమ బోలేదు.

రా.—ఆకార్యంబులేమి ?

స.—పెక్కులున్నవి. వానిని మనము రహస్యముగా మాటాడవలెను.

రా.—సరియె. అట్లె చేయవచ్చును. ఈసౌధమునకు బోదమురండు.

అనిపలికి సేవకుల నచ్చటనే యుండ నియమించి వారిరువురు లోని కేఁగి యొక్కచో నుపవేశించిన తర్వాత యోగిసత్తముం డిట్లనియె.

స.—కుమారా ! ఇచ్చట నెవ్వరును లేరుగదా ?

రా.—లేరు ! చెప్పవలసినది చెప్పుఁడు.

స.—దామోదరుఁడు చేయుంకృత్యంబులు నిరాఘాటంబుగా నెఱవేరుచున్నవి.

రా.—ఏమి నెఱవేరినవి ?

స.—ఏమిచెప్పుదు ? ఒక యుత్తరంబు కల్పించి రత్నసింహునిఁ దోధానుండి వెడలఁగొట్టించె.

రా.—ఔరా ? రత్నసింహుని వెడలఁగొట్టించినాఁడా ?

స.—అంతటితో సరిపోలేదు. ప్రాణంబులుగూడ నూడఁదీయ సిద్ధముగా నున్నాఁడు.

రా.—మనమాతని రక్షింపవీలగునేని అట్లు చేయఁగూడదా ?

స.—చేయఁగూడ కేమి? కాని యది మిగుల సాహసకార్యము.

రా.—అదియేదియో సెలవిండు.

స.—నేఁ జెప్పనక్కఱలేదు. ఈయుత్తరంబుఁజూచిన నీకుఁ దెలియును.

రా.—(తీసికొని చదివి) కోపంబున కన్నులెఱ్ఱఁబాఱ యోగింజూచి; ఆ ఏమీ! ఇందులకు భయపడనేల? నాచేతిఖడ్గమే యాతని విడిపింపఁ గలదు.

స.—అట్లనకుము. తొందరపడిన లాభము లేదు. మనము యుద్ధంబునకేఁగినచో మూర్ఖులగువారా రత్నసింహుం జంపినచో నేమి చేయఁగలము.

రా.—(ఆలోచించును) అవును పోనిండు. సామంబున నెఱవేర్చుకొనఁ గూడదా?

స.—సామోపాయంబుననె సాధింపవలె దైవానుగ్రహంబున నతండు జీవించుఁ గాక. ఇంతియ కాక మనమనుకొనిన రాకన్నియకుఁగూడ నొకయాపద రాఁదలచియున్నది. దానిని దప్పింపవలయును. అందువలన మనము కొన్ని దినంబులు గూఢవేషంబులతో దేశసంచారము చేయవలయును. వేగముగాఁ బయనముకమ్ము.

రా.—ఆలస్యమేల? ఈరాత్రియే బయలు వెడలుదము. మీ యనుగ్రహంబు వలన నాయిరువురను రక్షింపఁగలిగితి నేని కృతార్థుండనగుదును. నా పరాక్రమము సాహసము సఫలంబులగును.

స.—నాయనుగ్రహముతోఁ బ్రయోజనమేమి? కార్యములు నెఱవేర్ప దైవానుగ్రహంబును గోరవలెను.

రా.—మీ యిరువురి యనుగ్రహంబుకూడ నాకు కాంక్షణీయమే!

స.—నీవు తప్పక యికార్యంబు సాధింపగలవనియె నానమ్మకము.

రా.—(ఆనందము పట్టఁజాలక) యోగివర్యా! ఇదిగో ప్రతినఁజేయుచున్నాను విను. నే నాయిరువురను రక్షింపనిచో రాజకుమారుండను గాను బాప్పారావలు సంతతిలోనివాఁడను గాను. నమ్ముఁడు.

స.—నే మిగుల సంతసించితిని. నీప్రతిన దైవము నెఱవేర్చుఁగాక యని పలికి.

రాత్రి భోజనం బైనపిమ్మటం బయనమై తనమఠంబునకు రమ్మని చెప్పి, పోయెను.

అంత ప్ృథ్వీరా జందుల కంగీకరించి యోగిని పీడ్కొలిపి తనకై వేచి యున్న భటులతో గుఱ్ఱపుబండిలోం గూర్చుండి తన నివాసంబున కరిగెను.

---

# పదునైదవ ప్రకరణము

భగవంతుఁడు సృజించిన ప్రపంచమునందు మహనీయంబులగు పదార్థములలోం బర్వతంబులు కొన్నియని చెప్పవలసియున్నది. లోకంబున కుపకరించుటలో వానినిఁబోలినవి మఱికొన్ని లేవని చెప్పవచ్చు. అవి తమయందు బొడమిన నదులచే లోకమును ఫలవంతముగాం జేయుచున్నవి. పలువిధంబులగువన్యవస్తువుల నొసంగుచున్నవి. పెక్కులగు ప్రాణులకు జీవనాధారంబులై యున్నవి. హిందూదేశంబునంగల పర్వతంబులలో హిమాలయపర్వతంబులు విస్తీర్ణత్వమందును, నెత్తునందును మిగులజిన్నవై సమస్తలోకమున కుపకరించుటలోం దక్కినవానితో సరికాకపోవు. పర్వతంబులకు దూర్పుననున్న భూమి మిగులఫలవంతమై, చక్కఁగబండినసస్యంబులతోను, గోటలతోను, నిండి యుండును. అట్టిఫలవంతమైన ప్రదేశంబునకుం బర్వతంబులకు నడుమనొక యరణ్యంబుగలదు అందొక చిన్నగ్రామంబు కలదు. అందు వసించినవారందరు భిల్లులగుటంగాబోలు నదిభిల్లవాటిక యను పేరంబరఁగె. ఆభిల్లులు సర్వదా యరణ్యంబుల సంచరించుచు సంపాదించిన వన్యపదార్థబులచే జీవనంబు గడపుచుందురు. వీరు మూర్ఖులలో నగ్రేసరులని చెప్పవలసియున్నది. వారు సాధారణముగం బశువులకంటె బుద్ధిహీనులై యుందురు. వారల యాకారంబులు మిగులవికృతంబుగానుండును. వారిశిరోజంబులు మోటుగాను కుఱుచగాను నుండును. వారిచేతులుంపొట్టివి. లోచనంబులు మిగులం జిన్నవి. కాని పొట్టలుమాత్రము మిగుల పెద్దవియై తేనెతెట్టులవలె వ్రేలాడుచుండును. వారలాయరణ్యములో నొకవిధమగు నారతో నేసిన వస్త్రంబులం దాల్చుచుందురు. వారల ప్రవర్తనమరసిన వీరలెవరికైన లొంగుదురాయన్న సందియమ్ము

వాడమునుగాని వారందఱునుదమలో నధికుఁడగు నొకనికిలోఁబడి యాతని యాజ్ఞ శిరసావహించి మెలంగుచుందురు. ఆభిల్లనాథుండు రూపమందును, గుణంబు లందును, ప్రవర్తనమందును దక్కినవారికంటె నుత్కృష్టుఁడు కాని బలంబు చేతను నధికుండని చెప్పవచ్చు. మఱియుం వీఁడు చదువను వ్రాయను నేర్చినవాఁడు వాఁడొక్క పర్యాయము వారల నందఱిని నొక్కచోఁ జేర్చి చిత్రతరంబు లగు కథలను చెప్పి యానందపఱచుచుండును. అందుచే వాఱందరు వాని దైవముగా భావించుచుండిరి. వానియాజ్ఞ యతిక్రమించుట యొక తప్పుగా భావించి సర్వవిధముల వాని ననుసరించి వర్తించుచుందురు. మఱియుంవారు వేట కుఁ బోవునప్పుడు తాము జంపినజంతువులమాంసంబులలోఁ గొంత ముందుగా దమనాయకున కర్పించి మిగిలినదానిని దమగృహంబులకుఁ గొనిపోవుచుందురు. వాఁ డొకగుడి కట్టించి యొకదేవత నందుఁ బ్రతిష్ఠించెను. వాఁ డాదేవతయే మనకుఁ గష్టసుఖంబులు కలిగించుచుండుననియు, నామెకు బాగుగా నుత్సవము చేసినచో మనమందఱము సుఖులమైయుందుమనియు, వారికి నమ్మకము పుట్టఁ జెప్పుచుండును. అందువలనవారికి జ్వరాదులువచ్చినచో గ్రామదేవత దయతప్పిన దని తలఁచి యామెయనుగ్రహంబు సంపాదింప మ్రొక్కి ముడుపులు గట్టుచుం దురు. మఱియుఁ దమకువచ్చుచున్న కష్టములు తొలంగుటకై ప్రతిసంవత్స రంబు నొకగొప్పయుత్సవంబు చేయుచుందురు. ఆయుత్సవంబు వసంతకాలంబున జేయనియమింపఁబడినది. వసంతమందు కాననంబులఁ గల కొన్ని తరుబృందం బులు గ్రొంజిగురు లెత్తుచుండుటయు, మఱికొన్ని చక్కనిపువ్వుమంజరులతోఁ బ్రకాశించుచుండుటయు మఱికొన్ని ఫలించుచుండుటయు చికాదిపక్షి జాలంబు గూయుచుండుటయు స్వభావంబు. ఆభిల్లనాథుండు వెడగు భిల్లుల కాయరణ్యప్రాంతంబులు జూపి గ్రామదేవతమహిమ చూచినారా! తన యుత్సవంబు వచ్చుచున్నదని యడవుల నన్నింటిని జిగుళ్లచేతను, పువ్వుంబుల చేతను, బండ్లచేతను నలంకరించుచున్నది. ఆయుత్సవం బయినకొన్ని దినంబులవఱకు నిట్లే యుంచి, తరువాత వానినన్నింటిని మాయము చేయుచుండును. అట్లు కానిచో గ్రామదేవతయుత్సవకాలమందే చెట్లుచిగుర్ప నేల? పుష్పింపనేల ఫలింప

నేల? పిమ్మట లేకపోనేల? చక్కఁగ యోజింపుఁడని చెప్ప వారందఱు నిక్కంబని భావించి వసంతకాలంబునఁ జెట్లు చిగిర్చినతోడనే గ్రామదేవత యుత్సవంబున కారంభించి సన్నాహంబులు చేయుచుందురు. ఇట్లుండ నొకనాఁడు భిల్లనాథుండు వసంతకాల మేతెంచుటఁ గనుఁగొని భిల్లులఁ బిలిపించి యిట్లనియె. "ఓరీ భిల్లులారా! గడచినరాత్రి నాకు స్వప్నమునందు గ్రామదేవత గనిపించి యిట్లని చెప్పినది. 'ఓరీ! నాయుత్సవకాల మేతెంచియుండ నింకను మీరు మత్తులై యున్నారేమి? ఇంతకుపూర్వము మీరుచేయు నుత్సవము నా కెంత మాత్రము సంతోషకరంబుగ నుండలేదు. మీరిచ్చినయాహారము నాకెంతయుఁ దృప్తిఁగొలుపలేదు. మీరిచ్చినయెనుపోతు నాకు రుచికరముగ నుండలేదు. మీరొసంగిన కల్లు నాకంతమైనఁ దనియలేదు. కావున నీసంవత్సరము మీరు జాగరూకులైయుండి నాకు నరుని బలిగా వేయవలె. నాలుగుపుట్లకల్లు దేవలయు. నాయుత్సవంబు మిగుల నానందదాయకంబుగాఁ జేయింపవలయు, మీరటుచేయనిచో మిమ్మందఱ నొక్కమాఱు దిగమ్రింగెదను. చూడుఁడు నామహిమ.' అని మిగుల నాగ్రహంబుతోఁ బలికినది. మనము కష్టపడి యామె యనుగ్రహంబు సంపాదింపవలె. కావునఁ జాలినంత కల్లు కూడఁ బెట్టుఁడు. మీమందిరంబుల నలంకరించుకొనుఁడు, ఆతల్లి యనుగ్రహంబు సంపాదించుకొనవలెనన్నచో మనము తప్పక యొకమనుష్యుని బలిగా నిచ్చితీఱవలె ఆమనుజునిగూర్చి దేవతయే చెప్పినది." ఆమనుష్యుని దెచ్చుటకుమన మిప్పటినుండియుఁ బ్రయత్నించుచుండవలెను. అని యప్పటికి గొన్నిదినంబుల క్రిందటనే చెప్పియుండుటచే నాభిల్లులందరు తత్తత్కార్యంబులం దప్రమత్తులై యుత్సవంబునాటికి సర్వము సన్నద్ధముచేసిరి. ఇట్లుండ నుత్సవదినంబు వచ్చెను. నాఁడుమధ్యాహ్నము నాల్గుగంటలకే యుత్సవ మారంభింపఁబడియె. ఒక పురుషుఁడొంటినిండఁ బసపు పూసికొని చూపఱకు భయము కలుగునట్లు కుంకుమ బొట్టు బెట్టి వేపకొమ్మలు చేతంబట్టుకొని యొడలెఱుఁగక గొంతుకపగలునట్లు కేకలువేయుచు నొకవిగ్రహమును నెత్తిపైపెట్టుకొని నడుచుచుండె ఒకకొందఱు

దేవతకోసము గల్లుకుండలు నెత్తిఁబెట్టికొని పోవుచుండిరి. మఱికొందరు కాళ్లకు గజ్జెలుకట్టుకొని డప్పులమ్రోఁత ననుసరించి యాడుచు, సారాయిమత్తుచే నొకరిపైనొకరు బడి పెద్దగొంతుతోఁ బాడుచుఁ బోవుచుండిరి. మఱికొందఱు తమకు సంప్రాప్తమయిన యాపదలు తొలఁగించుటకై మ్రొక్కుకొన్న యెనుపోతులను, మేకపోతులను, కోళ్లను, గొఱ్ఱెలను నొక్కచేతితోఁ బట్టుకొని రెండవ చేతితోఁ గొన్ని వేపకొమ్మలును, దళతళమనెడి యొక్కొక్కఖడ్గంబును బట్టికొని పోవుచుండిరి. ఇంకొకకొందఱొకపురుషుని కాళ్లుచేతులుబంధించి యొక్కయంట్లె లోఁ గూర్చుండఁబెట్టి మోచికొని పోవుచుండిరి. వారిలో నొకఁడు సర్వదా దేవతను స్మరించుచుఁ గొన్ని వేపకొమ్మలను బెడిదంపుఁటడిదంబును బూని పోవుచుండెను. వాఁడే దాసుఁడని పిలువఁబడును. వాఁడే యానరుని నఱకవలసినవాఁడు. నాఁడు వారందఱు పొట్టలనిండ కల్లుద్రావియున్నవారగుటచే మదోన్మత్తులై పరస్పరము విరుద్ధభాషణంబులాడుచు, పకపకనగుచు, మదాతిశయంబుచేఁ గ్రిందఁబడినవారిని లేవనెత్తి నడపించుచు, వికారచేష్టలు చేయుచు, నరులైనను వానరులవలెఁ బ్రవర్తించుచుఁ బోవుచుండిరి. ఇట్లుత్సవంబు చేయుచు సాయంకాలమగునప్పటి కాగుడిసమీపంబునకుఁ బోయిరి. ఆదేవతగుడి గ్రామమున కొక పావుకోసుదూరంబున నొకతోఁటనడుమ నున్నది. వీ రాస్థలంబు ప్రవేశించునప్పటికిఁ జీఁకటులు మెండుగ వ్యాపించినందునఁ గొన్ని కాగడాలు వెలిఁగించిరి. కాని యవి యాచీకట్లఁ దఱుమఁదగినంత వెలుతురుగలవి గాక కొంచెము వెలుతురుగలవై యుండెను. అప్పుడు భిల్లనాథునియాజ్ఞ చొప్పున దేవతను గుడిలోఁ బ్రవేశింపఁజేయ దలంచుచుండిరి. అంత నావచ్చినమూఁకలో నొకఁడు పెద్దకేక వేయుచు నేలఁబడియె. అక్కడివారందఱు మూఁగి వానిని దేవతయావహించినదని పలుకుచు, రెండుబిందెలనీరు దెచ్చి వానికిఁ దానమాడించి గుగ్గిలపుధూపము వేసిరి. అంత నాపురుషుఁడు జడలుగట్టియున్న కేశకలాపము తన శరీరమంతయుఁ వ్యాపించుచుండఁ దనశిరంబునూఁపుచు నిట్లుపలికె. ‘ఓరీ! మనుష్యులారా! మీరుచేయునుత్సవము నాకుఁ గొంచెమానందము గొలిపినది. నా కోరినమనుజునికూడ తెచ్చినారు. అంతయుఁ బాగున్నది. కాని మీరు వేయు

కేకలు నాకు భయము కలిగించుచున్నవి. అందుచే మీరిచ్చుబలిని నేను సుఖముగఁ దిన వలనుపడకున్నది. కావున మీ రీతోఁట యవతలిభాగంబున నుండుఁడు. దాసుఁడు నరబలియీగానే కేక వేయును. అప్పుడు మీరుమీరు తెచ్చిన బలులు సమర్పించి కేకలు వేయకుండఁ బొండు. బలులిచ్చినవెంటనే మీరు గృహంబుల కేఁగవలయును. ఏమాత్రమాలస్యము చేసినను వానిని మ్రింగుదును. నా గుడిలోఁ దప్ప బైని దీపముండఁగూడదు" అని యూరకుండె. ఆమాటలు విన్నతోడనే యచ్చటవారందఱును తోఁటయవతలిభాగంబున కరిగి నిలిచియుండిరి. అంత భిల్లనాథుఁడు దాసుని మఱియొకరిని నచ్చట నుండనియమించి నరబలియిచ్చిన తోడనే కేక వేయవలయుననిచెప్పి యామందిలోనికిఁబోయి కేకలిడవద్దనియు, దాసునికేకవిన్నతోడనే మీరు బలులర్పించి పరుగిడవలయుననియుఁ జెప్పి సంసిద్ధులఁగాఁ జేసె. అంత దాసుఁడు గుడిలోని కరిగి పూజచేసివచ్చి బద్ధుండయి దుఃఖాబుచే సొమ్మసిల్లియున్న యాపురుషునిఁ జేతితోఁ దట్టిలేపి రెండవవాని జూచి జాగ్రత్తగాఁ బట్టికొమ్మనిచెప్పిముమ్మాఱు తనకు దావలగొని చేతిని బైకెత్తి నత్తువకోలఁది నఱికెను. కాని బలిష్ఠుఁడైన యాపురుషుండు పట్టుకొనినవాని పట్టు దప్పించుకొని తిరిగిపోయినందున వానికిఁ దగులక యావ్రేటు క్రిందనున్న మ్రానికిఁ దగిలెను. అంతట దాసుండు మిగులఁగోపించి గట్టిగపట్టుకొమ్మని మఱల నఱక సిద్ధముగానుండఁగా దలయొకటి త్రుళ్లిపడియె. . అదిచూచి పట్టుకొనిన వాఁడు కేకలు వేయుచుఁ బర్విడి గ్రామమువంకఁ బోవుచుండెను. అంత నచ్చటి వారలు తమతమబలులనర్పించి తమతమయిండ్లకరిగిరి. కాని దాసుండెంతరాత్రికి ఇల్లుచేరలేదు. అందుచే వానికుటుంబము భిల్లనాథునికిఁ జెప్పగా వాఁడు రెండవ వానిని బిలిచి దాసుఁడేఁడీయనియడిగెను. అంత వాఁడు దాసునిసంగతి నాకుఁ దెలియదు. నరబలియిచ్చినతోడనె నేఁ బర్విడివచ్చితిని. నరబలి యీయఁ బడెను. ఆలస్యముచేసిన ప్రాణంబులు దక్కవని పర్విడి వచ్చితిననియె. అంత భిల్లనాథుండు జక్కఁగాఁగొంతసేపుయోచించి యాగుడియొద్ద జరిగినవృత్తాంతము నంతయుఁ దెలిసికొనిన దాసునిభార్య కిట్లనియె. 'దాసుఁడు బలి సరిగా నీలేక పోవుటచేతను బలియిచ్చినవెంటనే పర్విడిరాక యాలస్యము చేయుటచేతను దేవ

తయేవానిని జూపియుండును. వానిఁ గూర్చి విచారించిన లాభము లేదు. భర్త యపరాధము పోవు నిమిత్తము మఱచటి యేఁడొక మేఁకపోతును బలియిచ్చెద నని మ్రొక్కుకొనుము. దానివలన మీకు క్షేమము కలుగును. లేనిచోఁ గలుగ దని చెప్పి దానిచే నట్లు మ్రొక్కించి యింటికిఁ బంపి తానును తనగృహంబున కేఁగెను.

---

# పదియాఱవ ప్రకరణము

రత్నసింగును బురబహిష్కారము చేసిన పిమ్మట సూరథాన్రాయలు మఱియెవ్వరిని నమ్మఁజాలక రాజ్యవ్యవహారముల భారంబు తనపైవేసికొని లేని సత్తువ తెచ్చికొని తనకుమారికను దనకు సహాయభూతురాలిఁగాఁ జేసికొని రాజ్యమేలుచుండెను. తారాబాయియు మిగుల వివేకవంతురాలగుటచే నామె సమస్త వ్యవహారంబులను నెఱవేర్చుచు నెట్టిలోపంబును గలుగనీయక ప్రవర్తిల్లుచుండెను. ఇంతియకాక తగినయుద్ధంబులు సంప్రాప్తమగునపుడు సేనాధిపత్యము వహించుటకుఁ గూడ సిద్ధముగా నుండెను. రాయలు తనకుమారిక సామర్థ్యంబును గనిపెట్టి సమస్తవ్యవహారంబును క్రమక్రమంబుగా నామెచేతిలో విడువఁజొచ్చె. తారాబాయి యిట్లు సమస్తవ్యవహారంబుల నిర్వహించుట యందు స్వతంత్రురాలాయెను. అయినను దండ్రియాజ్ఞలేక క్రొత్తవ్యవహారంబుల నేమియుం జరుపలేదు. ఇట్లుండ నొకనాఁడు రాయలు కుమారికా సహితుండై రాజకీయవ్యవహారంబులు చక్కఁబెట్టుకొని గుఱ్ఱపుఁబండిలోఁ గూర్చుండి చల్లగాలి ననుభవించుటకుఁ బోయెను. అట్లతఁడు కొంతతడవు పురసమీపంబున నున్న యొకపూఁదోఁటలో విహరించి యచ్చటికి నొకక్రోసుదూరంబున నున్న యానంద మను పూవులతోఁటఁ దర్శింపఁబోయె. ఆయానందము రాయలకు మిగుల ప్రేమాస్పదమైనది. ఆపూవులతోఁటను రాయలే ప్రతిష్ఠించెను. మొదట నాప్రదేశము ముళ్లచేతను, నిష్కుసుమములై, నిష్పలాశములై, నిష్ఫలంబులై యున్న వృక్షంబులచేతను నావరింపఁబడి క్రూరమృగంబులకు నిలయంబై మిగుల నసహ్యకరముగాను భయంకరముగాను నుండెను గాని రాయలా స్థలం

బును బాగుచేయించి యొకతటాకముఁ ద్రవ్వించి పలువిధమ్ములగు పూవుల మొక్కలను వృక్షమ్ములను వేయించుటచే క్రమముగా నది చూచినవారి కానందదాయకంబుగాఁ గానవచ్చుచుండె. కర్ణకఠోరంబులగు జంబుకాదిని నాదంబులకాకరమైన యాప్రదేశమిప్పుడు శ్రావ్యంబులైన కోకిలాదిరావంబుల కాలయమాయెను. ఆవంధ్యభూమికిట్టి విశేషంబులు గలిగియుండుటకు రాజానుగ్రహమె ముఖ్యకారణంబు. కావున లోకములో మానవుండు బుద్ధిహీనుండైనను నుత్తమకుల సంజనితుండు కాకపోయినను, గురూపియైనను విద్యాగంధములేనివాఁడయినను రాజాదరణకుఁ బాత్రుండవునేని, యెల్లరకు శ్లాఘనీయుండగునని చెప్పుట కిది యొకనిదర్శనంబుకదా? రాయ లయ్యుద్యానవనంబు ప్రవేశించి యందలివింతలను కుమారికకుఁ జూపించి సంభాషింపఁ జేయుచుఁ, దోఁటమాలీలు జాకరూకులై దోహదంబులు వేయుచు యుక్తసమయంబుల జలము కట్టుచున్నారో లేదో పరీక్షించుచు విహరించుచుండెను. ఇట్లు కొంతవడి విహరించి తిరిగి వచ్చుట కభిముఖుఁడై యుద్యానము ముఖద్వారంబునకు వచ్చె. అంత రజఃపటలంబుతోఁ గూడిన మహావాయు వెదుర్కొని ముందడుగు బెట్టనీలేదు. రాయలు గాలితగ్గిన పిమ్మట పోవచ్చునని నిశ్చయించి వెనుకకు మరలి యారామ సౌధంబునగూర్చుండిరి. అంత వాయువు క్రమక్రమముగా హెచ్చి ఝంఝామారుతంబుగా మారి మహావృక్షంబులనైన నున్మూలించుచుండెను. అదిచూచి రాయలు తాను ప్రయాణము నిలుపుట తమకు మేలయినదనితలంచుచు నామహాభూతము శాంతించినతోడనే పురికిఁబోవచ్చునని వేచియుండెను. అంతఁ గొంతసేపటికి నామహాభూతము తనప్రభావంబునుజూపి కొంచెము శాంతినొందెను. రజఃపటలము దిక్కులకు వ్యాపించినందున మొదట గ్రమ్మినచీఁకటులు నశించెను. అది రాయలు గాంచి యింకను విళంబము చేసినచో రాత్రి తటియుననియు, నందువలన నట్టి ప్రదేశమందుండి పోవుట యాపదలకు మూలమగుననియుఁ దలపోసి కుమారికతో వచ్చి బండిలోఁ గూర్చుండె. అంతలోఁ బటపటమను శబ్దమొకటి యరుదెంచె. అదియేమోయని శోధించుచుండ సమీరవశంబున బండిలోనికివచ్చి కడియున్న పెనుచినుకొకటి

వారిసందియంబు బాపె. అంత రాయలాకసంబు వైపుచూచి వర్షంబువచ్చుచున్నట్లుగాంచి వర్షంబువచ్చి తన్ను నిర్బంధించినచోఁ బురంబుచేరుట మిగుల కష్టసాధ్యంబని విచారించుచున్నయవసరంబునఁ గన్నులు మిఱుమిట్లుగొనునట్లు నిజకాంతులు నలుగడల వ్యాపింప మింటనొక మెఱుపుమెఱసి గుండెలవియించునట్లురిమెను. ఆభీకరనినాదంబున కచ్చటివారందఱు నాల్గుబారలదూరంబునఁ ద్రుళ్లిపడిరి.

గుఱ్ఱంబులును నిలువక పర్విడఁజొచ్చె. ఆభయంకర నినాదంబుతోడనే వర్షముప్రారంభమయి రాయల డెందంబును విచారసాగరంబునముంచివైచె. మఱియుం నావర్షము కుండలతోఁబోసినట్లు కురిసి భూతలంబును జలమయంబుగా జేసి విడిచెను. ఆవర్షంబు ముగియునప్పటికి భానుమంతుం డస్తగతుండాయె. అందుచేఁ గారుచీఁకట్లు క్రమ్ముకొనియుండెను. అప్పుడు రాయలు త్వరపడి బండిపూన్చి యట్టిసమయంబునఁ బయనంబుచేయుటకు భయంకరంబుగానుండుటచే నాయుద్యానవనరక్షకులను సహాయంబుగాఁగొని వచ్చుచుండెను. కాని యడుగడుగునకును గొండబట్టెలాటంక పెట్టుటచేఁ దొంటియట్ల త్వరగాఁ బయనంబుసలుపవీలులేకుండె. ఆపూర్వులతోఁటకు దోథానగరంబునకును నడుమ నొకతోఁటగలదు. ఆతోఁట మహావృక్షంబులచేఁ గ్రిక్కిసి చూపఱకు భయంబుగొలుపుచుండు. ఈరాయలబండి యాతోఁటలోనుండి పోవలసియున్నది. అయిన నాప్రాంతమందు చోరభయంబులేకుండుటచే నిర్భయంబుగాఁ బోవుచుండిరి. ఆరక్షకభటులు తాముచేయవలసిన కార్యంబులులేక పోవుటచే నేదియో మాటాడుకొనుచు ననుగమించుచుండిరి. గుఱ్ఱపుబండియుఁ మెల్లగ నేఁపోవుచుండె. ఆసమయంబున జాలవర్షమొకటి గురియనారంభించె ఆ చీఁకటిలో పటపటమనుశబ్దముదక్క మఱియొక్కటిగోచరంబుగాలేదు. అట్టి జాలవానదట్టముగా గురియుచున్ననవి రాయలకుగాని తారాబాయికిగాని తాఁకలేదు. గాని గుఱ్ఱములలోనొకదానికాలికిఁ దగిలెను. అందుచే నదిబండినిఁ దప్పుదారికిఁ గొనిపోవుచుండెను.అదిచూచి హయచోదకుఁడు తొందరపడి కేకవేసి బండినిలుపఁజొచ్చె. కాని మఱియొకశిలవచ్చిహయచోదకునిఁ దలఁబగులఁ

దాఁకెను. అందుచే వాఁడుపగ్గంబులవదలి తడుముకొనుచుండ నాగుఱ్ఱంబులు బర్విడ నారంభించెను. రక్షకభటులు హయచోదకుని కేకవినివచ్చి బండినిలుపఁజూచిరి కాని నిలుపలేకపోయిరి. అంత హయచోదకుండు తానుబాధఁబొందుచున్నను ధైర్యమువహించి యూరకుండిన మోసమువచ్చునని తనయావచ్ఛక్తితోఁ కళ్లెంబుల నాకర్షించిపట్టుకొని యతికష్టంబుచే నిలిపెను. అంత రాయలు బండి దిగికత్తిచేతఁ బూని భటులను బురికొల్పుచుఁ జోరులనుబట్టుకొనుటకయి తాలు. వచ్చుచున్న దిక్కుమొగంబై కొంతదూరము పోయెను. అంతఁగొందఱు చోరులువచ్చి బండిముట్టడించి లోపలనున్న తారాబాయిని గొనిపోయిరి. ఆమ మిగులశూరురాలైనను దాను నిరాయుధురాలగుటంబట్టియుం జోరులుహఠాత్తుగా వచ్చిముట్టడించుటంబట్టియు రోదనముతప్ప నేమియుం జేయఁజాలకపోయెను. ఆయార్తస్వరము విని రాయలు పాదంబులు తొట్రుపడ భటులతోఁ గూడి బండియొద్దకువచ్చి చూచెను గాని తారాబాయి యందుఁ గానరాలేదు. అంతరాయలు భయంబుచే గడగడవడకుచున్న హయచోదకునివలన దొంగలు పోయినమార్గంబుదెలిసికొనిపరువెత్తెను. తారాబాయిగాని దొంగలుకాని కానరారైరి. అందుచే రాయలు దుఃఖాతిశయంబు జరాభారంబునకుఁ దోడ్పడుటం జేసి మిగుల వివశుండయి యాప్రాంతము దిరుగ లేక వెంటనే పురికివచ్చి రాజకీయభటులనుజేరఁబిలిచి యావృత్తాంతమ్ము వారికిఁ దెలిపి "శీఘ్రముగాఁబోయి యరణ్యమ్ములగాలించి తారాబాయిని వెదకి రండు. అట్లుచేసిన మీకు గొప్ప బహుమానమర్పించెదనని" చెప్పిపంపెను. అంత వారును రభసంబునఁ బోయి వెదకఁజొచ్చిరి. అట్లు భటులు చన్నపిమ్మట రాయలుకుమారికను దలఁచుకొని విచారపరీత హృదయుఁడై యిట్లు విలపింపఁదొడంగె. "అక్కటా! ఎట్టి యాపద సంభవించినది! ఇట్లు జరుగునని కలయందైన నెఱుంగను. కుమారీ! నానిమిత్తమెంత విలపించుచున్నావో! ఆదుష్టులచేతులు తాఁకినప్పుడు నీవెంత యహవ్యాము నొందితివో; అయ్యయో! ఇంతకాలంబు నిన్నుఁ బెంచి తుదకీదుర్మార్గులపాలంబడవేసితి నేమి? తనయా ఇఁక నాకు రాజకీయవ్యవహారంబులందుఁ దోడుచూపువారెవరు? అకటా! ఇట్టిదుఃఖంబునొందకుండఁ జని

పోయిన నీతల్లి నాకంటె నెంతయు నదృష్టవంతురాలుగదా ! నిన్నాయొడలు విడనాడి పురంబుఁజొచ్చిన నావంటి కఠినహృదయుండు మఱొక్కఁడు కలఁడా ! నిన్నుత్తమ రాజకుమారునకిచ్చి పెండ్లిగావించి రాజ్యంబు నీకుఁ జెందఁజేయవలయునని యాశపడియుండఁగా నాయాశలన్నియు నట్టేటఁ గలసినవి. మహావీరులగుశత్రువుల నెదిరించి రాజ్యలక్ష్మిని గాపాడిన నేను సాధారణులగు దొంగలనుండి రక్షింపలేక పోతినేమి? దైవమా! నేఁడిచ్చటనే కాలముపుచ్చక వనవిహారార్థం బేలపోతిని? పోతినిబో నేనొక్కఁడనేపోక పిల్ల దానింగూడ నేలకొనిపోతిని. కొనిపోతినిబో మొదటి యుద్యానంబునుండి మఱి లక యానందంబున కేలయరిగితి? అరిగితిఁబో వెంటనే తిరిగిరాకమాలీలఁబరీక్షిం చుచు నేలతడసితిని? తడసితిఁబో నిదివరకెన్నఁడును లేని గాలివాన నేఁడేలవచ్చె? వచ్చెఁబో యాసమయము మిగుల భయంకరంబుగా నున్నదనియోజించి యా రామ సౌధంబునవుండక యేలమరలితిని? మరలితిఁబో భటులును నేనును బాలిని గాపాడుచు నుండక దొంగలఁబట్టుకొను నిమిత్తమేల ప్రయత్నించితిని ! పోఁ గాలము సంభవించునపు డిట్టిబుద్ధులు పుట్టుచుండును గాఁబోలు! "వినాశకాలే విపరీతబుద్ధి"యనెడి పండితవచనము వితథంబై చనునే? ఇంతకుఁ బ్రారబ్ధకర్మం బనుభవింపక తీఱునా ? ఇప్పుడిట్టు విచారించిన నేమిలాభంబు ! కార్యంబును జెఱిచితి. అని యిట్లు కుమారింగూర్చి మిగుల విలపించుచు నేమియుఁ దోఁచక యట్టిటు దిరుగుచు భటులరాకకై వేచియుండెను.

---

# పదునేడవ ప్రకరణము

చెట్టులేనిదేశమం దాముదపుచెట్టే మహావృక్షంబని కొనియాడబడుచంద మునఁ దేజోంతరములేక యంధకారబంధురమైన రాత్రియందు తేజశ్శాలులని గణింపఁబడుచు మింట విఱ్ఱవీఁగుచు చుక్కలమొత్తమ్ముల గర్వమ్ముఁబాసి వెలవెల బోవుచుండఁ దూర్పునఁ జందమామ యుదయించెను. చంద్రునికాంతి సంతో షములు నలుగడల గడలుకొనియుండుటచేఁ దమంబు లొకకొంచెమడఁగుటం బట్టి వస్తువులన్నియు నేత్రగోచరములు కాఁజొచ్చెను. ఆసమయమునందు

ఇరువురు పురుషులాకపిల్ల దాని భుజములపై నెక్కించుకొని యరణ్యమార్గములం బడి దీసికొనిపోవుచుండిరి. ఆకన్య భయాతిరేకంబుచే మూర్ఛపడియుండెను. ఇట్లా పురుషులు కొంతవరకుఁ గొనిపోయినతరువాత నాకన్యామణి కొంచెము తెలివి తెచ్చుకొని, నాయనా! నాయనా! అనిపిలిచి ప్రత్యుత్తరము రాకపోవుటచే మరల మూర్ఛపోయెను. అంత నాపురుషులామెనొకనదీప్రాంతమునకుఁ గొనిపోయి యొకయిసుక తిన్నెపై నామెను డించి యామెసమీపమునఁ గూర్చుండిరి. ఆసమయము పండువెన్నెలలవలన నెంతయు మనోహరముగానుండెను. ఆనదిపై నుండి ప్రసరించుచున్న చల్లని మెల్లగాలుల త్యానందముం గలిగించుచుండె ధవళ కాంతుల నీనుచున్న యాసైకతము చందురుని తెల్లకాంతులచే నినుమడించి ప్రకాశించుచు మడతలుపడియున్న తెల్లనిపట్టుబట్ట పఱచినవిధమున నొప్పుచుండెను. అంత నాకన్యామణి చంద్ర మారుతము లొనరించుచున్న శైత్యోపచారములచే మెలకువచెంది కనులువిప్పి నలుగడలుపరికించి యింకను దనసమీపముననె కూర్చుండియున్న యాపురుషులఁగొని ఓరీ దుర్మార్గులారా! పెనుభూతములవలె నిక్కడనె దాపరించియున్నారా? అనిపలికి భయముచే మరల కన్నులం నిమీలించెను. అంత వారిరువురును నీక్రిందివిధమున సంభాషించిరి.

ప్రథముఁడు.—ఈమె కింకను భయమువదలలేదు. ఏమి చేయుదము ?

ద్వితీయుఁడు.—చేయుట కేమున్నది. గాని మూర్ఛ దేఱినట్లు గన్పట్టుచున్నదా.

ప్రథ.—మూర్ఛదేఱుట కేమి? ఇప్పుడు మెలకువతోనే యున్నది కాని మనవలని భయముచేఁ గనులు మూసికొనియున్నది.

ద్వితీ.—అట్లయినచో మనమామె కుపకారులమే కాని యపకారులము కామని తెలుపుదము.

ప్రథ.—అట్లు చెప్పినంతమాత్రమున నామె నమ్మ ననుకొనుచున్నావా?

ద్వితీ.—నమ్మఁదగిననిదర్శనముఁ జూపించి నమ్మింపవలయును.

ప్రథ.—ఆమెను నమ్మింపఁదగిన నిదర్శనములు మనయొద్దనేమి కలవు?

ద్వితీ.—లేకేమి! ఆయుత్తరమే చాలును.

ప్రథ.—నవ్వారే! చక్కగా జ్ఞప్తికిఁ దెచ్చినావు. ఆయుత్తరము నీమెకుఁజూపి మనల నమ్మునట్లు చేయఁగలము.

అని పలికి యాపిల్లదానిని సమీపించి చేతితోఁ దట్టిలేపి సుందరీ! సుందరీ నీ వేలభయపడెదవు. మమ్ములఁజూచి భయపడుటకు మేము పెద్దపులులము కాదు. రాక్షసులము కాము నీ కెంతయో యుపకార మొనరించుటకే యిచ్చటికిఁ గొని వచ్చినాము కాని హానిగలిగించుటకు రాలేదు. నీప్రాణముల కెంతమాత్రము భయములేదు. కన్నులఁ దెఱచి నీ క్రేఁగంటిచూపుల నాపై ప్రసరింపఁజేయుము. ఇంతవరకు నిన్నిచ్చటికి గొనివచ్చుటకు మాపడిన శ్రమ భగవంతునకుఁ దెలియును. మే మెంత శ్రమపడినను నీకటాక్షవీక్షణములకుఁ బాత్రుల మైతిమేని యా శ్రమయంతయుఁ దొలఁగిపోవును అని పలికెను. అతనిమాటలు తొలుత తనతండ్రితో నెడబాపి తెచ్చినందున జనించినకోపానలంబునకు వాయుసదృశంబులై భగ్గునమండించుటం జేసి సహింపలేక యాయిరువురనొక్క పర్యాయము సంహరింప నెంచి తనయొద్ద నాయుధ మేదియు లేదని విచారించి వారిరువురు దమయాయుధములదూరముగఁ బడవైచి యేమరుపాటున నుండుటఁ జూచి తా నొక యాయుధమును మెల్లగ సంగ్రహించి వారిపైబడి మాటాడఁదలంచి 'యబలనగు నేను బలియురగు నిర్వురుపురుషుల నెట్లు చంపఁగలను' అని శంకించి క్షత్రియవంశమున జన్మించియు దగినంత యాయుధపరిశ్రమఁ జేసియు నే నిట్లు జంకుచున్నా నేమి! చంపెదను లేక చచ్చెదనని తెగించి చివ్వున లేచి యొక యాయుధము కేలఁగీలించి ఘోరాకారియగు శార్దూలిచందంబునం దనతో భాషించినవానిపై కుఱికి చంపుటకు హస్తంబుపైకెత్తిన నంతలో రెండవవాఁడు వెనుకభాగంబునుండివచ్చి యామెహస్తంబును బట్టికొని యాసుందరి యాయుధాఘాతంబుచే నాపురుషుఁడు మడియకుండఁ జేసెను. అంత నారాజకుమారి రెట్టించినకట్టలుఁతో నాతనిపట్టు విడిపించుకొని ఓరీ! తుచ్ఛులారా! మీవంటి పాపాత్ములు లోకంబునఁ బుట్టరు. నన్నిట్లు గొనివచ్చి నాతండ్రికిని నాకును గలిగించినదుఃఖము మీవంశముల నడఁగింపకమానునా? మీరు నాకొనరించెడు నుపకారమేమున్నది. మీదుర్మార్గపుబుద్ధి నేనెఱుంగుదును. నన్నుఁ గొనిపోయి యొక కఱకుతురకదొర కిచ్చుటయే నాకు గొప్ప యుపకారమని తలంచుచున్నారు. కాఁబోలు. ఓరీ! దుష్టపథులారా! నాకంఠములో జీవమున్నంత

కాలము నేనొకతురకను బెండ్లాడుదునా మీరు నన్నుఁ గొనిపోయి యొకతురక కర్పించి మన్ననలందవలెనన్న యభిప్రాయము లేక కేవలము ధనాపేక్షయేయున్న నాయొంటనున్న యీ బంగరునగలతో నేల తృప్తిజెందరు? మీరు నన్ను బలాత్కారమున, గొనివచ్చు నవసరంబున నాయంగభూషణములన్నియుం జాఱి క్రిందఁబడుచుండఁగా వానినెల్లసంగ్రహించి యేలసంతసింపరు? మీయభిప్రాయము నాకుఁ దెలియును. నన్నుఁ గొనిపోయి తురుష్కచక్రవర్తికెవ్వనికో యీయఁదలఁచినటులున్నది. ధనసంపదలకాసించి నేనట్టి నీచుని మాత్రము పెండ్లియాడుదానను గాను అని పల్కుచు రోషావేశంబునఁ గ్రిందుమీఁదుచూచుకొనక యాయబల వారి నుగ్గాడనుంకించి సమయంబున నామెచర్యయంతయుఁ గనిపెట్టి యామెపరాక్రమంబునకును సౌశీల్యంబునకును నచ్చెరువడి వారిలో నొకఁడిట్లనియె." చెలియా! నీశౌర్యంబునకెంతేనియుం మెచ్చుకొనవలసియున్నది. నీయభిప్రాయము వేఱగుచున్నది. మాయభిప్రాయము నీవనుకొనునట్లు కాదుసుమీ! నీవన్నట్లు మేమెంతమాత్రము దుర్మార్గులము కాము. నిన్నుఁ దురక కిచ్చుటకు కూడ మేము తలంపలేదు. ఈకాలపుసంగతులనుబట్టి మమ్మునమ్మఁజాలక నీవిట్లు వదరితివి కాని మాసంగతి నీవు యథార్థముగా కనిపెట్టినచో మే మెట్టి హితులమో నీకే తెలియును. మేమును యోగ్యులమగు రాజపుత్త్రులము గౌరవాభిలాషులము. కాని తురకల మెప్పువడయుంటకై నిన్నుఁ గొనిపో నేతెంచినవారము కాము. మాయాకారంబుల నీవు చక్కఁగఁ బరిశీలించితివేని నీవు చతురురాలవుగనుక మాయాకారంబులంబట్టియే తెలిసికొనఁగలవు. కోపంబుడుగుము. శాంతమువహింపుము. కృత్యాకృత్యంబుల వివేచింపుము. విద్వాంసురాలవగు నీకు 'సహసా విదధీత నక్రియా' మనెడు పండితోక్తి యేల మానసగోచరముకాకున్నదో తెలియకున్నది. మామాటల విశ్వసించి యాగ్రంధము క్రిందఁబడవేయుము." అనవుడు నాయువతీలలామ యిట్లనియె. 'ఓరీ దుష్టులారా! మీరు చూడఁబోయిన గోముఖవ్యాఘ్రంబులవలెనున్నారు. మీరన్నట్లు మీయాకారంబులు మనోహరంబుగానుండి మీయయోగ్యత నెల్లరను వెల్లడించుచున్నవి మీయొనర్చిన ఘోరకృత్యమెంతయుం నాశ్చ

ర్యముఁ గొలుపుచున్నది. ఇట్టుండ మీయాకారంబులంబట్టి నాకు హితులరని యెట్లునమ్మఁదును? ఇంతవరకు నన్నును నాజనకుని జాలచే నొప్పించి పెక్కుబాముల బడఁద్రోచి నన్నిచ్చటికిఁ బలాత్కారముగాఁ గొనివచ్చి వంచింప నలవికాని యిడుమలబెట్ట నిశ్చయించియున్న మీరిప్పు డమృతము నీసడించు మంచిమాట లాడినంతమాత్రమున మీవలలోఁ జిక్కెడుదానంగాను. ఇంత వఱకు నాయంధము లేక యూరకుంటిని గాని యిఁక మీఁద నూరకుండుదానంగాను. మిమ్ములనిర్వురను రణంబున హతులఁగావించెద. లేనిచో మీచేఁజచ్చిస్వర్గసుఖమనుభవించెద. ఇంతకన్న మఱియొక మార్గంబు లేదు. మేము రాజపుత్త్రులమని నుడువుచున్నారు. మీరు నిక్కముగా రాజపుత్త్రులేయయిన నిట్టితి నీచంబగు దొంగతనంబు నవలంబింపనూహింతురా? గొడ్డును గోసికొని తినునట్టి కఠినహృదయులవలె నదయులయి మమ్ములఁ జంప శిలావర్షము గురియింతురా? ఇదియుంగాక యేపాపమునెఱుఁగని నన్నిట్లు బలాత్కారముగాఁ గొనిపోనుంకింతురా? కావున మీరెంతమాత్రము క్షత్త్రియవంశ సంభవులరు కారు. కాకయొక వేళ మీ రుత్తమరాజవంశంబున జన్మించినను చర్యలంబట్టి మిమ్ము చండాలురని పిలువఁ దగినదియే కాని, రాజపుత్త్రులని పిలువఁగూడదు. రాజపుత్త్రులన్నంత మాత్రమున మిమ్ము విశ్వసించుదానంగాను. మఱియు నే నితరుని యుత్తమత్వమును, అధమత్వమును గుణంబులఁబట్టి నిశ్చయింతునుగాని మీవంటి వంచకులాడు తియ్యనివచనంబులంబట్టి కాదు. మీమంచిచెడ్డలను మీరొనరించిన కృత్యమె వేమొగంబుల ఘోషించుచున్నది. నోరు నొచ్చునట్లుగా మీరు వేఱ చెప్పనేల ?' అని రోషావేశముచే శరీరముతూఁటులుపడునట్లు ములుకులవంటి పలుకులు పలుకుచున్న వారెంతమాత్రము కోపమూనక వారిలోనొకఁడిట్లనియె. సుందరీ! నీవు మమ్ముల నెంతనిందించినను మేము కోపమూనువారము కాము. నిన్ను వెదకునిమిత్తము మీజనకుండుపంపినభటులందఱు నిట్లు చనుదెంచుచున్నారు. ఇఁక మీఁద మేమిచ్చటనుండుట యుక్తము కాదు. మే మే యిచ్చట నున్నచో నాభటులకు మాకు ననవసరమగుయుద్ధము పొసఁగకమానదు. ఈ యుత్తరములఁ దీసికొనుము. ఇవి మావృత్తాంతమంతయుఁ దెలియఁజేయును.

ఈరెంటిని బట్టి నీకు మేము హితులమో కామో తెలియఁగలదు. అయిన నీ యుదంతమంతయుఁ రహస్యముగానుంచుము. ఆ తరువాతనయిన మాయందుదయ యుంచుము. ఇదిగోఁ బోవుచున్నాము. అని పలికి వారటనుండి కదలిపోయిరి. అంత తారాబాయి మిగుల నాశ్చర్యము చెంది వారినిగురించి పలువిధముల నాలోచింపుచుండఁగా నారాజభటులు సమీపించిరి. అదిచూచి యామె యాయుత్తరములరహస్యముగానుంచి యచ్చటనే నిలువఁబడియుండెను. అంతట రాజభటులాస్థలంబునకు వచ్చి యామెంజూచి యధికానందముచెంది యామె కిట్లనిరి. 'అమ్మా! నీకోసము మీతండ్రిఁ జెందుచున్న దుఃఖమింత యని మేముచెప్పలేము. నిన్నింతదూరము గొనివచ్చిన దొంగలెచ్చటికేఁగిరి. మా కన్నుల బడినవారలను యమపురంబునకంపి లోకమునకు హితమొనరించియుం డుము. వారివలన నీకేమియుఁ గాయములు తగులలేదుకదా! వారేవైపరిగిరో జాడఁ జెప్పఁగలవా? చెప్పినచో వారలనెట్టయిన బట్టుకొనిబంధించి తీసికొనివత్తుము."

అని పలుకుచున్నవారలంజూచి తారాబాయి యిట్లనియె:—'భటులారా! మీరలెంతటియినసమర్థులరె. వారలజాడ నే నేమిచెప్పఁగలను. మీసడివినినతో డనే భయపడి నన్నిచ్చట దిగవిడిచిపోయినారు. భగవంతుని యనుగ్రహము వలన నాకేమియు గాయములు తగులలేదు. ఇంక నాచోరులు మీకెక్కడఁ గనబడుదురు! నన్నుఁగూర్చి మాతండ్రి యెంతవగచుచున్నాఁడో వేగముగనింటికిఁ గొనిపొండు. దొంగలనుగూర్చి యాపయిని విచారించుకొందమనిచెప్పి తండ్రినిఁ జూడ మిగులవేడుక పడుచున్నయాపిల్లను రాజభటులు తమతోఁగూడఁ గొని వచ్చియున్న పల్లకిలోఁగూర్చుండబెట్టి యతివేగముగాఁ బురంబునకు బోవు చుండిరి. అంతకుముందు కొందఱుభటులేగి సూరథానులనుజూచి నమస్కరించి "మహారాజా! తారాబాయిని గొనివచ్చుచున్నారని చెప్ప విని యాముదుసలి రాజు సంతోషమును బట్టఁజాలక కొంతవరకు నిశ్చేష్టితుఁడై యుండి యామె కొఱ కెదురుచూచుచుండెను. అంతలో రాజభటులందఱు మహానందముతోఁ బల్లకిఁగొనివచ్చి రాజుముందఱఁ బెట్టిరి. ఆపల్లకిఁ గ్రిందఁబెట్టినతోడనే తారా బాయి, మహాసంతోషముతో 'నాయనా! నాయనా' అని పలుకుచుఁబోయి

తండ్రిని కౌఁగలించుకొనెను. అంత సూరధానులు తనముద్దుకూఁతును ముద్దిడి తొడపైనిడుకొని యానందబాష్పములచే నామెనుదడుపుచు వెన్నెదిగన్న పేదచందంబుననుండెను. అంత తారాబాయి 'నాయనా! మరల నీమొగమును చూతుననుకొ లేదుసుమీ! భగవంతుని దయారసము మనపైనున్నదిగనుక, తిరిగి మనమొండొరులఁ జూచుకొనునంతభాగ్యము కలిగినది. లేనిచో నీదినమున సంప్రాప్తమయిన యపాయము తొలగించుకొన నెవ్వరికయినఁ దరమగునా. తప్పక మృతిబొందవలసినదే. ఇంతకును మనయదృష్టము బాగున్నది' అని పలుకుచున్న కుమారిక పలుకుల కలరి, 'తల్లీ నీవు మిగుల నాఁకలిగొనియున్నట్టు గనిపించుచున్నావు. భుజించినపిమ్మట మాటలాడుకొందము రమ్ము' అనిచెప్పి భోజనము నిమిత్తము కూతుతోఁ గూడఁ బోయె.

---

# పదునెనిమిదవప్రకరణము.

మాళవరాజునకును దామోదరసింగునకును మిత్రభావము క్రమముగా హెచ్చఁ జొచ్చెను. అందువలన వారిరువురును సర్వకాలంబులయందు నొకరి నొకరు విడనాడక వర్తించుచుండిరి. దామోదరసింగునకు ప్రత్యేక మొకమేడ యున్నను నది కేవలము భోజనగృహమాయెనే కాని నివాసభవనము కాలేదు. తన నివాసమెపుడును మాళవరాజు సౌధరాజమేయైయున్నది. వారెల్లకాలమ్ములందును జిత్తూరుజయించుటకును, దారాబాయిని గొనివచ్చుటకు దోధానగరంబు దామోదరునకు వశమగు నట్లుజేయుటకు నాలోచించుచుండిరి. వీరికీ యాలోచనతప్ప నన్యాలోచన లేమియుఁలేవు. అందుచే నొకనాఁడు వారిరువురు నొక్కచోఁగూర్చుండి యిట్లు సంభాషింపఁదొడంగిరి.

రా.—మిత్రమా! చిత్తూరురాజ్యలక్ష్మిని వేగముగా వరింపవలెనన్న కోరిక మిగుల బాధింపుచున్నది.

దా.—ఒక్క రాజ్యలక్ష్మినేకాదు, దారాబాయినికూడ వరింపఁగలరు.

రా.—అవును. ఈరెండిటికై నామనము త్వరపడుచున్నది.

పవాత

ఆరాజు విహారించుచుండఁగనే యొకగాలి వీతెంచెనఁట.

రా.—సమయము బాగున్నది. తరువాత నేమిజరిగినది?

రా.—సర్వదా యాప్రాంతంబులఁదిరుగుచు సమయముకై వేచియున్న భిల్లులు గనిపెట్టి, యాతండు పూవులతోఁటనుండి పురంబునకుఁ బోవుచుండఁగా నాలండి నరికట్టి తారాబాయిని తీసికొనివచ్చిరి.

రా.—కార్యము నెఱవేఱినదే.

దా.—కాని యాసమయంబునఁ బ్రశయాంతకులఁబోలిన యిరువురుపురుషులా భిల్లులను నఱికి యాపిల్లను విడిపించుకొనిపోయిరఁట.

రా.—(నిట్టూర్పు పుచ్చుచు) అక్కటా! మనముచేసిన ప్రయత్నము శత్రువులకు దెలిసియే యుండును. లేనిచో నింతవఱకువచ్చినకార్యము వృథయైచనునా?

దా.—అవును. ఇంతమాత్రముచే మనకువచ్చిన నష్టమేమి? ఈపర్యాయము తప్పక కొనిరాఁగలుగుదుము. మఱియు నాకింకొక యాలోచనతోఁచు చున్నది. ఇప్పుడు రాయ లసహాయుఁడై యున్నాఁడు. కావున తోఢానగర మవలీలనె పట్టుకొనఁగలము. మన మొరులకు దెలియకుండ నిశీథసమయంబున నప్పురిని జుట్టుముట్టినచో నాపురంబును వశంబు కావించుకొనుటయే కాక తారాబాయిని నిరపాయంబుగాఁ దీసికొని రాఁగలము. తోఢాను ముట్టడించుట కిదియే తగినసమయ మని నామిత్రుండగు మాధవసిం గొకయుత్తరము వ్రాసినాఁడు. కావున నీసమయంబున దాడి వెడలితిమేని జయము గాంచుటలో నిస్సంశయము. రాయల కింతకు ముందుండు మిత్రవర్గమంతయు నశించినది. మరలమిత్రులను సంపాదింపకముందే పోయి తోఢాను ముట్టడించుట యుచితము. మఱియుఁ జిత్తూరువృత్తాంతంబు వినుఁడు. రాయమల్లు ఱెక్కలుదెగిన పక్షివలె నున్నాఁడు. నాకు మిత్రుఁడును, రాయమల్లునకు సోదరుఁడును, నాంతరంగికశత్రుండును, చిత్తూరురహస్యంబులు బాగుగఁదెలి

సినవాఁడునగు సురాజమల్లు నాకొక యుత్తరంబువ్రాసియున్నాఁడు మనము నిమిత్తమాత్రులమై యున్నఁ జాలునఁట. చిత్తూరు మనచేత కొప్పగించుట కేమియు లోపంబులేదఁట. ప్రస్తుతమచటనికుమారు లెవ్వరు నింట లేరఁట. ఈసమయమునఁ జిత్తూరునకుం బోతిమేని రక్తపుచుక్క చిందకయే చిత్తూరు వశంబుగావించుకొనఁగలమఁట. ఇట్టిసమయము లభించినప్పుడు మిన్నకుండుట రాజనీతినిపుణుల కుచితంబుకాదు. కావున మన మిప్పుడే రెండునగరంబులపైకిఁ బోవుట యుచితంబని తోఁచుచున్నది. వారలు మనరహస్యం బెఱుంగరు కావున యుద్ధసన్నాహంబులు మాని యుందురు. అందువలన మనము శీఘ్రకాలములో నేజయమందఁగలము. ప్రస్తుతము మనము చేయవలసిన కార్యంబుల వినుఁడు. మనమింకొకకొంత సైన్యముం గూర్చుకొనవలయు. మనకుభిల్లనాథుండు వేగురుభిల్లులతో వచ్చి సహాయముచేసెదనని వాగ్దానము చేసియున్నాఁడు. కావున నిందున్న సైన్యములో మూఁడవవంతు నాకర్పింపుఁడు. నే సైన్యంబును భిల్లులను గొని తోఢాను ముట్టడించెదను. నేను వారి సహాయంబున తోఢాను వశంబుగావించుకొని తారాబాయిని భిల్లులచే మాళవకుఁ బంపించెదను. మీరు మిగిలిన సైన్యముఁ గొని చిత్తూరు ముట్టడించుఁడు. మీకు సురాజుమల్లు సహాయపడకమానఁడు అట్లుచేయవలసినదని సురాజుమల్లున కొకయుత్తరము వ్రాసియంపెద. మీరు చిత్తూరు ప్రవేశించినతోడనే సురాజమల్లు వచ్చి మిమ్ములఁ గలిసికొనును కాని చిత్తూరు మీకు వశంబైనను నాపురం బతని కిచ్చి మీకుసామంత ప్రభువునుగాఁ జేసికొనుఁడు. ఇట్లుచేయుట మంచిది. తమయభిప్రాయం బేమియో వక్కాణింపుఁ డన నతం డిట్లనియె. "ఓయీ ! నాయభిప్రాయంబున కేమున్నది ? మనయిర్వురభిప్రాయంబు లొక్కటియే. నీయాలోచనయే బాగున్నది. మఱికొంత సైన్యముండినంగాని చిత్తూరు పయికిఁ బోవుట మహాసాహసము. నేనందునిమిత్తము ప్రయత్నించి యొరు లెరుగకుండ చాలినంతధనంబులిచ్చి సైన్యంబుఁగూర్చుచుండు..

ను. నీ ప్రయత్నములయందు నీవప్రమత్తుండవై యుండుము. అనియాతో నితోఁ జెప్పిపంపి యది మొదలు బలవంతులగువారిని బరీక్షించి తనసైన్యంబులోనికిఁ జేర్చుకొనుచుండెను.

---

# పందొమ్మిదవప్రకరణము

తారాబాయి యొకనాఁ డొంటరిగాఁ గూర్చుండి యిట్లు విచారింపఁ జొచ్చెను. అక్కటా! ఎంతదుర్మార్గపుకార్యముఁ జేసితిని. "సిరిరా మోకాలొడ్డువారు కలరా" యని యందురు. కాని నేనట్టిదాననైతిని. నేనెవ్వరినిమిత్తము చిరకాలంబునుండి వేచియున్నానో యట్టిమహానుభావుఁడు నాదృష్టిపథంబున బడినను జూడనైతి. నావంటి దురదృష్టవంతురాలు మఱియొక్కతె లేదని వక్కాణింపఁగలను. "సుందరీ" నీకు మేముపకారులముగాని యపకారులముగా మని యెంతచెప్పినను నేను వినక మూర్ఖబుద్ధిలో ననరానిమాట లాడితి. అభిమానవంతుఁడైన యారాజపుత్త్రుండు డెందంబున నే మనుకొనెనో? ఎట్టి రోగంబులకైన మందుగలదుగాని మాటలచే విఱిగిన మనస్సునకు మందులేదని యందురు. కావున నాకాఱుమాటలచే విఱిగిన యారాజకందర్పుని మానసంబు మరల మాఱుకొనునో మాఱుకొనదో. అయ్యయ్యో! ఆసమయంబున క్రోధపిశాచంబు నన్నావరించి కొఱు లఱపించినది. కన్నులారా! చిత్రపటమునందతనిరూపంబు చూచి చూచి తృప్తిపొందఁ జాలక యాతని మనోహరాకారంబుఁ జూడ వేచియుండియు మీయెదుటఁ బడినప్పుడు చూచి సంతసింపలేక పోతిరి. ఇఁక మీజన్మంబు నిష్ఫలంబు. మీకారాజ చంద్రుఁడుగనఁబడునని నేను నమ్మఁజాలను. ఓమనసా!! నీవు నాసమయంబున నట్టిమూఢమవైతివేమి? కొంచెమైన నాలోచింపవద్దా? ఏమహానుభావుని నీవు సర్వకాల సర్వావస్థలయందు సంస్మరించుచుఁ దదీయ సందర్శనంబుఁ గోరుచుంటివో? ఆసచ్చరిత్రుఁడు కీవఁమీపమునఁ నన్నను గ్రహింపలేకపోతివేమి? నీవు గ్రహించినచోఁ గన్నులార నాతనిసుందరాకారంబును జూడనా? తనివిదీర నాతనితో మాట

కాదనా? అయ్యో! ఇప్పుడేమనుకొనినను లాభమేమి? వార లెంతబోధించినను వినవైతి. వారు పల్కిన హితవాక్యంబు లన్నియుం గోపపరీతమానసనైన నాకు నహితంబులుగాఁ దోచె. ఓసీ! కోపమా? ఎంతచేసితివి? నీవలనఁ గనులముందటి భాగ్యంబును జెడఁగొట్టికొంటిని. లోకంబున నీ ప్రభావం బెవరిని నిర్భాగ్యులగాఁ జేసి విడువదు. నీమూలంబున నారాజచంద్రుని సంహరించుటకుఁ బూనికొంటిని. నేనెవ్వరిని జంపఁబోతినో యామహానుభావుండె పృథ్వీరాజు. అక్కటా? ఎంత పాపాత్మురాలనైతి. ఏమహానుభావుని పాదంబులు దలఁదాల్చి పూజించి కృతార్థురాలను గావలసియున్న దాననో నే నామహాభావుని సంహరింపఁ బూనుకొంటిని. అక్కటా! యెంతపనిచేసితిని! నాకీ యుత్తరంబుల నొసంగినవాఁడు పృథ్వీరాజే యైయుండును. ఆమహానుభావుండు నా పల్కిన వాక్యంబులకు కోపంబు వహించి నన్నుఁజేపట్టునో చేపట్టఁడో "చెలియా! నీ వెంత నిందించినను మేము కోపంబును బూనము" అని పల్కెను. దీనింబట్టి యోఁజింప నతనికి నాయందనుగ్రహంబున్నట్లు తోఁచుచున్నది. కావునఁ గ్రోధము వహింపక పోయినఁ బోవచ్చు? అతఁడప్పటి నా చర్యను బోడగాంచి నన్నుం దుష్టురాలినిగా నెంచునేమో? ఉదారగుణుండైన యారాజసత్తముండు అప్పటి నా చర్య కోపాతిశయంబుచే విపరీతంబుగా నుండెనని భావింపక పోవునా? ఒకవేళ నాతఁడు దుష్టురాలినిగా నిశ్చయించి నన్నుఁజేపట్టనిచో నాజన్మంబు వ్యర్థము. నాకీ జీవిత మంతతో సరియే? నా కీలోకముతోఁ బనియే లేదు. నే నప్పుడు పలికిన కాఱుమాటలను క్షమింపవలయునని ప్రార్థించుచు నొక యుత్తరంబు వ్రాయుదుమనిన, నతని ప్రదేశంబు తెలియరాదు. ఎచ్చటికి వ్రాయను? గద్వారునం దుండునని కర్ణాకర్ణికగా వినియున్నాను. అచ్చటికి నొక సేవకుని పంపిన నేమగునో? అయిన నిందులకై తరువాత నిశ్చయించి యేదైనను జేయవలెను. భవానీదేవి యనుగ్రహించి నా పృథ్వీరాజు మానసంబు నాకుఁ బ్రతికూలము గాకుండ జేయుంగాత! అక్కటా! యీదామోదరుని వలన నెట్టిపాట్లుఁ బడవలసివచ్చినది? ఎన్ని పాపకార్యంబు లాచరింపవలసి వచ్చుచున్నవి? ఆ దుర్మార్గు నంతము బొందించినఁ గాని మాకు సుఖంబుగలుగదు.

అయ్యో! పాపము. ఏపాపము నెఱుంగక సర్వదా మా రాజ్యంబునఁ గాపాడుచున్న రత్నసింగున కెన్ని పాట్లు సంభవించినవి? మాతండ్రిగా రాతని సభలో నవమానించి పురంబునుండి వెడలఁగొట్టుచున్నప్పు డాతనిమానస మెంత వికవిక లాడెనో? ఇంతకు నేమి? యాతండు గొప్ప యాపదనుండి తప్పించుకొని క్షేమంబున నున్నవాఁడట. ఈ యుదంతము రమాబాయికిఁ దెలిసిన పరమానంద మొందఁగలదని నిశ్చయించి రమాబాయి మందిరంబునకుఁ బోయెను. ఈమె పోవునప్పటికి రమాబాయి యొంటిగాఁ గూర్చుండి తన మనోహరుండైన రత్నసింగుంగూర్చి విచారించుచుండెను. రత్నసింగు తోధాను విడిచిపెట్టినది మొదలు రమాబాయి మానసంబు దేశసంచారంబు చేయుచుండెనే కాని యొకమాఱును సుస్థిరముగ నుండలేదు. ఉండినను విచారంబుచే చంచలత్వ మందకుండ నుండలేదు. విచారాతిశయంబున నన్నపానాదులు గొనకపోవుటచే మిగులఁ గృశించి యుండెను. ఆమెకు నిద్దుర సరిగాఁ బట్టలేదు. ఈ హేతువులచే రమాబాయి మిగులఁ గాంతివిహీనురాలై యుండెను. అంత రమాబాయి తన యింటికివచ్చిన తారాబాయినిజూచి తన విచారంబును గుట్టుపఱచి యామె కిట్లనియె.

రమా.—తారా! ఇట్టియసమయంబున వచ్చితివేమి?

తా.—ఏమియులేదు. నీకొక శుభవర్తమానంబు తెచ్చితి.

ర.—(ఉత్కంఠతో) ఏమిటది?

తా.—ఎవరినుద్దేశించి నీవు విచారించుచున్నావో? యాపురుషోత్తముని వృత్తాంతము.

ర.—ఎందుకట్టెకసక్కెములాడెదవు. ఆతని వృత్తాంతము స్వప్నవృత్తాంతంబు వంటిదే?

తా.—అట్లనకుము. ఆమహాపురుషుని నీవు చేపట్టఁగలవు.

ర.—ఎక్కడ! పరలోకమందా?

తా.—కాదుకాదు! ఈలోకమందే! మఱియు స్వల్పకాలంబులోనే!

ర.—సఖీ! యెందుకీ యూరడింపుమాటలు?

తా.—కాదుకాదు. ఇదిగో నీయుత్తరంబు చూడుము. (అని చేతికిచ్చును.)

ర.—(అందుకొని) సాంతముగాఁ జదివికొని, చెలియా! అతనికి సంప్రాప్త మయిన యాపద యేమయియుండునో?

తా.—తెలియదు. ఏదయిన నేమి యిప్పుడతఁడు క్షేమముతో నున్నాడు.

ర.—ఇప్పు డతఁడెచ్చట నున్నాఁడో?

తా.—అదియుఁ దెలియదు?

ర.—ఈ యుత్తరంబు లెక్కడివి?

తా.—చెలీ! ఈ యుత్తరంబులసంగతి మిగుల గోపనీయము. ఇతరుల కెవ్వరికిఁ దెలియనీఁగూడదు. మన చెలికత్తియలకైనను దెలియనీయకుము. అట్లయిన మనకార్యం బంతయు విఫలమగును. ఈవృత్తాంతంబంతయు రహస్యంబుగాఁ జెప్పెదను రమ్మని రమాబాయితోఁగూడి తన బసకేఁగెను.

---

# ఇరువదవ ప్రకరణము

మానవులకు భగవంతుఁ డెప్పుడు తలఁపునకువచ్చు? సుఖవంతులై యుండు నప్పుడుకాదు. ధనవంతులై యుండునప్పుడుకాదు. శుభకార్యాదుల నొనర్చుకొను చున్నప్పుడుకాదు. పెక్కులాపదలు చుట్టు ముట్టినప్పుడును, దాము దలంచిన కార్యంబులు చెడినప్పుడును భగవంతుఁడు గానవచ్చుచుండును. ఇతర సమయములయందు భగవంతునినామము నోటంబలుకనివారైనను విపత్తులు తటస్థించినప్పుడు పలుమాఱు భగవంతుని ప్రార్థించి ముడుపులు కట్టుచుందురు. అప్పుడు భగవంతుఁడే దిక్కగును. దేవాలయంబులే శరణంబులగును. ఈయంశ మందెంతసత్యమున్నదో యందఱకుఁ దెలిసినవిషయమే. రమాబాయి యొక్క తెఱుఁటియవస్థ నవలంబించినది. తాను జిరకాలంబునుండి రత్నసింగును దన మనోహరునిగా నెంచుకొనియుండెఁ. కాని యామెకోర్కె నెఱవేఱకమునుపే రత్నసింగు పురంబునుండి వెడలఁగొట్టఁబడియె. అప్పటినుండియు రత్నసింగు వార్తయే తెలియకపోవుటచే విచారపరీతయై యుండి తారాబాయి యిచ్చిన

యుత్తరంబువలన నతండు సజీవుండై యున్నాఁడని తెలిసికొని తన మనోభీష్టము నెఱవేర్పవలయునని తన కార్యభారమంతయు భవానీదేవిపై మోపెను. మఱియుఁ బూర్వము రుక్మిణీదేవి గౌరీదేవిని బూజించి యామె యనుగ్రహంబునకుఁ బాత్రురాలగుటంబట్టియె నిర్బంధంబులనన్నింటిని తొలగించుకొని తన కిష్టతముండయిన కృష్ణునిఁ బెండ్లాడఁగలిగినట్లు పురాణాదులందు విన్నదగుటచే రమాబాయి తానుగూడ భవానియనుగ్రహంబు సంపాదించుకొనినచోఁ దన కిష్టతముండయిన రత్నసింగుని బెండ్లాడఁ గలుగుదు ననెడి తలంపొకటి యుద్భవించి యామెను బాధింపఁజొచ్చెను. అందుచే నామె యెట్లయినను భవానీ సందర్శనంబు చేసికొనవలెనని ప్రయత్నించుచున్నది. కాని యూరినడుమనున్న భవానీమందిరంబునకుఁ బోవుట మిగులఁ గష్టంబుగా నుండెను. తనంత దాను బయలుదేఱి వెళ్లినచో నలుగురు సిగ్గువిడిచి యూరం దిరుగుచున్నదని దూషింతురేమో, యన్నభయము బాధించుచుండెను. లేక తారాబాయి మొదలగు వారితోఁ జెప్పి వారితోఁ గూడ గలిసివెళ్లిన బాగుండునని యోజించెను; గాని వారు తనయభిప్రాయంబు గనిపెట్టి గేలిచేయుదురని భయపడుచుండెను. రాత్రి చాలవఱకతిక్రమించిన పిమ్మట మాఱువేషంబుతోఁబోయి వచ్చుట యుక్తంబుగాఁ దోఁచెను. గాని యట్టిరాత్రిసమయమం దసహాయురాలయి పోయినచో మార్గమధ్యంబున దుష్టులపాయంబు గలిగింతురేమో యని తలంచుచుండెను. ఇట్లు పలుసందియంబు లుండుటచే నేమిచేయుటకు నిర్ణయించుకొనలేక తుట్టతుదకు రాజగృహంబునఁ జనువుతో సంచరించుచుండిన మాధవసింగను రాజకుమారుని సహాయంబున భవానీసందర్శనంబుఁ జేయ నిశ్చయించుకొనెను. అందుచే నొకనాఁడు మాధవసింగట్లుపోవుచుండ వానిబిలిచి తనయభిప్రాయంబతనికిఁ దెలియఁజేసెను. ఈ మాధవసింగునుగూర్చి యిచ్చటఁగొంచెము వ్రాయవలసియున్నది. ఈమాధవసింగు సూరథానులకు దూరపుబంధువు. ఇతఁడు చిరకాలంబునుండి యాసంస్థానమును కనిపెట్టికొని యుండెను. వీఁడు కుటిలుఁడు. ధామోదరసింగునకు దక్షిణభుజంబువంటివాఁడు. ఇతఁడు పైకి రాయలకు స్నేహితునివలెఁ బ్రవర్తించుచుండినను నాంతరంగికశత్రువై యచ్చటియుండంత

మెప్పటికప్పుడుత్తరంబులమూలమున దామోదరునకుఁ దెలుపుచుండును. మఱియుం రత్నసింహుని పురంబునుండి వెడలఁగొట్టుటలో ముఖ్యకారకుఁడు వీఁడె. దామోదరునియుపదేశంబుననే కాక వీఁడు రత్నసింహునిపై సహజవిరోధంబుఁబూనియతని నెట్లయిన నూరినుండి వెడలగొట్టింపవలెనని మొదటనుండియుం దలంచుచుండెను. ఇందులకుఁ గారణము వీరిరువురును రమాబాయిని గాంక్షించుటయే. మఱియుం రమాబాయికి రత్నసింగును వరింపవలయుననియే యున్నది. కాని మాధవసింగును వరింపవలెనని లేదు. ఇంతియ కాక మాధవసింగు దన్నువరింపవలెనన్నకోర్కి నున్నాఁడని రమాబాయికెంతమాత్రము తెలియదు. మాధవసింగు దనయభిప్రాయంబును రమాబాయికిఁ దెలుపవలెననియుండెను. కాని తగినసమయంబు లభింపలేదు. అందుచే సమయంబునకు వేచియుండె. నేఁడు రమాబాయి తనయభిప్రాయంబు తెలుపఁగానే మాధవసింగు తనకు మంచిసమయంబు లభించినదని పరమానందభరితుండై యందులకంగీకరించెను. అంత మాధవసింగు రమాబాయితో రహస్యంబుగా నీదినము శుక్రవారంబు. భవానీదర్శనంబుఁ జేయుటకుఁ దగినసమయంబని చెప్పెను. రమాబాయి మాధవునిదురభిప్రాయంబెఱుఁగదు. కావున నందుల కంగీకరించి రాత్రి యతిక్రమించినతోడనే తనబసకు రావలయునని వేఁడెను. ఇట్లుండఁగా సూర్యుండస్తమించె. రాత్రి క్రమక్రమంబుగా నతిక్రమించుచుండె. నాఁడు వెన్నెలరాత్రియగుటఁ జంద్రుఁడు నభోమండలం బలంకరించి వెన్నెలలచే లోకమంతయు నిండించెను. రాత్రి జామున్నఱ కావచ్చినది. రాజమందిరంబునఁ జాలమంది శయనంబులం జేరిరి. అట్టిసమయంబున మాధవుండు మనోహరవస్త్రభూషణంబులఁ దాలిచి కరవాలంబులోనఁ గల యొకకత్తిను బూని రమాబాయిమందిరంబునకుఁ బోయెం. అతఁడు పోవునప్పటికి రమాబాయి వెన్నెలనుండి తన్ను వేఱుపఱుపకుండునట్లు తెల్లవస్త్రంబులఁదాలిచి సిద్ధంబుగానుండెను. అంత మాధవుండు ముందు నడుచుచుండెను. రమాబాయి వాని ననుసరించి పోవుచుండెను. మాధవసింగు నందఱు నెఱింగినవారలగుటచే ద్వారరక్షకభటులెవ్వరు నడ్డగింపలేదు. అందుచే వారు నిరాటంకంబుగ బోఁదొడంగిరి. ఇట్లు వారు వీధులు దాఁటిదాటి యూ

భవానీమందిరంబు ప్రవేశించిరి వీరు పోవునప్పటికి భవాని యాలయంబు భూతల వైకుంఠంబుచందంబునఁ బ్రకాశించుచుండెను. నాఁడు శుక్రవారంబగుటచే దేవాలయ మంతయు దీపంబులతో నిండియుండెను. అర్చకులాలంకారంబులు చెలంగ దేవిని బూజించుచుండిరి. వచ్చినభక్తులును భక్తురాండ్రును దమకు వచ్చిన దేవీ స్తోత్రంబులు చదువుచుండిరి. మఱికొందఱు మృదంగాదివాద్యఘోషములతో గానము చేయుచుండిరి. అంత మాధవసిం గర్చకులను బిలిపించి రాజకుమారికకు దర్శనంబు చేయింపుమని చెప్ప నాతఁడు జనుల నొత్తగించి మార్గము చేయింప రమాబాయి మేలిముసుఁగు చెలంగుచుండ దేవీనికటంబునకుఁ బోయి నమస్కరించి తనకు వచ్చిన దేవీస్తోత్ర మొప్పగించి తల్లీ నీకరుణారసంపుఁ జూపులఁ జిల్కి ప్రోవుము. నీపాదపద్మంబుల నమ్మినవారికి శుభంబు లొడఁగూడునఁట! నీపాదంబుల సంతతము ధ్యానించుచున్న నాకోర్కె నెఱవేర్పుము. ఆరాజకుమారునితో నన్నుఁ జేర్ప వేని నీపాదసన్నిధానంబునందె నాజీవంబులు బాసెద. ఉత్తమరాజపుత్రినగు నాసాహసంబును బరికింతువుగాక! సర్వము నకు నిన్నె నమ్మియున్న నన్నుఁ జేరఁదీసి ప్రోవుము. అని ప్రార్థించి తాఁగొని వచ్చిన ఫలాదుల నర్పించి దేవతాప్రసాదస్వీకారంబు గావించి యచ్చోటు గదలి వెంటనే యింటికిఁ గొనిపొమ్మని మాధవసింగును గోరఁగా నతండందుల కంగీకరించె. అంత వారిద్దరు పురవీధులవెంబడిని పోవుచుండిరి. ఇట్లు వారు పోవుచున్నప్పుడు దారి తప్పినట్లున్నదని రమాబాయి చెప్పఁగా వాఁడది విని; "లేదు లేదు మొదటి మార్గముకంటె నిది దగ్గరమార్గము" అని బదులు చెప్పి తీసికొనిపోవుచుండెను. మాధవసింగామె నట్లు తీసికొనిపోయి యూరికొసనున్న యొకపాడు దేవాలయంబుఁ జేర్చెను. రమాబాయి యది చూచి యిది యేమి యిక్కడికిఁ గొనివచ్చితివి? అని యడిగెను. అందులకు మాధవసిం గిట్లనియె. "చెలియా! ద్రోహబుద్ధితో నిన్నిచ్చటికిఁ గొనిరాలేదు. కార్యంబు చెప్పెద. నాచిత్తంబు నీయందుఁ బ్రవేశించి మరలిరాలేక యున్నది కావున నన్నుఁ దయతోఁ జూచి చేపట్టుము నాయభిప్రాయంబు నీకుఁ దెలియఁజేయ వలయునని తలంచితినిగాని యింతవఱకు నాకు సమయంబు దొరకలేదు. నా

ప్రార్థన మన్యథా చేయవనితలంచెద” నని విన్నవించుకొనెను. అది విని రమాబాయి యుద్రేకించిన కోపమ్ము నడఁచికొని నోటనుండి వెడలివచ్చుచున్న నిందావాక్యంబుల రాకుండ గ్రుక్కుకొని తనలో నిట్లనుకొనియె. అక్కటా! వీని కిట్టి దుర్మార్గపుబుద్ధి యున్నదని యెఱుంగనైతి. పులిని విశ్వసించి పోయినట్టు లీక్రూరుని నమ్మి వచ్చితిని. వీనినుండి తప్పించుకొనువిధంబు చూచుకొనవలెను. ఇప్పుడు నే నేమాత్రము తొందరపడినను కార్యంబు చెడును. ఈ యుందంతము నెవ్వరికి చెప్పినను స్వతంత్రించి యీతని వెంబడించి పోయినందులకు నన్నే నిందింతురు. కావున సామంబుచేతనే కార్యంబు నెఱవేర్చుకొనవలెనని తలంచి యిట్లనియె. “రాజకుమారా? నీవింత లెడగువాఁడవేమి? ఈ యుదంతము తెలియఁజేయుట కింతదూరము తీసికొని రావలయునా? ఒక యుత్తరంబు వ్రాసిపంపినఁజాలదే? నేను మొదట రత్నసింగును గోరికొని యున్నను నాతఁ డేదేశంబునకో పోయినాఁడు. ఇంత నాతనినుండి నామానసంబును ద్రిప్పికొని యున్నాను. నిన్నువరించుట విషయమై యుత్తరముఖమునఁ దెలిపెద. నన్ను వేగముగా నిల్లు చేర్పుము. తారాబాయి మొదలగువారు నేనిట్లు వచ్చితినని యెఱింగినచో మఱియొకరీతిగాఁ దలంపక మానరు. కావున నొరులెఱుంగకుండ నిల్లుచేర్పుము” అని పలికెను. మాధవుం డదివిని రమాబాయిం గని యమితానందంబు చెంది, రత్నసింగు దేశాంతరముననైన జీవించియున్నాఁడని తలంచుచున్నావేమొ. అతండు చచ్చివాఁడు కావున నన్ను దప్పక వరింపుము. నీక మితసుఖంబులఁ గలిగించెదనని పలికి యామెను గొనివచ్చి యిల్లు చేర్చి తానింటికిఁ బోవుచుఁ దిరిగి యిట్లనియె. “సుందరీ! యెప్పుడు నాకోరిక నెఱవేర్చెదవు?” అని వినయంబు గదురఁ బలుక నామె రెట్టించిన కట్టలుకతో నిట్లనియె. ఓరీ! దుష్టబుద్ధీ! నీవిట్టి దుర్మార్గపుమతితోఁ జరించుచున్నావని యెఱుంగను. రాయలతోఁ జెప్పి యేమి చేయించెదనో చూడు. ప్రాణంబులపై బ్రదుకుండిన నన్నెప్పుడును స్మరింపకుము. నిన్ను వరింప నాకెంతమాత్రము నిష్టములేదు. చనువిచ్చి మాటాడితి నన్నంతమాత్రమున నన్నట్లు తలఁపవచ్చునా! దీనిఁ బ్రథమాపరాధంబుగ నెంచి క్షమించితిని. పొమ్మని కసరెను.

అది విని మాధవుండు నిశ్చేష్టితుఁడై నోటమాటరాక తనమందిరమునకు మరలెను. కాని యామెయందలి మనంబును మాత్రము మరలించుకొనలేకపోయెను.

---

# ఇరువదియొకటవ ప్రకరణము

"విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమం" అనునార్యోక్తి యొకటి కలదు. ఆవాక్యరత్న మెంతయుం నాదరణీయమై యున్నది. ఒకపండితుఁ డొక విద్యయందుఁ జేసినపరిశ్రమను నట్టిపరిశ్రమచేసిన మహనీయుండే తెలిసికొన సమర్థుండు. తక్కినవార లట్టివారలై యుండరు. ఒక కవీశ్వరుని కవిత్వమందున్న మాధుర్య చమత్కారములను మఱొక కవీశ్వరుండే గ్రహింపసమర్థుండు. కాని తక్కినవారు కారు. ఇందువలనఁదక్కినవారందఱు మూఢులని నాయభిప్రాయం బుకాదు. పండితుని పాండిత్యవిశేషంబును, గవీశ్వరుని కావ్యమందలి చమత్కార విశేషంబులను గాంచి తక్కినవారందరు నమితానందము నొందఁగలరు. కాని వానినిమిత్తము పండితకవులు చేసిన పరిశ్రమాతిశయమును గనుగొనఁజాలరు. దీనింబట్టి యోచింప నెవ్వ రేవిద్యయందు నిపుణులో వా రావిద్య నేర్చినవారి పరిశ్రమను గ్రహింపఁ జాలుదురని స్పష్టమగుచున్నది. అట్లే యొకధనుర్విద్యా కుశలుఁడు మఱియొకధానుష్కుని పరిశ్రాంతిని దెలిసికొని యానందించుచుండు. అట్లే పరాక్రమశాలి మఱియొకని పరాక్రమగుణంబును జక్కఁగఁ గ్రహించి సంతసించును. కొన్నిసమయంబులందు గొంద ఱితరుల విద్యాదులను గాంచి మంచి విద్యాపాండిత్యము లెదుటివారికిఁ గలవని గ్రహించియుఁ మాత్సర్య బుద్ధితో వారి పాండిత్యాదులఁ బైకి నిందించుచున్నను, వారల మానసంబునకు వాని తత్త్వములు గోచరములయియుండకమానవు. కావున మహాపరాక్రమశాలి యగు పృథ్వీరాజు తారాబాయి పరాక్రమాతిశయము చూచినప్పటినుండియుం నమితానందంబు నొంది పలుమాఱామె పరాక్రమముననె కొనియాడుచుఁ దన మనంబున నిట్లు తలంచుకొనుచుండె. అయారె ! ఆశోపముల్ గాంచి యిదివఱలోఁ

దన సౌందర్యాతిశయంబుచేత నామానసంబును దనవం కాకర్షించికొనినది. ఇప్పుడు పరాక్రమగుణమనెడు గుణంబుచే నిక్కంబుగా దృఢంబుగాబంధించి నది. బాపురే ? ఆవయ్యారిసాహసు మేమనికొనియాడుదును ? ఆమోహానాంగి పరాక్రమ మెంత వర్ణింతును ? నాఁటిరాత్రి మహాకోపావిష్టమానసయై కర వాలంబు కేలఁకీలించి మందగమనయినను నమందగమనయై, నన్నుఁ జంప నెంచి నాపైకి లంఘించివచ్చుచున్న యిచ్ఛందనగంధివై ఖరి నెట్లు మఱువఁగల ను? ఇంతకు నేమి! ఆమె సత్స్వభావ మెంతయుఁ శ్లాఘనీయమయినది. స్వకులా చారరక్షణయందామెకుఁ గలపరాయణత్వ మెవరికిఁ కలదు?అని యిట్లు స్మరించు కొనుచున్నసమయంబునఁ బురుషుఁడొకఁడు వచ్చి పృథ్వీరాజు నచుమతివడసి మెల్ల మెల్లనఁజనుదెంచి నమస్కరించి నిలువఁబడియె. అంత పృథ్వీరాజి ట్లతనితో సంభాషించె.

ప.—నీవెచ్చటివాఁడవు ?

భృ.—తోధానగరవాసిని ?

పృ.—నిన్నెవరంపిరి ?

భృ.—మారాజకుమారిక తారాబాయి

పృ.—ఎందులకు ?

భృ.— తెలియదు. ఇదిగో నొకయుత్తరమిచ్చెను. (అని చేతి కందించును)

పృ.—(దాని నందుకొనివిచ్చి) దీపపువెలుఁగున నిట్లు చదువనారంభించె.

క. మామక మనోమనోజా !
శ్రీమద్రాజాధిరాజ ! శ్రితసురభూజా !
కోమలపాదాంభోజా !
ప్రేమాస్పద గుణసమాజ ! పృథ్వీరాజా !

గీ. స్వచ్ఛకీర్తికలాప ! రాజకులదీప
రమ్యతరరూప ! రిపుభీకరప్రతాప !

అవధరింపుము నీదాసురాలు తార
చెలఁగి వ్రాసిన లేఖావిశేషములను.

క. కరుణానిధి విను తోధా
పురమందు గడించి సేమమును గని మే మె
ల్లర మున్నారము నిర్మల
కరుణారసపూర్ణ తావకకటాక్షముచే.

చ. కినుక మదిం గలంచుటను గ్రిందును మీఁదును జూచుకోక గొ
బ్బున ననరానిపల్కులను ముఖ్యులపంక్తిని లేఁతప్రాలకం
దెను గడుకోమలం బయిననీదుశరీరము గందునట్లుగా?
జొనిపిననాదుతప్పు దయఁజూచి క్షమింపుము రాజనందనా!

మ. ఉపకారం బొనరించినట్టి మహనీయుల్ మీరలం చాత్మభ
క్తిపరం గాక కృతఘ్నురాల నయి కత్తిం గేలఁగీలించి మీ
కపకారం బొనరింప మీపయికి నుద్యల్లీల లంఘించునా
యపరాధంబు సహింపవయ్య గుణధుర్యా! రాజచూడామణీ.

మ. చిరకాలంబుననుండి మిమ్ములను దర్శింపంగ నామాత్మతం
దరపాటొందఁగ నప్రయత్నముగ లబ్ధం బయ్యెనైనం ధనా.
తురుఁ డగ్రంబునఁ బొంతు గాంచి మదియందు న్రాయియుంచున్నిరా
దరముం జూపినయట్టు లాయె నను నాదౌర్భాగ్య మెట్టున్నదో?

చ. కమలము చక్రవాకము తగంగ దినేశునిరాకఁ గోరుచుం
దమున సదా చకోరకుముదంబులు చంద్రునిరాకఁ గోరుచుం
దమున మదీయచిత్తము త్వదాగమనంబును గోరుచుండె మో
దమునను దెల్పవయ్య వసుధావర దర్శన మెప్పు డిత్తువో?

తే. ధరణినాయక! యధికసంతాపమునను
బొగులు మచ్చిత్తచాతకమునకు నకట

చల్లఁదన మిచ్చునీవనుజలద మిటకు
వచ్చిజీవనమిడకున్న బ్రదుకుటెట్లు.

అని యిట్లు పద్యరచనాచాతుర్యముచే నొప్పునట్టి యాయుత్తరము జదువు కొనునప్పుడు పృథ్వీరాజు చెందుచున్నయానందంబునకు మేరలేదు. మఱియుం నారాజకుమారుండు మరలమరలఁ జదువుకొనుచుఁ దనలో నిట్లనుకొనుచుండె. అయారే ? ఇదివఱ కామెపరాక్రమాదిగుణంబులంగూర్చి వినియుఁ గనియుం నున్నాను! వానికే మిగులనానందముచెందుచుండఁగా శ్రోత్రుజనుల కర్ణములకు సుధారసస్రావమువలెనున్న యాసుందరి కవిత్వచాతుర్యమ్ము నీయుత్తరము వెలువరించుచు నానందాంబుధిలో ముంచినది. బాపురే! మొదటిరెండుపద్యంబులలో నంత్యానుప్రాసమును మిక్కిలిచక్కఁగ సమర్చినది. మూఁడవపద్యంబుచేఁగృతజ్ఞత్వము వెలువరించుచున్నది. నాల్గవపద్యముచేతను, అయిదవపద్యముచేతను నాఁడుమమ్ముల నెఱుంగక నిందించినందులకు క్షమాపణకోరుచుఁ దానునుభవించుచున్న పశ్చాత్తాపమును దెలుపుచున్నది. ఆఱవపద్యంబున నెంతచక్కనియుపమానంబులు చేర్చినది కమలకుముదోపమానంబులచేనాదర్శనంబులేనిచో మనస్సంతోషమామెకులేనట్లు తెలియుచున్నది. చక్రవాకోపమానముచేఁ దనమానసము విరహసహమయినదనియుం, చకోరచాతకోపమానంబులచే నేజీవనాధారకుఁడనని యుఁ దెలుపుచున్నది. ఆజీవనపదము నెంతబాగుగా శ్లేషించినది ! నాదర్శనంబు లేనిచో బ్రదుకుటదుర్లభమని తెలుపుచున్నది. ఆసుందరి మిగుల సాహసవంతురాలు. నేనొకవేళఁజిరకాలమువరకు దర్శనమీయనిచోఁ బ్రాణంబులుఁవిడుచునేమో! కావున శీఘ్రకాలంబులోనే వెడలిపోయి యామెకోర్కెనెఱవేర్పవలెనని యిట్లు పృథ్వీరాజు తారాబాయివ్రాసిన యుత్తరమునందలిసారస్యంబులు గ్రహించుచుఁ దన్మయత్వంబునొంది మయిమఱచియున్న యవసరంబున సదాశివయోగి సరభసంబున లోపలికిఁబోయి పృథ్వీరాజున్నమందిరంబు ప్రవేశించి యతనిప్రక్కనున్న పీఠంబుపైఁగూర్చుండెె. కాని యారాజనందనుఁడుదీర్ఘాలోచనలోమునిఁగియున్న వాఁడౌటచేనావచ్చిన సదాశివయోగిని జూడనేలేదు.

అతఁడేదియో యోచించుచున్నాఁడని గ్రహించి యోగి, "రాజకుమారా! యేమియోచించుచున్నా" వని పల్కెను.

అదివిని పృథ్వీరాజు తనయొద్దఁగూర్చుండినయోగికి నమస్కరించి దీర్ఘాలోచనలో మునిఁగియున్నవాఁడనగుటచేఁ దనురాకయెఱుంగకపోతినని క్షమాపణ చెప్పికొని యిట్లు సంభాషించె.

పృ.—స్వామీ! వింతలేమయినంగలవా?

స.—వింతలుకలవాయని యడుగుచున్నావా! మనకొంప మునిఁగినది.

పృ.—త్రుళ్ళిపడిలేచి, అదేమియో సెలవిండు.

స.—ఏమిచెప్పుదు? చిత్తూరు తోధానగరంబులు విపదంబుధిలో మునుఁగ సిద్ధముగా నున్నవి?

పృ.—అది యెట్లు?

స.—మాళవరాజు దారసైన్యంబుతోఁబోయి చిత్తూరుముట్టడించుచున్నాఁడు.

పృ.—తోధానగరమునకు వచ్చినయాపదయెట్టిది.

స.—దామోదరుఁడు కొంతసైన్యంబుతోఁగూడుకొని తోధాను ముట్టడించి. తారాబాయిని, రాయలను మాళవమునకుఁ గొనిపోవుచున్నాఁడు.

పృ.—(తనలో) అకటా దామోదరుఁడు మిగులఁ గుటిలోపాయంబులు గలవాఁడు. వాఁడెట్టులయినఁ దోధానుజేపట్టకమానఁడు. (ప్రకాశముగా) ప్రస్తుతము మనమేమిచేయవలెను?

స.—ఏమియున్నది. ఆరెంటికిని సంప్రాప్తమయిన యాపదలను దొలగింపవలెను.

పృ.—అట్లుచేయుంటే యుచితము. ఈరెండును మనకవశ్యముగా రక్షణీయంబులే! కాని యొక్కపర్యాయము వేఱువేఱుస్థలంబుల సంప్రాప్తమగుచున్న యాపదల నెట్లు తొలఁగింపఁగలము.

స.—అట్లులయినం జిత్తూరును గాపాడుటయె ముఖ్యమని తలంచెద.

పృ.—అట్లుచేసినచోఁ దోధానగరంబు వైరులకుఁజిక్కునే!

స.——చిక్కఁగాక 'తోఁ'ధానగరంబును రక్షించుటకన్నఁ జిత్తూరు సంరక్షణము మన కవశ్యాచరణీయము.

పృ ——తోఁధానగరరక్షణముగూడ నట్టిదియొకదా!

స.——కాదు. తోఁధా శత్రువులకుఁజిక్కినను మనము తిరిగి సంపాదింపఁగలము.

పృ.——ఏమీ? శత్రువులకు వశమయిన చిత్తూరుమాత్రము తిరిగిసంపాదింపలేమా?

స.——సంపాదింపఁగలుగుదుము. కాని చిత్తూరు రాజపుత్త్రులకుఁ బ్రాణము వంటిది. అది మనదేశములో మిగులఁ బ్రసిద్ధమయినది. రాజపుత్త్రుల కంఠములలోఁ బ్రాణంబులుండ నదియెప్పుడును శత్రువులకుఁజిక్కియుండ దన్న యశంబు చెందియున్నది. ఇప్పుడాయశంబును మనము తప్పక కాపాడవలయును. తోఁధా కట్టియశంబులేదు. కావున నొకవేళ శత్రువులకు వశమయిననుఁ దదుత్తరక్షణమందే సంపాదింపఁగలము.

పృ.——మీరు చెప్పినది యుక్తమే! చిత్తూరు రక్షించుటకు మనకుఁ గర్తవ్యమే? తోఁధానగరమొకవేళ శత్రువులకు వశమయినను దిరిగి జయింపఁగలుగుదుము. కాని శత్రువులకుఁజిక్కిన తారాబాయిని, రాయలను గాపాడుట యెట్లు? వారల గౌరవంబు చెడినపిమ్మట వారిని మనము రక్షించినను లాభమేమి?

స.——అట్లయిన నేమి చేయుదము?

పృ.——చిత్తూరురక్షణమును తప్పనిదే! తోఁధానగరంబు నొకవేళ శత్రువులకు విడిచినను దారాబాయిని రాయలను నవశ్యము రక్షించుట యుక్తమనియె తలంచెద?

స.——అవును. ఈరెండింటిని మనము నెఱవేర్పఁగలమా?

పృ.——(ఆలోచించుచు) సరిగాఁ జెప్పఁజాలను.

స.——(ఆలోచించుచు) నీవుపోయి చిత్తూరుఁ గాపాడిరాఁగలవా?

పృ.——తారాబాయిని, రాయలను రక్షించుటయో?

స.——దానికేమి? ఇకార్యము నీచేనగునా?

పృ.—(కోపముతో) కాకేమి? ముల్లోకము లొక్కపెట్టున వచ్చి తాఁకినను జిత్తూరు నవశ్యము రక్షించెదను.

స.—అట్లయిన నీవు వెంటనే పయనమై పొమ్ము.

పృ.—చిత్త మట్లె చేసెద. జోధారాజకుటుంబముమాట యేమి యోజించినారు?

స.—ఆ రాజకుమారికను రాజును నేను రక్షించెద.

పృ.—అసహాయులై మీ రెట్లు రక్షింపఁగలరు? కొంత సైన్యము కావలసిన కైకొనుఁడు.

స.—నాకెవ్వరు వద్దు. నే నొక్కఁడనే యాకార్యంబు నెఱవేర్చెద. నీవు నీ సైనికులతో నీకార్యంబున జాగరూకుండవై యుండుము.

పృ.—మీరొక్కరు వారల రక్షింపఁ గలుగుదురాయని సందియంబు వొడముచున్నది.

స.—నీకెందుకు? వారలను బ్రోచుభారము నాది. అని పలికి యోగీశ్వరుం డాతని వెంటనే పంపి తనకార్యంబునఁ దా జాగరూకుఁడై యుండె.

---

# ఇరువదిరెండవ ప్రకరణము

జోధానగరంబుచుట్టును బలిష్ఠంబగు నొక ఱాతిగోడ కలదు. అది సామాన్యంబుగా శత్రువులకు భేద్యంబుకాదు. ఆగోడచుట్టు మిక్కిలిలోఁతైన కందకంబొకటి వెలయుచుండును. అయ్యది సదా జలపూరితంబై సాధారణముగా దుస్తరంబై యుండు. ఈరెండును నాపురంబుఁ జొర నపేక్షించు వారికి బంధనవిశేషంబులవంటివని చెప్పవలసియున్నది. ఆ పురంబు జొరనెంతరయంబుతోఁ బోయెడివారైనను నచ్చటికి వచ్చినతోడనే యట్టె నిలువవలసినవారే. కాని ముందుకడుగిడంజాలరు. సూరధానురాయలకీరెండును దమ్ము గాపాడుకొనుటలో మహాసైన్యంబులవలె నొప్పుచుండెను. ఆ కందకమం దొకబల్ల కట్టుండుటచే బురజనులరాకపోకలకు సుకరంబుగానుండును. కాని యా జల

తరణ సాధనంబు రాత్రి యెనిమిదిగంటలగునప్పటి కాస్థలమునుండి తీసివేయఁబడును. అందుచే రాత్రి యెనిమిదిగంటల కాలమయినపిమ్మట పురంబులోనివారు పైకిని బైవారుపురంబులోనికిఁ బోవలనుపడదు. మఱియుఁ గోట కవాటంబులుగూడ సాయంకాలముననే బంధించుదురు. అయిన నా తలుపులకు మధ్య పిల్లద్వారంబుండుటచేఁ దన్మాలంబునఁ బురజనులు రాత్రి గమనాగమనంబుల సలుపుచుందురు ఎనిమిదిగంటలకాలమైన పిమ్మట నదియుం బంధింపఁబడును. మఱియు సూరథాన్రాయలు తనకు శత్రువులు పెక్కుఱుండుటచే నాసమయంబునఁ దనకపాయంబు కలిగింతురోయని భయమందుచుఁ దన సైనికుల యుద్ధసన్నద్ధులయి ద్వారంబు రక్షించుచుండవలయునని యాజ్ఞాపించియున్నందున వారు ద్వారంబు మిక్కిలి జాగరూకులై కాచుచుండిరి. మఱియు రాయలకు దామోదరుఁడు హృదయశల్యమై సర్వకాలములందును లోపలబాధగలిగించుచున్నందున నతఁడేమఱక మఱికొంతసైన్యమును గూడ సంపాదించియుండెను. అట్టి బలిష్ఠమైనకోట గలవాఁడైయుండుటం బట్టియుఁ దగినసైన్యంబుగలవాఁడై యుండుటంబట్టియుఁ దనకితరులనుండి భయంబు రాదనుధైర్యంబుతో నుండెను. ఇట్లుండ నొకనాఁడురాత్రి జాలవఱకతిక్రమించినది. కోటలో గస్తుతిరుగునట్టి రాజభటులు దక్క నందఱు నిద్రించుచుండిరి. సైనికులు శీఘ్రకాలంబులోనే తమకు యుద్ధము సంప్రాప్తమగునని యెఱుంగరు. కావునఁ బ్రమత్తులై నిద్రించుచుండిరి. రాత్రులందు సైనికులును రక్షకభటులును పురంబును జాగరూకతతో రక్షించుచున్నారో లేదో పరిశీలింపవలసినదని రాయలు తనకాజ్ఞాపించియున్నాఁడని మాధవసింగుదెలియఁజేసి రాత్రులందతఁడు పురంబునఁ దిరుగుచు నాయాస్థలంబు లందున్న రక్షకభటుల నెచ్చరించుచు సంచరించుచుండెను. రక్షకభటులును సైనికులును నిజముగా రాయలట్టి యాజ్ఞయిచ్చియున్నాఁడని నమ్మిరి కాని యది కల్లయని యుల్లంబుల నెఱుంగకపోయిరి. అందుచే నాతఁడు వచ్చునపుడెల్లవారు భయపీడితులయి తాము జాగరూకులై యున్నారమని విన్నవించుకొనుచుండిరి. కాని

యింతరాత్రి వేళ నీవెందులకిట్లు సంచరించుచున్నావని యాతని సంచారంబు మాన్పఁ బ్రయత్నింపరైరి. మఱియుం రాయలకైన నెన్నఁడును దెలియఁజేయరైరి. అందువలన మాధవసింగు నిరాటంకముగాఁ దిరుగుచు నాఁటిరాత్రి నిదురింపక నాయాస్థలంబులయందు రక్షకభటులను జూచుటకుఁ గాఁబోలు సంచారము చేయుచుండెను. కాని యానాఁడు మునుపటివలె మేల్కొలిపి జాగరూకులై యుండుఁడని చెప్పుచు రాలేదు. మఱియు వీఁడా సాయంకాలమందు పురపశ్చాద్ద్వారమందుఁ గాఁచియున్న సైనికులను రక్షకభటులను జూచి ఈప్రక్కపర్వతముండుటచే శత్రువులకు సుగమముగానుండదు. కాన నిందుండి శత్రుభయం బెన్నండును గలుగనేరదు. ముఖ్యముగ మనము సింహద్వారంబును రక్షించుచుండవలయునని చెప్పి యచ్చటివారిని బెక్కండ్రను గదలించి సింహద్వారంబునకుఁ జేర్చె. మాధవుఁడిట్లు కపట సైన్యాధికారంబు వహించి యున్నాఁడని రాయలకుఁగాని తారాబాయికిఁగాని తెలియదాయె. సైనికులందఱు మాధవుఁడు దమకధికారియనియె తలంచుచుండిరి. అందుచే వాఁడెట్లు నియోగించిన నదియె హితకరమనియుఁ దమ ప్రభువు కిష్టమైన దనియుఁ దలంచి యాతఁడేమి యాజ్ఞాపించిన నట్లే చేయుచుండిరి. మఱియు నాఁటిరాత్రి మాధవుఁడు సర్వదా పశ్చాద్ద్వారంబునొద్దనే చరించుచుండెఁగాని తొంటియట్లు తఱుచుగాఁ బురమందంతటను దిరుగులాడలేదు. ఇట్లు వాఁడచ్చటఁ గనిపెట్టుకొనియుండఁగా రెండుజాములరాత్రి యతిక్రమించునప్పటికిఁ బశ్చాద్ద్వారంబునుండి కొందఱుమనుష్యులు కోటలోనికి రాఁదొడంగిరి. ఆ వచ్చువారిని గోటతలుపులుగాని కందకముగాని యాటంకపఱిచినట్టు గానరాలేదు. భటులాసాఁడా ప్రక్కనున్న జలతరణసాధనంబు నాస్థానంబునుండి తప్పించుటయుం గవాటంబు బంధించుటయుం మఱచుటచే వారు నిరాటంకముగాఁ బురిఁ జొచ్చిరో లేక మాధవుని మహాప్రభావమె వారిని బురిఁజొప్పించినదో తెలియదు. ఆవచ్చుచున్న మనుష్యులను మాధవుండు చూచినప్పుడు తనచేతనున్న కరవాలంబుతో దండమర్పించి వెనుకకు మరలింపవలసినది. అందులకు

మూరుగా వీఁడు తనకరంబుల మోడ్చి దండమర్పించి లోనికిఁ గొనివచ్చుచుండెను. ఆ సమయంబున నచ్చటి కావలిభటులసంఖ్యాతక్కువగానున్నను వారు లేచి కత్తుల దూసి యాటంకపఱుపఁ జూచిరి. కాని ప్రథమయత్నంబులోనే వారందఱు పగవారికత్తుల పాలైరి. అందుచే వారచ్చట నేమిజరిగించినను నెవ్వరికిఁ దెలియలేదు అంతమాధవుండును దామోదరసింగును మఱికొందఱుభటులును నిశ్శబ్దముగానం తఃపురాభిముఖులై పోఁజొచ్చిరి. కాని వారల నిర్బంధించువారలెవ్వరునుగాన రాలేదు. వారొకకవాటంబునైనను భేదింపవలసినయవసరంబు లేకపోయెను. సరిగా వారందఱు నంతఃపురంబునొచ్చిరి. మాటిమాటికి గుండెకొట్టుకొనుచు నొ క్కొక్కమాఱు త్రుళ్ళిపడి లేచుచు నలుదిక్కులుపరికించుచు కొంచెముచడిసేసి మరల నిద్రించుచుఁ గావలియున్నభటులుగిక్కురనకుండ ఖండించిలోని కేగిరి. తమ కింతవేగముగా నపాయంబు రాదనుకొనినిశ్చయించి హాయిగా నిద్రించియున్న రాయలు మందిరంబునొచ్చి నోటగుడ్డలుగ్రుక్కి కాళ్ళుసేతులుబంధించి యొక సవారిలోఁ బరుండఁ బెట్టిరి. తరువాత దామోదరాదులు తారాబాయిపరుండి యున్న గృహంబు ప్రవేశించిరి. ఆమె యెల్లప్పుడు పృథ్వీరాజుపైనున్న చింతచే సరిగా నిద్రింపక యేదియో యాలోచించుచుండెను. కావున నామె వచ్చు చున్నవారి కాలిచప్పుడులువిని యెవ్వరో మనుష్యులువచ్చుచున్నారని కేక వేసి ఖడ్గముచేకొనఁ బ్రయత్నించుచుండె. గాని వెంటనే వీరలుపోయి పట్టుకొని మరల కేకవేయకుండ నోటగుడ్డలుగ్రుక్కి బంధించి తండ్రి పరుండియుండిన సవారీలోనికిఁ గొనిపోయిరి. మొదట తారాబాయి గట్టిగానే కేకలిడెనుగ ని యప్పటికి రక్షకభటులందఱు నిర్మూలింపఁబడియుండుటచే నందులకు ఫలంబు లేకపోయెను. మొదటవీరా తారాబాయిగృహంబుఁజొచ్చినచో నామె మేల్కొని యున్నది. కాన నామె శబ్దముచేసియుండును. అదివిని సూరథానుఁడు లేచివచ్చి తారాబాయిని బంధింపకుండ నిర్బంధించియుండును. అట్లుగాక వీరు మొదట రాయలు మందిరంబునొచ్చుటచే నిద్రించుచున్నయాతఁడు తననోటిలో గుడ్డలు క్రుక్కుచున్నపుడు కాని శత్రువులువచ్చిరని యతఁడు గ్రహింపనేలేక

పోయెను—ఒకవేళ రాయలు కేకవేసినచో విని తారాబాయి యాకొన్న శార్దూలిచందంబున వారిపైఁబడి చంపియుండును. కాని యట్లుజరిగినదికాదు. కావున వీరలు ముందుగాఁ దారాబాయి గృహంబుఁజొచ్చినను లేక రాయల గృహంబుఁజొచ్చినప్పుడు మేల్కొని యతఁడు బొబ్బలిడినను నాఁడు దామోదరాదులు వారినిబంధించి తీసికొనిపోలేక యుందురని యోజింపవలసియున్నది. దైవము ప్రతికూలముగానున్నపు డది యెట్లు సంఘటించు. అట్లు దామోదరుఁడు వారినిరువురను బంధించి సవారీలోఁగూర్చుండబెట్టి తనతోవచ్చిన మహమ్మదను నొక తురుష్కవీరునిఁ జూచి యీసవారీని భద్రంబుగా మాళవకుఁ గొనిపొమ్ము. కొంతదూరము చన్నపిమ్మటగాని వీరినోటనున్న గుడ్డలనూడఁ దీయకుము. భద్రమనిచెప్పి కోటదాఁటింప వారు మాళవకభిముఖులై పోవుచుండిరి. దామోదరుఁడు సైన్యంబుతోఁ గోటఁబ్రవేశించినయొకగడియకు సైనికులకును రాజభటులకును శత్రువులరాక తెలిసినది. అంతఁ గ్రమక్రమముగా నూరంతయు వ్యాపించెను. అదివిన్నతోడనే సైనికులును రాజభటులును రాజమందిరంబు సొచ్చిరి. కాని యచ్చటఁ దమ మహారాజు కానరాఁడయ్యె. రాజమందిరంబు శత్రుసంఘంబుతోనిండియున్నను దారాబాయి యందాత మెచ్చటను గానరాలేదు. అందువలన రాజకుటుంబమునకు హాని సంభవించినదనివగచుచు లోనికిఁ బోవునప్పటికి మాధవదామోదరులచటనుండిరి. అప్పుడు దామోదరుఁడావచ్చినవారిలో బలవంతులగువారినిబిలిచి యిట్లనియె. మీరాజు బద్ధుండయి మాళవకుంగొనిపోఁబడె. మీరాజులేనప్పుడు మాతో యుద్ధముఁజేసిన మీకేమి లాభముగలదు? ఇఁకమీఁద నన్ను రాజుగాఁ జేకొనుఁడు. మీరందరును నాకుపకారంబొనరింపుఁడు. మీకోరినట్లు బహుమానంబు లొసంగెద. పుచ్చుకొనుఁడు. ఇంతకాలము రాయలు ద్రవ్యంబుతిని యిప్పుడు మేమెట్లుసీకొడంబడుదుమని సంశయింపవద్దు. అతండు మరల మీరాజ్యంబునకువచ్చి మిమ్ములం బరిపాలించినంగదా మీరు సందియము చెందవలసియున్నది? అట్లగునని మీరు కలయందైనతలంపకుఁడు. అని యిట్లు నయంబునఁ గొందఱను భయంబునఁ గొం

దళము ధనంబునుఁగొందఱను వశంబుగావించుకొనెను. రాజమందిరంబులోని స్త్రీపురుషులును పురంబులవారును రాజకీయబంధువులును జేయునదిలేకయతనికి వశులైరి. అంత రమాబాయి యావృత్తాంతమంతయుఁ గమలవలన విని మిగుల దిగులొంది దుఃఖాతిభయంబుచే మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలివిచెంది యిట్లని విలపించెను. అక్కటా! మహారాజా! నీవు నన్నుఁ జిన్నతనంబునుండియుఁ బ్రేమంబునఁ బెంచి యిపుడు నన్ను విడిచిపోవుట యుక్తమా? అకటా! తెల్లవారునంతలో నింతవంతలపాలగుదుమని యెఱుఁగకపోతిమి. ఓ చెలియా! తారా! నీసందర్శనములేకుండ నేనెటులుండఁగలను? నీవచ్చట నెన్నిబాములనొందుచున్నావో? నేను విచారంబుచేఁ బొగులుచుండ నీవా నాఁడాయుత్తరంబు తెచ్చిచూపి సంతసింపఁజేసిన నీయుపకారంబు వేజన్మంబులకైనను మఱతునా? చెలియా! నీముఖారవిందంబును మఱలఁజూచుభాగ్యంబు నాకులభింపదు గాఁబోలు. నన్నీదుర్మార్గులేమిచేయుదురో. దుర్మార్గుఁడయినమాధవసింగు నన్నేమిచేయునో, "ఓతల్లీ! కరుణారసవల్లీ! ఓభవానిదేవీ! మమ్ముల నీదుఃఖసముద్రమునుండి తొలంగింపుము. నీకంటెమాకు దిక్కు లేదని నమ్మియున్నా" మని యీవిధంబుగాఁ గొంతతడవు చింతించి చేయునదిలేక యూరకుండెను. అంత దామోదరుండు మాధవసింగుసహాయంబున నన్నికార్యంబులు చక్కఁజేసికొనుచుండె.

---

# ఇరువదిమూఁడవప్రకరణము

దామోదరుఁడు తోధానగరంబునకుఁ బయనంబైనకాలమందె మాళవరాజు చిత్తూరుపైకి దాడివెడలెను. అతనివృత్తాంతము తెలిసికొందము. మాళవరాజట్లు బయలువెడలి దామోదరోపదేశప్రకారంబుగా నిశీథసమయంబునకుఁ జిత్తూరుపురంబునకుఁబోయి ముట్టడించెను. ఆచిత్తూరుపురంబరిపీరులకెంత భయంకరంబుగా నుండునో, అది హిందూదేశంబున నెంతప్రసిద్ధి చెందియుండెనో చదువరులెఱిఁగియే యుందురు. మాళవరాజు తనసైన్యంబుంజూచు

కొని చిత్తూరుపట్టుకొనుట సులభంబనియెంచి యఖర్వగర్వంబునొందెను. గాని చిత్తూరుకోటగోడను జూచినప్పు డాగర్వంబంతయుం సూర్యసందర్శనంబువలనఁ దొలంగు పెంజీఁకటిచందంబున నశించెను. అయిన నూరకుండక తన బలంబులఁ జుట్టుముట్ట నాజ్ఞాపించెను. అతనియాజ్ఞచే తడవుగా సేన లట్లావరించియుండెను. మాళవరాజునకు స్వయముగాఁ జిత్తూరు వశపఱచుకొనునంతసామర్థ్యము లేకపోయినను సురాజమల్లుని సహాయంబువలన వశంబగునని తలంచుచుండెను. అందుచే నతనిరాకకై నిరీక్షించియుండెను. మాళవరాజు చిత్తూరును ముట్టడించినకాలమందు చిత్తూరురాజునకు దుర్గబలంబు దక్క మఱియొకబలంబు లేదు. చిత్తూరుపురాధీశ్వరుండు యౌవనదశయున్నప్పుడు మహాపరాక్రమంబున శత్రువులఁజంపి కీర్తిఁబొందినవాఁడే కాని యిపుడు జరాపీడితుండగుటచే యుద్ధంబుచేయఁ దగినంతసామర్థ్యంబు కలవాఁడు కాఁడు. రాయమలునకు మహాబలవంతులగు కుమారులు మువ్వురుండినను ప్రస్తుతమున చిత్తూరున నొక్కండును లేఁడు. ఆకుమారులలో సంగుఁడతనికి ముద్దుకుమారుఁడు. అతఁడు పృథ్వీరాజుతోఁ బోరాడి దేశాంతరగతుఁడై యున్నప్పటినుండియు నతనియందంత మేమియుఁ దెలియలేదు. అందుచే రాయమల్లు విచారాతిశయంబుచే స్వస్థతలేకయుండెను. పృథ్వీరాజు తండ్రిచే నవమానింపఁబడి విదేశగతుండగుట చదువరులెఱింగియే యున్నారు. జయమల్లు సోదరులిద్దరు విదేశవాసులగుట మాచితండ్రిని జేరి రాజ్యంబు దనకీయవలయునని ప్రార్థించెను. గాని రాయమల్లు కుటిలుండైనయామూఁడవకుమారుని చిత్తూరుసింహాసనంబున గూర్చుండఁబెట్టి దానికీర్తిని జెడగొట్టనిష్టంబులేక యతనిఁదూలఁ బలికెను. అందుచే జయమల్లు నిరాశచేసికొని సురాజమల్లునిసహాయంబున చిత్తూరుసింహాసన మెక్కవలయునని యతనిఁగొంతకాల మాశ్రయించి తుదకునిరాశఁజేసికొని యెచ్చటికోఁబోయెను. రాయమల్లిట్టిస్థితిలోనుండ మాళవరాజు డీకొనెను. అతండు నిద్రించియున్నసమయంబునఁ జిత్తూరుహితంబుఁగోరుచున్న రాజపుత్రులుకొందఱు కదుపడిఁజని మేల్కొలిపి యావృత్తాంతంబు వినిపించిరి.

అంత నా వాక్యంబులు శూలంబులవలె దాఁకనారాయమల్లు సహింపలేక నోట మాటరాక మిన్నకుండె. అతఁడు ప్రాయంబునను న్నప్పుడు మాళవరాజును జయించినబలశాలియైనను నిప్పుడు మాళవరాజన మనంబునభయపడఁదొడంగెను. అంత రాజపుత్రులందఱుచేరి యతనికి ధైర్యంబుఁగొలుపుచుండిరి. ఆసమయమునను రాజపుత్రులందఱిలోను ముఖ్యుఁడైయున్న సురాజమల్లనురాజపుత్రుఁడు రాయమల్లుని సమీపించి యిట్లుసంభాషించె:—

సు.—అన్నయ్యా! మాళవరాజు భయంకరంబగు సైన్యంబుతో వచ్చిమనపురిని జుట్టముట్టెను. వాఁడుబహుక్రూరుండు. బల్లిదుండు. వాని నెదిరించి మనము మన స్త్రీలు నిష్కారణంబుగాఁ జచ్చుటకంటె వానికిలోఁబడుట మంచిది.

రా.—కాని నాజీవితకాలంబులోఁ జిత్తూరు తురుష్కులపాలాయెనన్న యపఖ్యాతిచెందుట నాకిష్టములేదు.

సు.—ఇందఱిప్రాణంబులు తీయుటకంటె నపఖ్యాతి చెందుటయుం మేలే.

రా.—అదికాదు పొరపడితివి. అపఖ్యాతిచెందుటకంటెఁ బ్రాణంబులు విడుచుటయే బాగనితలంచెద.

రాజపుత్రులు.—(అదివిని) వహ్వారే! బాగు, బాగు, రాణాకుఁదగినమాటాడితివి. అదియె నిశ్చయము. మాప్రాణంబులు పోయినపిమ్మటఁగాని జిత్తూరు తురకలవాలగుట కంగీకరింపము.

సు.—ఎందులకీడాంబికపుపలుకులు? మాటలు పెక్కులుచెప్పువారెగానియుద్ధంబునఁ గత్తిబట్టుకొనిపోరాడువిట్టి యొకండును గానరాఁడు. ఇట్టి మూర్ఖులగుమిమ్మాశ్రయించియుండలేను. (ఆసిరాయలంజూచి) నీవు మాళవరాజునకులోఁబడ నిష్టపడకుంటివేని తక్షణంబె నాసైనికులతో శత్రువునిఁజేరెదను.

రా.—ఊరకుండుము.

రాజపు.—మాకుఁ జాలసంతోషము నీవు శత్రునితోఁ జేరఁబోయినఁ బొమ్ము. చిత్తూరు నీతోనే నిలిచియున్నదా యేమి? మేము నీయభిప్రాయము నంగీకరింపము. రాణాయంగీకరించిన మేమూరకుండము.

సు.—"కోపమ్ముతో" ఓరీ! నీచులారా! ఇది చూడుఁడు నాప్రతిన? చిత్తూరు తురష్కులపాలు జేయనిచో నే రాజపుత్రుఁడనుగాను. ఇదెపోయెద (అనిలేచును).

రా.—అందులకు భయంబుతో నేపో యనుచుండ 'రాజపుత్రులందులకడ్డంబు వచ్చి. ఓరీ! నీవట్లుచేయనిచో నీవు నిక్కంపు రాజపుత్రుండవు కావు. మేము తురకలపాలుగాకుండఁ జిత్తూరు సురక్షింపనిచోఁ నిక్కంపురాజపుత్రులము కాము. ఇదే జ్ఞప్తియం దుంచుకొనుము.

అన్న పలుకులు విన్నతోడనే సురాజమల్లక్కడనుండి లేచిపోయెను. అప్పుడు రాయలు దక్కినవారి కిట్లనియె.

రా.—ఓయీ! ఈదురాత్ముఁడు పోయి మనగుట్టుఁ దెలిపి మనకు బాధ గలిగించునేమో?

రాజపు.—మహాప్రభూ! బాప్పారావలువంశమందుఁ బుట్టి చిత్తూరుసింహాసన మెక్కియుండి మీ రిట్టియధైర్యంపుపలుకులు పలికెద రేల?

రా.—అధైర్యముచేఁగాదు. చూచితిరా? నాకుమారు లెవ్వరును లేరు. నేను ముదుసలినైతిని సమరంబు ఘటిల్లించినచోఁ జక్కఁగ సైన్యంబును నడపువారయినను లేరు. అందుచే నిట్లంటిని.

రాజపు.—భయంబులేదు. చిత్తూరును మేము కాఁపాడెదము.

రాయ.—అయిన, నాకుమారునకుఁ బృథ్వీరాజునకు నొకయుత్తరంబు వ్రాసి పంపిన బాగుండునని తలంచెద.

రాజపు.—సభలో మీచే నవమానంబుచెందిన యతండు మీయుత్తరంబుచూచి వచ్చునని తలంపము.

రా.—మఱియేమిచేయుదము.

రాజపు.—ఏమున్నది. చంపుట; లేక చచ్చుట.

రాయమల్లు వారిమాటలాలకించి తనకుఁదప్పదని నిశ్చయించి లేని ధైర్యంబును దెచ్చికొని యుద్ధప్రయత్నంబులుచేసి సిద్ధంబుగనుండె. అట్లుసురాజమల్లు కోపముతో నటనుండి కదలిపోయి తనసైనికులం జేరఁబిలిచి కోటబహిర్భాగంబున వేచియున్న మాళవాధీశునితోఁ జేరవలెనని బయలుఁజేరి సింహద్వారంబు చెంతకుఁబోయి తలుపుతీయుండని ద్వారరక్షకుల వేఁడెను. కాని వారు రాణా యనుమతిలేకుండఁ దలుపుతెఱవమని పల్కిరి. అంత సురాజమల్లు చేయుఁనదిలేక యొక కోటబురుజుచేరి త్రాళ్లువేసికొని గోడదిగి సైన్యంబులతోఁగూడ మాళవ రాజుం జేరెను. అంత మాళవరాజమితానందంబుచెంది సురాజమల్లును గౌరవించెను. ఇట్లు వారిరువురు నుచితమర్యాదలం గావించుకొనినవిమ్మట మాళరాజతని కిట్లనిరి.

మా.—రాజపుత్రా! కర్తవ్యంబేమి?

సు.—ఏమున్నది? కోటను భేదించుటయే.

మా.—అవును. అందుల కుపాయంబాలోచింపుము.

సు.—ఆలోచించితిని. ఇదివరలో దురుష్కులువచ్చి కోటగోడను భేదించియున్నారు. ఆస్థలంబున చిత్తూరువారు మరల గోడను నిర్మించిరిగాని యది మొదటిగోడంత సత్తువకలదై యుండలేదు. అచ్చటనే భేదింప యత్నించిన బాగుండును. కార్యము సఫలమగును.

మా.—ఇంకను జేయవలసిన పనులేమి?

సు.—మన సైన్యంబులోఁ గొంతభాగమును గోటచుట్టును గావలియుంచి లోనివారిని పైకి రానీయఁగూడదు.

మా.—సైనికులిదివఱకే చుట్టుముట్టియున్నారు. కాని లోపలనేపాటి సైన్యమున్నది?

సు.—సంఖ్యకుఁ జాలమందిగలరు. కాని కత్తిఁబట్టుకొనఁగలంత బలముగలవారరుదు.

మ.—"సంతోషముతో" అట్లయిన కోట వశమగుననియే తలంచెద.

సు.—సంశయమేల! స్వల్పకాలములో నేమగునో చూడుఁడు.

అని వారిట్లు సంభాషించుకొనుచుఁ దమబలములను బురికొల్పి కోట గోడను ద్రవ్వ నారంభించిరి. రాజపుత్రులును ఊరకుండక తమశక్తి కొలది నగ్నివర్షంబును శిలావర్షంబును గురియించుచు వారికార్యంబున కంతరాయంబు గల్పించుచుండిరి. మాళవరాజు సైన్యమధికముగానుండుటచే సైనికులు విశేషంబుగాఁ జచ్చుచుండినను వెనుదీయక మిగిలినవారా కార్యంబు జరుపుచుండిరి. అందుచే నది నిరాటంకంబుగ సమాప్తినొందుచుండెను. అది రాజపుత్రులు చూచి తగిన ప్రయత్నంబులఁ జరపి తురకసైనికులఁ జంపుచుండిరి. గాని కోట వారి బారిబడకుండఁ గాపాడలేమను నస్థైర్యం బుదయించినది. అట్లయినను వారు శత్రువులకు లోఁబడియుండ నిష్టపడక కార్యముమించినచోఁ బురుషులు పోరిచచ్చుటకును స్త్రీలు జోహారు చేయుటకు నిశ్చయించుకొనిరి.

---

# ఇరువదినాలవప్రకరణము

“గచ్ఛత్పిపీలికాపంక్తిస్సముద్రమధిగచ్ఛతి” అనెడి పండితవాక్య మొక్కటికలదు. దీనింబట్టియోజింప స్వల్పబలంబుగలవారైనను శ్రద్ధవహించి వెనుదీయక పాటుబడుచుండినచోఁ గార్యసాఫల్యంబు నొందుదురనుట స్పష్టము. సురాజమల్లు సైనికులు, మాధవ సైనికులును, మీఁదనుండి రాజపుత్రులు ఘోరంబుగ శిలాగ్నివర్షంబులు గురియుచున్నను, బట్టినపట్టువదలక చేయుచున్న కుడ్యభేదన క్రియలు చాలవఱకు ముగియఁజొచ్చెను. మరునాఁడాపని ముగించి కోట ప్రవేశింపవలెననియుండిరి. అప్పటికి సురాజమాళవాధీశులు చిత్తూరు వారికి దుర్గబలంబులుదప్ప మఱియొకబలము లేదనియుం నాదుర్గము భేదింపఁబడిన చిత్తూరు వశంబు గావించుకొనుటకుఁ బ్రయాసపడనవసరంబు లేదనియుం మహానందాంబుధిమునింగియుండిరి. కోటలోనివారు గోడచాలవఱకు ద్రవ్వఁబడినదని విన్నతోడనే యింక కోట కాపాడుట కష్టమని భావించిరి. అయినను వారు కార్యమించినచో వారికులాచారంబునడుపవలెనని యెంచియుండిరి. శూరవరులైన యారాజపుత్రులకు యుద్ధమునకుఁబోవుట, వివాహంబునకుఁబోవుట వంటిదే.

కనుక వారు నానందంబునే చెందియున్నారని చెప్పవలసియున్నది. ఇట్లుభయ బలంబులవారు నుభయలోకసౌఖ్యము లనుభవించుటకు రాత్రి యొకటి ప్రతిబంధకంబుగనుండెను. రాయమల్లు చిత్తూరునకువచ్చిన మహాపదతొలఁగించుట యసాధ్యమని తలంచి యేమిచేయుటకు బాలుపోక విచారాతిశయంబుచే నిద్రాహారంబులు విడిచి యుండెను. భానుమంతుం డస్తమింపఁ జీఁకటులు లోకము నావరించెను. ఆకోట కొకవైపు మాళవరాజును, రెండవవైపు సురాజమల్లును గుడారంబులు వేయించుకొని సైనికులఁ గోటచుట్టు గాఁపుంచి జాగరూకులై యుండిరి. రాజు తన గుడారమునందు గూర్చుండి మహానందముతో సంగీతాది వినోదంబులఁ గాలక్షేపంబు చేయుచుండె. ఇట్లు కొంతకాలముప్రొద్దుపుచ్చి తన సేనలో బలవంతులగుతురుష్కవీరులను దనకంగరక్షకులగానియమించి నిర్భయంబున నిద్రించుచుండెను. అప్పటికి జాము న్నరరాత్రి కావచ్చినది. ఆసమయంబున నంగరక్షకులుగా నుండువారలుతప్పఁ దక్కినవారందఱు నిద్రించిరి. అప్పుడబ్దుల్లఖాన నెడి యొకపురుషుఁడు కత్తిఁబూని జాగరూకుండై రాజరక్షణభారంబంతయుఁ దనమీఁద వేసికొని యాగుడారంబుచుట్టును దిరుగుచుండెను. అంతఁ దక్కినవారలబ్దుల్లాఖానుఁజూచి "ఓయీ! మాకు నిద్ర గాఢముగా నావేశించుచున్నది. కొంతసేపు శయనించి తిరిగి మాపనులయందు జాగరూకులమైయుందుము. నీవప్పుడు శయనింపవచ్చును. మేము మేల్కాంచునంతవరకు జాగ్రత్తగాఁ గాపాడుచుండు" మని చెప్పి యిస్పించి శయనించిరి. ఆసమయంబున నబ్దుల్లాఖాను కంటిపై ఱెప్పవేయక కంటిని ఱెప్పవిధంబున గుడారమును రక్షించుచుండెను. అప్పుడుఁ గొందఱు ఘోరశిఖామణు లాయుధపాణులై మాళవరాజు గుడారమువంక వచ్చుచుండిరి. వారాగుడారమును సమీపించి లోనికిఁ బోవుచుండిరి. కాని యెవ్వరు నిర్బంధించినట్లు గానరాదు. అబ్దుల్లాఖాను వారింజూచియే యుపేక్షించెనో, లేక చూడలేదో కాని యతండైన నిర్బంధించినట్టు గానరాదు. అతండు చూచిన పక్షమున దమరాజు గుడారంబును వైరులు చొచ్చుచుండఁ జూచి యూరకుండునా? అట్లు వారు మాళవరాజుశయ్యను జేరి యతనిని బంధించి కొనిపోవుచుండిరి. ఇట్లు వీరు

బాధించుచుండ మాళవరాజు వేసినకేకవిని యబ్దుల్లాఖాను తొందరపడి కత్తి చేఁబూని పర్విడివచ్చెను గాని కార్యము మించిపోయెను. ఇతఁడు చూచునప్పటికి చాముండులు సురంగమార్గముదాఁటిపోయిరి. అంత నబ్దుల్లాఖాను మిగుల విచారముతోఁ బెద్దకేక వేసి సైనికులను ద్వారపాలకులను లేపి తమ ప్రభువును విడిపింపవలెనని వారిని వెంబడించెను. అంత నీవార్త విని కోటచుట్టునున్న సైనికులుఁ జేరవచ్చి పృథ్వీరాజును దాఁకిరి. ఈసమయమున సురాజమల్లావృత్తాతము విని కోటలోనున్న రాజపుత్రు లెవ్వరో యట్లుచేసి యుందురని యెంచి వారిజయించి మాళవరాజును విడిపింపవలయునని సరభసముగఁబర్విడి వచ్చి సైన్యములను బురికొల్పి యాతనిఁ దాఁకెను. పృథ్వీరాజు తన్ను వెంబడించి వచ్చుచున్నవారిం గాంచి యూరకున్న కార్యంబు చెడునని తాఁ గొనివచ్చిన యైదువందలసైనికులలోఁ గొందఱను మాళవరాజును గాచుచుండుమని చెప్పి తక్కినవారితో శత్రువులఁ దాఁకెను. ఆసమయంబు నుభయసైన్యంబులవారికిఁ బోరు ఘోరంబయ్యె. ఆసమయమునఁ బృథ్వీరాజు ప్రళయాంతకునివలె విజృంభించి శత్రుసైన్యంబునఁ బెక్కండ్ర నేలపాలుగావించె. అంత శత్రువర్గంబులో నొకరును ముందు రావెఱచుచుండిరి. అంత సురాజమల్లు మహాపరాక్రమశాలియగు నతఁడు పృథ్వీరాజని తెలిసికొని తొలుతటి గర్వంబు విడిచి పెట్టెను. మఱియుం జయముకొనుట నిశ్చయం బని పర్విడివచ్చిన సురాజమల్లిపుడు పృథ్వీరాజును జూచినప్పుడు తొలుకటియాశవదలి ప్రాణరక్షణకై పాటుపడఁదొడంగెను. ఇంకఁ దనయాటలు సాగవని గ్రహించెను. అయిన నుదార సైన్యోపేతుఁడైన షేము స్వల్పసైన్య సమేతుఁడైన బృథ్వీరాజును జయించి మాళవరాజును విడిపింపలేకపోమని ధైర్యంబు తెచ్చికొని సైనికులఁ బురికొల్పిమరలఁ బృథ్వీరాజును దాఁకెను. అంత పృథ్వీరాజు సైనికుల వెంటబెట్టుకొనివచ్చు చున్న పినతండ్రిని దాఁకి యాతనితోఁ బోరాటమారంభించెను.ఇట్లు వారిరువురు కొంత వడిఁ బోరిరి. కాని సురాజమల్లుపృథ్వీరాజు నద్వితీయపరాక్రమంబును సహింపలేక పలాయితుఁడయ్యె. అతనితోడనే తక్కినసైనికులును తమ పాదములకు బుద్ధిచెప్పి పర్విడఁజొచ్చిరి. అంతఁ బృథ్వీరాజాదులు నిరాటంకంబుగాఁ బోవు

చుండిరి. ఆసమయంబున నబ్దుల్లాఖాను మొదలగు వీరులు కొందఱు తమ ప్రభూత్తముండు శత్రువులకుఁ జిక్కియుండ నూరకుండుట యుచితంబు గాదని లేనిధైర్యంబు దెచ్చికొని మరలఁ బృథ్వీరాజును దాఁకవచ్చుచుండిరి. కాని అది పృథ్వీరాజు చూచి వారిపంకదిరిగి పెద్దయెలుంగెత్తి "ఓరీ! దురాత్ములారా! మీరు సాహసించి ముందుకు రావద్దు. అట్లు వచ్చితిరేని దత్క్షణమంచే మీరాజును బొడిచిచంపెదను. మీరట్లు రానిచో మీ ప్రభువునకేమి యపాయమును గలిగింపక విడిచి పుచ్చెద" నని కేక వేసెను. అదివిని రాజపుత్రులన్నబాటదప్పరు కాన రాజుప్రాణముల కపాయము రాదని నిశ్చయించి మరల నాతని వెంబడింపరారైరి. ఈకలకల మంతయుం విని చిత్తూరులోని రాజపుత్రులు కోటగోడలపైఁ గూర్చుండి శత్రువులు వారిలో వారు కలహించుచున్నారని యెంచి కన్నులపండువుగాఁ జూచుచుండిరి. వారు పృథ్వీరాజు వచ్చియున్నాఁడన్నవార్తయె యెఱుంగరు. అది రాయమల్లు చూచి శత్రువులలోఁ గలహముపుట్టెను గానఁ జిత్తూరు వారిపాలఁబడకుండ గాపాడవచ్చునని యెంచుచుండెను. ఆసమయంబునఁ బృథ్వీరాజు సింహద్వారముసమీపించి తన తండ్రికి వర్తమానమంపెను. అంత రాయమల్లు తనకుమారుండు మాళవరాజును బంధించి గొనివచ్చుచున్నాఁడని విని పరమానందభరితుండయి యెదురుచని కోటలోనికి రప్పించెను. అంతఁ బృథ్వీరాజు మాళవరాజును గొనివచ్చి తండ్రిపాదములపైఁ బడవేసి నమస్కరింప నతఁడు కుమారుపరాక్రమంబునకును, బితృభక్తికిఁ గడుంగడు మెచ్చికొనియె. అనంతరము రాయమల్లు విచారపరీతస్వాంతుండయి యవమానంబుచే వెలవెలఁబోవుచున్న ముఖంబుతో దనపాద సన్నిధినున్న మాళవరాజుం జూచి కనికరించి కట్లువిప్పించి యతని కుచితమర్యాదలఁ గావించె. అంత నామాళవరాజు రాజపుత్రులయౌదార్యభావంబును మెచ్చుకొనుచు వారలొనరించు గౌరవంబును మరణతుల్యంబుగా నెంచుచుఁ దన సైనికులఁజేరి తన్ను రక్షింపనందుల కెవ్వరి నేమన్నను లాభము లేదనుకొని సురాజమల్లుని బిలువఁబంచె. కాని యతండు పృథ్వీరాజు దెబ్బలకు దాళజాలక యెచ్చటికో పాఱిపోయెను. అంత మాళవరాజు వెనుకదిరిగి చూడకుండ

నిజదేశాభిముఖుండై పోయె. తెల్లవాఱినపిదపఁ పృథ్వీరాజు తనజనకుం జేరి యతని నచ్చటనుండుమని రాయమల్లు వేఁడుచున్ననంగీకరింపక తనసైనికులతోఁ గూడి క్రొత్తగాఁ దాను స్వాధీనము గావించుకొనియున్న కమలమియరుదుర్గంబును జేరె. అంత రాయమల్లు దానును బ్రజలును సుఖంబుననుండె. చావునకు సిద్ధంబుగానున్న చిత్తూరువా రమితానందభరితులై సౌఖ్యమనుభవించిరి. జయలక్ష్మి వరింప సిద్ధముగనుండ యమితానందభరితులైయున్న మాళవరాజు నతని సైనికులు నమితదుఃఖంబులపాలై జయంబునకు మాఱుగా నవమానంబు చెందిరి. ఔరా! దైవగతి యచింత్యముగదా!

---

# ఇరువదియైదవ ప్రకరణము

దామోదరసింగట్లు కృతకృత్యుండౌటంబట్టి మాళవరాజుగూడ సురాజమల్లుసహాయంబునఁ జిత్తూరు వశంబుగావించుకొని కృతార్థుండగునని నమ్మియుండె. మాళవభూపతి గూడ విజయంబొందినచోఁ దలంచినకార్యంబులన్నియుం నెఱవేఱినట్టె? దామోదరుండు, తారాబాయి మాళవకుఁ బాపబడినది. కనుక తనస్నేహితుని యభీష్టంబు తీఱుననియు, సూరధానులు మాళవరాజు కారాగృహంబులో నుండుటగాన దాను నిస్సపత్నంబుగాఁ దోధాపురంబేలుకొనవచ్చుననియు, మాళవరాజు చిత్తూరుదుర్గంబు లోఁబఱచుకొని తల్లాభాతిశయంబు నొందియుండుటచేఁ దోధానగరంబును బంచియిమ్మనఁడనియు నిశ్చయించి తనలోఁ దా నమితానందంబు నొందుచుండెను. కాని యా యానందమెంతో కాలము నిలువలేదు. అవును. ఈలోకమందలి యానందంబులు స్థిరంబులయి యుండునా? అవి వెన్నెలలవంటివి. వెన్నెలలు స్వల్పకాలంబు ప్రకాశించి వెంటనే రూపుమాయును. అట్లె యానందంబును మొదటజనించి కనుమూసి తెఱచునంతకాలంబులోనే నశించును. ఇందులకు దామోదరసింగుస్థితియే నిదర్శనము. దామోదరసింగట్లానందభరితుఁడై యుండఁగా నొకభటుండు మెల్లమెల్లన నేతెంచి దామోదరునికి నమస్కరించి యొక యుత్తరమందించె.

దామోదరుఁ డాతురతం దానిఁ గైకొని చదువుకొనెను. దానిసాంతంబుగాఁ జదువునప్పటి కాతని యానందము సూర్యోదయానంతరంబునందలి వెన్నెల చందమాయె. తోడనే దామోదరుఁ డాయుత్తరంబును గ్రిందఁబడవైచి నిట్టూర్పుపుచ్చి తనలో దా నిట్లనుకొనఁజొచ్చె. అకటా! ఎంతపని జరిగినది! తలంచిన తలంపంతయుం వ్యర్థమాయెను. అయ్యో! రాజున కెంతయపమానంబు సంభవించినది. ఉత్తమరాజపుత్త్రులగుటచే దయార్ద్రహృదయులై యతని విడిచిపెట్టిరి. కాని మఱియొకశత్రువయినచో నాతని విడుచునా! యావజ్జీవము చెఱసాలలో నుండు మని యాజ్ఞాపించిన నట్లుండవలసినదే కదా!యేమిచేయఁ గలుగుదుము! పాపము. సురాజమల్లు చేయవలసినసాహాయము చేసినాఁడు. దైవము ప్రతికూల మయినచో నాతఁడేమిచేయఁను? పృథ్వీరాజు తండ్రితోఁబోరాడియెచ్చటికో పోయెనని వినియున్నాము. నాఁడెక్కడనుండి వచ్చినాఁడు ? మాయుద్ధయాత్ర మిగుల గుప్తముగాఁ బ్రవర్తిల్లినదే! దూరదేశమునందున్న పృథ్వీరాజున కెట్లు దెలిసినదో!పృథ్వీరాజే నాఁడు చిత్తూరు చేరకున్న మాయత్నంబులు ఫలించుటలో లోపముండునా ? పాపము. ఆసుల్తా నొకరిజోలికి పోక తలలోనిపువ్వు వాడకుండఁ దనరాజ్యం బేలుకొనుచుండ నేఁ బోయి వానికి జిత్తూరు జయాభిలాషను గలిగించితిని. అట్టి కొనసాగకపోవుటయేగాక మాదుమిక్కిలి యతనికి నగౌరవంబుగూడ సంప్రాప్తమయినది. అందువలన నతనికి నాపైఁ గోపము జనించునేమో ? అతని కగౌరము సంప్రాప్త మగుటకు నేఁ గారణభూతుఁడనై యుండ నాపైఁ గోప మేల జనింపదు? ఒకవేళ జనించినను జనించుఁగాక! నే నతనిమానసంబు హరించినకన్యారత్నంబును గానుకఁగా నంపియున్నాను. అందువలన నతనికోపము నశింపక మానదు అని తలంచుచుఁ బోయిన ధైర్యంబును తెచ్చికొని యేదియో యాలోచించుచుండె. ఆసమయంబున నొక పురుషుం డాయుధపాణియై హయారూఢుండయి తోధానగరంబు ప్రవేశించి వచ్చుచుండెను. అంతవఱకు మహారభసంబున హయంబును బర్వెత్తించుచు వచ్చుచున్నయతనికిఁ దోధాపురంబు కన్నులఁ బడినతోడనె మందముగుపడకుండె. మార్గాయాసంబువలన నాతనికంతగాఁ జెమ్మటపట్టలేదు. కాని పురదర్శనం బొన

ర్చినప్పటినుండి యతనిశరీరమునుండి చెమ్మట లేళ్లవిధంబునఁ బ్రవహించు చుండెను. ముఖంబు వెలవెలఁబోవుచుండె. పెదవులు మాటిమాటికిఁ దడుపుచున్నను నెండిపోవుచుండె. అతనికిఁ బొడముచున్న నిట్టూర్పుల కంతమే లేదు. నాలుకను గదిలేనికారణంబున నోరులతో మాటలాడలేకుండెను. అతఁ డెందుచే నట్టిస్థితిలో నున్నాఁడో యెవ్వరికిని దెలియలేదు. అతని నెఱిఁగియున్నవారు పెక్కురప్పురంబున నున్నవారు. వారలతని నెదుర్కొని వృత్తాంతములేమని యడుగుచుండిరి. కాని యందులకు బదులుచెప్పక దామోదరసింగున్న తావును జూపుఁడని యడుగుచు పోవుచుండెను. ఇట్లతం డెచ్చటను నిలువక దామోదరుఁడున్న తావును దెలిసికొని యతనిమందిరంబుఁ జొచ్చి యొకచోఁ గూర్చుండి యాలోచించుచున్న దామోదరునిఁ జూచెను. చిన్నవోయినముఖముగల యతనిఁజూచినతోడనే దామోదరుని ప్రాణములు మీఁదికెగసిపోయెను. నిశ్చేష్టితుఁడయ్యెను. అట్లు వారొండొరులఁ జూచుకొనుటతప్ప నోట మాటలులేవు. అంతఁ గొంతవడికి దామోదరుఁడు స్మృతి వహించి యావచ్చిన మహమ్మదుతో నిట్లు సంభాషించె.

దా.—ఓయీ తిరిగివచ్చితివేమి ?

మ.—తమ సెలవయినదని.

దా.—నేను నిన్ను రావలయునని కోరలేదే ! రాయలు తారాబాయి యెచ్చట నున్నారు ?

మ.—తమ సెలవుచొప్పున నాఫకీరున కప్పగించితిని.

దా.—త్రుళ్లిపడి అయ్యో ! కొంపముంచితివి ? ఆఫకీరెవఁడో నే నెఱుగను. అకటా ! దుర్మార్గుఁ డెవఁడో మోసముకావించినాఁడు. చెప్పినంత మాత్రమున నమ్మవచ్చునా !

మ.—ఆమాటలు బూటకములని తలంచితిని. కాని మీయుత్తరము నమ్మకము గలుగఁ జేసినది.

దా.—అయ్యో ! నే నుత్తరము వ్రాయలేదే ! ఆయుత్తరము నే వ్రాసినదో కాదో యోచింపవద్దా !

చ.—ఏమి యోచించెదను? మీముద్రతోనున్న యీయుత్తరము విషయమై సందియమేల కలుగును?

దా.—ఆశ్చర్యపడి, నాముద్ర యందున్నదా?

చ.—ఉన్నది.—తమసెలవుచొప్పున మేము జాగరూకులమయి నడిచిపోవుచు క్షేమముగా మాళవదేశము ప్రవేశించితిమి. మేమట్లు పోవుచుండఁగా నొకఫకీరు పర్విడు పెద్దయెలుంగుతో మమ్ము నిలువఁబెట్టి చేరవచ్చి యిట్లనియె. అయ్యా! తోధానగరజనులు దామోదరుని మాటవినక పురం బతనిస్వాధీనముచేయమని వాదించుచుఁ బోట్లాటకు సిద్ధులై యున్నారు. దామోదరాదులబలము మిగులఁ దక్కువగానున్నది. ఈసమయమున నీవు రభసంబునఁ బోయి యాతనికిఁ దోడ్పడవేని చేతికిం జిక్కినపురంబు మరల శత్రువులకు వశమగుచున్నది. దామోదరునకు నేనాప్తుఁడను. నా కీసవారీ నప్పగింపుము. నేను భద్రముగా వీరినిఁ గొనిపోయి రాజమందిరంబుఁ జేర్చెద ననిపలికె. ఆమాటలు విని నిజమొ కల్లయోయని యుల్లంబున విచారించుచున్న నన్నుఁ జూచి ఫకీరు "ఓయీ! నీవు సందేహింపవలదు. నమ్మకములేనిచో నీ యుత్తరంబుఁ జూచుకొమ్మ"ని చేతికిచ్చె. ఆ యుత్తరంబు చూచినతోడనే నాకు నిలువఁ గాళ్లాడక యీసవారీ యతని కప్పగించి సరభసంబున నరుదెంచితిని.

దా.—ఏదీ యాయుత్తరము? చూడనిమ్ము.

చ.—"చిత్తమ"ని (ఆయుత్తర మందించును.)

అంత దామోదరుండు దానిని గొనివచ్చి యిట్లు చదివెను. "ఓయీ, నీవుచన్నదిమొదల లిచ్చట యుద్ధము మెండుగ జరుగుచున్నది. తోధాపుర వాసులు తిరుగఁబడి నన్నును నా సైన్యమును నానాబాధలం బెట్టుచున్నారు. మాలో బల్లిమండ వగుకేవరుగుటచే నపజయము పొందుటయేకాక ప్రాణంబులవిషయమైకూడ సందేహింపవలసియున్నది. ఈ ఫకీరు మన కాప్తుఁడౌటి

లోనివాఁడు. ఇతఁడు మంచి యుపాయశాలి. మాళవరాజాంతఃపురంబులో నున్నను సంశయమందవలసినది కాని యీతని కధీనమైయున్న వస్తువునకు భయపడ నవసరములేదు. కావున నాసవారీని మనస్నేహితుని యధీనముకావించి వెంటనే రమ్ము. తోడుపడుము. మమ్ముల రక్షింపుము. మార్గాయాసమునకు జంకకుము. నీరాక కెదురుచూచుచున్నవాఁడ" అని తన ముద్రతో నొప్పుచున్న యాయుత్తరంబునుజూచి విచారాంబుధిలో మునిఁగి కొంతవడికిఁ దెలివి తెచ్చికొని మహమ్మదుతో నిట్లనియె. అక్కటా! ఎంతమోసము జరిగినది. కార్యమంతయుఁ జెడినది. ఇందువిషయమై నిన్ను దోషినిగా నెంచుట తగదు. నేను దోషినిగాను. అనిచెప్పి పూర్వము భిల్లవాటికకుఁ బోవునప్పుడు భిల్లవాటికకు దారిఁజూపినందుకుఁ గూలిగాఁ దన ముద్రాంగుళీయకమునిచ్చి తిరిగి దానిఁ బుచ్చుకొనకపోవుట నే కదా యిట్టియవస్థ సంప్రాప్తమయిన దని మిగుల విచారించుచు తుదకుఁ దనలో నిట్లనుకొనెను. చక్కఁగా నాలోచించిచూచిన నే నిరపరాధుండను. అయినను బయివారు నన్నపరాధిగా గ్రహింపకమానరు. రాజపుత్రుఁడనయిన నేను దురకయయిన మాళవరాజును వంచింప నిట్లు చేసితినని తలంపకమానరు. మఱియుం బైకి దారాబాయిని దురకయయిన మాళవరాజున కిచ్చునట్లు పలుకుచున్నను రాజపుత్రస్త్రీలగౌరవము చెడగొట్ట నిష్టములేకయే రహస్యముగా నతఁడొకయుత్తరము తనమిత్రునికి వ్రాసియిచ్చి మాళవను ప్రవేశించిన తారాబాయిని రాయలనెచ్చటికో పంపియున్నాఁడని నిశ్చయింపక మానరు. నామానసంబునఁ జిత్తూరుపురంబు మాళవరాజాధీనముచేయవలె నని యున్నను బరులు మాళవరాజున కవమానముకలిగించుటకే చిత్తూరుముట్టడించు మని మాళవరాజునకు దురాలోచన చెప్పెనని నిందింతురు. ఈ రెండుకార్యంబులు మాతలంపునకు వ్యతిరిక్తములగుటచేతను, నే రాజపుత్రుఁడ నగుటచేతను, నన్ను వంచకునిగాను, నపరాధినిగా యోజింపకమానరు. ప్రజలనుకొనిన మనకు నష్టములేదని తలంపరాదు. వారీసమాచారములను క్రమక్రమముగా మాళవరాజుచెవి నెక్కించి నాపైఁ గోపము దెప్పింపక మానరు. అందువలన నతఁడు కోపోద్దీపితుండై తన సైన్యముతో వచ్చి నన్నుఁ జంపి తోధాసంస్థానమును

గొనకమానఁడు. అట్లైన చిరకాలమునుండి రాజపుత్త్ర ప్రభువుల పాలనములో నున్న తోధాను రాయలకుఁ జెందకుండ నాకుం జెందకుండ నిష్కారణముగాఁ దురుష్క ప్రభువు పాలనమున కప్పగించి దేశద్రోహి నగుదును. కావున నిప్పుడు నేనొరులెఱుఁగకుండ మాళవదేశమునకుఁబోయి మాళవరాజు పాదములు పట్టుకొని యిందలి యాథార్థ్యముఁ జెప్పి యతనిమానసంబునకు నమ్మకము కలుగునట్లు చేసి తారాబాయిని శీఘ్రకాలములోనే కొనివచ్చి పెండ్లిచేసెదనని నమ్మించి యతని యనుగ్రహంబునకుఁ బాత్రుండనయితీఱవలె. పృథ్వీరాజు దేశములోనున్నట్టును మనకు శత్రువుఁడై యున్నట్టును దెలిసినది. కావునఁ దక్కిన సైన్యంబుతోఁగూడ మాళవరాజును గొనివచ్చి తోధాపురంబున నుండునట్లు చేసెద. లేనిచోఁ జేతఁజిక్కినతోధాపురంబు శత్రువులపాలగును. మేమింతకాలమునుండి పెక్కుకార్యంబులొనరింపఁ బ్రయత్నించినను సఫలంబయినది యిదియొక్కటియె. కావునఁ దీని పరులకధీనంబుకాకుండ గాపాడవలయును. మాళవరాజునుగూడ నిచ్చటికిఁ గొనివచ్చినంగాని యీపురము తగినంతరక్షణలో నుండదు అని నిశ్చయించి మహామ్మదును మాధవసింగును మఱికొందఱను బిలిచి పురంబు జాగ్రత్తగాఁ గాపాడుచుండుఁడనియుఁ దన ముద్రాంగుళీయకము శత్రువులకుఁ జిక్కియున్నదికాన తన్ముద్రాంకితములగు నుత్తరముల వెంటనే నమ్మవద్దనియుం వారల కాజ్ఞాపించి యొరులకుఁ దెలియకుండ మాళవకుఁ బోయెను.

---

# ఇరువదియాఱవ ప్రకరణము

రాజపుత్త్రస్థానమున బదనూరనునొకపురవరంబు గలదు. అది చిత్తూరు మండలములోనిది. అందుగలరాజులందఱును మిగుల బలశాలులు. పూర్వము చిత్తూరురాణాయొకఁడు వారిబలశౌర్యములంజూచి సంతసించి యాబదనూరు భూములను వారికిచ్చి, పన్నులేకుండ ననుభవించుచు, సమరసమయములందుఁ దోడ్పడుచుండవలయునని యాజ్ఞాపించినందున వారందులకంగీకరించి యప్పటి

నుండియుం దా భూములను స్వేచ్ఛచే ననుభవించుచుండిరి. కాని యుద్ధములందుఁ జిత్తూరువారికి సాయముచేసినట్లు కానరాదు. రాయమల్లుఁ డది తెలిసికొని యొకప్పుడు సమరము సంభవింపఁగా నాబదనూరు వారినందఱిని వచ్చి తమకు సాయపడవలయునని యాజ్ఞాపించెను. బదనూరురాజులలో నొకటిరెండు కుటుంబములవారు మాత్రము రాజశాసనము మన్నించి సాయపడిరి. కాని తక్కినవా రట్లుచేయక రాజశాసనమును నిరాకరించిరి. అందులకు రాయమల్లు కోపించి తనకు సాయపడనివారిభూములనన్నింటిని పుచ్చుకొనియె. చిత్తూరు వారికి సహాయభూతులై వారిగౌరవమునకుఁ బాత్రులైయున్న యొకకుటుంబము వారు తోడానగరపురాజునకు దగ్గరబంధువులు. సూరతాన్రాయలు కుమారికా సహితుండై తనకుబంధువులగు నాబదనూరు రాజులనింట నివసించియుండెను. ఆరాజకుటుంబము వారు, రాయలు తమకు బంధువగుటచేతను, సంస్థానాధిపతి యగుటచేతను, నతని నధికమగు గౌరవంబుతోఁ జూచుచు, నెట్టిలోపమును గలుగ నీయక పోషించుచుండిరి. అట్లు వారు తన్ను గౌరవముతోఁ బోషించుచున్నను రాయలు వారియింటనుండుట తనకొకగౌరవలోపముగానే భావించుచుండెను. మఱియుఁ దన్నును, దనకుమారికను బదనూరికిఁ గొనివచ్చినవారెవ్వరో యెఱుంగఁడు. తోడానగరాంతఃపురమున నిద్రించుటయుఁ, బిమ్మట దామోదర్రావులు వచ్చి నోట గుడ్డలుక్రుక్కి సవారిలోఁబడవైచి కుమారితోఁగూడ మాళవకుఁ గొనిపోవుచున్నట్లుమాత్ర మతఁడెఱుఁగును. తా నట్లు మాళవరాజు కారాగృహంబునకుఁ గొనిపోఁబడుటకు మాఱుగా బదనూరుపురంబుననున్న బంధువుల గృహంబున కెవరిచేఁ గొనిరాఁబడిరో సుంతేనియుఁ దెలియదు. ఆతని కావృత్తాంతమును మనంబునఁ దలంపునకువచ్చినప్పుడది యొకస్వప్నమువలె నత్యాశ్చర్యకరముగాఁ దోఁచుచుండె. ఆసందియమును బాపుటకై తనబంధువులనడుగ వారొక సన్యాసి గొనివచ్చి యప్పగించిపోయెనని చెప్పిరి. రాయ లదివిని భగవంతుఁడు తనయందు దయయుంచి సన్యాసివేషము బూనివచ్చి తమ్మును శత్రువులబారినుండి తప్పించి బంధుమందిరంబునకుఁ జేర్చిపోయె నని తలంచుచుండెను. అంతటియసాధ్యకార్యమును జేయ భగవంతుఁడు తప్ప మఱియొకఁడు సమర్థుఁడై యుండఁడని

యతనికిఁ బెద్దనమ్మకమున్నది. తారాబాయి యామాటలు విన్నప్పుడు నాఁడా దొంగలనుండి కాచిన పరోపకారధురీణులలో నొకపురుషుఁడు సన్న్యాసివేషము నూని తమ్ము శత్రువులనుండి రక్షించి బంధుగృహమునకుఁ జేర్చియుండునని తలపోయుచుండెను. తారాబాయి యట్లు తలపోసినను దమ్ముఁ బ్రోచినపురుషుఁడు తమపాలిట భగవంతుఁడనియే నిశ్చయించియుండెను. రాయలొక్కొకప్పుడు తనకును దనకుమారికకును జరిగినయపాయంబులఁ దలంచికొని మిగుల విచారిం చుచుఁ, దనకుమారికవిషయమయి తాను స్థిరపఱచుకొన్నమనోరథములు భగ్నములయినందులకు మిగుల వగచుచు, మఱొక్కొకప్పుడు శత్రువులకుఁ జిక్కియుఁ దప్పించుకొనివచ్చినందుల కమందానందమునొందుచుఁ, దన్నుఁ జూడ వచ్చినబంధుగులకు దర్శనమీయ విన్నవోవుచుఁ గాలంబు గడపుచుండె. తారాబాయి తనతండ్రి ప్రవర్తనమంతయు నరసి తనలో నిట్లనుకొనియె. అక్కటా! మాబంధువులు మమ్ముల నత్యాదరముతోఁ జూచుచున్నను, బరుల వంచఁదలఁదాఁచుకొవలసివచ్చెఁగదా యనువిచారముచే నాజనకుఁడు మిగుల బాధింపఁబడుచున్నాఁడు. మాజనకుఁ డిట్టిదుఃఖంబులపాలగుటకుఁ గారణభూతను నేనే? మాతండ్రి పుత్త్రవంతుఁడైనను, సంతానవంతుఁడు కాకపోయినను, నిట్టిదుఃఖంబులు సంభవింపవుగదా? కన్నతల్లిదండ్రులకు సౌఖ్యంబొడగూర్చుట సంతతికి విహితకృత్యము. అట్టుండ జననీజనకులకు సౌఖ్యంబులొడఁగూర్పలేకపోవుటయే కాక మొదటిస్థితిలోనైన నుండనీయక యధికదుఃఖంబులపాలుచేయుట మిక్కిలి క్రూరకార్యము. అట్టి క్రూరకర్మ మొనరించెడి కృతఘ్నులలో నే నొకర్తుకను. అకటా! నాకృతఘ్నత్వ మెట్లు దొలఁగించుకొందును? మరల జనకుని తో ధారాజ్యంబున కభిషిక్తుం జేసి యున్నతసుఖంబుల నందించినంగాని యాకృతఘ్నత్వము తొలఁగిచనదు. అట్టిదుర్ఘటకార్యంబు నే నెట్లు నెఱవేర్పఁగలను? మాళవరాజదామోదరుల గెల్చునంతటి సైన్యముండినచోఁ గార్యము నెఱవేర్ప సమర్థురాలనై యుందును. కాని యట్టి సైన్యము నాకెట్లు లభించును? తగినసైన్యము లేనప్పు డెవరితోఁ గత్తికట్టి పోట్లఁబోరుదాన? ఎట్లయిన నిక్కార్యము కొనసాగించుట కష్టము.

హా! దైవమా! ఎంత యాపదలపాలు గావించితివి? ఓరీ! దామోదరా! ఎంతపని చేసితివి? అయ్యో! రత్నసింగున్నచో మా కిన్నిపాట్లు సంభవింపకపోను. ఓరీ! మాధవా! మాకు హితకారివలె సంచరించుచు మమ్ముల నధఃపతితులఁ గావించినపాపము నిన్నుఁదుదముట్టింపక విడుచునా? అయ్యో! చెలియా! రమాబాయీ! మానిమిత్తము నీ వెట్టిదుఃఖంబులఁబొరిఁ బడుచున్నావో? దురాత్ముఁడయినమాధవసింగు నిన్ను వలచియున్నాఁ డనివింటిని! ఆమాయావి నీ కెట్టియిడుములఁ గుడిపించునోగదా? ఓకరుణాసింధూ? ఓభగవంతా! మమ్ముల నెప్పటికయిన నొకచోఁజేర్చి మరల నానందము గలిగింపుమా! అని యిటు పలువిధంబులఁ జింతించుచుఁ గాలంబుగడపుచుఁ దుదకు నిజకార్యనిర్వాహకమగు నొకయుపాయమాలోచించి యదియె కర్తవ్యమనుచు నిశ్చయించి జనకాదులగు పెద్దలమ్రోల నిట్లు శపథంబు గావించె.

శా.—ఓరాజన్యవరేణ్యులార! పగరన్ యుద్ధంబునం గెల్చి తో
ధారాజ్యంబునకుం బ్రశస్తగుణు నుద్యత్కీర్తి మాతండ్రి నిం
పారం బట్టముగట్టు నట్టి వసుధాధ్యక్షుండు పో సుందరా
కారుం డైనఁ గురూపియైననుఁ దగంగా నాకుఁ బ్రాణేశుఁడౌ.

తారాబాయి యిట్లు శపథంబుచేసి రాజస్థానంబునఁ జాటఁబంచె. అది విని యచ్చటివారందఱు నామెపితృభక్తికి మిగుల సంతసించిరి. తార పృథ్వీరాజునుదప్ప నొరునిఁ బెండ్లాడ నిష్టము లేకపోయినను, పితృభక్తి కధీనురాలయి తనసౌఖ్యమునైన వదలుకొని తండ్రిసౌఖ్యంబునే ప్రధానముగా నెంచుకొనుచున్న యామెస్వభావము మిగుల వర్ణనీయముగదా?

---

# ఇరువదియేడవ ప్రకరణము

దామోదరుఁ డట్లు మాళవకుఁబోయి తనవచనరచనలచే మాళవరాజు డెందంబున కానందంబు గలిగించి యతనిఁగొనివచ్చి తోధాపురంబున నివసింపఁ జేసి యప్పురంబున దగినరక్షణలో నుంచెను. కాని తారాబాయినిఁ గొనివచ్చి

రాజునకుఁ బెండ్లి చేయుంట యెట్టులోఁ దెలియకుండెను. తానా! తారాబాయినిఁ గొనివచ్చి రాజునకిచ్చినచో వానికిఁ దోధానగరాధిపత్యము లేదు. మాళవరాజు తోధానగరంబునకు వచ్చినప్పుఁడట్టి వాగ్దానంబు చేసికొనియె వచ్చినాఁడు. అందుచే వాఁడు సర్వకాలసర్వావస్థలయందు దారాబాయికై ప్రయత్నంబు సలుపుచుండె. ఇది యిట్లుండ నొకనాఁడు దామోదరుండు తనకు మిత్రుఁడైన మాధవసింగుతో నొక్కచోఁ గూర్చుండి యిట్లు సంభాషించె.

దా.—ఓయీ! మిత్రమా? నేను తోధాపురంబును వశంబుగావించుకొనుటలో నీవు చేసినసాయము వేయిజన్మంబులకయిన మఱవఁజాలను.

మాధ.—నేఁ జేసినసాయ మేపాటిది? నాయందు మీకు దయ మెండుగనుక నిట్లనుచున్నారు?

దా.—దయచే నన్నదికాదు. యాథార్థ్యంబున నే వక్కాణించితి! వహ్వారే! నా నిమిత్త మెంతకష్టపడి కార్యంబుసాధించితివి! ఎప్పటికైన నీకుఁ బ్రత్యుపకారంబు గావించి నాఋణంబును దీర్చుకొనవలయును.

మా.—మహారాజా! మీకు నాయందంతనుగ్రహమున్నచో నేనొక వస్తు వడుగుచున్నాను. దయచేయుండు. దానిని మీ రొసంగినచో మీరు చేసిన యుపకారం బెన్నటికి మఱవను.

దా.—సాధ్యమయినచోఁ దప్పక యిచ్చెదను.

మా.—సాధ్యము కాకేమి! మీహస్తగతమైనవస్తువే.

దా.—చెప్పుము. సందియమేల? అట్టివస్తువైన నీకుఁ దప్పక యొసంగెదను.

మా.—నే నొక స్త్రీరత్నంబును గోరుచున్నాను. ఆ రత్నము నాకు బహుమానంబుగా నొసంగినఁ జాలు.

దా.—ఆస్త్రీ యెవ్వరో చెప్పుము.

మా.—రమాబాయి.

దా.—పకపకనవ్వి అబ్బ! ఎంతకోరికఁ గోరినావు. ఆమె యనాథయేకదా!

మా.—అవును.

దా.—అట్టియిన నుత్తమరాజపుత్రుఁడ వయిన నిన్ను వరింప నాలోచన యొందుకు ?

మా.—రత్నసింగును బెండ్లాడవలెనని యున్నదఁట.

దా.—రత్నసింగు చచ్చియుండె నెట్లు పెండ్లాడును.

మా.—ఏమో! తెలియదు. వెనుక నేనొకనాఁడు నాయభిప్రాయం బామెకుఁ దెలుపఁగాఁ దలవాఁచునట్లు దిట్టినది. అప్పటినుండియు నే నామెతో మాటాడలేను. కాని నామానసం బామెనుండి మరలక బాధపడు చున్నది.

దా.—నీవేమియు మాటలాడవద్దు. నీకార్యంబును నెఱవేర్చువాఁడను నేను.

మా.—(సంతసించుచు) దేవరతలంచినఁ జాలు. ఎట్టికార్యంబులయిన సఫలంబు లయితీరు. ఇక్కార్యంబన నెంత !

దా.—నిజమే. ఇది యేపాటిగొప్ప కార్యము. ఆ కన్యకను వివాహమాడినట్లు నమ్ముము. అని పలికెను.

మాధవుం డామాటలు విని యమితానందంబుచెంది తనకార్యమయినట్లు భావించుకొనుచుండె. అంత నొకనాఁడు దామోదరుఁడు మాధవుని కార్యంబు నెఱవేర్పనెంచి రమాబాయిమందిరంబునకుఁ బోయె. రమాబాయి వాని మోఁము జూడవెఱచి తెరచాటునకుఁ బోయి నిలిచెను. అంత దామోదరుండు తెరయొద్దకుఁబోయి యచ్చటనున్న యొకయాసనంబున నాసీనుండయి రమాబాయి నుద్దేశించి యిట్లనియె. అమ్మాయీ ! రమాబాయీ ! నీవు విచారింపవలసిన యవసరంబు లేదు. నీకు సూరథాను లెట్టివాఁడో, నే నట్టివాఁడనే. రాయలు నిన్నెంత ప్రేమతోఁ బెంచెనో నేను నంత ప్రేమతోఁ బెంచెదను. నీ కెట్టిలోపంబును గలుగనీయను. నేను తోధానగరంబునకుఁ బట్టాభి షిక్తుఁడ నయినపిమ్మట నీకొకసౌధరాజంబునుఁ గట్టించియిచ్చెద. నీకు మహా వైభవంబుతోఁ బెండ్లిగావింపవలెనని యున్నది. నీకుఁ దగినవరుని సంపాదించి యున్నాను. అతఁడు క్షత్రియుండు. మిగుల మంచిగుణంబు గలిగినవాఁడు.

అతండు చిరకాలంబునుండి నిన్నుఁ బ్రేమించియున్నాఁడు. అతండు సౌందర్యవంతుండు కాని కురూపిగాఁడు. అతండు బుద్ధివిశేషంబులుగలవాఁడు. కాని మందుండు గాఁడు. నీవు రత్నసింహునేమో పరిణయింప నెంచియున్నావని విన్నాను. ఆ కోర్కి నిష్ఫలంబు. వాఁడీలోకంబునే విడిచియున్నాఁడు. కావున వానినెట్లు పెండ్లాడుదువు? గుణంబులందును, సౌందర్యమందును మాధవసింగు రత్నసింగునకుఁ దీసిపోఁడే? నావాక్యంబులు హితంబులుగాఁ దలపోసి మాధవసింగును వరింపుమని పలికెను. అతని వాక్యంబులు విన్నసమయంబున రమాబాయికిఁ బొడమినకోపంబునకు హద్దులేదు. చంద్రబింబమువలె నుండు నామె మోము సూర్యబింబంబుభాతిఁ గన్పట్టె. ఆమె కన్నులు మిక్కిలి యెఱ్ఱవాఱె. కోపాతిశయంబున నామె శరీరలత వాయుప్రేరితం బగువల్లి విధంబునన్నల్లలనాడఁ జొచ్చెను. అంత రమాబాయి తనకోపాతిశయంబు నడంచుకొనుచు నాదామోదరున కిట్లనియె. ఓరీ దురాత్మా! నీమొగంబుఁ జూడ నాకు సిగ్గగుచున్నది. ఇచ్చటినుండి లేచిపొమ్ము. నీవు రాజపుత్రుఁడవా? ఆమాటఁ బలుకునప్పుడు నీకు లజ్జవొడమలేదా? నీవు నిన్ను రాజపుత్రునిగా భావించుచున్నావేమో? నీవు కడజాతివాఁడవు కాని, రాజపుత్రుఁడవు కావు. ఓరీ, తుచ్ఛా! గొడ్డును గోసికొనితిను మ్లేచ్ఛులసహవాసంబుచేయుచు, వారల పాదధూళి శిరంబున మోయుచు వర్తిల్లుచున్న నీవు రాజపుత్రుఁడ వెట్లౌదువు? రాజపుత్రులకుండవలసిన గుణంబులు నీకేమిగలవు. స్వకులాచారంబుల నీవేమిరక్షించుచున్నావు. అక్కటా! పారఁబడితివి. నీవు వానినెఱిఁగినఁగదా రక్షించుకొనుట సంభవించుచున్నది. నీకులమేదో నీ వేమాచారంబుల నడుపవలయునో నీకేమియుఁ దెలియదు. రాజపుత్రులన్నను, మ్లేచ్ఛులన్నను నొకజాతివారనియె భావించుచున్న దుర్మార్గుండవు నీవు పాపంబులకుప్పవు. కానిమనుష్యుండవు కావు. నీరాజ్యకాంక్ష యెందఱికిపుత్తుక లుత్తరించుచున్నది. పరమగుణాఢ్యుండయిన యీగోపాలసింగు ఉసురులుపోసికొన్న పాపాత్ముండవు నీవేకదా? అక్కటా! ఆ తారాబాయి యెంతయోగ్యురాలు. ఆమెంబోలినయుత్తమురాలు లోకంబున మఱెవ్వరుఁ గలరు? అట్టియుత్తమురాలినిఁ గొనిపోయి కటికతురకకుఁ బెండ్లిజేయఁ బూను

కొన్న నీతల శతధాభిన్నము కాకున్నదేమి? అట్టివారలను బాధించిన పాపంబు నిన్ను దిగమ్రింగక మానదు. నీచుఁడయిననీవు లజ్జావిహీనుండవయి యధర్మములాచరించుచుండినను ధర్మసంస్థాపనాపరుండైన భగవంతుఁడు వానిఁ దుదముట్టింపక మానఁడు. కావున నీచేతఁజిక్కిన తారాబాయియుఁ రాయలు తప్పించుకొనఁగలిగిరి. నీవు వేయిప్రయత్నంబులు చేసినను వేయిమాయలు పన్నినను నీకోర్కె యెప్పటికిని సమకూడదు. ధర్మమే జయించుఁగాని యధర్మమట్లుకాదు. అంతియకాక యధర్మమునాశ్రయించిన వాని నధోగతి పాలు చేయకమానదు. కావున ధర్మమార్గవర్తియగు సూరథాసులే జయముఁబొందుదుఁగాని నీ వెన్నటికిజయమొంద లేవు. తోడారాజ్యసింహాసనం బెక్కఁగలనని కలయందయినఁ దలంపకుము. నీవు తోడారాజ్యంబునకభిషిక్తుండ వగుదువా? అందుల కెన్ని జన్మంబులెత్తవలెను? నీవంటి వానికి రాజపదంబు లభించినచోఁ బ్రజ లంతమొందవలసినదే కదా? నాకొకసౌధంబు గట్టించి యిచ్చెదవా? ఆహా రే! నాయం దెంత యనుగ్రహమున్నది. ఓరీ బుద్ధిహీనా? నీకు నిలువనీడ లేదుగాని నాకు సౌధరాజంబు గట్టింతువా? ఎందుకీ చేతగానివాగ్దానంబులు? నాకు నీవు పెండ్లిచేయుదువా? నీ పూరతున్నఁ జాలును. మఱియుం రత్నసింహునకు మాధవసింగునకుఁ గల తారతమ్యంబులు నీవేమియెఱుంగుదువు? చక్కఁగ యోజింపఁగ వారిరువురికి హస్తిమశకాంతరము గలదు. పెండ్లియాడుటకు రత్నసింగీలోకంబున నున్నఁ గదా? యనియంటివి. ఈలోకమందు లేనిచోఁ బరలోకమున నున్నాఁడు కదా? ఆలోకమందే పెండ్లాడెదను. అంతియకాని నీవు చెప్పినపల్కులు విని నీకట్టించు సౌధరాజాదుల కాసపడి మాధవసింగును పెండ్లాడుదాననుగాను." అని యిట్లు నిర్భయంబుగాఁ బలుకు రమాబాయి తిరస్కారవచనంబు లాలకించి దామోదరుండు నడుమఁ ద్రొక్కిన నాఁగుబామువలెఁ గ్రుళ్ళిపడి క్రోధావిష్టమానసుండైన రమాబాయి కిట్లనియె. ఓసీ! నీచురాలా! చూడఁబోయిన గోరంత లేవు. కాని నోరికిరాని కాఱులఱచుచున్నావు. 'నాగుణంబులు గనుఁగొనుటకు నీవెంతదానవు? నీకంటికి నేను గడ్డిపోచవలె గనుపడుచున్నాను గాఁబోలును! నేను మొదట సామవాక్యంబులఁ బల్కుటచే నీకు భయపడితినొ యిట్లు

మాట్లాడుచున్నాననుకొనుచున్నావు. దామోదరుని ప్రభావంబు నీవెఱుంగవు కాఁబోలు! ఎంతలేసివారలయిన నాబుద్ధిచాతుర్యంబుచే నవలీల భేదింప శక్తి గలవాఁడ నని నమ్ముము. తారాబాయియుం రాయలును దప్పించుకొనుటచే నా చేసినపను లధర్మములయ్యెనా ? కొద్దిదినంబులలో వారల నేరీతినైనఁ గొనివచ్చి తీతెదను. నాకంఠంబున బ్రాణంబులుండ సూరధానులువచ్చి తోధానగరంబునుఁ బాలించుట మిథ్య. తోధానగరంబునకు నేనే రాజును. పురమంతయుం నా కధీనమయినది కానఁ బౌరులందఱు నావారలే. వారందఱు నాయాజ్ఞ శిరసా వహించితీఱవలెను. అట్లె పురమందలివారందఱు నాయానతి పూలదండచందం బునం దాల్చి నాచెప్పినచొప్పునడుచుచు నన్నత్యంతము గౌరవించుచున్నారు. నాపురంబుననున్న దానవు గాన నీవు నాయానతి తలఁదాల్చి తిరుగవలయుం. నేఁజెప్పినచొప్పున నడచితీరవలయుం. నన్నెంతయుఁ గారవింపవలయును. అట్లుండ నీవు నన్నుఁ దిరస్కరించి పలుకుచున్నదానవు. సాటిరాజపుత్ర స్త్రీవని నేనెంతయుఁ గారవమునుఁ జూపిమాట్లాడుచుండఁగా నది నీవు గ్రహిం పక యన్యథా భావించుచున్నావు. నీవు యోగ్యురాలవనియెంచి నిన్నొక రాజపుత్రునకిచ్చి పెండ్లిచేయఁదలఁచినాను. ఈ సంభాషణవలన నీదుష్ట స్వభావముఁ దెలియవచ్చినది. కావున నిన్ను మాధవసింగునకీయక యొక్క కఱకుతురకకే యిచ్చి పెండ్లిచేసెదను. చూడుము నామహిమ. పంజరంబునఁ జిక్కినచిల్కచందమున నీవు నాచేతిలోఁ జిక్కితివి. నీ వెచ్చటికిఁ బోఁగలవు ? నీకు రాజపుత్రుని భర్తగాఁబడయునంతటిభాగ్యంబు లేదు. బ్రహ్మ నీనుదుట మహామ్మదీయుఁడే భర్తయగునని తప్పక వ్రాసియుండును. లేనిచో నీకిట్టి చెడుబుద్ధులు పుట్టవు. నేను తురకను గొనివచ్చి నీకుఁ బెండ్లిచేయనిచో నా పేరు దామోదరుండు కాఁడు. నే రాజపుత్రుండను గాను. ఈశపథం బెన్నటికిఁ దిరుగదని గ్రహింపుము.” అని పల్కిన దామోదరునిమాటలు శూ లంబులవలెఁ దాఁక రెట్టించినకట్టలుకతో రమాబాయి తిరిగి యిట్లనియె. ఓరీ ! నీతుచ్ఛపుంబలుకులకు జంకుదాననుఁ గాను. నేను నీకుఁ జిక్కితినంటివి. అదియె న్నఁడును బొసఁగదు. నాశరీరం బీ పురంబుననున్నందుననీకుఁజిక్కినఁ జిక్కుఁ

గాక. సాహసంబు నీకుఁ జిక్కదే; నన్నుఁ గొనిపోయి కఱకుతురకకు బెండ్లి జేయుదువా? ఆకార్యంబు నెఱవేర్ప మూఁడవకన్నుఁ బెట్టుకొని రావలదా? రమాబాయి యనఁగా సామాన్యస్త్రీయని తలఁపఁబోకుము. నీ ప్రతినలకు భయపడుదు ననుకొంటివా? తాటాకులచప్పుళ్లకు కుందేళ్లు జడియవన్న సామెత దేవరవా రెఱుఁగనిది కాదు. నేను నొక శపథంబును బూనుచున్నాను. నాకంఠములో జీవముండ నే మహమ్మదీయుని వరింపను. అట్లు చేయనిచో నే రమాబాయినిఁ గాను అని నిశ్చయంబుగాఁ బ్రతినపట్టె. దామోదరుం డది విని యామెను జంపవలె నని మొదటఁ దలంచినను దన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనవలయు నని కాఁబోలు మాఱుమాటాడక యచ్చటనుండి కదలిపోయె. అంత రమాబాయియు నింతేనియు మానసంబునఁ గొంకులేక యెప్పటియట్ల ప్రవర్తించుచుండె.

---

# ఇరువదియొనిమిదవ ప్రకరణము

అకటా! నాకుమారిక చేసిన ప్రతిజ్ఞ మిగుల విచారకరమైనది. తోధాను గెల్చి నాకిచ్చినవానిఁ జేపట్టునఁట! వాఁడు కురూపియైనను భర్తగాఁ జేకొనునఁట! అయ్యో! దుష్టగుణుండుఁ గురూపియు నగు రాజకుమారుఁడు రాజ్యము గెల్చియిచ్చినచో వానిఁ దప్పక పెండ్లాడవలసినదే కదా? అట్లయిన నామె యావజ్జీవము సౌఖ్యంబులకు దూరమయి యుండును గదా! నాపడుచున్న దుఃఖంబును గనిపెట్టి సహింపలేక తనసౌఖ్యంబునైన నాసింపక నాదుఃఖంబు దొలఁగింప నిట్లు చేసినది. అయారే! ఆమె పితృభక్తి యెంతయుఁ శ్లాఘనీయము. ఇంతకు నేమి? ఆమె ప్రతిజ్ఞ నెవ్వరు నెఱవేర్పలేనిచో నిఁక బ్రహ్మచారిణియై యుండవలసినదే! ఈకార్యంబు నెఱవేర్చునట్టి రాజపుత్రు లుండకపోదురా? లేకపోయినఁ బోవచ్చు. మాళవరాజన సామాన్యుండే? వానికి నుదారసైన్యంబుఁగూడ గలదు. ఇంతియకాక నీతినిపుణుం డగు దామోదరుం డగ్గికి వాయువుదోడ్పడునట్లా మాళవరాజునకుఁ దోడుపడి యున్నాఁడు. కావున మాళవరాజు నోడించునంతటిబలశాలి యెవఁడున్నాఁడు? ఇక్కార్యము

దుర్ఘటమైనట్లే తోఁచుచున్నది. దైవానుగ్రహమువలన నీకార్యము సంఘటించుఁగాక. పృథ్వీరాజు మాళవరాజునోడించి చిత్తూరు సహాయమునుండి కాచియున్నట్లు వినియున్నాను. ఇక్కార్యము నెఱవేర్చిన నెఱవేర్పఁదగిన రాజకుమారుం డీతండొక్కండే. అతండే వచ్చి యిక్కార్యంబు దీర్చినచోఁ దారాబాయి ప్రతిజ్ఞ సఫలమగుటయే కాక చిరకాలంబుక్రిందటనే యుండి యభివృద్ధిచెందుచున్న యామెమనోరథంబుగూడ సఫలంబగును. అతఁడు మిక్కిలి మంచిగుణంబులుగలవాఁడును సౌందర్యవంతుండును గావునఁ దారాబాయి తాఁజేసిన ప్రతిజ్ఞవలన జనించునష్టంబుఁ బొందదు. అని యిట్లు సూరథాన్రాయలు చీకటిలో నొంటిగాఁగూర్చుండి యాలోచించుచున్న సమయంబున నొకపురుషుఁడు త్వరగావచ్చి రాయల వా రెచ్చట నున్నారని యడిగి తెలిసికొని నమస్కరించి యొకయుత్తరమందించె. అంత రాయలు లోపలికిఁబోయి దీపపువెలుఁగున దానివిచ్చి తనలోఁ దానిట్లు చదువుకొనెను.

ఓమహారాజా ! భవదీయహితాభిలాషి నమస్కరించిచేయుమనవిసాంతముగా వినుదురుగాక. పృథ్వీరాజుగుణంబులకు మీ రెంతయుమెచ్చికొని చంద్రోదయకాలంబునందలి పారావారంబు చందంబున నుబ్బొంగుచున్నారు. మఱియుఁ దమకన్యారత్నంబునకుఁ బృథ్వీరాజే తగినభర్తయని తలంచుకొనుచున్నారు. కాని నిక్కువము గ్రహింపలేకున్నారు. మీ రొకవేళ పృథ్వీరాజునకు మీకుమారికనిచ్చి నిష్కారణముగా నా మెకుత్తుకను దెగియుఁ దగనికత్తిచే నుత్తరించి విపదంబుధిలోఁ ద్రోయుదురేమోయని భయపడి యిట్టియాపదనుండి మిమ్ముఁదొలఁగింపవలెనని యెంచి మీకు హితోపదేశము చేయుచున్నాను. ఆపృథ్వీరాజు పయోముఖవిషకుంభమువంటివాఁడు. మిగుల దుష్టగుణములు గలవాఁడు. అంతటికుటిలుండు లోకంబునఁబుట్టఁడు. పుట్టినవారిలో లేఁడు. తన జ్యేష్ఠసోదరునితోఁబోట్లాడి యాతనికన్ను పోఁగొట్టి జనకునిచే నవమానితుండై పరదేశములపాలగుటయే పృథ్వీరాజుయోగ్యతను వేమొగంబుల ఘోషించుచున్నది. నేవేఱచెప్పనేల! మీకుమారిక యతని వలసియున్నను అతనికి మీ కుమారిక యందు సుంతేనియుం వలపులేదు. వలపేయుండినఁ దక్కినరాజకుమారు

వలె వచ్చి తమదర్శనంబుచేసి తనకోర్కె దెలుపరాదా? అందులకుబదులుగా నాదుష్టుండు రాత్రిసమయమున మీ రానందవనమునుండి వచ్చుచుండఁగా శిలావర్షంబును గురియించి మిమ్ములఁ బలుచిక్కులఁ బెట్టి మీకుమారిని బలాత్కారముగాఁ గొనిపోయి మీకింతవంత గొలుపనేల? మీరు మహాబుద్ధిశాలురైన సేవకులఁ బంపుటచే వారాదురాత్ముని బాఱఁదోలి మీకూఁతును మీకు దక్కించిరి కాని లేనిచో నీపాటి కతనిస్నేహితుఁ డగునొకమహామ్మదీయుని పాలుగావలసినదే కావున నాహితోక్తులఁ జక్కఁగ స్మరించుకొని మఱియొక రాకొమరునకు మీపుత్రికనిచ్చి పెండ్లిచేసి సౌఖ్యవంతురాలినిగాఁ జేయుఁడు. అట్లు మీరుచేయనిచో దుఃఖంబులపాలగుట నిక్కంబు.—

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
భవదీయహితాభిలాషి.

అని చదువునప్పుడు రాయలత్యాశ్చర్యమగ్నుండాయె. పిమ్మట నతఁడు పయికివచ్చి యయ్యుత్తరము దెచ్చినవారిఁగూర్చి వెదకెను. కాని వాఁడుత్తరమిచ్చిన వెంటనే యదృశ్యుండాయె. అంత రాయలు తనమనంబున నిట్లనుకొనెను. అక్కటా! ఈయుత్తరంబు వ్రాసినవారెవ్వరు? నామిత్రులెవ్వరైన నిట్లు వ్రాసియుందురా? వ్రాసియుండిన దమచేవ్రాలు నేలపొందింపరు. కావున మిత్రులు వ్రాసినదికాదు. పృథ్వీరాజు మాకు హితుండనిభావించుచుంటిమి. కాని యిట్టియహితుండని యెఱుంగమే? నాఁడు మమ్ముల శిలావర్షంబుచేఁ బీడించినదురాత్ముండు పృథ్వీరాజేయైయుండునేమొ? అతనికి నాకుమారికయందు వలపులేదని నిశ్చయింపవచ్చు. అట్లుకానిచోఁ దక్కినరాకుమారులవలె నొకపర్యాయమైన వచ్చి తనయభిప్రాయంబునేల వెలువరింపఁడు? ఈయుత్తరపుసంగతుల నమ్మినచోఁ బృథ్వీరాజు మావిరోధియగుట నిక్కంబు. నాకుమారిక పలుమాఱు నాతోఁ బృథ్వీరాజు మనకు మహోపకారియని వక్కాణించుచువచ్చుచున్నది. ఆమె పృథ్వీరాజునందున్నవలపుచేతనే యట్లుపలుకుచున్నదో లేక సత్యముగనిపెట్టియే యనుచున్నదో తెలియదు. నాకుమారి పలికినవచనంబు లీయుత్తర మవిశ్వసనీయమని తెలుపుచున్నవి. ఈయుత్తరము

తారాబాయివచనంబులు విశ్వసనీయములుకావని తెలుపుచున్నది. ఇందేది నమ్మను! ఈయుత్తరమునఁ జేవ్రాలు లేకపోవుటచేఁ బృథ్వీరాజుపైఁగిట్టని వారు వ్రాసియున్నారా యని సందియము పొడముచున్నది. కాని పృథ్వీరాజువలని భయముచేఁ జేవ్రాలు చేర్పకయుండవచ్చునను యభిప్రాయము వెనుక సందియమును బాపుచున్నది.అందుచే నీ యర్థంబును నిర్ణయింపఁజాలకున్నాను. ఈయుత్తరము తారాబాయికిఁ గనుపఱచిన మిక్కిలి విచారములపాలగును. ఇప్పటినుండియు నామెను విచారాక్రాంతనుగాఁ జేయనేల? క్రమముగా విచారించి యీయుత్తరపుసంగతులు నిజమయ్యెనేని నాకుమారికను బృథ్వీరాజున కొసంగకుండవలయును. ఈయుత్తరము సమయమువచ్చినప్పుడుగాని యెరులకుఁ జూపనని నిశ్చయించి దానిని రహస్యముగాఁ దనపెట్టెయందుంచెను. మొదట రాయలు తనకుమారి యభిప్రాయంబుచొప్పుననే ప్రవర్తించుచుండుటచేఁ దారాబాయి పృథ్వీరా జిచ్చినయుత్తరంబులసంగతి చెప్పక దాఁచి వారలమానసంబు లొక్కమార్గముననే వర్తించుచుండెను. కాని యిప్పుడు రాయ లాయుత్తరము చూచినప్పటినుండియుఁ గేవలము గుమారియభిప్రాయము ననుసరింపలేదు. కావున నింతవఱకు నొక్కటియగువారలమనం బీయుత్తరంబు చూచినప్పటినుండి ద్వివిధంబుగా మాఱఁజొచ్చెను. రాయలు ఈయుత్తరంబు చూపిన కుమారి విచారించునేమోయని యట్టె దాఁచియుంచెనుగాని యాయుత్తరంబుసంగతి యేమియుఁ గుమారికిఁ దెలియఁజెప్పలేదు. ఆమెయుఁ బృథ్వీరాజు తనకిచ్చినయుత్తరంబుల నతని యాన నతిక్రమింప నిష్టములేక తండ్రికిఁ జూపలేదు. కారణాంతరముంబట్టి వీరలన్యోన్యము తమరహస్యంబుల దెలుపుకొనక పోయినను బరస్పరానురాగంబుమాత్రము పూర్వమువలెనే యున్నది కాని మాఱుటలేదు. మఱియు వీరన్యోన్యహితము గోరుకొనుచుండిరే కాని అన్యోన్యము ద్రోహబుద్ధిగలవారయి యుండలేదు. మఱియుఁ దారాబాయి పృథ్వీరాజుంగూర్చివర్ణించినప్పుడైనను రాయలు తనకూఁతురు వలపుచేఁ బృథ్వీరాజు తత్వముగ్రహింపలేకపోవుచున్నదని తనమానసంబున ననుకొనుచుండు వాఁడేకాని 'యిదమిత్థ'మ్మని తనయుత్తరంబు చూపక వినియు విననట్టు లూర

కుండును. రాయలు ప్రసంగవశమునఁ బృథ్వీరాజు నుద్దేశించి దురభిప్రాయ పడునప్పుడు తారాబాయి యతఁడు మనకు హితకారియని వాడిమాటలతోనే చెప్పుచుండెను. కాని పృథ్వీరా జిచ్చినయుత్తరంబు జూపి యతనిడెందమున నున్న సందియమును బాపలేను. ఇట్లు వీరు కాలముగడపుచుండిరి.

---

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

రాయమల్లు మూఁడవకొడుకగు జయమల్లునిఁగూర్చి కొంచెము వ్రాసియున్నాను. వానిచర్య కొంచెము విచారింతము. వీఁడు, సగుఁడు, పృథ్వీరాజు పోరాడి విదేశగతు లైనప్పటికుండియుం, వీనికాఁపురం బొకచోటఁ నని శ్చయింపఁజాలము. వీనికి శత్రువులనియుం, మిత్రులనియుం విచారంబు లేదు. ఆదఆదు జీవనప్రయత్నించుచుండు. అన్నలిద్దరును లేరు కానఁ దనకు రాజ్యం బొసఁగుమని రాయమల్లునిఁ గోరి యతనిచేఁ దిరస్కృతుండై చేయునది లేక యచ్చోటుఁగదలి సురాజమల్లు నాశ్రయించె కాని సురాజమల్లు పృథ్వీరాజుచే నోడింపఁబడినది మొదలతనిసహవాసంబువదలి దామోదరు నాశ్రయించి యతనితో నత్యంతమైత్రిఁ గలిగియుండెను. అతనియొద్దఁ గొంతకాలముండి యచ్చటను గాలునిలువక తనయన్నయగు పృథ్వీరాజునొద్దకుఁబోయె. ఆ పృథ్వీరాజు మిగులమంచివాఁడును సద్గుణభూయిష్ఠుండును గనుకఁ దన్ను జేరవచ్చినసోదరుని జయమల్లునిం గాంచి యమితానందమొంది యపారప్రేమముంచి తనమందిరంబున నుంచుకొనెను. అంత జయమల్లరమరలేకుండ సోదరుమందిరంబునఁ దిరుగులాడుచు వ్యవహారంబులందతనికిఁ దోడుపడుచు నతనియొద్ద లేఖకుఁడుంబని చూచుచుండె. పృథ్వీరా జాతనివినయాదులంగాంచి తమ్మునకు బుద్ధివచ్చినదనిభావించి నతని ప్రేమతోఁ జూచినట్లే యతఁడును దన్నుఁ బ్రేమించుచున్నాఁడనియెంచి రహస్యపుటుత్తరంబులుఁ గూడ నతనిచే వ్రాయించుచుఁ దాఁ జేవ్రాలు చేసి పంపుచుండెను. ఇట్లుండ జయమల్లునకు వెనుక తారాబాయి

పృథ్వీరాజునకు వ్రాసినయుత్తరంబు కనఁబడియె. అంత జయమల్లాయుత్తరంబుఁ గాంచి యామూలాంతరము చదువుకొని యామె తెలివితేటలకు గడుంగడు మెచ్చుచు తనలో నిట్లు చింతించె. ఔరా! ఈసుందరాంగి నిరుపమానురాలయినట్లు దోఁచుచున్నది. ఈమెంగూర్చియె దామోదరుండు పలుమాఱులు నాతోఁ జెప్పియున్నాఁడు. మఱియు నీయుత్తరమ్మునుబట్టి యోజింపఁ బృథ్వీరాజును ప్రేమించియున్నట్టు గానవచ్చుచున్నది. అందఱు రాజపుత్రులుండఁగా నీతనినే ప్రేమించుటకుఁ గారణము చిత్తూరు రాజపుత్రుం డగుటయే కాని మఱి యొకటి గాదు. నేను జిత్తూరురాణాపుత్రుఁడను. ఉత్తముండను; ఇట్టుండ నన్నుమాత్ర మేల వరింపకపోవలె? మఱియు దామోదరుఁ డుపదేశించినట్లు పృథ్వీరాజు దుర్మార్గుఁడని స్థిరపఱుచుచు రాయల కొకయుత్తరము వ్రాసియున్నాను. దానిఁ జూచి రాయలు పృథ్వీరాజును ద్వేషింపక మానఁడు. కావున దామోదరునిమిత్తముచేసిన కార్యము నాకే యుపయోగించినది. మఱియుఁ దారాబాయి పెండ్లినిమిత్తము మిగులఁ ద్వరపడుచున్నట్లున్నది. అందుచే నేముందుగఁబోయి వారికిఁగనఁబడి నాయుదంతమంతయుం వారికిఁ దెలిపెద. అట్లు చేసినచో రాయలు తప్పక నన్నుమన్నించి పిల్లనిచ్చి యల్లునిగాఁ జేసికొనక మానఁడు. అకటా! దామోదరుఁ డీపాటికి నాపంపినయుత్తరమును గ్రహించి వారలను దోధాకుఁగొనిపోవునేమో? అట్లయిన నా మనోరథంబు విఫలంబగును. అయ్యో! ఈ యుత్తర మింతకుముందు నాకుఁ గానవచ్చినచో నరభసంబునఁ బోయి తారను బెండ్లాడకపోదునా! దామోదరుఁడు చెప్పినప్పుడెల్ల సామాన్యస్త్రీయంచు నెంచితినిగాని యిట్టియుత్తమురాలని తెలిసినది కాదె? ఇప్పుడైననేమి? తొందరగాఁ బోవలయునని నిశ్చయించి యన్నతోఁ జెప్పినఁ దనకోర్కిని విఫలముఁజేయునని యెంచి యెవ్వరితోను జెప్పక యెవ్వరికిఁ దెలియకుండ బదనూరికిఁబోయెను. జయమల్లట్లు బదనూరు ప్రవేశించి రాయలు నివసించియున్న మందిరంబుచొచ్చి తనరాక రాయలకు తెలియఁజేసె. ఆసమయంబునఁ గుమారికయుఁ దామునుగూడి యేదియో ప్రసంగించుచుండిరి. భటుఁడువెళ్లి రాయల కావర్తమానము తెలిపినతోడనే తమకధిపతి

డైన రాణాకుమారుఁడు తన్ను దర్శింపవచ్చినందుల కమితానందంబునొంది కదువడిం జని యాతని కుశలంబు నడిగి లోనికిఁ గొనిపోయి యొకపీఠంబున గూర్చుండఁజేసి యుచితమర్యాదలం గావించెను. జయమల్లు రాయలుచేసిన యాదరమున కమితానందమునొంది తనవచ్చినకార్యంబు సఫలంబగుట నిక్కం బని తలంచుచుండె. అప్పుడు రాయ లతనితో నిట్లు సంభాషించె.

రా.—రాజకుమారా! నిన్ను జూచినందుల క్షమితానంద మొందుచున్నాము. ఎచ్చటినుండి వచ్చినావు?

జ.—రాజా! నేఁ జిత్తూరునుండి వచ్చియున్నాను.

రా.—సంతోషము. శ్రీరాణాకుఁ గుశలమా?

జ.—దైవానుగ్రహమునఁ గుశలియైయున్నాఁడు.

రా.—నాయనా! ఈమధ్య చిత్తూరునకుఁ బ్రసవించినయాపద చన్నందులకు మిగుల సంతసించుచున్నాను.

జ.—ఆయాపదను దొలఁగించినవాఁడనే నేను.

రా.—నీవేనా! రాయమల్లునికుమారుఁడు వచ్చి తప్పించినట్టు విన్నాను. అతఁడు పృథ్వీరాజేమో యని తలంచినాము.

జ.—నేనే! పృథ్వీరా జచ్చటికి రానేలేదు.

రా.—ఎచ్చటకుఁబోవుచు నిటకు వచ్చినావు?

జ.—ఇచ్చటఁ దమదర్శనంబుఁజేసికొని తమయనుగ్రహంబువలన నొక్క కార్యంబు నెఱవేర్చుకొనవచ్చితిని.

రా.—ఏదియో? చెప్పుము.

జ.—ఏమిచెప్పుదు. నీకుమారిక సుగుణంబులు నన్నిచ్చటికి బంధించికొని వచ్చినవి.

రా.—నీయభిలాష తెలిసినది. చిత్తూరురాణాతోఁ జుట్టఱికము చేసికొనుట కంటె మాకధిక మేమి కావలెను. కాని మాపిల్ల యొక్క ప్రతిజ్ఞ చేసినది. ఎఱుంగుదువా?

జ.—ఎఱుంగుదును. ఆకార్య మొనర్ప నెంతపని? కాని మీకుమారికతో మాట్లాడ ననుజ్ఞ యిండు.

రా.—ఇచ్చితిని. ఇట్లు చనుము. (అని చేయిచూపును.)

అంత జయమల్లశ్యంతానందంబునొంది తెరచాటునఁ దమసంభాషణ వినుచున్న తారాబాయిం జూచి యామెసౌందర్యంబున కాశ్చర్యపడి మెల్లన ని ట్లనియె.

జ.—సుందరీ ! రాణాపుత్రులనుగూడ నీగుణంబు లాకర్షించి తెచ్చుచున్నవి. నీసౌందర్యము నిరుపమానము.

తా.—రాజకుమారా ! రాణాపుత్రులయిననుసరే ? లేక సామాన్యరాజ్యపుత్రులైననుసరియే ? ఈమాటలతో నాకుఁ బ్రయోజనంబులేదు. నాచేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చినచోఁ బెండ్లాడుదు. లేనిచో వరింపను.

జ.—నీపట్టిన ప్రతిజ్ఞ యేపాటిది. క్షణకాలములో నెఱవేర్పఁగలను.

తా.—అట్లయిన సంతోషము. నీవు నాప్రతినదీర్చిన యుంత్తరక్షణ మంజే పెండ్లాడెదను.

జ.—అట్లుకాదు. ముందు నన్నుఁజేపట్టుము. తరువాత శత్రువులఁ జంపి రాజ్యము మీజనకున కర్పించెద.

తా.—అదికాదు. ముందు నాప్రతిన తీఱవలె.

జ.—రాజపుత్రుఁడను ; అన్నమాట తప్పనివాఁడను. నామాటయందు నమ్మక ముంచి ముందు చేపట్టుము.

తా.—ఈవృథాలాపంబులతో లాభములేదు. ముందు నాప్రతినదీర్చినఁగాని పెండ్లివిషయమై తలంపవద్దు.

జ.—పట్టిమూర్ఖురాలవలెయున్నావు ! నీవన్నమాటయేకాని మామాటలు చెవిని బెట్టవేమి !

తా.—నాశపథముతీర్పఁగొన నిట్లనుచున్నాను. కాని మూర్ఖబుద్ధితోఁగాదు.

జ.—అయిన నీప్రవర్తనమరయఁ దురకను బెండ్లాడఁ దగియున్నదానవు. కాని మావంటిరాజపుత్త్రుల వరింపఁదగినదానవుకావు. నీయందున్నలక్షణంబులన్నియు నవలక్షణంబులే. ఇట్టిచెడులక్షణంబులుగల నిన్నుఁగూతునుగాఁ బడయుటంబట్టియె నీతండ్రి కిట్టిపాటులు సంభవించినవి. నీవంటి దుష్టలక్షణురాలు లోకంబున లేదు. అని యేవో ప్రసంగించుచుండ

తా.—చాలుచాలు నీయధికప్రసంగము నిఁకమానుము. ఇట నుండఁదగినవాఁడవుకావు. పో పొమ్ము.

జ.—నే నీస్థలంబునుండి పోను.

అని యిట్లు చెడుప్రసంగము చేయుచుండెను. తెరచాటుననుండి వినుచున్నరాయ లాతండు పలికిన నిందావాక్యంబులు విని సహింపలేక తనకుమారిక గౌరవంబుచెడఁగొట్ట నేతెంచిన దుర్మార్గుం డనిభావించి పట్టరానికోపంబుతోఁ జేతఁగత్తిపట్టుకొని సరభసంబునఁబోయి యారాజపుత్త్రుమల్లు తలత్రెళ్ళిపడునట్లు ఖండించెను. తనతండ్రియొనరించిన పనికిఁ దారాబాయి మిగుల నానందించెను. ఆవార్త క్రమక్రమముగా గ్రామములో వ్యాపించినప్పుడు గ్రామములోనివారందఱు చిత్తూరురాణా తనకుమారుని నిష్కారణముగా జంపినందులకు శిక్షగా సూరథాన్రాయలను యావజ్జీవము కారాగృహంబున నుంచుననియు, లేనిచో నతనిశిరంబునైన వెంటనే దీయించుననియు, నింతియకాక యిట్టియతరాధిని నింటఁబెట్టుకొన్నవారికిఁగూడ నాపదరాక మానదనియు, నిట్లు పలుతెఱంగుల పలుకుచుండిరి. కాని రాయలు వారిమాటల కెంతమాత్రము భయపడక యచ్చటివారితో "రాణా న్యాయమార్గావలంబియైనచో నాచేసిన పనికి సంతసింపవలసియుండును" అని పలుకఁజొచ్చెను. కాని వారందఱు నాతండు పలికినవి పిచ్చిమాటలని భావింపఁజొచ్చిరి. అంత నొకనాఁ డొక రాజభటుఁడు బదనూరువచ్చి సూరథానులు నివసించియున్న గృహంబును చేరెను. అప్పుడచ్చటివా రాభటుఁడు చిత్తూరురాణాపంపున రాయలయొద్దకు వచ్చినట్లు తెలిసికొని రాయలకుఁ జావో లేక కారాగృహనివాసమో తప్పదనిభావించి యతనివిరోధులు సంతసంబు నొందుచుండ నతనిబంధుగులును

హితులును మిగుల విచారింపఁజొచ్చిరి. ఆమాటలు లోపలనున్న తారాబాయి యాలకించి మిక్కిలి భయపడఁజొచ్చెను. అంత భటుఁడు రాయలకుఁ దాఁగొనివచ్చిన యుత్తరంబు నందింప నందుకొని యచ్చటివారలు విన నిట్లు చదువ నారంభించెను.

“మిత్రమా! పాలసంద్రమువలె నిష్కల్మషమైన చిత్తూరు రాణావంశమందు హాలాహలంబువలె జన్మించిన జయమల్లుని జంపినందులకు మిగుల నానందించుచున్నాను. మఱియు దుష్టకుమారునివలన నాకుఁగలుగుచున్న యపకీర్తి తొలఁగించినందులకు బహుమానముగా బదనూరుభూముల నిచ్చితిని. వానిని నీవు గైకొని స్వేచ్ఛగా ననుభవింపుము. నీకువచ్చినయాపదల శీఘ్రకాలంబులోనె పోవుటకై భగవంతుని ప్రార్థించుచున్నాను. ఇట్లు రాణా రాయమల్లు” అని యున్న లేఖ చదివిన నచ్చటివారందఱు నత్యాశ్చర్యమగ్నులైరి. విరోధులు చిన్నవోయిరి. మిత్రులు సంతసించిరి. తక్కినవారందఱు రాయలసాహసంబునకును, రాణాయోగ్యతకు మిగుల నానందించి నుతించిరి. అందులకు రాయలు తారాబాయియు నమితానందంబుచెంది బంధువులయింట నున్నామనిన చిన్నతనంబు బాసి స్వతంత్రులై జీవించుచుండిరి.

---

# ముప్పదియవ ప్రకరణము

మాధవసింగు దామోదరుండు తనకార్యము నెట్లయినను నెఱవేర్చునని యానందము చెందుచుండెను. కాని యొకనాఁడు దామోదరుఁ డతనిం గాంచి యిట్లనియె. ఓయీ! నీకోర్కె దీర్ప నాశక్తియంతయు ధారవోసి చూచితిని. కాని సుంతేనియుం లాభములేకపోయెను. నే నారమాబాయియొద్ద కనేకపర్యాయములుపోయి నయమునను, భయమునను బోధపఱిచితిని. నామాటలను వినక నన్ననరానిమాటలపాలుచేయుచున్నది. నీగుణగణంబుల వర్ణించి నిన్ను బెండ్లియాడుట యుచితంబని తెలుప నిన్ను ననేకనిందావాక్యము లాడినది.

నీవావాక్యంబులు విన్నచో సహింపలేక యామెను వెంటనే చంపి నీవు పొడిచికొని చచ్చియుందువు. నేను మొండివాఁడను కావున దానివాక్య శరపరంపరకు సహించి జీవములతోఁ దిరుగఁగలిగితి. దానికిఁ గొంచెమేనియుం భయంబులేదు. ఎంతచెప్పినను నిన్నుఁ బరిణయమాడ నామెకు మనోరథంబున్నట్లు లేదు. కావున నీ కొక్కహితోపదేశంబుచేసెద. శ్రద్ధతో నాలకింపుము. అట్టికాంతను నీవు పెండ్లాడుటకంటె బ్రహ్మచర్యం బవలంబించుట ముఖ్యము. నీయం దనురాగంబు లేనికాంతను బరిణయమయి యామెతోఁ గాఁపురంబు చేయుటకంటె బ్రాణాపాయకరంబయినది మఱియొక్కటిలేదు. సుఖంబపేక్షించికదా వివాహమాడఁ బ్రయత్నింపఁ బాటుపడుచుందురు. తాదృశసౌఖ్యంబులు కలుగకున్న నట్టివివాహంబుతోఁ బ్రయోజనమేమి ? మఱియుం బ్రయోజనంబుమాట యటుపైచూచికొందము. తానుజీవించుటయె మిగులఁగష్టసాధ్యము. తనపై ననురాగంబు లేనికాంతను బెండ్లాడి ప్రాణంబులఁగోలుపోయినవారల నెందఱను జూచుచున్నారము కాము ! నీవాకాంతను వరింపఁగడంగినచో నీప్రాణంబులుపోవుట సిద్ధం బని తలంచెద. ఆమె మిగుల సాహసవంతురాలు. ఆమె మొదట మంచిమాటలు పల్కి పెండ్లియాడెదనని చెప్పినను నీవంగీకరింపవద్దు. అట్లుకాక నీవిష్టపడితివేని యామె యేరాత్రివేళనో యేయుపాయంబుచేతనో నిన్నుఁ జంపకమానదు. నీవు నాకుఁ బరమాప్తుండవగుటచే నీకింత దూరము బోధించుచున్నాను. ఈమెకంటె నధికసౌందర్యవంతురాలగు కాంతను గొనివచ్చి నీకుఁబెండ్లిచేసెదను. ఇఁకమీఁద నిందులకయి ప్రయత్నింపకుము. బలాత్కారంబున నామెనుగొనివచ్చి నీకుఁబెండ్లిచేయఁదగినంత సామర్థ్యంబు నాకున్నది. అయిన నట్లుచేసి మిత్రుండవగు నీప్రాణంబులు దీయించి మిత్రవధజనితపాపమంద నిష్టములేక యాకార్యంబునుండి విరమించితి. నాచెప్పినవాక్యంబులు వినకున్నందులకు నాకమితకోపంబుదయించినది. ఆకోపాతిశయంబుచే నొక ప్రతిజ్ఞ చేసియున్నాను. అరమాబాయిని దురకకిచ్చి పెండ్లిచేసితీరవలె. అట్లుచేసి యామె యామోటుతురకతోఁ గాఁపురంబుచేయుచున్నప్పుడు నే నామెయింటికిఁబోయి నన్నుఁ గాఱుమాటలాడినందుల కిది ప్రతిఫలంబని చెప్పి యామెను

సిగ్గుపొడమునట్లు చేయవలెనని యున్నది. భగవంతుఁ డీకోర్కె యెప్పటికి నెఱవేర్చునోయని యున్నాను. ఇట్లు చేసినంగాని యామందబుద్ధికి బుద్ధిరాదు. ఉత్తమరాజపుత్త్రుండనయిన నిన్నుఁ బెండ్లాడు మని బోధింప రత్నసింగును దప్ప మఱియొక్కరిని బెండ్లాడ నని చెప్పుచున్నది. ఇఁక నెందులకు వరింపదో చూతము. ఒకతురకకే యిచ్చి పెండ్లిచేసెదను. నీ వన్యథాతలంపకుము. నీవు చక్కఁగ యోజించిన నావాక్యంబులు హితంబులగునని తోఁపకమానవు. మఱి యొకయుత్తమకాంతను జిరకాలంబులోనే గొనివచ్చి నీకిచ్చి పరిణయంబు చేసెదను. ఆమెతో నీవు సుఖంబుగఁ గాపురంబుచేయవచ్చును. నాకుఁ జోధానగరసింహాసనారోహణంబు లభించినతోడనే నీకుఁ దగినయుద్యోగ మిచ్చి ప్రేమించెదను. ఈవాక్యంబులు శిలాలిఖితంబులని యెంచుము. యెప్పటికిని దిరుగ నేరవు. ఈవాక్యంబులు నిండుమానసంబుతోఁ బలికినవి. కాని ముఖప్రీతికయి పలికినవి కావు." అని యిట్లు హితబోధ చేయ మాధవుం డందులకేమియు ననఁజాలక సంతసించినవాఁడువలె నచ్చోటు గదలిపోయెను. దామోదరుండు పట్టినపట్టుదలక రమాబాయికి నొకతురకను తెచ్చి పెండ్లిచేయ నధికశ్రద్ధపూనియుండె. మాధవుం డచ్చోటుఁబాసిన తరువాత దామోదరుం డాడినవాక్యంబులన్నియు సహితంబులుగాఁ దోఁపనారంభించెను. అందుచే నతండిట్లు భావించుకొనె. దామోదరుండు చెప్పినవాక్యంబులను నిశ్చయంబులని తలంపను. ఇతండుపోయి రమాబాయితోఁ గఠినంబుగాఁ జెప్పియుండఁడు. ఒకవేళఁ జెప్పియున్నచో నామె తప్పక విని యుండును. పురంబునవారందఱు నాతని యాన తలఁదాల్చివర్తించుచుండ నబలయుం భీరువునగురమాబాయిమాత్ర మితనియానలఁ దలఁదాల్చివర్తింపదా ? రమాబాయిని నాకొసంగి వివాహము చేయించుట యీతని కొకఘనకార్యమా ? ఈతనివర్తనమరయఁగా నొకసంగతి తట్టుచున్నది. ఆతఁడు తారాబాయిని మాళవరాజునకర్పింప వాగ్దానముచేసినట్టె రమాబాయినిగూడ నొకతురక కిచ్చునట్లు వాగ్దానము చేసియుండు. అతనివాగ్దానంబునకు నామనోరథంబు విపరీతముగానున్నది. కాన రమాబాయి నన్నుఁ బెండ్లాడ నిష్టపడకున్నదనియు, నీమెకంటె సౌందర్యాతిశయముగల కన్నియను

గొనివచ్చి పెండ్లిచేయుమనియును నాతోఁ జెప్పియున్నాఁడు. ఈయర్థము నాతఁడు పలికినవాక్యములలో నొకటి స్థిరపఱుచుచున్నది. రమాబాయి నన్ను వలచి పెండ్లాడెదనని చెప్పినను వరింపవద్దఁట. అందువలన నాపదలు తప్పక సంభవించునఁట! అయ్యారె! ఇతని యభిప్రాయము తెలిసినది. ఇతఁడుపోయి రమాబాయితో సామవాక్యంబులఁ దురకను బెండ్లాడుమని చెప్పఁగా నామె యాలోచించుకొని తురకను బెండ్లాడుటకంటె స్వజాతిసంభవుఁడయిన మాధవసింగు నయినఁ బెండ్లాడుదునని పల్కుచుండవచ్చు. అదివిని దామోదరుండు రమాబాయిరహస్యముగాఁ దన యభిప్రాయంబుఁ దెలుపుచు నాకు సందేశమంపు ననియు, నందువలనఁ దనకార్యంబు తప్పకచెడుననియు యోజించి నామనంబు నవిఱుచుటకయి ఇట్టిమాటల నాడియున్నాఁడు. వీఁడుమిక్కిలి కుటిలుఁడు. వీనికి మిత్రుఁడనియు శత్రువనియు నన్న భేదము లేదు. అందఱను బాధ చేయుటేవానికి ముఖ్యకారణము. అట్టుండ నేను వీనికి మిత్రుండనైనను బరోపకారినైనను, నవిమనంబున నెంచక నా కపకారముచేయుచుండ గుప్తముగాఁ గాటుపఱుచుచుండును. వీనికి మానసంబున నొకటియుండును. వాక్కునందొకటియుండును. చేయునది మఱియొకటియైయుండును. మనోవాక్కాయకర్మంబులు భిన్నంబులుగా వర్తించు నీతనిమాటలు సరిగా నమ్మరాదు. కావుననిప్పుడు నేను రమాబాయి హృదయ మెట్టున్నదోఁ గనుగొనవలెను. నే నెట్లు గనుగొనఁగలను! మునుపటివలె నే నంతఃపురమందు వర్తించుచున్నచో నామె యాకారవర్తనము లెట్లున్నవో తెలిసికొనియుందును. దామోదరుం డొరులందుఁ జరింపఁగూడదని శాసించినాఁడు. వానిశాసన మతిక్రమించి యె ట్లంతఃపురంబు ప్రవేశింపఁగలుగుదు ? ఆమెయభిప్రాయంబు నుత్తరముల ముఖమునఁ దెలిసికొనవలయు. ఆయుత్తరంబుల రాకపోక లొరులకుఁ దెలియఁగూడదు. తెలిసినచో వారు చని దామోదరునికి విన్నవింతురు. అందుల కతఁడుగ్రుండయి నన్నపారదుఃఖముల కర్హునిగాఁ జేయును. ఈకార్యము మిగుల నపాయకరమైనది. కావున జాగరూకుండనై పని నడుపవలయును. రమాబాయి మందిరమునకు వచ్చుచుఁ బోవుచుండెడిది కమల. ఆకమలచే నాకార్యమును

రహస్యంబుగా నెఱవేర్చుకొనవలయు. నా పేరువినఁగానే నిప్పు ద్రొక్కినకోఁతి వలె మిడిసిపడునట్టి కమలచే నాకార్యమెట్లు నెఱవేర్చుకోఁగలను! ఇందులకు ముందుగా నామెయనుగ్రహంబు సంపాదించుకొనవలయు. "సామమున నెల్ల పనులును సరవిఁజెందు" అని పండితులందురు. సామంబున నామెయనుగ్రహంబు సంపాదించి యామెచే నాకార్యంబు నెఱవేర్చుకొనలేకపోదునా? అని యిట్లు పలువిధంబులఁ జింతించుచుఁ దనమందిరంబునకుఁ బోయి యప్పటినుండియుం మనోహరవస్తువుల సంపాదించి కమలగృహంబునకుఁ బంపుచుండు. ఇట్లు కొంత కాలమైనపిమ్మట నొకనాఁడు తాను గమలను దర్శింపఁబోయెను. అంతఁ గమల మాధవసింగొసంగిన వస్తువుల కమితానంద మందుటచేఁ గ్రాఁబోలు దొంటి యట్లు మాధవునిఁ గోపముతోఁ జూడక కరుణావీక్షణంబులచేఁ జూడసాగెను. అందులకు మాధవుండు రమాబాయిని బెండ్లాడినట్లు సంతసించెను. అంతఁ గమల యతనిఁ గుశలమడిగి నీవచ్చిన కార్యమేమని యడుగ నతండు చిఱునవ్వునవ్వుచు ఏమియులేదు నీదర్శనంబు చేసికొనవచ్చితి నని చెప్పి యానాఁడేమియుఁ జెప్పక తిరిగిపోయెను. ఇట్లు మాధవసింగుదయాస్తమయంబులఁ బ్రతిదినముఁ గమలాసందర్శన మాచరించుచు నుపహారంబు లర్పించుచు నామెయనుగ్రహమును సంపాదించె. అంత నొకనాఁడు కమల దన్నుఁజూడవచ్చిన మాధవునితో నిట్లు సంభాషించెను.

క.—రాజకుమారా! నీవు మాయింటికి కనవరతము వచ్చుచున్నావు. కాని కారణం బెఱుంగఁజాలకున్నాను.

మా.—నీసందర్శనలాభంబునఁ దనివిచెందకుండుటయే?

క.—అట్లుగాదు. నీమనోరథంబేదియో తెలియఁజెప్పు.

మా.—నామనోరథంబు నీకుమాత్రము తెలియదా?

క.—రమాబాయిని వరించుటవిషయమా?

మా.—(మోమువంచుకొని) అవును.

క.—అది దుర్ఘటకార్యము. నేనెట్లు ఘటనచేయఁగలను?

మా.—ఘటనచేయుటకై నీవేమియుఁ బాటుపడ నక్కఱలేదు.

క.—మఱేమి చేయవలయు.

మా.—నే నిచ్చునట్టి యుత్తరంబుల నామె కిచ్చి యామె యేమి చెప్పునో నాకుఁ దెలుపుచుండవలయు.

క.—అట్లయిన నీకార్యము నిరాటంకంబుగాఁ జేయుదును.

మా.—ఈవృత్తాంతము మఱెవ్వరికినిఁ దెలియనీరాదు.

క.—బ్రహ్మకైనను దెలియనీను.

మా.—ఇదియె నాకోరిక. ఱేపు తిరిగి నీదర్శనంబున కరుదెంచెద అని చెప్పి యత్యంతానందముతోఁ దనయింటి కేగెను.

---

# ముప్పదియొకటవ ప్రకరణము

మొదట రాజకుమారులు బదనూరునకు వచ్చి రాయలదర్శనమాచరించి యతనికుమారిక చేసిన ప్రతిజ్ఞ తెలిసికొని మాత్రము కాదనిపోవుచువచ్చిరి; కాని జయమల్లుని జంపినపిమ్మటఁ దారాబాయిని బెండ్లాడ నెంచి యొకరాజపుత్త్రుఁడును రాలేదు. ఇంతియకాక రాయలు మహాకోపియనియు, నేమాత్రపు విరుద్ధభాషణము లాడినను యమనికాంతమునకుఁ బంపుననియుం, బ్రాణములపై యాశ యున్నవారు వారిం జూడఁగూడదనియుం నొకప్రథపుట్టెను. అందుచేఁ దమప్రాణంబుల కాశపడి తారాబాయిని బెండ్లాడఁ దలంపనేలేరు. ఒకవేళఁ దలంచినను దమమానసంబుల మట్టిపెట్టుచుండిరే కాని యాతలంపునకు వశులై బదనూరికిఁ బోలేరు. అందుచే సూరథానులు తనకుమారిక ప్రతిన నెఱవేర్చు భూపతికుమారుండు లభించుట దుర్లభంబని తలంచుచు నుండెను పృథ్వీరాజట్టిసామర్థ్యముగలవాఁడని తనమనంబున నున్నది కాని జయమల్లు వ్రాసిన యుత్తరంబును జూచినప్పటినుండియుం దనకూఁతు రెన్నిహితవాక్యంబులు చెప్పి మంచిమార్గమునందుఁ బ్రవేశపెట్టుచున్నను రాయలహృదయము మంచిమార్గంబునఁ బడక పృథ్వీరాజు తనకుశత్రువనియె భావించుచుండెను. తనతండ్రియొద్దకొక యుత్తరంబు వచ్చినదనియు నందుచేఁ బృథ్వీరాజునుగూర్చి విరుద్ధాభిప్రాయము

ముదయించిన దనియుఁ నామె సుంతేనియుఁ నెఱుఁగదు. తనజనకునకుఁ బృథ్వీరాజుంగూర్చి దురభిప్రాయంబున్నదని తెలిసినచోఁ బితృభక్తింబట్టిఁ బృథ్వీరాజునందుఁ దనకున్న ప్రేమమును మరల నాకర్షించుకొని యుండునేమో ? అట్లు తెలియకపోవుటచేఁ బృథ్వీరాజునే సంతతము హృదయకమలంబున ధ్యానించుచు నాతనిరాకకై ప్రతీక్షించుచుండెను. ఆమె దేహము మాత్రము బదనూరునఁ దిరుగుచున్నది కాని మానస మెల్లప్పుడు పృథ్వీరాజు ననుసరించియే వర్తించుచుండెను. మానసంబులేనిచో నింద్రియంబులు నిరర్థకంబులని యందఱికిఁ దెలిసినవిషయమే కదా! అందువలన నామెచెవులు శబ్దంబులు గ్రహింపమానెను. నేత్రములు వస్తువును జూడనేలేదు చూచిన నావస్తువేదియో తెలిసికొనలేకుండెను రాయలు పిలిచినప్పుడు మాత్రము పలికి యతఁడడిగిన ప్రశ్నలకుత్తరంబు లిచ్చుచుండెను. అంతకుఁ దప్ప నొరులతో మాటాడదు. ఒకరు చెప్పినది వినలేదు. ఇతరులు తన్నేదైన నడిగినచో దానికి విపరీత ప్రత్యుత్తరము లిచ్చుటయే కాని సదుత్తరము లిచ్చుట గానరాదు. పెక్కేల! ఆమెవర్తనయొక యున్మత్తునివర్తనమును బోలియుండెను. అంత నొకనాఁ డామె తనలోఁ దానిట్లు చింతింపఁదొడఁగె. ఈమధ్యవచ్చిన యుత్తరముం బట్టి యోజింప నారాజనందనునకు నాపై నపారప్రేమమున్నట్లు తెలియవచ్చుచున్నది. నారచించినపద్యముల కమితానందము నొందితినని వ్రాసియున్నాఁడు. శీఘ్రకాలములోనే వచ్చి దర్శన మిచ్చెదనని చెప్పియున్నాఁడు. మఱియు నాప్రతిజ్ఞనవలీల నెఱవేర్చి నన్నుఁ బెండ్లాడెదనని వ్రాసియున్నాఁడు. నేఁటికిని రాలేదు. ఆరాజనందనుం డెప్పుడువచ్చునో? ఎప్పుడు నాకోర్కె సఫలము చేయునో! నాకన్ను లాతనిసౌందర్యముంజూచి యెప్పుడు తృప్తిచెందునో? అని పలుతెఱంగులఁ జింతించుచుండ నొకసవారీతో నొకకొందఱుమనుష్యులువచ్చి వారియింటిముందు నిలిచిరి. అంత నొకమనుష్యుండు లోనికిఁ బోయి యచ్చటఁ సంచరించుచున్న యొకదాసిచేతి కొకయుత్తరమిచ్చి తారాబాయి కిమ్మనెను. అంత నాయూడిగకత్తె యాయుత్తరమును గొనిపోయి యాలోచనసముద్రంలో మునిఁగి యున్న తారాబాయి కిచ్చెను. అంత నామె దానిం జదువ

కొని యమితానందంబు చెంది వెంటనే తండ్రియొద్దకుఁ బోయి యాయుత్తర మీయ నందుకొని యిట్లు చదివెను.

"ఓ సుందరాంగీ! మిమ్మిచ్చటనుండి గొనిపోవ దామోదరుం డనేక మాయోపాయంబులఁ బన్నుచున్నట్లు వినియున్నాను. నేను తోడానగరంబు నకుఁ బోయి శత్రువులతో యుద్ధము చేయుచున్నప్పుడు మాయోపాయంబున మిమ్ములఁ గొనిపోవునేమోయని భయపడుచున్నాను. కావున వీరితో బయలు వెడలి, కమల మియర్ కోటకు రావలెను. ఈకోటను భేదించుట శత్రువుల కసాధ్యము. మీరు సురక్షితముగా నిటనుండినచో నే నవలీలఁబోయి నీప్రతిజ్ఞ నెఱవేర్చి రాఁగలను. నేను స్వయముగా మిమ్ములఁ జూడ వచ్చెదనని యిది వఱకు వ్రాసితిని. కాని తోడానగరవిజయమునకై ప్రయత్నించుచుండుటచే రాలేకపోతిని. అందులకు మీరన్యథాతలంపక యీరాత్రి పయనంబై యొరు లకుఁ దెలియకుండ నీదుర్గంబునకు రావలయు. అనుమానింపఁబని లేదు. మీరిట సురక్షితముగాఁ జేరినచో నన్ని కార్యంబులు చక్కఁబడిన వనియె నమ్ముము" అని చదివి పృథ్వీరాజు చేవ్రాలుతో నున్నయాయుత్తరంబును జక్కఁగ విమర్శించి చూచి తనకూఁతుతో నిట్లు ప్రసంగించె.

రా.—కుమారీ! నీయభిప్రాయ మేమి?

తా.—చిన్నదానను నాకేమి తెలియును? పెద్దలు మీరె చెప్పుఁడు.

రా.—నా యభిప్రాయంబు నీకిష్టమయినచో గమలమియర్ కోటకుఁ బోవు టుచితముగాఁ దోఁచెను.

తా.—(తెల్లతెల్లబోయి) నాయనా! ఏమి యట్లు సెలవిచ్చుచున్నారు?

శా.—పృథ్వీరాజు మనకు శత్రుకోటిలోనివాఁడు. కావున నతనియొద్దకుఁ బోవుట యుక్తము కాదు.

తా.—(తనలో) అకటా! మాతండ్రిగారి నోటినుండి యిట్టిమాటలు వెలువడు చున్న వేమి? (ప్రకాశముగా) జనకా! మొదటినుండియు నాతని యపారప్రేమతోఁ జూచుచున్న మీరు నేఁడీవిధముగ నేల మాటాడు చున్నారో తెలియకున్నది.

రా.—మొదట మంచివాఁడని భావించి యట్లు ప్రేమతోఁ జూచితిని.

తా.—ఇప్పుడో?

రా.—అతండు దుష్టుండని తెలియవచ్చినది.

తా.—ఎట్లు తెలియవచ్చినది? ఎవ్వరైనఁ జెప్పినారా? లేక రత్నసింహుఁడు కలఁగాంచినట్లు కలగాంచినారా.

రా.—కలగనుట కాదు. ఒరులు చెప్పినారు.

తా.—"చెప్పుడుమాటలు చెడ్డ" వన్నసామెత తమకుఁ దెలిసియే యున్నది.

రా.—ఎవ్వరో పృథ్వీరాజుపై గిట్టక చెప్పినారని యందువా? ఏమి?

తా.—నిస్సందేహముగా.

రా.—మనహితులే మన కొకయుత్తరము వ్రాసినారు.

తా.—పృథ్వీరాజు మనకు శత్రువని వ్రాసినచో నాయుత్తరము తప్పక యహితులు వ్రాసినదే కాని హితులు వ్రాసినది కాదు. హితులైనవారట్లు వ్రాయరు.

రా.—పృథ్వీరాజునం దున్నవలపే యీమాటల నాడించుచున్నదా? లేక నీవే యాలోచించి పల్కుచున్నావా?

తా.—నేనే చక్కఁగా నాలోచించి పల్కుచున్నాను. వలపు గిలపు నాచే ననిపింపలేదు.

రా.—అట్లయినచో మనకు శత్రువగు పృథ్వీరాజును హితుఁడని చెప్పెదవే. అతండు హితుండని యెట్లు స్థిరపఱుపఁగలవు?

తా.—పోనిండు. శత్రువని మీరెట్లు స్థిరపఱుపఁగలరో? చెప్పుఁడు.

రా.—ఇదిగో నీయుత్తరమే స్థిరపఱచును. (అని తన పెట్టెలో దాఁచియుంచిన యుత్తరమును దీసియిచ్చును.)

తా.—(అందుకొని చదివి) ఈ యుత్తర మెవ్వరు వ్రాసినారు?

రా.—మన హితమును గోరుచున్న మిత్రుఁడు.

తా.—కాదుకాదు మనయహితమును గోరుచున్న యమిత్రుఁడని తలంచెద.

రా.—ఏమట్లందువు! దీనిని నమ్మవా?

తా.—నమ్ముటకు వ్రాసినవారి చేవ్రాలేది?

రా.—చేవ్రాలు మఱచి యుండవచ్చును. అంతమాత్రమున నమ్మక పోవుటయే.

తా.—అవును. దానిని నమ్మఁగూడదు. అంత యుత్తరము వ్రాసినవారు చేవ్రాలు చేయమఱతురా?

రా.—మఱచుటకాదు. పృథ్వీరాజువలని భయముచే మానినారేమో?

తా.—అందుచేతనే మానినారో? లేక వ్రాసినవారు పగవారగుటచే వారి చేవ్రాలున్నచో శత్రువులు వ్రాసినదిగా భావించి మనము నమ్మమని మానినారో?

రా.—మనము నమ్మకపోయిన వారికి నష్టమేమి?

తా.—మనము పృథ్వీరాజు సహాయమునఁ దోధాను గెలిచి యందు మనము సుఖముగనుండుటయే నష్టము. ఈ యుత్తరము మనము నమ్మి పృథ్వీరాజును శత్రువుగా భావింతుమనియుం, నందువలన నతని స్నేహము చేయక యుందుము కానఁ దోధాపురము నెప్పటికి వశము చేసికోలేక విచారము నందుచుందు మనియుం వారి యభిప్రాయము. మఱియుం దుష్టులు సజ్జనులు దుఃఖములపాలగుటనే కనులపండువుగఁ జూచుచుందురు. కావున పృథ్వీరాజునకు మనకు భేదముగలిగింప నిట్లు వ్రాసియున్నారు.

[illegible]—పృథ్వీరాజు మనపైఁ బ్రేమగలిగినవాఁడే యైనచో నొకమారైనను జూడరాలేదేమి?

[illegible]—కార్యాంతరాసక్తుండగుటచే తీరుగడలేక రాకపోయినఁ బోవచ్చు. అంతమాత్రముచే శత్రుఁడని భావించుట యుచితమా?

[illegible]—పోనిమ్ము; పృథ్వీరాజు దుష్టుఁడే కానిచో నాఁడు మనమానందవనము నుండి వచ్చుచున్నప్పుడు శిలావర్షముఁ గురియించి మనలను హింసించి యిన్ని బలాత్కారముగాఁ గొనిపోనేల?

తా.—శివ! శివ! ఎంతమాటవింటిని. నాఁడు పృథ్వీరాజు నన్నురక్షించెనా? లేక బలాత్కారముగాఁ గొనిపోయెనా? అక్కటా! యుపకారమునకుఁ బోయిన నపకారమువచ్చుననుమాట వ్యర్థమగునా?

రా.—నాఁడు పృథ్వీరాజు నిన్నురక్షించినాఁడా?

తా.—(తనలో) అక్కటా! రాజనందనుఁ డీయుత్తరము నొరులకుఁ జూపవద్దని చెప్పియున్నాఁడు. కాని నేఁ డీయుత్తరమును నాజనకునకొసంగనిచో నాతని సందియము పాయదు. కావున పృథ్వీరాజిచ్చినయుత్తరము చూపుదును. పృథ్వీరాజు కోపించినచో క్షమింపుమని వేఁడికొందును (ప్రకాశముగా) అవును. పృథ్వీరాజు రక్షించెను. మీకునమ్మకము లేనిచో నీయుత్తరము చదువుఁడు (అని యుత్తరము చేతికిచ్చును).

రా.—(ఆయుత్తరమందికొని యిట్లుచదివెను) సుందరీ! మేము నీకుపకారులమైన గ్రహింపక మమ్ముల దుస్సహావాక్యంబుల పాలుచేయుచున్నావు. అయినను మేమందులకుఁ గోపింపము. నిన్ను మేముబండిలోనుండి బలాత్కారముగఁ గొనిపోవుచున్నామని తలంచితివి. కాని యట్లుకాదు. దామోదరసింగు పంపినభిల్లులు నిన్నుబలాత్కారముగాఁగొనిపోవుచుండ వారలనుజంపి నిన్ను విడిపించితిమి. నీవుభయముచే మూర్ఛితవైయుండి యెవ్వరు నిన్ను గొనిపోయినారో యెఱుఁగక నీమూర్ఛదేఱినప్పటికి మేము నీకన్నులయెదుటనుండుటచే మమ్మే దొంగలఁగాఁ దలంచితివి. దామోదరసింగు ప్రయత్నించిన రెండుకార్యములను జెఱిచి యిరువురను రక్షింపఁగలిగితిమి. కృతార్థులమయితిమి. అని పృథ్వీరాజు చేవ్రాలుతోనున్న యాయుత్తరముం జదివి యత్యంతాశ్చర్యము నొంది తారం జూచి.

రా.—కుమారీ! ఇంతకుఁబూర్వము నాకీయుత్తరమేల చూపలేదు?

తా.—ఆరాజనందనుఁడు చూపవద్దని చెప్పినాఁడు. కాని యిప్పుడు మీమానసంబుననున్న దురభిప్రాయంబును దప్పింపనెంచి చూపితిని.

రా.—వారిచే రక్షింపఁబడిన రెండవవా రెవ్వరు ?

తా.—(తనలో) అతనియందంతము తెలియకుండు నిమిత్తమే యీయుత్తరంబు లఁ జూపవద్దనిచెప్పియుండు. కావున నిపు డతనిఁగూర్చిచెప్పుట యుక్తముకాదు. (ప్రకాశముగా) నాకుఁ దెలియలేదు.

రా.—(సంతసముతో)పృథ్వీరాజు హితుండని నీవు త్రికరణశుద్ధిగఁ జెప్పగలవా ?

తా.—ముచ్చుమువ్మాటికి నారాజనందనుండు మనకు హితుండనిచెప్పఁగలను.

రా.—అట్లయిన నీయభిప్రాయమేమి ?

తా.—మీయభిప్రాయమేదియోయదియే.

రా.—మొదటియుత్తరముంబట్టి పృథ్వీరాజు శత్రువని భావించితిఁగాని నీవు చూపిన యుత్తరముంబట్టి హితుఁడని తెలిసికొంటిని. ఇప్పుడు కమలమియరుకోటకుఁ బోవుటయే యుచితమని తోఁచుచున్నది.

తా.—(సంతోషముతో) అదియే యుక్తము.

అని యిట్లు వారొండొరులు సంభాషించుకొని రాత్రి చాలవఱకతిక్రమించిన తరువాత నొరులకుఁ దెలియకుండ నావచ్చినవారితోఁ గలిసి కమలమియరుకోటకు పోయిరి.

---

# ముప్పదిరెండవప్రకరణము

రాజకుమారా! నీవువ్రాసిన యుత్తరంబును శిరసావహించి తీసికొన్నాను. దానిని దుదదాఁక చదువుకొని యమితానందభరితురాలనయితి. వెనుక నీవు నన్ను భవానీమందిరమునకుఁ గొనిపోయినవాఁడు నీవుచెప్పిన హితవాక్యంబులు వినక నిందించినందుల కిప్పుడు డెందమున విచారించుచున్నాను. దురాత్ముఁడయి దామోదరుఁడు చలము వహించియున్నాఁడు. నన్నుఁగొనిపోయినవాఁడు మద్దీయుం నకుఁ బెండ్లిచేయునఁట! రాజపుత్రుఁడయి యుండియు నెట్టిదుష్టమార్గమును

ద్రొక్కుచున్నాఁడో చూడుము. నాకొకమహమ్మదీయుని వివాహము చేయు చిచో తానొక రాజపుత్రుండే కాఁడట. అట్లాదురాత్ముఁడు దృఢప్రతిజ్ఞ చేసినాఁడు. నేనూరకుండక మహాక్రోధంబువహించి సుంతేనియు జంకక నాకంఠమున జీవములుండ రాజపుత్రునిఁదక్కఁ దురకను బెండ్లాడను. అట్లు చేసినచో రాజవంశమునందుఁ బుట్టినదానఁగానని ప్రతినఁబట్టితి. కాని నా ప్రతిజ్ఞ నెట్లు నెఱవేర్చికొందునో తెలియదు. మొదట రత్నసింగును వరించితి కాని నేనెంతకాలము వేచియున్న నతండు వచ్చుజాడ కానరాలేదు. కాన నేనిఁక రత్నసింగుపయి యాశవదలుకొన్నాను. నీవు వ్రాసినవిధంబునఁ దుర కను బెండ్లాడుటకంటె నెంత నీచుఁడయినను రాజపుత్రుని బెండ్లియాడుట యుత్తమముగదా! నీవు నాయందు దయయుంచి వెనుకనాడిననిందావాక్యము లెదఁదలంపక నన్నుఁజేపట్టి యీదామోదరుబారినుండి తప్పింపుము. దామో దరు నాజ్ఞచే రాజభటులు సర్వదా జాగరూకులయి కావలియున్నారు. వారల కన్నుఁబ్రామివచ్చుట నీకు మిగులఁ గష్టము. కావున నీరాత్రి యందఱు నిద్రిం చినతరువాత నొరులకుఁ దెలియకుండ నాభవనముయొక్క పశ్చిమభాగమునకు రమ్ము. నేనొక త్రాడు వేసి యుంచెద. దానివెంబడి నాసౌధంబుఁ బ్రవేశింప వచ్చు. అనంతరము కర్తవ్య మూహించి యీస్థలము తప్పించుకొని యొకసుర క్షిత స్థలమునకుఁ బోదము. నీవు తప్పక రావలయు. రాజపుత్రుండవయిన నీకు రాజపుత్రస్త్రీగౌరవముఁ గాపాడుట యుచితకృత్యముకదా! ఇంతకంటె వ్రాయఁనదిలేదు" అని రమాబాయి చేవ్రాలుతోనున్న యాయుత్తరమును జదువుకొని సంతోషసాగరంబున మునింగి యాయుత్తరమును గొనివచ్చిన కమలకు బహుమానంబులొసంగి, కమలను బంచి, నాఁడు తనకార్యంబు నెఱ వేఱుట నిశ్చయమనితలంచి యిట్లనుకొనియె. ఓరీ! దురాత్మా! దామోదరా! నీవు నాకార్యము నెఱవేఱనిచో నుండిపోవుదా? నీకయి యెన్నికష్టము లనుభవించితి. ఎన్నిపాపకార్యంబు లాచరించితి! నీయాజ్ఞ శిరసావహించి నీ వాఁనాఁడు నాచేవ్రాయించిన యుత్తరమునపయి రత్నసింగు చేవ్రాలు చేయిం యింప నేఁజూసికొంటిఁకాని యట్టిసాహసకార్యమునకు మఱియొకఁడు బూను

కానుగా? అరత్నసింగు తొందరగాఁ గార్యములు చక్కఁబెట్టుకొనుచున్న సమయము వేచి రాజకీయవ్యవహారపుఁబత్త్రికలలో నీయుత్తరంబునుచేర్చి యతని కీయుత్తరపు సంగతి తెలియకుండఁజేసి చేవ్రాలుచేయించితి. నాఁడారత్న సింగు నాయందున్న నమ్మకముచేతను, తొందరపనులుండుటచేతను, నాకాగిత-ములచదువకుండఁ జేవ్రాలుచేయుటచే నాయాటలు సాగినవికాని లేనిచో నా జీవితాశ విడిచికోవలసినదే కదా ? మఱియు నీవానాఁడు తోధాపురంబుఁ బ్రవేశించునాఁడు నాసాయముండఁబట్టి కార్యము దీర్చుకోఁగలిగితివి. కాని చో మాళవరాజువలె నవమానంబుచెంది వచ్చినట్లేవఁబట్టి పూళవకుఁబోవలసిన దేకదా? ఆదినంబునఁ బశ్చిమద్వారంబునొద్ద భటులు లేకుండఁజేయుటలోను శుద్ధాంతంబుప్రవేశించుట కొకకవాటమయిన భేదింప నవసరము లేకుండఁజేయుట లోను, నాపడినకష్టము భగవంతునికిఁ దెలియు. ఇట్లు నీ కనేకవిధములఁ దోడుపడి నీకార్యములు దీర్చిననాకు రమాబాయినిఁ బెండ్లిచేయుటకు బదులుగా నామె నొకతఁరకకీపలయునని ప్రయత్నించితివి గదా ? నీకుటిలబుద్ధియే వెలువడినదికాని యంతకన్న నీవు చేసెడిదేమి? నాకార్యంబవలీలనే నెఱవేర్పఁ గలఁడు. నీవంటి కృతఘ్నుండు మఱియొకఁడుండఁడ దని నిశ్చయముగ చెప్పఁగలను. నీవు నాకెంతో హితుండవనియు నాకార్యములఁదీర్ప సమర్థుండవనియు నెంతో నమ్మకమూని నామనోరథంబు తెలుపఁగా మొదటఁ జేసెదనని చెప్పి తుదకొక మహమ్మదీయునికిఁ గట్టనెంతువా ? అని యిట్లు దామోదరుని నిందించుచుఁ దనకార్యంబు నాటంకపఱుచుచున్న సూర్యుంజూచి "అకటా! నేఁ డీ భానుమంతుం డున్నస్థలమునుండి కదలుచున్నట్టె కానరాదు. ఎన్నిపర్యాయంబులు నభోమండలమువంకఁ జూచిన నెప్పటి స్థలంబునందున్నట్టె గానవచ్చుచున్నాఁడు: ఇదివఱకు వేగముగా నస్తమించు నీసూర్యుండు నేఁ డెంత కాలము వేచియున్న నస్తమింపఁడేమి! దామోదరునివలె వీఁడు నా కార్యంబు నిర్బంధింపఁ దలంచుచుండెనేమో ?" అనిదూషించుచు సూర్యాస్తమయమునకు వేచియుండె. అంత సూర్యుండును మాధవసింగు నిందావాక్యములు భరింపలేకో, వాఁడుపడుచున్న సంతాపమునుజూచి సహింపలేకో

పడమటకొండచాటుఁజొచ్చె. అప్పుడు మాధవుని హృదయ కుహరంబు మోహంబుచే నావృతమయినట్లు రోదసీకుహరంబు తిమిరావృతంబు కాఁజొచ్చె. అయినను రమాభాయి మందిరమునకు రహస్యముగాఁ బోనెంచిన మన మాధవ సింగున కంతటితో నిర్బంధములు తీఱలేదు. వీనికింకను నిర్బంధములున్నవి. ఊరంతయుం మాటుమణఁగి యుండవలయుం. ఊరంతయుంఁ గాకపోయిననుఁ దన వీథిలోనివారైనను నిద్రింపవలె. లేనిచోఁ దన ప్రవర్తనముఁగని తత్త్వముఁగని పెట్టి దామోదరునితోఁ జెప్పుదురన్న భయము బాధించుచుండెను. ఇంతియకాక పురరక్షకభటు లెదురుపడి తన ప్రవర్తన మరయుదు రేమోయని భీతిలుచుండె. ఇట్లతఁడు పలుసందియములు పెట్టుకొని విచారించుచుండ రాత్రి చాలభాగమతిక్రమించుచుండెను. అతని నిర్బంధము నొక్కొకటి తొలంగుచుండె. తనవీథివారేకాక, యూరిలోనున్న తక్కినవీథులవారుగూడ శయనించిరి. అప్పుడు పురరక్షకభటుల యదలింపులు తప్ప మఱియొక్క శబ్దమేదియుం వినరాలేదు. అంత మాధవుండదియే తగినసమయమని యోజించి యాకాలమునకుఁ దగినవేషముధరించి భయంకరమగు ఖడ్గమొకటిఁగొని దానినెవరైనఁజూచినచో ననుమానింతురని యొకచేతి కఱ్ఱలోనిమిడ్చి యొరులకుఁ దెలియకుండఁ బోవుచుండెను. తానాచీకటిలోఁబడి యతిరయంబునఁ బోవుచున్నప్పుడు చూడక మార్గమధ్యమందు శయనించియున్న యొకకుక్కమీఁద వానికాలు పడెను. అంత నామునుసలికుక్క యూరకుండక మొఱుగుచుఁ బరువెత్తికొంతదూరము పోయి వెనుకతిరిగిచూచి తనవెంట నొరులెవ్వరును రాలేదని నిశ్చయించి భయంకరమయిన గొంతుకతో మొఱుగ నారంభించెను. ఆధ్వనిచే నా సమీపమందున్న వారందఱును మేల్కనిరి, ఘోరమయిన పోరాటంబులంబైన భయపడని మనమాధవుం డాకుక్క మొఱిగినప్పు డపారభయము నొందసాగెను. ఆభయమునకుఁ బ్రధానకారణము కుక్కకాదు. అచ్చటివారిని మేలుకొలుపునట్టి దానిధ్వని యని గ్రహింపవలసినది. ఆభయమునకు నావీథివారిమాటలు తోడుపడి మఱింత వృద్ధిపొందించె. అయినను వాని పాదములుమాత్రము నిలువక వాని మోసికొని పోవుచుండెను. ఆసమయంబున నా మేల్కనినవారిలో నొ

కాఁడు మనుష్యుఁ డొకఁడుపోవుచున్నాఁడని భావించి "అపోయెడివారెవ్వ"రని యడిగెను.అదిమాధవుండువిని తానప్పుడు ప్రత్యుత్తరమీయనిచోఁ దస్కరునిగాభావించి తన్నువెంబడించి తనకార్యంబునకే కాక తనప్రాణంబునకుఁ గూడఁ జేటు మూడింపక మానరనియోజించి "నేనా! పురరక్షకభటుఁడనని ప్రత్యుత్తరమిచ్చె. అదివిని యామానవుఁడు మాఱుమాటాడకపోయి నిద్రించెను. అంత మాధవుఁడు తనయుపాయము ఫలించినందుల కమితానందంబు నొంది సందుగొందులుదాఁటి పోయిపోయి రమాభాయిసౌధమును సమీపించెను. ఆసౌధమునకుఁ బురోభాగంబున రాజబంధువులగృహంబులును, రెండుప్రక్కల మఱికొందఱిగృహంబులును గలవు. కాని, దానికి నాలవవైపునఁ బెద్దతటాకము, తటాకసౌధంబులకు నడుమకొన్నివృక్షంబులు ముండ్లపొదలుగలవు. అదిక్కునుండి సౌధముఁజొచ్చుట యెట్టివారికయిన నసాధ్యము. అందుచే దామోదరుండుంచిన కావలిభటులందఱు ముందువైపునే కాచికొనియుండిరి. ఆమేడ వెనుకటిభాగమునఁ జెట్లు క్రిక్కిరిసియుండుటచేఁ జొరశక్యముకాకుండె. ఇట్లు చెట్లచేదుర్గమయమయియుండుటచేతను, మేడయెత్తు ముప్పదిగజములకంటె నధికముగానుండుటచేతను, సోపానపంక్తి లేకపోవుటచేతను, నాతట్టునుండి మనుష్యులు వత్తురన్న సందియము లేకపోవుటచే నొకమారయిన నాప్రక్కకుఁ బోయి చూడనవసరములేనందున నాప్రక్క నిర్మానుష్యమయి మిగులభయము గొలుపుచుండె. ఆవైపుగోడకుఁ దటాకములమీఁదనుండి చల్లనిగాలి వచ్చునిమిత్తము ద్వార మొకటియుండె. రమాభాయి యాప్రక్కనుండియేవచ్చి తావేసిన త్రాటివలనఁ బైకెక్కి యాద్వారమువలన లోపలఁ బ్రవేశించి తన్నుగొనిపొమ్మని మాధవున కుత్తరమంపినది. మాధవుండు రమాభాయియందున్న యభిలాష తనకుఁ దోడుబంటయి నడిపింప నిర్భయంబుగా నాచెట్లలోనికిఁ బ్రవేశించి యాద్వారమునొద్దకుఁ బోయెను. ఆ మాధవుండు చిరకాలమాపురంబున నుండినవాఁడును, నెట్టి రహస్యమార్గములనైన నెఱింగినవాఁడునుగాన నట్టి గాఢతమంబులో నట్టి దుర్గమస్థలంబున కొంటిఁగాఁ బోఁగలిగెను గాని మఱియొకడయినచోఁ బోయియుండలేఁడు. మాధవుఁడయినను తనకు రమాభాయియం-

డున్న యభిలాషయను భటుండు తోడుచూపకయున్న నొంటిగాఁబోవుటకు భయపడునని యూహింపవలసియున్నది. ఎట్లయిననేమి ! మాధవుండాస్థలంబు చేరునప్పటికి మేడపైనుండి యొకత్రాడు వ్రేలాడుచుండెను. ఆమేడమీఁద దీపములు వెలుగుచుండెను. ఆదీపపు వెలుతురున నొకకాంతాలలామ కని పించె. అప్పుడామాధవుండాకాంతను రమాబాయినిగా గ్రహించి తాను వచ్చినసంగతి తెలియుటకయి యాత్రాటినిబట్టి కదల్చెను. ఆకదలుటచూచి రమాబాయి మాధవుని రాకగ్రహించి రమ్మని చేసన్నచేసెను. మాధవుండామెకు గనఁబడలేదుకాని రమాబాయి యతనికిఁ గానవచ్చుచుండెను. అందురమాబా యిచేసినచేసన్నఁ గనిపెట్టి తాఁగొనివచ్చిన యాయుధమును మొలకుఁగట్టియా త్రాటిని బట్టికొని పైకెక్కనారంభించెను. ఈమాధవుఁ డప్పుడప్పుడు తటస్థిం చినయుద్ధములందుఁ బ్రాకారములమీఁదికి శత్రువులకోటగోడ లెగఁబ్రాఁకినవాఁడ గుటంబట్టి యధికాయాసము లేకయే యెగఁబ్రాకుచుఁ దనకార్యము సాధించు కొనుట నిక్కంబని భావించియుండెను.

---

# ముప్పదిమూఁడవ ప్రకరణము

నేను మొదటవ్రాసిన యుత్తరమున కాతారాబాయి యమితానంద మొందిన ట్లాపత్రికావాహకుండె చెప్పియున్నాఁడు. అదివ్రాసి చాలకాలము కావచ్చినది. తరువాత దీనిని దారాబాయికిఁ బంపుమని మాతమ్ముఁడు జయ మల్లుని కొకయుత్తరమువ్రాసియిచ్చితి. అది యామెకుఁ జేరెనో లేదో తెలి యదు. ఈమధ్య నేనంపిన మనుష్యుఁడిప్పటికిని రాలేదు. ఇప్పటికి రెండుదిన ములక్రిందటనే రావలసినది. ఇంతవిలంబమగుటకుఁ గతంబేమియోయని మనంబు మిగులవిచారముచెందుచున్నది. సదాశివుని సందర్శించి చాలకాలమాయె. అతని దర్శన మెప్పుడులభించునోయని యిట్లు పృథ్వీరాజు తారాబాయిని సదాశివుని మాటిమాటికిఁ దలంచుకొనుచున్నసమయంబున నొకభటుండు మెల్లననేతెంచి

నమస్కరించి నిలిచెను. అంతఁ బృథ్వీరాజాపురుషుని బదనూరికిఁ దానంపిన వానినిగా గ్రహించి వానితో నిట్లు సంభాషింపఁదొడంగె.

పృ.—ఏమి! తెల్లఁబోవుచున్నావు? నీయందంతమేమి?

భ.—దేవా! తమసెలవుచొప్పున బదనూరికిఁబోతిని.

పృ.—తారాబాయిని రాయలను జూచినావా?

భృ.—లేదు. వారా గ్రామంబున లేరు.

పృ.—మఱియెచ్చటికిఁ బోయినారు?

భ.—తమరంపిన యుత్తరముచొప్పున వారికమలమియరుకోటకే యేతెంచినారఁట.

పృ.—అయ్యయో! నేనిచ్చటకురమ్మని యుత్తరము వ్రాయలేదే!

భ.—తామొకయుత్తరమే కాకుండఁ గొందఱిమనుష్యులఁగూడఁ బంపినారఁట.

పృ.—అకటా! నేమనుష్యులఁబంపినానా! ఇదియెంతయుం మోసముగా నున్నదే! అచ్చటివారిని జక్కఁగానడిగి తెలిసికొన్నావా? లేదా?

భ.—అందులకే యింతవిలంబమాయెను.

అంత పృథ్వీరాజు వానిఁబంపి తనలో నిట్లు విచారింపఁ దొడంగెను. అయ్యయో! యెంతపనిజరిగినది. ఇది దామోదరునికృత్యము. మఱియొకరిది కాదు. పెద్దపులివాతఁబడినట్లు వారాశత్రులబారిఁబడఁగా నాఁడా సదాశివుండు తప్పించినాఁడు. ఇట్లు వారలు సురక్షితులయియున్నారని తలంచుచుండఁగా మరల వారు శత్రువులచేతిలోనే చిక్కినారు. ఓరీ! దురాత్మా! దామోదరా! నీ వెంత కుటిలుండవురా? నిన్నేమి చేసినను పాపములేదునా! ఓరీ! రాజపుత్రాధమా! వారలకెన్ని యాపదలను బెట్టుచున్నావురా? యమ నిశాంతమునకుఁబోయినఁ గాని వారలకు సుఖంబు గలదు. స్వచ్ఛమగురాజపుత్రవంశంబుల కంతకళంకంబు దెచ్చుచున్నావురా? నినుఁ జంపినచోఁ దారాబాయికి రాయలకుఁ గాకుండ లోకమునకంతటికి సౌఖ్యము గలిగించినవాఁడనయ్యెద. ఓదురాత్మా! నీమాయా చాతుర్యమున కెంతయుం నక్కజపడుచున్నాను. నిన్నుమించిన మాయావు లీ

లోకంబుననుండరని నిక్కముగ వక్కాణింపఁగలను. ఓసదాశివా! నీవానాఁడెంతో శ్రమపడి బుద్ధిచాతుర్యంబుచే వారినిదప్పించి వారిగౌరవంబుల గాపాడితివి. నీపడినశ్రమయంతయు వ్యర్థమాయెను. శత్రువులకుఁ జిక్కినవారినిఁ దిరిగి విడిపింపఁగలుగుదుమో లేమో! తెలియకున్నది. అని యిట్లు మిగుల వగలపాలగుచు విచారాతిశయంబున నిద్రాహారంబుఁ గైకొనక యొకకార్యమయిన సాంతముగా నెఱవేర్పక సదాశివయోగీంద్రునిమిత్తము వేచియుండెను. అంతనొకనాఁడు సదాశివుండురయంబున వీతెంచి తనకు నమస్కరించిన పృథ్వీరాజు నాశీర్వదించి కూర్చుండి రాజకుమారునిలో నిట్లు ప్రసంగించె.

స.—రాజపుత్త్రా! ఎంతయాపద యేతెంచినది!

పృ.—అవును. తారాబాయియు రాయలును సురక్షితులయి యున్నారని సంతసింపఁగా వారల నాభగవంతుండు మరల విపదంబుధిలో ముంచినాఁడు. ఎవ్వరికయినను కర్మ మనుభవింపక తీరదు.

స.—దైవము నిందింపఁగూడదు. వారలను దిరిగి శత్రువులపాలఁ జేయుటకు మనబుద్ధిహీనతయే కారణమని వక్కాణింపవలసియున్నది.

పృ.—అందు మనబుద్ధిహీనతయేమున్నది?

స.—లేకేమి! నేనాదినము వారలను బదనూరికిఁ గాక గద్వారుదుర్గమునకుఁ గాని యిచ్చటికిఁగాని గొనివచ్చినచో వారలుశత్రువులపాలగుదురా? ఇది నా తెలివితక్కువ. బదనూరు ప్రవేశించిన తరువాత నీవు పోయి వారలను స్వయముగాఁగొనివచ్చి, యాదుర్గమందు నుంచికొనకపోవుట నీ తెలివితక్కువ.

పృ.—నిశ్చయమే. కాని యిందువిషయమయి తారాబాయి రాయల తెలివి తక్కువగూడనున్నదని చెప్పవలసియున్నది.

స.—శివ! శివ! వారలబుద్ధిమాంద్యము సుంతేనియు లేదు.

పృ.—లేకేమి? తమకుఁ బెక్కురుశత్రువులున్నారని తెలిసియు వచ్చినవారి నెల్ల విశ్వసించి వారివెంబడించిపోవుట తెల్వితక్కువ కాదా?

స.—వారట్లు విశ్వసింపనేలేదు. నీచేవ్రాలుతోనున్న యుత్తరమే వారిని నమ్మించి కుత్తుక లుత్తరించినది.

పృ.—నాచేవ్రాలున్న యుత్తర మెరుల కెట్లుచేరినది?

స.—నీసోదరుండగు జయమల్లునివలన.

పృ.—అక్కటా! నేనాతని విశ్వసించి బదనూరికిఁ బంపుమని యిచ్చినలేఖ. శత్రువులకిచ్చినాఁడు కాఁబోలును.

స.—అవును. నీవు జయమల్లునివిశ్వసించుట తప్పు.

పృ.—ఎన్నియో నీతివాక్యములుపలుక సోదరుఁడని కనికరించి విశ్వసించి చేరఁదీసితిని.

స.—అతుచ్ఛుని విశ్వసించుటవలననే మనకిన్ని చిక్కులు మరల సమకూరినవి. వాఁడు దురాత్ముఁడయిన దామోదరునివలన లంచముఁగొని యతని దుర్బోధన కంగీకరించివచ్చి, నీతోఁగపటస్నేహముచేసి నీవిచ్చినయుత్తరము దామోదరుని కంపినాఁడఁట. వాఁడాయుత్తరమును తనభటుల కిచ్చి తారాబాయిని రాయలనుగొనిరండన వారు బదనూరికిఁబోయి యుత్తరమీయఁగాఁ దారాబాయి రాయలును నాయుత్తరమును నీవంపినదని తలఁచి వారల వెంబడించి తోధానుచేరిరి.

పృ.—ఆయుత్తరములోనైన కమలమియరుకోటకు రమ్మని వ్రాయలేదే!

స.—ఆభాగమంతయు శత్రువులు చేర్చినారు.

పృ.—అకటా! దురాత్ముండెంతపనిచేసినాఁడు. ఆనీచునిచంపి సూరధానులు మావంశమునకు మిక్కిలి హితముచేసినాఁడు.

స.—మనయదృష్టమెంత బాగున్నదో చూడు.

పృ.—అదేమి?

స.—వాఁడు పట్టిన ప్రతిన విన్నావా?

పృ.—వినలేదు.

స.—మాయోపాయముచే నిన్నుఁజంపుటకు జయమల్లు ప్రతిజ్ఞచేసినాఁడట.

కృ—ఎవరియెదుట?

స.—దామోదర మాళవరాజులయెదుట?

కృ.—అందువలన నతనికిఁ గలుగులాభ మేమి?

స.—జయమల్లు నిన్నుఁజంపి దామోదరుని కుపకారముచేసినచో పిమ్మట దామోదర మాళవరాజులు మీజనకునిఁజంపి జయమల్లుని రాణాగాఁ జేయుట కంగీకరించిరి. లాభముకాదా?

కృ.—జయమల్లింత మోసముచేయ వచ్చినాఁడు.

స.—వాఁడు చేసిన మోసమిదియ కాదు. నీమీఁద రాయలకుఁ గోపమువచ్చుట కయి యొకయుత్తరము వ్రాసినాఁడు. కాని తారాబాయి యది శత్రువులు వ్రాసిన యుత్తరమనిచెప్పి రాయలకోపమును మాన్పినది.

కృ.—భగవదనుగ్రహంబువలన బ్రతికితి. లేనిచోఁ జత్తునుగదా?

స.—సరియె. భగవదనుగ్రహము మాటకేమి? తారాబాయి వ్రాసినపద్యముల యుత్తరము నీప్రాణములఁ గాపాడినదని నమ్ము.

కృ—ఎట్లు?

స.—జయమల్లు మొదటఁ దారాబాయిని సామాన్యస్త్రీగా భావించెఁగాని నిరుపమానురాలని భావింపలేదు. అందుచే వాఁడును దామోదరుఁడును మాళవరాజును గలిసి జయమల్లుదామోదరులు మోసముచేసి నిన్నుఁ జంపి తారాబాయిని మాళవరాజున కిచ్చుటకును, మాళవరాజు తోఢా చిత్తూరునగరంబుల వారిరువురికి నొసంగుటకును శపథంబుచేసికొనిరి. అందులకు నిన్నుఁ జంపుటకయి జయమల్లిచ్చటికి వచ్చి తనకార్యము నెఱవేర్చికొనసిద్ధముగానుండఁ దారాబాయి వ్రాసినపద్యములయుత్తరము వానికంటఁబడియె. అది వాఁడుచదువుకొని తారాబాయిబుద్ధి విశేషమునకును కవిత్వచాతుర్యమునకును మిగుల మెచ్చుకొని తానే వరింపవలెనని తలంచి బదనూరికిఁ బోయెను. ఆయుత్తరము వానినింటనుండి కదల్పనిచో వాఁడు నీప్రాణములఁ గదల్పియుండును.

పృ.—జయమల్లిట్టివాఁడని మీకుఁదెలిసినచో నాకుఁ దెలియచేయవద్దా?

స.—కార్యాంతరాసక్తుండనయిన నాకిది యేమియుం మొదటఁ దెలియలేదు. తెలిసినచో వర్తమానమంపనా!

పృ.—మాళవరాజునకింకను బుద్ధి రాలేదా?

స.—బుద్ధియుండినఁగదా వచ్చుటకు.

పృ.—ఆదురాత్ముల఼ఁ జంపినంగాని నాకు నిద్రాహారంబులుండవు, కాని తారా బాయిని రాయలను తప్పించుట యెట్లో యోజింపుఁడు.

స.—నీయాలోచన చెప్పుము.

పృ.—నాయాలోచన యేమున్నది. దండోపాయమవలంబించి మాళవదామో దరులనుజయించి తారాబాయిని రాయలను విడిపించి తోధానగరంబు వారలనుండి గైకొనవలెనని యున్నది.

స.—ఆయుపాయమవలంబింపవలసినసమయ మిదికాదు.

పృ.—మఱెప్పుడు?

స.—తారాబాయియుం రాయలు శత్రువులచేతికిఁ జిక్కకుండనున్నప్పుడు.

పృ.—ఇప్పుడయిననేమి?

స.—నీవు దాడివెడలినసంగతి వారికిఁదెలియఁగానే రాయలను దారాబాయిని జంపనిశ్చయించుకొన్నారు. మఱియు వారిరువురు తమకుఁ జిక్కి యున్నంతకాలము నీవు రావని వారినమ్మకము.

పృ.—కాప్రయాసమంతయుం వారిరువురికొఱకేగదా? వారిరువురుమృతినొంది నప్పుడీరాజ్యాదులతో నేమిప్రయోజనము?

స.—అవును. నిశ్చయమే. అందుచేతనే దండోపాయము యుక్తము కాదంటిని.

పృ.—మఱేమి చేయవలెను.

స.—సామము చేత రాయలను దారాబాయిని విడిపింపవలె. తరువాత దండో పాయము ప్రయోక్తవ్యము.

పృ.—వారుమిగులజాగరూకులయియుందురు కాన నిప్పుడు సామోపాయము గూడ వ్యర్థమగునేమో?

స.—జాగ్రత్తతోఁ బ్రయోగించినచో సామ మెప్పుడును వ్యర్థముకాదు. రమ్ము. సామము ప్రయోగించి చూతమనిచెప్పి వానిని వెంటఁబెట్టికొని యెచ్చటికోపోయెను.

---

# ముప్పదినాల్గవ ప్రకరణము

మాధవుండు పరలోక గతుండయిన కొన్ని దినంబులకుఁగాని తోధాపురంబున నతనిమరణవార్త యందఱికిఁ దెలియరాలేదు. ఆవార్త పురజనులువిన్నప్పుడు కొందఱు రమాబాయికిఁ దనపై వలపులేదని గ్రహించియు నామెనుగామించుటయే మాధవునిబుద్ధిహీనతను వెలువరించుచున్నదనియుఁ, మఱికొందఱు తుచ్ఛుఁడయినమాధవసింగునకు రమాబాయి తగినశిక్ష చేసినదనియు నింకొక కొందఱు వలపులేనికాంతను వలచుటకంటెఁ బ్రాణాపాయకరమగు కార్యమింకొకటిలేదనియుఁ, గొందఱు మాధవుని మేడపైకి రహస్యముగాఁ రప్పించికొని చంపించి యామైపైనబాఱవైచినదనియుఁ, నింకొకకొందఱు డామోదరుండు తనకుఁదురకను బెండ్లిచేసెదనని ప్రతినపట్టుటచే రమాబాయి భయపడి తురకను బెండ్లాడుటకంటె రాజపుత్త్రునివరించుట మేలనితలంచి తనపై వలపు చాల్చినమాధవసింగు నొరులెరుగకుండునట్లు సౌధముయొక్క పశ్చాద్భాగంబుననుండితనసౌధమును సమీపించి తావైచినత్రాటివెంబడిని సౌధంబుపైకివచ్చినచో నాస్థలమునుండి తప్పించుకొని పోయి పెండ్లిచేసికొని సుఖముగా బ్రదుకుదమని చెప్పగా నతఁడందులకంగీకరించియామె చెప్పినట్లుఁజేసిత్రాటివెంబడిని బైకిఁబోవుచున్నప్పుడు ప్రమాదవశమునఁ ద్రాడు తెగుటచే నటనుండిక్రిందఁబడిచచ్చెననియు, వేఱొకకొందఱు రమాబాయికపటప్రేమమునుగనఁబడఁజేసిత్రాటివెంబడినిదన మేడ మీఁద కతండు వచ్చునట్టులొడంబఱిచి వాఁడు మేడనధిరోహించుచున్న సమయ

మున ఖడ్గంబుతో నాత్రాటిని ఛేదింప నటనుండి క్రిందఁబడి మృతినొందెనని యంఁ,బలువిధంబుల భావింపఁజొచ్చిరి. అంతనీవార్త దామోదరుండు విన్నప్పుడు తన హితవాక్యంబులు వినకపోయినందులకు వానికిఁ దగినప్రాయశ్చిత్తమాయెనని మొదటసంతసించెనుగాని తరువాత నతఁడు తనకొనర్చినయుపకారంబును దలంచుకొని మిగులవిచారించి కడపటివారాలోచించినట్లు వానిచావునకుఁ గారణభూతురాలు రమాబాయియే యని యూహించి యాఘాతకురాలికిఁ దగినశిక్ష యొనర్చి తనమిత్రునిఁ జంపినందులకుఁ బగదీర్చుకొన నిశ్చయించి యొకనాఁడు మాళవరాజు సందర్శనంబునకుఁబోయి తనరాక యెఱింగించిపుచ్చి తదనుమతంబున లోనికిఁబోయి యుచితాసనమలంకరించి యతనితో నిట్లు సంభాషించెను.

దా.—మహారాజా! తామభిలషించిన కాంతామణిని దారాబాయిని నిటకు రక్షించితి. ఇఁక మీరు వరించుటయే.

మా.—(సంతోషముతో) రాజపుత్రా! నీవుతలంచిన కార్యము నిష్ఫలమగుట కవకాశమియ్యవు. నీ ప్రభావము వర్ణింప నెవ్వరితరము!

దా.—కార్యంబులు నెఱవేరుట నాప్రభావంబువలనఁగాదు. తమకు నాయం దున్న యనుగ్రహంబువలననే యని యోజింపుఁడు. దేవా! నామనవి యొకటి యున్నది.

మా.—ఏదియో తెలియఁజెప్పుము.

దా.—మాధవసింగు నాకుఁ గుడిభుజమువంటివాఁడని తమరెఱుంగుదురుగదా!

మా.—అవును, ఎరుఁగుదు. మననిమిత్తము చాలకష్టపడినాఁడు.

దా.—ఆ మాధవసింగు రమాబాయిని వరించెను. కాని యామె కతనియందు వలపులేదు.

మా.—తరువాత నేమిజరిగినది.

దా.—వానిని మాయోపాయముచేఁ జంపించినది.

మా.—అకటా! మాధవసింగు చచ్చెనా? ఎంతపని చేసినది. ఆదురాత్మురాలు.

దా.—అందులకు దానికిఁ దగినశిక్ష యొనర్పవలెనని యున్నది.

మా.—ఏమిశిక్ష యొనర్చెదవు. యావజ్జీవము కారాగృహమునందుంచెదవా?

దా.—దానికది యొకశిక్షయా?

మా.—మఱియేమిచేసెదవు?

దా.—మోటువాఁడును, బలిష్ఠుఁడు నగునొకమహమ్మదీయునకుఁబెండ్లిచేసెదను.

మా.—బాగుబాగు. అఁడుదాని కంతటికంటె నెక్కుడు శిక్షలేదు.

దా.—ఇది కేవల మారమాబాయికి శిక్షయేకాక తక్కినలోకమునకు జాతిమత భేదములేకుండ నొండొరులు పెండ్లిచేసికొనవచ్చునని విధిసూత్రము కూడ కాఁగలదు.

మా.—నీవాక్యమెంతయు నాదరణీయమయియున్నది. హిందువులుమిగులఁ జెలివితక్కువవారు. అందఱు భగవంతునిచేతనే సృష్టింపఁబడి యుండనీయెక్కువతక్కువలెందుకువచ్చినవో తామెఱుఁగరు.ఏజాతివా రాజాతివారితోనేకాని మఱియొకజాతితో సంబంధములు చేసికొనుట తప్పనిభావింతురు. మఱియుం నట్టిపట్టుదలలో మీరాజపుత్రులు మిగుల మూర్ఖులు.

దా.—తమమాట నిశ్చయమె. అట్టిరాజపుత్రులమూర్ఖతను వదలించుటకే రమాబాయి కిట్టిశిక్ష విధించుట.

మా.—మంచిది, కానిమ్ము. నీవిఁక సంఘసంస్కరణకర్తవని ప్రసిద్ధికెక్కుదువు.

దా.—మహారాజా! సంఘసంస్కరణములేక హిందువులందఱు చెడుచున్నారు. కావున నేనిప్పుడు క్రొత్తమార్గమవలంబించి రమాబాయి నొక మహమ్మదీయునకొసంగి వివాహముచేయుటయుఁ దారాబాయినిఁ దమకు వివాహముచేయుటయు, నీరెండుకార్యంబులు నాజీవితకాలంబులో నెఱవేఱినచో నీవివాహములను నిదర్శనముగాఁ జేసికొని తక్కినవా రందఱు జాతిమతభేదములేకుండ వివాహముచేసికొందురు. అందువలన దేశమభివృద్ధిలోనికి వచ్చును. ఇంతకు నేనేకారణమను. గాన దేశమున కుపకారముఁ జేసినవాఁడ నగుదును.

మా. — మేలుమేలు. అట్లు తప్పక చేయుము.

దా.—చేయుటకు సంకోచము లేదుకాని రమాబాయికిఁ దగిన తురక పెండ్లి కొడుకొకండు కావలసియున్నది.

మా.—అందుకయి ప్రయత్నింపనేల? మనసైన్యమందు గావలసినందఱు పరు లున్నారు.

దా.—చిత్తము. మావారలఁ బిలిపించి యొకరిని బ్రోత్సాహపఱుపుఁడు.

మా.—ప్రోత్సాహపెట్టుట కిదియొకయుద్ధము కాదే! పెండ్లి చేసెదమని చెప్పిన నందఱు నంగీకరించువారలే. అందులో సౌందర్యవతియగు రాజపుత్ర స్త్రీని పెండ్లాడు విషయమయి వేఱ చెప్పనేల?

దా.—అందువలననే యికార్యంబు కష్టసాధ్యంబువలెఁ గన్పట్టుచున్నది. ఆమె కందఱు భయపడుదురు.

మా.—ఏమి! యీవెఱ్ఱిమాటలు! యుద్ధములయందు కత్తిగొని శత్రుసేరుల నెదు ర్కొని జయముఁబొందుచున్నవీరు లాయబలకు భయపడుదురా? ఇదిగో చూడు! ఇప్పుడే యొప్పించెదను. నీవికఁ బొమ్మనిపంచి (రాజ భటుని బిలిచి) ఓరీ! నా సేనా నాయకులం బిలిచికొనిరమ్ము.

భ.—చిత్తము. (అని పోయివారిని గొనివచ్చును. ఆసేనానాయకులుచు వచ్చి వరుసగా నిలువఁబడి తనప్రభువున కెరఁగిరి.)

మా.—(వారలంజూచి) ఓయీ! మహమ్మద్ ఖాను! యిటురమ్ము

మ.—చిత్తము (అని సమీపించును.)

మా.—సౌందర్యవతి యగు నొకరాజపుత్రకన్యకనిచ్చెదము. వరింతువా!

మ.—(ఆలోచించుచు ఊరకుండును.)

మా.—(ఏమి యూరకుందువు)?

మ.—కన్నపెండ్లమునకే యన్నముపెట్టుట దుర్ఘటముగానున్నది.

మా.—అట్లు భయపడవలసిన యవసరములేదు. నీకుఁదగిన జీవనోపాధినిం గలిగించెద. ఒకసౌధముకూడఁ గట్టించి యిచ్చెద.

మ.—మహాప్రభూ! ఏమియిచ్చినను నేనాకన్నెను వరింపలేను. మఱియొకరి కిప్పింపుఁడు.

మా.—ఓరీ! పిఱికిపందా? నీవు నాకు ప్రేమాస్పదుఁడ వని యెంచి నీకీ యుప
కారము చేయుచుండ వద్దనుచున్నావా! నీవదృష్టవంతుఁడవు కావు.
పోపొమ్ము.

మ.—చిత్తము (అని భయపడుచు నిష్క్రమించును.)

మా.—ఓయీ! దావూద్! నీ విటు రమ్ము.

మ.—(సమీపించి నిలుచును.)

మా.—నీవా రమాబాయిని పెండ్లాడెదవా?

తా.—మహాప్రభూ! నాకు వద్దు. నాకు వద్దు.

మా.—కారణ మేమి?

తా.—ఏమిచెప్పను. రాజపుత్రస్త్రీలు మిక్కిలి శౌర్యవంతురాండ్రు. మిగుల
గౌరవాభిలాష గలవారు. వారు తురకలను గడ్డిపోఁచలవలెఁజూతురు.
ఆమెను బెండ్లాడి జీవించుట మిగులఁగష్టము. మాధవసింగుగతి యే
మయినదో యాలోచింపుఁడు.

మా.—మాధవసింగు వెడఁగువాఁడు. కావున మోసపోయినాఁడు. అతనిచరిత్ర
మొక నిదర్శనముగాఁ గొనకుము.

తా.—అట్లుకాదు. స్త్రీలు తమ కిష్టములేనిచో బ్రహ్మాండనాయకునినైన
నిముసమాత్రములో మోసపుచ్చి చంపఁగలరు. కావున నాకుఁ బెండ్లి
చేయ నక్కఱలేదు. మీకును నారాకన్నియకును బదివేలవందనంబులు.

మా.—(కోపముతో) ఓరీ! తుచ్ఛా! పిరుఁడ వనిపించుకొని సేనాధిపత్యము
వహించియు, నాఁడుదానికి వందనంబులు చేసెదవు. సిగ్గులేదా! పోపో.

తా.—(సంతసముతోఁ బయికిఁబోవును.)

మా.—ఓయీ! నాజర్ఖాన్! నీ విటు రమ్ము.

నా.—సమీపించి నిలుచును.

మా.—నీవయిననాయాజ్ఞఁ దలఁదాల్చి రమాబాయినిఁ బెండ్లాడుదువా?

నా.—మహాప్రభూ! దేవరవారి యాజ్ఞనెప్పుడు శిరసా వహించిరే
యున్నాము.

మా.—ఎల్లప్పుడుకాదు. ఇప్పటిమాట చెప్పుము.

నా.—(భయముతో) ఆమెను బెండ్లాడుటకు భయపడుచున్నాను.

మా.—పోషించుట కష్టమనియా !

నా.—కాదు లొంగదీసికొనలేక.

మా.—ఓరీదుర్బలా ! ఒక్క యాఁడుదాని లొంగదీసికొనలేనివాఁడవు పెక్కు సైనికుల నెట్లు లొంగఁదీసికొనుచున్నావు ?

నా.—మహాప్రభూ ! సైనికుల నెందఱినైన వశముకావించుకొనఁగలను కాని యొకకాంతను వశముకావించుకొనలేను. యుద్ధములందు శత్రువుల యాయుధపు దెబ్బలనయిన సహింపఁగలనుగాని, యొకకాంత నిందావాక్యములు సహింపలేను. యుద్ధమందు శత్రువులతోఁబోరాడి వారి చేతిలోఁ జచ్చుటకు జంకనుగాని, యాఁడుదానిచేతిలో చచ్చుటకు జంకుచున్నాను.

మా.—ఎందుకీప్రగల్భవాక్యంబులు. పో పొమ్ము.

నా.—(నమస్కరించి పోవును).

మా.—ఓయీ ! అబ్దుల్లాఖాను !

అ.—చిత్తము. చిత్తము. (అని సమీపించును)

మా.—నీ వయిన రమాబాయిని బెండ్లాడుదువా !

అ.—తమయాజ్ఞ కెప్పుడు బద్ధుఁడనేకాని వలపులేని కాంతను వరించుట ప్రాణములు గోల్పోవుటయే !

మా.—ఎట్లయిన మంచిమాటలాడి వశము కావించుకొని వరింపలేవా ?

అ.—మంచిమాట లాడినను లాభములేదు. అకిల్ల రాజపుత్త్రునే వరింపక చంపి స్వర్గంబునకుఁ జేర్చినది. మహమ్మదీయుల మగుమాసంగతిఁ జెప్పనేల !

మా.—(అత్యాగ్రహముతో) ఓరీ! తుచ్ఛులారా ! నామాట నతిక్రమించుచున్నారే. మీలో నెవరయిన నారాజపుత్రిని బెండ్లాడుదురా ? లేక యుద్యోగంబులు వదలి పోవుదురా? ఏదోయొకటి చెప్పుఁడు.

సీ.—మహాప్రభూ! బ్రతికియుండిన బలుసాకేచాలును. పొమ్మన్న నుద్యో
గంబు బయిన విడిచెదము కాని యాకాంతను బెండ్లాడము—

ఆసమయంబున నబ్దుల్లాఖాను తనలో నిట్లనుకొనియె. "అక్కటా! యీప్రభువునకెంత తోఁచినంతియు కాని, ఇదియుక్తమా యయుక్తమా యను నాలోచనలేదు. మే మెవరమయినఁ బెండ్లాడనిచో మాయుద్యోగంబులు లాగివేయుట సిద్ధము. ఇందేమి చేయుట యుక్తము. రాజాజ్ఞనుబట్టి యాకాంతను బెండ్లాడినచోఁ దక్కినముగ్గురు తమతమ యుద్యోగములందుండి సుఖముగా జీవింపఁగలరు. నాప్రాణము లెప్పటికయినఁబోవలసినవే కదా! కావున నాప్రాణంబులఁ బరోపకారమునకు ధారవోయుట యుక్తకార్యము. ఆమెను సకలోపాయంబులచేత వశముగావించుకొనుటకుఁ బ్రయత్నించెదను. దైవానుగ్రహమువలన నామెమనస్సు తిరిగి నన్ను బ్రేమించెనేని పరోపకారమే కాక నాకత్యంతసౌఖ్యముకూడ లభించును. అట్లు ప్రేమించక నన్ను మాయోపాయంబుచేతఁ జంపినను నాకుఁ బరోపకారజనితపుణ్యంబు లేకపోలేదుగదా!" అని యోచించుకొని మాళవరాజును సమీపించి యిట్లనియె.

దేవా! తమయాజ్ఞ నతిక్రమింప నిష్టము లేకయుఁ దక్కినసేనానాయకుల కుపకారము జేయఁదలంచియుఁ బ్రాణంబులకయిన నాసింపక యామెను బెండ్లియాడ నంగీకరించితి. ప్రభువునాజ్ఞమీరుటకంటెఁ బ్రాణంబుల విడుచుటయ యుక్తమని తోఁచినది. కావున నాకుఁదగినసౌధ మొకటి యిప్పించి జీవనోపాధి గలిగించి యారమాబాయిని నాకప్పగింపుఁడు. ఆమెను సకలోపాయంబులచేతను సాధించిచూచెద. అట్లొకనెలదినములు చూడవలెను. ఆమె మనంబును మంచిమార్గంబునకుఁ దెచ్చికొని యంగీకరించినచో సరియే. లేనిచోఁ బ్రాణంబులకు నిరాశ చేసికొని బెండ్లాడెద. ఏమయినను నామెను బెండ్లాడుట నిశ్చయము. ఆమె యబ్దుల్లాఖాను భార్యయని త్రిశుద్ధిగ నమ్ముఁడు. అని పలికి రాజును సంతసింపఁజేసి యొకసౌధంబు పుచ్చుకొని రమాబాయినందుంచుకొని యామెమనంబు ద్రిప్ప సకలోపాయంబుల నుపయోగించుచుండె. మాళవరా

జతని ధైర్యసాహసములకు మెచ్చుకొని మిక్కిలి గౌరవంబుతోఁ జూచుచు నతఁడు రమాబాయిని వరించునట్టి మార్గమున నే తానును తారాబాయి కర గ్రహణము చేయవలయునని సంతసించుచుండెను.

---

# ముప్పదియైదవ ప్రకరణము

అబ్దుల్లాఖానుకోర్కి సిద్ధించినది. రమాబాయి వానివరించుటకు నిష్ట పడి వాని కిట్లనియె. "ఓయీ! నిన్ను నేవరించుట కెంతమాత్రము లోపములేదు. నామనస్సు తిరిగినది. మనకిరువురకు జరుగఁబోవు వివాహము రాజపుత్రాచారము ననుసరించియుండవలెకాని మహమ్మదీయాచారముచొప్పున నడిపింపఁ గూడదు. ఇందులకు నీవిష్టపడుదువేని నిన్నుఁ బెండ్లాడుదు" నని చెప్పెను. అబ్దుల్లా యదివిని యమితానందము నొంది యందుల కంగీకరించి మహావైభవముతోఁ బెండ్లాడెను. మాళవరా జదివిని మిగులసంతసించి వానికిఁ దగిన బహుమానము లర్పించె. దామోదరుఁ డమితానందంబునొంది తానొక సంఘ సంస్కరణకర్తయని నలువురిలోను వాక్రువ్వఁజొచ్చె. రమాబాయి తురకను బెండ్లాడిన దని వినినప్పుడు తోధానగరమేకాక రాజస్థానంబంతయు మహామారుతముచే నుద్ధూతం బగుసాగరంబుచందంబునఁ గలఁగ నారంభించె. అప్పుడు దామోదరుని బడఁదిట్టని రాజపుత్త్రుం డొక్కఁడును లేఁడు. మఱియుఁ గొందఱు కలికాలంబు వచ్చినదనియుఁ, గావుననే యిట్టి దుర్బుద్ధులుపుట్టుచున్న వనియుం, బలుకఁజొచ్చిరి. కొందఱిఁక వర్ణములు సంకరంబులగునని భయపడఁ జొచ్చిరి. కొందఱు రహస్యముగాఁ దోధాకుఁబోయి యబ్దుల్లాను రమాబాయిని జంపి ఇఁకముందట్టి దురాచారంబులు కలుగకుండఁ గట్టుదిట్టము చేయవలెనని భావింపఁజొచ్చిరి. కొందఱు దామోదరున కీపోఁగాలపు బుద్ధి పుట్టె నందులకు మిగుల నిందించిరి. మఱికొందఱు వర్ణసంకరములు గావించుటకును కులాచారంబులు దప్పించి ధర్మమునడఁగఁద్రొక్కి లోకము పాపభూయిష్ఠం

ఋగాఁజేయుంటకుఁ బుట్టిన కలిపురుషుఁడే దామోదరుఁడని భావింపఁజొచ్చిరి. కొందఱు దామోదరుఁ డచిరకాలములోనె చావ భగవంతునిఁ బ్రార్థింపు చుండిరి. కొందఱు దామోదరుఁడు దురాత్ముఁడుగదా! బ్రహ్మవిని కెందు కింత యాయుర్దాయ మొసంగెననియు, "పాపీచిరాయుః" వనుమాట వీనియెడ నిక్కమయ్యె ననియు భావించిరి. తరువాత రమాబాయిఁగూర్చి యిటునిందింప సాగిరి. "అకటా! రాజకులమందు నేఁడీదురాత్మురా లేలజన్మించినది? రాజ వంశంబునంతయు మలినముగావించినది! అకటా! ప్రశస్తగుణంబు, రాజ పుత్రవంశపావనుండునగు మాధవునివరింపక వానిని జంపి తుద కీతురకచుఁ బెండ్లాడినదేమి? ఓసీ! తుచ్ఛరాలా! రమాబాయీ! నీకిట్టిదుర్బుద్ధిపుట్టిన దేమే? ఈతుచ్ఛసుఖంబుల కాశించి రాజపుత్రస్త్రీలగౌరవం బంతయు నట్టేటిపాలు గావించితివేమే? కులాచారంబులు చూచుకోవద్దఁటే? మాధవ సింగుకంటె నీదురాత్ముఁడె సౌందర్యవంతుండఁటె? గొడ్డును గోసికొని తినునట్టి తురకను బెండ్లాడనింలేనియుంఁ గొంత జనింపలేదేమె? ఇట్టి తుచ్ఛమార్గ మవలం బించి లోకనిందపాలయి జీవింపలేనని యోజింపవద్దఁటే? రాజపుత్రస్త్రీవే! నీవాపాటిగౌరవ మపేక్షింపవద్దఁటె! మేమింత వెఱ్ఱిపడుచున్నా మేమి! గౌరవంబును గోరినదానవయినచో నీవు మహాత్మదీయునిఁ బెండ్లాడనేల? ఛీ! నీజన్మంబుకాల్పనా? నీసౌఖ్యము మంటిపాలుగాను! ఎంతపని చేసితివే! సౌఖ్యమే స్థిర మనుకొన్నావే! సౌఖ్యమే చూచుకొనుచున్నావుగాని భగ వంతుఁడు పరలోకమునందుండి పాపుల శిక్షించు నన్నమాట మఱచితివికాఁబో లును. మందనుభవింతువులెమ్మని పలువిధంబులనిందింపఁజొచ్చిరి. ఆసమయం బున రమాబాయితలిదండ్రులువచ్చి నూఁతునెంతయు బ్రతిమాలుకొనుచు నిట్లనిరి. 'కుమారీ! నీవలన మేమెంతయు నిందాపాత్రులమగుచున్నాము. నిన్నుఁ గన్నందులకు మాకేదియాలాభము!ఆలోచించి బుద్ధితెచ్చుకొని ప్రాయశ్చిత్తము చేసికొని రాజపుత్రులలోఁ గలియుము. అనాదియయివచ్చుచుండిన మన యా చారములఁ దప్పించుట యుక్తముకాదు. నామాటవినుము. మాకపకీర్తితేకు మనియెన్నివిధములఁ బ్రార్థించిన మాఱుమాటలేదు. ఆసమయంబున మాళవ

రాజసైనికులువచ్చి మెతలివంద్రుల దూరముగాఁ దఱిమిరి. అంతవారలు ప్రేమను చూపి మాధవసింగునువలె అబ్దుల్లానుగూడ జంపునని భావించి చేయునదిలేక తమయూరుఁ జేరిరి. ఆపురములోని వారందఱు రమాబాయికపట ప్రేమను చూపి మాధవసింగునువలె నబ్దుల్లాను గూడఁ జంపునని భావించుచుండిరి. కాని యామె యట్లుచేయక తనయందమితానురాగంబుగలదియయి వర్తింపఁజొచ్చె. అదిజూచి తురకలందఱు నత్యాశ్చర్యంబుజెందిరి. మాళవ రాజుసేనానాయకులుపొందుచున్న విచారంబునకుఁ బారంబులేదు. ఇప్పుడు వీరందఱు నబ్దుల్లాతో విరోధముఁబూనియుండిరి. ఆసంగతి క్రమక్రమముగా నబ్దుల్లాచెవిసోకఁగా వాఁడు మాళవరాజునొద్దకుఁబోయి సేనానాయకులు చేయుచున్న మరూహలను దెలిపెను. అందులకుమాళవరాజుమిగుల నాగ్రహింపఁగాఁ దామెప్పుడు నతనికి హానిచేయమని ప్రమాణములు చేసి పోయిరి. వారిలోనియవ్వరు తాముచేసిన ప్రమాణములకుబద్ధులయి యప్పటినుండియాయబ్దుల్లా ఖానును ప్రేమించుచుండిరి. కాని వారిలోఁ దాఘ్రామూరకుండక రహస్యముగా నబ్దుల్లానుజంపి రమాబాయినిచేకొనవలెనని నిశ్చయించి యుండెను. వాఁడాసంగతి నెవ్వరికిఁదెలియనీయక యొకనాఁటి నిశీథంబునఁ గత్తిచేతఁ దాల్చి కొంతసొమ్ముమూటఁగట్టికొని తిన్నఁగా నబ్దుల్లాసౌధంబునకుఁబోయి యచ్చటి కావలిభటులకు, దగినంతలంచంబులిచ్చి యొప్పించి సౌధంబుసొచ్చివారలు శయనించుగదిద్వారమువద్దకుఁబోయి తలుపుమెల్లఁగాఁ ద్రోసెను. కాని యా తలుపు కదలినదికాదు. అంతజాగ్రత్తగా వాఁడు పరిశీలించిచూచి తలుపురంధ్రములనుండి వెలువడివచ్చుచున్న దీపపుఁగాంతులచేఁ బయినిబీగము వేసియున్నట్లు గ్రహించి యబ్దుల్లా రమాబాయితోఁగూడ మఱియొకచోటనుండునని తలంచి యచ్చోటువిడిచి యామేడరెండవప్రక్కకుఁ బోయెను. వీఁడట్లుపోయి చూచునప్పటికి మేడదిగువనిద్దరుమనుష్యులు సంచరించుచున్నట్లుపొడకట్టె. అంతవాఁడు నిశ్శబ్దముగా సౌధసోపానపంక్తినవతరించి చూచి, యాయిరువురను, రమాబాయిగాను యబ్దుల్లాగాను భావించి వారల రహస్య సంభాషణ వినఁగోరి యూపిరిబంధించి స్తంభాకృతివహించి వారలను జెప్పవేయకుండఁ జూచుచుండెను. కాని వారు మిగుల మెల్లఁగా మాటలాడుచుండుటచే వా

మాటలితనికేమియుం వినరాలేదు. అందువలన నితండు మఱింత శ్రద్ధవహించి యితరమయిన శబ్దంబులవినక వారిమాటలనే వినఁగోరియుండె. ఆసమయంబున వెనుకనుండి యొక పురుషుండువచ్చి, దేహము మఱచియున్న యాతని చేతిలోనున్న యాయుధము లాగికొనె. అంతదావుఫ్ఖాను, యెవఁడోతనకేల నున్నకత్తిఁ గైకొనెనని యూహించి, వెనుకకుఁదిరిగి చూచునప్పటి కాపురుషు డాతనికుత్తుక నేలఁబడనఱకెను. అదివిని యచ్చటనున్న వారిద్దరు మూఁడవ పురుషునితో నేదియో చెప్పి యావైపుననున్నగోడదాటిపోయిరి. తెల్లవాఱిన తరువాత నబ్దుల్లా సుఖముగా నిద్రనుండిలేచి పోయి చూచునప్పటికిఁ దావుఫ్ఖాను వచ్చటఁజచ్చిపడియుండెను. అందులకతఁడు విస్మయమంది మాళవరాజు సన్నిధికిఁబోయి యావృత్తాంతము విన్నవింప వానికిందగిన శిక్షయయ్యెనని సంతసించెను. అది మొదలు మఱియెవ్వరును వారిమేడపంకకయినఁ బోనిష్టపడకుండిరి. అబ్దుల్లా రమాబాయితో సుఖముగాఁ గాలముగడపుచున్నాఁడనివిని మాళవరాజు తానుకూడ తారాబాయిని దర్శించి తనయభిప్రాయంబు తెలుపవలయునని యెంచి దాసోపరసహితుండై యామెమందిరమున కేఁగెను. వీరలు పోవునప్పటికామె యపారంబగు విచారంబునొందుచుఁ దనతండ్రి చెప్పినది వినసందులకుఁ దగినప్రాయశ్చిత్తమాయెననియుఁ బృథ్వీరాజు మిగుల మోసపుచ్చెననియుఁ మాతండ్రి చెప్పిన ప్రకారము పృథ్వీరాజు శత్రుకోటిలోనివాఁడే యనియుఁ భావించుచునుండెను. అంత వీరలిరువురు నిశ్శబ్దముగాఁబోయి యామెసమీపముననున్న చెఱియొకపీఠము నలంకరించిరి. విచారాతిశయంబుచే మైమఱచియున్న తారాబాయి వారలఁజూచి సరభసంబునలేచి నిలుచుండెను.

అంత మాళవరాజు తారాబాయి కిట్లనియె. ఓసుందరీ ! నీసందర్శనంబునకయి యిచ్చటికి రాఁగా నీవు లోనికిఁబోవుట యుక్తమా? నీవదనేందుబింబంబునుఁ జూడ నానేత్రోత్పలంబులు మిగుల వేడుకపడుచున్నవి; నన్నుఁ జేపట్టి నా యభిలాష దీర్పుము. మీతండ్రి కోర్కె నాలోచించి చూడ నీవు తోధానగరంబునకే రాణివగుదువుగాని నన్నుఁ బెండ్లాడుదువేని మాళవరాజ్యంబునకెల్ల రాణివగుదువు. కావున నన్నుఁజేపట్టి సౌఖ్యములనుభవింపుము. జన్మమెత్తినం

దులకుఁ దగినసౌఖ్యము లనుభవింపకున్న నాజన్మమువలని ప్రయోజనమేమి? ఇప్పటికినీయౌవనమంతయుం వ్యర్థముచేసితివి. ఇఁకనయిన వివేకవంతురాలవు కమ్ము. రమాబాయి మిగుల వివేకవంతు రాలని చెప్పవచ్చును. మహమ్మదీయునిఁ బెండ్లాడినఁగాని తనకిహలోక సౌఖ్యమునున్న యని భావించి యట్లుచేసినది. నన్నువరించినంగాని నీకు సుఖంబులబ్బవు. నన్ను నీవు చేకొననిచో యావజ్జీవము బ్రహ్మచారిణివై నాకారాగృహముననుండ వలసినదానవే? నిన్ను విడిపించువా రెవ్వరును లేరు. పృథ్వీరాజువచ్చి విడిపించుననితలంపఁబోకుము. వాఁడు సామమునవచ్చి విడిపించలేఁడు. యుద్ధముచేసి మిమ్ములనువిడిపించుననితలంతువేమో? అదియును నిష్ఫలమె. వాఁడట్లు మాపయికివచ్చినచో నిన్ను మీతండ్రిని గత్తిపాలొనరింపఁదలఁచినారము. ఇఁక పృథ్వీరాజెట్లువచ్చును? ఎట్లు విడిపించును? కావున నట్టిపేరాశలకుఁబోక నావాక్యమువిని నాగౌరవమునందుము. అని యిట్లుపలికినప్పుడు తారాబాయికివచ్చినకోపమునకు హద్దులేదు. ప్రళయకాలపయోనిధియందలితరంగంబులచందంబునఁ గోపరసతరంగంబులు మేరనతిక్రమింపఁజొచ్చె. ఆసమయంబున. నామెకు యుక్తాయుక్త వివేకమునశించె. తాను మాళవరాజునకుఁ జిక్కియున్నమాట మఱచె. మాళవరాజు నోటమాట నోటనుండఁగనె వానిమాటలు సహింపలేక యింతకుముందుఁ దా దాఁచికొని యున్నకరవాలంబు కేలఁగీలించి మదపుటేనుఁగుపైకి లంఘించుసింహిచందంబున మాళవరాజును సమీపించి నఱుక బాహువెత్తెను. అంత దామోదరుండు సరభసంబునవచ్చి చేతిలోనికరవాలంబు బలాత్కారముగా లాగికొనఁగా దాసీజనంబువచ్చి యామెను గొనిపోయి యథాస్థానంబునఁజేర్చిరి. ఆసమయంబున మాళవరాజామెశౌర్యంబున కచ్చెరువందుచు నిశ్చేష్టితుండయియుండె. తారాబాయి తనప్రయత్నము వ్యర్థమయినందులకు విచారించుచు వారినిట్లు దూషింపనారంభించె. ఓరీ! మ్లేచ్ఛాధమా! నీకిట్టి పోఁగాలపుబుద్ధులు పుట్టుచున్నవేమి! నీరాజ్యంబును నీకులంబును నాశనముచేసికొనఁదలంచి నీవిట్టి దుష్టమార్గంబునఁ బ్రవర్తించుచున్నావు. నీవు. మదాంధుఁడవయి క్రిందుమీఁదులుచూడక నోటికిరానికాఱులఱచుచున్నావు. నన్ను నీవు పెండ్లాడుదువా?

ఉత్తమరాజ పుత్త్రి వగునన్ను స్వేచ్ఛుండవయిన నీవిట్టిమాటలాడుచున్నప్పుడు నీజిహ్వ పడిపోలేదేమి! ఈరాజపుత్త్రాపశదుండగు దామోదరు డడ్డుకొనినచో నీవీపాటికెచ్చటనుందువో! యోజించుకొమ్ము! దురాత్ముఁడయినవీనిమాట లాలకించి నిష్కారణముగాఁ జెడుచున్నావు బుద్ధి తెచ్చుకొనుము. తోధాను విడిచి మాళవపతుఁబొమ్ము. కలయందయినను నిన్నువరింతునని నమ్మకుము. ఇఁక నిరాశ చేసికొమ్ము. ఇది ప్రథమాపరాధము గావించి విరమించితి. ఇఁకమీఁద నెప్పుడు నిట్టి మాటలుఁబలుకకుము. అట్లు పలుకుట నీప్రాణములపోకడయే యని యెఱుంగుము. మావంటివారి నాశించి నిష్కారణముగాఁ బ్రాణముల వమ్ము చేయకుము. రమాబాయి వరించినదని చెప్పుచున్నావు. ఆనీచురాలికి బుద్ధిలేక తప్పుదారిఁ ద్రొక్కినది. అది నశ్వరంబులగుసుఖంబులే శాశ్వతములనుకొన్న యవివేకవంతురాలు. అతుచ్ఛురాలు నాకు మార్గదర్శకులారా? పో! పొమ్ము. ఇట్టిపొసఁగనిమాటలాడకుము.” అని నిందించి దామోదరుంగాంచి యి ట్లనియె. “దురాత్మా! తులసీవనములో గంజాయిమొక్క పుట్టినట్లు పూజనీయ మగురాజ పుత్త్రకులమందు నీవు జనించి యా కులగౌరవమును జెడఁగొట్టు చున్నావు. నిష్కారణముగా మాళవరాజును జంపఁబూనితివి గాని మాదుఃఖంబుల కెల్లఁ గారణభూతుండవగు నిన్నుఁ జంపవలసినది. అయినను నింకటితోఁ బ్రతికితివని తలంపకుము. నీవు చచ్చుట సిద్ధము. నీచర్యలఁబట్టి యోజింప నీకుఁ బోఁగాలము సమీపించినదని నిశ్చయింపవచ్చు.” అని యిట్లు నిందించు చుండ వినలేక దామోదరుఁడు మాఱుమాటాడలేక మాళరాజుతో దానపతలికిఁ బోయెను. ఆసమయంబున మాళవరాజు ప్రాణంబులఁ బిడికిటఁబట్టికొని పయికివచ్చి యింకఁ దారాబాయిపై నాశవదలుకొని యామె శౌర్యంబునకును సాహసంబునకు నత్యాశ్చర్యమొందుచు నిఁకఁదాను దారాబాయిని బెండ్లాడఁ జూచినఁ బ్రాణంబులు పోవుటకు సందియంబు లేదనియుఁ నెన్నిప్రయత్న ములు చేసినను తనకామె లొంగుట యసంభవమనియుఁ దలపోసె. కాని దామో దరుఁడు వానికి ధైర్యముఁగొలుపుచు నిట్లనియె. “మహారాజా! నీవింతమాత్ర మున నధైర్యముఁ జెందకుము. మొదట రమాబాయియుఁ నిట్టె ప్రగల్భంబులు

పలికినది. తన కేమిచేసినదో చూడఁడు. కాంతలచర్య లిట్టివైయుండును. ఇంతతో నిరాశచేసికొనక మరల మరలఁ బ్రయత్నించుచుండుము. కాని యామె సౌధంబున నాయుధంబు లేమియుం లేకుండఁజేయవలయు. లేనిచోఁ బ్రమాదంబువాటిల్లు. ఇట్లు కొన్నిమాసము లతిక్రమించునప్పటి కామె తనంత తానే నిన్ను వరింపకమానదని చెప్పి సంతసింపఁజేసెను. అంత మాళవరాజు స్థైర్యము వహించి యామె సౌధంబున నాయుధంబు లేమియు నుండకుండఁజేసి యప్పటప్పటఁ దాను తారాబాయినిజూచుటకుఁ బోవుచుండెను. కాని మొదటిదినమువలె సంభాషించుట మానుకొనెను.

---

# ముప్పదియాఱవ ప్రకరణము

దామోదరుండు తోధాపురంబును జయించి వశము కావించుకొనినను, దనమాయాచాతుర్యముచే రాయలను దారాబాయిని గొనివచ్చి మరల మాళవ రాజున కర్పించినను, నంతటితో నతనికిఁ దోధారాజ్యాభిషేకము కాలేదు. వాఁడు నేఁ జేయవలసిన కార్యంబు లొనర్చి యున్నాఁడను. గావున పట్టాభిషేకంబుఁ జేయుఁడని పలుమాఱు మాళవరాజును బ్రార్థించుచువచ్చెను. కాని తారాబాయివివాహము తోధానగరరాజ్యాభిషేకము, నేకముహూర్తమందె జరుగవలయుననిచెప్పుటచే దామోదరుఁ డేమియు ననలేక యూరకుండెను. ఇఁక వీఁడు తారాబాయిని సమాధానపఱుపవలసియున్నది. అదియో వీఁ డొనర్చిన కార్యంబులన్నిటికంటె దుర్ఘటంబయియున్నది. ఎన్ని చెప్పినను వరించుట కిష్టపడక వచ్చినవారినెల్ల నిందించుచుండె. తారాబాయి మాళవ రాజును బెండ్లిచేసికొననిష్టపడకుండుట దామోదరున కెంతయు నిష్టము గానున్నది. కావున మాళవరాజు తారాబాయిని సమాధానపఱుచుట కెంత శ్రమపడి యెన్ని యుక్తులు పన్నుచుండెనో దామోదరుఁడంతకు వెయిరెట్లధికశ్రమపడుచు ననేక

ఘయుక్తులఁబన్నుచుండెను. కాని యవియన్నియు వ్యర్థంబులయ్యె. తనకంతములో జీవముండఁ దనకుఁ దోధారాజ్యపట్టాభిషేకము కాదని దామోదరుఁడు విచారింపసాగెను. ఆవిచారాతిశయముచే సరిగా నన్నపానంబులు సోలేదు. రాత్రులందయిన సరిగ నిద్దురపట్టుటలేదు. అవును. విచారంబు మానసంబును సంతతంబు బాధించుచుండ మనుజుండు గన్నారనిద్దురను, గడుపారఁ దిండిని బొందునా! పొందఁడు. కాన దామోదరుఁడు క్రమక్రమముగాఁ గృశింపఁ జొచ్చె. వీఁడిన్ని బాధలు పడుచుండినను బయిటుండియుక్తులు పన్నుటయే కాని యొకదినమునను దారాబాయియొద్దకుఁబోయి మాళవరాజును బెండ్లాడుమని హితోపదేశము చేసినపాపమునఁబోలేదు. అట్లు చేసినచో మహాసాహసవంతురాలగు తారాబాయి తనపైకి లంఘించి యాయుధంబు లేకపోయినప్పుడు వీటికిటీఁబోట్లచేతనైనఁ దనప్రాణంబులు బాపునని యెఱుంగును. మఱియుఁ దారాబాయి తనకంటె మహాశూరురాలనియు, బలవంతురాలనియు, నెఱింగినవాఁడగుటచే నెప్పుడేమి జరుగునోయని భయపడుచు నొకనాఁడయిన నామె మందిరమునకు స్వయముగాఁబోలేదు. ఈరహస్యంబును దనహృదయమందుఁ గప్పిపుచ్చి తనపేరు విన్నంతమాత్రముననే తారాబాయి కోపంబునమండిపడును గాని లేనిచోఁ దనసామవాక్యంబులచేఁ దారాబాయి మాళవేంద్రుని వరించునట్లు చేసియుండెనాయని ప్రగల్భంబులు పలుకుచుండును. వీఁడు పెక్కులుమాయోపాయంబులు మాళవేంద్రునకుఁ దెలిపి యతనిని తారమందిరంబునకుఁ బంపుఁగాని యతనితోనైన నచటికిఁ బోనొల్లకుండెను. అంత నొకనాఁడు మాళవరాజు దర్శనంబున కేగి యతని మన్ననలంది యుచితాసన మలంకరించి యతనితో నిట్లు సంభాషించెను.

దా.—మహారాజా! తారాబాయి సంగతి యెట్లున్నది?

మా.—తారాబాయి యింకను తారాపథంబుననే యున్నది గాని దిగలేదు.

దా.—ఆఁడువాండ్రు మిగుల మూర్ఖురాండ్రు. తమపట్టె కాని, తమలాభంబును బెఱవాని లాభంబును గూడఁ దలపోయరు.

మా.—అందులోను సీతారాబాయి యత్యంతమూర్ఖురాలని చెప్పవలసియున్నది. ఆదిపలుకునిందావాక్యములు వినుటచే నామెవిషయమై విరక్తి పుట్టు చున్నది.

దా.—(నవ్వుచు) తమ రంతమాట సెలవిచ్చుట ధర్మము కాదు. అంతమాత్రము చేతనే విరక్తిపొందినచోఁ గార్య మెట్లు నెఱవేరును. పలుశ్రమలు పడకుండఁ బెక్కులు నిందావాక్యములు వినకుండ సుస్త్రమకాంతలభించునా ! అట్లయిన నూరకుండక ప్రయత్నించుచుండవలె.

మా.—ప్రయత్నముమాన లేదు. కాని యామెయెప్పుడు పైఁబడి చంపునో యని భయమొందుచున్నాను.

దా.—ఎంతమాట సెలవిచ్చినారు. దానికాపాటిబలమెక్కడ ? భగవంతుఁడు నోరిచ్చినాఁడు కావున యుక్తంబు లరయక యఱచుచుండును. అట్లు ప్రవర్తించినచో మీరు విరక్తిచెంది విడిచిపెట్టుదురనీ యామె యభిప్రాయము.

మా.—మాళవరా జంతవెఱ్ఱివాఁడు కాఁడు. పెండ్లాడినచో సౌఖ్యము లనుభవించును. లేనిచో యావజ్జీవము దుఃఖము లనుభవించుచుఁ దారామందిరంబుననుండు. ఇంతకుఁ దప్ప మఱియొకమార్గము లేదు.

దా.—మహారాజా ! మనయబ్దుల్లా రమాబాయి నెట్లువశముగావించుకొన్నాఁడో యుపాయమడిగి తెలిసికొనిన బాగుండును. నేనడిగినఁదిన్నగా సమాధానమీయఁడు. మీరు మహారాజులుగాన తమరడిగినచోఁ దమ యాజ్ఞకుఁ బద్ధుండయి తాఁబన్నినయుపాయంబు విన్నవించికొనును. ఈమాట తమతోఁ జెప్పుటకే యిప్పుడిటకు వచ్చినాను.

మా.—సరియె. పిలిచి యడిగెద సీవిఁకఁబొమ్ము.

అని యతనిఁబంపి యొక సేవకునిఁబిలిచి యబ్దుల్లానుగొనిరమ్మని పంచె. అంత వాఁడు సరభసంబునఁబోయి విన్నవింప నట్టియసమయమందుఁ దన్నుఁ బిలిపించుటకుఁ గారణమే మోయన్ని పలువిధంబుల విచారమందుచు మాళవరాజు

సన్నిధింజేరి నమస్కరించి యుచితాసనమలంకరించెను. అంత మాళవేశ్వరు వానితో నిట్లు ప్రసంగించె.

మా.—ఓయీ ! సుఖముగ నున్నావా?

అ.—తమ యనుగ్రహముండ మాసుఖమున కేమిలోపము ?

మా.—నీభార్య చెప్పినమాటవిని ప్రేమతోఁ జూచుచున్నదియా?

అ.—అయ్యా! నాకు మిగుల నాశ్చర్యమగుచున్నది. ఆకాంత మొదట నెంత కోపముఁజూపినదో యిప్పుడంతకు వేయిరెట్లు ప్రేమచూపుచున్నది.

మా.—ఆమెను వశముకావించికొన నీవేమి చేసినావు ?

అ.—అయ్యా! నాపడినశ్రమ భగవంతుఁడెఱుంగు. మొదట నే నెన్నిమంచి మాటలాడినను దానికిఁ బ్రతిఫలము నిందావాక్యములు తప్ప మఱి యొకటి లేదు.

మా.—మొదట మావలె నీవును నిందావాక్యంబుల పాలయితివా!

అ.—కాకేమి ! యామెవాక్యంబులు వినుటకంటెఁ జచ్చుటయే మేలంచుఁ దలపోసిన వ్యాఁడను.

మా.—తరువాత నీవేమి చేసినావు?

అ.—ఆమె యట్లు నిందించుచున్నను విరక్తిఁజెందక సర్వదా యామెను లోఁగఁదీసికొను ప్రయత్నమునె సలుపుచుండెడివాఁడను.

మా.—(తనలో) దామోదరుఁడన్నమాటలు సత్యములే! అంతమాత్రమున విరక్తిఁజెందరాదు. (ప్రకాశముగా) తరువాతియుదంతము చెప్పుము.

అ.—అట్లు నేనెంతకాలము ప్రయత్నముచేసినను నాప్రయత్నములు వ్యర్థము లగుచువచ్చెను.

మా.—రమాబాయి మఱెట్లులోఁగినది ? ఆయుపాయంబు చెప్పుము. అదియు మనకిప్పుడు కావలసియున్నది ?

అ.—మహారాజా! రమాబాయి లోఁగిన తెఱంగంతయుఁ విన్నవించెద వినుండు. నాప్రయత్నంబులన్నియుఁ వ్యర్థమగుటచే నేనపారవిచారముల పాలగు చుంటిని. ఇట్లుండ నొకనాఁడొకఫకీరు మనపురంబునకు వచ్చెను.

ఆమహానీయుండు లోకారాధ్యుండని చెప్పఁదగియున్నది. అతని ప్రభా
వము నిరుపమానము. అతనికి నఘటితఘటనాశక్తి మెండుగఁ గలదు.
అతనిని నల్లామహమదు నవతారమనియె భావింపవచ్చును. మన
మతనికిఁ దెలిసినట్లు మఱియొకరికిఁ దెలియదు. మన మహమ్మదీయమత
మును హిందూదేశములోఁ బ్రబలించుటకయి మక్కానుండి యిచ్చటికి
కరుదెంచినాఁడట! ఆమ్మహానీయుండు మిగుల గరుణాళుఁడు. అతఁ
డొరులువిచారించుచుండ చూచి సహింపలేఁడు. మన గ్రామములోని
వారందఱు నాతనిఁ జూడఁబోవ నేనునుఁబోతిని. ఆమ్మహాత్ముం డందఱి
నత్యంతగౌరవముతోఁ జూచి కొంతసేపు మతమును బోధించి విచారా
క్రాంతునివలెఁ గన్పట్టుచున్న నన్నుఁ బొడఁగాంచి కరుణారసంబు చిలికి
వారినందఱను బొండనిపంపి నన్ను నుద్దేశించి యిట్లనియె. "ఓపురుష
వరేణ్యా! నీవు స్త్రీవిషయికచింతచే వంతపాలగుచున్నట్లు తెలియ
వచ్చుచున్నదని ప్రశ్నింప, నేనును నమస్కరించి యీ వృత్తాంత
మంతయుం విన్నవించితి. అదివిని నన్నుఁ జూచి కొంచెమాలోచించి
ఓయీ! విచారింపకుము. నిన్నామె తప్పక వరింపఁగలదు. నావాక్యము
నిశ్చయమని తలంపుము" అనిచెప్పి యొకయాకుపయి నేదోవ్రాసి
చుట్టచుట్టి దాని నొకత్రాటికిఁ గట్టి రమాబాయిని సమీపించి మంచి
మాటలాడుచు నామెచేతికిఁ గట్టి పైకివచ్చి నాకిట్లనియె. "ఓయీ!
ఆకాంత నీకు వశమయినది. దానిఁ జేపట్టి వరింపుము. ఈపర్యాయము
నీవుపోయి నీయభిలాషంబు తెల్పినతోడనే మాఱుమాటాడక యత్యంత
ప్రేమతోఁ జూచి తప్పకవరించు." నని చెప్పిపోయె. ఆ మాటలను నే
నెంతమాత్రము విశ్వసింపలేదు. అయినను నాఫకీరు మాటలయం దెంత
నమ్మకమున్నదో చూతమనిపోయి యారమాబాయికి నా యభిలాష
తెలిపితిని. అంత నన్నపారప్రేమతోఁ జూచి వరించినది. ఆమె పాతి
వ్రత్యము మిగుల నుతింపఁదగ్గది. అతని నిరుపమానప్రభావమే రమా
బాయిని నాకొసంగి పెండ్లిచేసినది. కాని యందు నాసామర్థ్యంబు
సుంతేనియుం లేదు.

అనివిన్నవింప మాళవరాజమితానందంబునొంది యతనికిట్లనియె. "ఓయీ! నేను దారాబాయినిఁ బెండ్లాడఁదలంచినట్లు నీవెఱుంగుదువుగదా! ఆకాంతకు నయమునను భయమునను మేమెంతబోధించినను సుంతేనియుం లాభములేదు. పోనిమ్మామెనుండిమనంబు నాకర్షించుకొందమన్న నట్లొనరింప నాకు వశము కాకున్నది. ఆయభిలాష మిగుల సంతాపమును గలిగించుచున్నది. కావున నీ వాఫకీరు నెట్టయిన నిచ్చటికిఁ గొనివచ్చి నాయభిలాషం దీర్పుము. నీకుఁ బ్రభువనగు నాకార్యంబు నెఱవేర్ప నీవంటివారంద ఱర్హులేకదా!" అని పలు విధంబులఁ బ్రార్థించుచున్న రాజుంగాంచి యిట్లనియె. "ఓ ప్రభూ! తమరింతగా నన్నుఁ బ్రార్థింపనవసరంబులేదు. అతండు ప్రస్తుతంబున నీగ్రామంబునఁ లేఁడు. కొన్ని దినంబులలోఁ దప్పకవచ్చునని యతనిశిష్యులు చెప్పుచున్నారు. అతండు రాఁగానే తమదర్శనంబునకుఁ గొనివచ్చెదను. అతండు వచ్చినచోఁ దమ కార్యంబు తప్పక నెఱవేఱును. తారాబాయి మిమ్ముల వరించినదనియె నమ్ముఁడు. మీరిఁక విచారింపకుఁడు. మీరామెకయి యేమియుం బ్రయత్నింప నవసరంబులేదు. అతఁడు దయాళుఁడవుటచే మావంటిసామాన్యులకార్యంబులనే యవలీలఁగ నెఱవేర్చుచుండఁ బ్రభువులయిన తమకార్యంబు సమకూర్చుటకో సంశయమేమున్నది! అతండు వచ్చుట యొకవేళ విలంబమగునేమో? అట్లయిన నేను స్వయముగఁబోయి యాతండెచ్చటనున్నను, తమదర్శనంబునకుఁ దీసికొని వత్తునని పలికి తనప్రభువు నానందాంబుధి నోలలాడించి సెలవుగైకొని పోయెను. అంత మాళవరా జాఫకీరువలనఁ దమకార్యంబగుట సిద్ధంబని తలపోసి సంతోషించుచుండె. ఈవర్తమానంబు దామోదరుండు విని తనకిఁకఁ దోఢారాజ్యం బబ్బుట సిద్ధంబని యానంద మొందుచుండెను.

---

# ముప్పదియేడవప్రకరణము

మాళవరా జబ్దుల్లా చెప్పిన యుపాయంబువలనఁ దారాబాయి తన కధీన రాలగుట నిక్కంబని నమ్మియుండె. ఆఫకీరువచ్చినచో సర్వము సమకూరు నవినెంచి యెంతతొందరపడుచున్న నతఁ డెన్నిదినంబులకు రాలేదు. అతని

రాక విలంబమయినకొలఁది మాళవరాజున కారాటంబు హెచ్చుచుండె. అతఁ డారాటంబు చెందుచున్నకొలఁది నతనిరాక విలంబమగుచుండె. ఇట్లు దినంబులును వారంబులు నతిక్రమించుచున్నవికాని యబ్దుల్లావచ్చి ఫకీరు వచ్చినాఁడన్నమాట చెప్పలేదు. మాళవరాజు ప్రతిదినము భటుల నబ్దుల్లాయింటికిఁ బకీరువృత్తాంతంబునకయి పంపుచుండెను కాని వారెల్లప్పుడు రాలేదన్న మాటతప్ప మఱియొకటి చెప్పలేదు. ఫకీరునిమిత్త మబ్దుల్లాయును తన శక్తి యంతయు దారవోసి యతనిజాడ లరయుచుండెను గాని యాతని యుదంత మెచ్చటను తెలియరాదయ్యె. మొదటఁ దాను కార్యంబు నెఱవేర్తునని ప్రభువును నమ్మించి యున్నవాఁడుకావున ఫకీరువృత్తాంతంబు దెలియకుండఁ బ్రభుదర్శనంబునకుఁ బోవ భయపడి కపటకారణంబులు కల్పించికొని ప్రభువుసన్నిధికిఁ బోవుట మానుకొనెను. ఇట్లుండ నొకనాఁడు ఫకీరు వచ్చియున్నాఁడన్నవార్త పురమందు వ్యాపించెను. అదివిని యబ్దుల్లా యధికానందంబు నొంది కడువడి ఫకీరుసన్నిధికిఁబోయి తమప్రభువు వృత్తాంతమంతయుఁ దెలియఁజేసి ప్రభువు సందర్శనంబునకువచ్చి తనయభిలాష తీర్చి తన్నుఁ గృతార్థుఁ జేయుఁడని బహువిధంబులఁ బ్రార్థింపసాగెను. ఆఫకీరు భూలోకసుఖమ్ములందును, తన్మూలకంబులగు ధనంబులందును నాశలేనివాఁడుకావున మహారాజులనైనఁ దృణప్రాయంబులంగాఁ జూచువాఁడేయయినను బరోపకారశీలుం డగుటంబట్టి యందుల కంగీకరించి సాయంకాలము రాజసందర్శనంబునకుఁ బోదమని యబ్దుల్లాతోఁ జెప్పె. అంత నబ్దుల్లాసంతోషమునం బొంగిపోయి మునుపు కారణాంతరము కల్పించికొని రాజదర్శనంబునకుఁ బోవనివాఁడేయయినను ఇప్పుడందరకంటె ముందుగా నాశుభవర్తనంబు రాజునకుఁదెలుప సత్వరంబునఁ బర్విడిపోయెను. ఇట్లబ్దుల్లా రాజసన్నిధిఁజేరి యాఫకీరు వృత్తాంతంబంతయుం విన్నవింప నతఁ డాలకించి యత్యంతసంతోషముచెంది యతనిఁగారవించి యాఫకీరు దర్శనంబుచేయఁ గుతూహలుండైయుండెను. అంత సూర్యాస్తమయంబగుడు నబ్దుల్లా ఫకీరునొద్దకుఁ బోయి యాశ్రయించియుండి నాలుగుగడియలరాత్రి కాఫకీరుతోఁగూడ రాజసందర్శనంబునకుఁ బోయె. వీరిరాకకయి రాజు సంసిద్ధుండయి వేచి

యున్నాఁడు కావున వారువచ్చుచున్నసంగతినాలకించి వెంటనే యెదురుచని నమస్కరించికొని వచ్చి యుచితాసనమిచ్చి కూర్చుండనిచ్చి తదనుమతంబునఁ దానొకయాసనంబున నధివసించి యాఫకీరుతో నిట్లు ప్రసంగించె.

రా.—స్వామీ! తాము మొదట నెచ్చటివారు?

ఫ.—మేమా! మొదట మక్కాయందుండెడివారము.

రా.—మక్కానుండి మతమువిస్తరించుటకే వచ్చినారు కాఁబోలును?

ఫ.—అవును. ఈహిందూదేశపుఁ బ్రజలందఱు దురాచారంబుల నవలంబించి యెందునుఁబొందని యొకచెడ్డమతము స్వీకరించి నిష్కారణముగాఁ జెడుచున్నారు. అందుచే వీరికందఱకు మనమత ముపదేశించి బాగు చేయవలెనని వచ్చినాను!

రా.—అవును. ఈహిందువులు బుద్ధిహీనులు. వారందఱు నొకమానవజాతివార లయినను వారిలో వారొకరికంటె నొకరధికులమని చెప్పుకొనుచుం దురు. ఇందున్నవారి కొకమతమనియు, నొకజాతియనియు లేదు. తమ కొకమతముకలవారయియున్నారు. మీరు వారలంగరుణించి యందఱి నొక్కమతమునకుఁజేర్చి వారలఁ గృతార్థులఁ జేయుఁడు.

ఫ.—నే నిశ్చయముగా నందులకే యిచ్చటికి వచ్చినాను.

రా.—హిందూదేశమున నేయేస్థలంబులకుఁబోయి యుపన్యాసములిచ్చినారు!

ఫ.—ఢిల్లీపురంబునఁ గొంతకాలముండి యుపన్యసించినాను.

రా.—బాగున్నది. అప్పురంబును బాలించు లోదీరాజులు మతమందుపట్టుదల గలవారు. మీకు మిగుల సాయపడియుండవచ్చును.

ఫ.—సాయపడ కేమి! మనమహామ్మదీయులు పాలించుపురంబులం దెట్లయినను మనమతము వ్యాపించియేయుండును. కాని హిందూరాజు లేలుచున్న పురంబులం దుపన్యసించి మతమును వ్యాపింపఁజేయవలెనను కోర్కె యున్నది.

రా.—అదియే యుత్తమము. ఈరాజసంస్థానంబునందుఁ దప్పక యుపన్యసింప వలసియున్నది. వీరుమిగులస్వమతాభిమానముగలవారు. కావునవీరల

ముందుగ మనమతమందుఁ బ్రవిష్టులం జేసినచోఁ దక్కిన హిందూస్థానం బంతయు లొంగినట్టె భావింపవచ్చును.

ప.—అందునిమిత్తమె యిప్పుడు రాజస్థానంబునఁ దిరుగుచుంటి.

రా.—ఇం దేయేపురంబులకుఁ బోయినారు.

ప.—చిత్తూరు, గద్వారు, కమలమియరు మొదలగు దుర్గంబులఁ దిరుగుచు నుపన్యసించుచునుందును. ఈమధ్యఁ గమలమియరుదుర్గమునకుఁ బోయి యచ్చట నుపన్యసించితి.

రా.—మీరు కమలమియరుదుర్గంబునకుఁ బోయినారా! పృథ్వీరాజుసంగతి యెట్లున్నది?

ప.—అతనిసంగతి యేమనిచెప్పుదు! మిగుల విచారంబుఁ జెందుచున్నాఁడు.

రా.—మేము గొనివచ్చిన తారాబాయిని విడిపింపఁ బ్రయత్నము చేయుచుండెనా?

ప.—అతఁడా ప్రయత్నమే విడిచికొన్నాఁడు. వానియాటలు మీయొద్ద సాగునా? ఇఁక వాఁడేమియుఁ జేయఁజాలక తారాబాయిపయి నాశవదలుకొని విరాగియయి దేశంబుదిరుగఁ బూనికొనినాఁడఁట!

రా.—మే మాతనికి వైరాగ్యము గలిగించితిమే.

ప.—అవును. మీ ప్రభావ మెంతవర్ణనీయమైనది. అందులో దామోదరసింగు ప్రతిభావిశేషము చెప్పనక్కఱయే లేదు.

రా.—ఏమట్లనుచున్నారు? మీకెట్లు తెలిసినది?

ప.—ఈయబ్దుల్లా నాశిష్యకోటిలోనివాఁడు. ఇతఁడు నాకెప్పటి వృత్తాంతమప్పుడే తెలియఁబఱుచుచుండును. ఆదామోదరుఁ డాతారాబాయిని గొనివచ్చుటలోఁ గనఁబఱిచిన బుద్ధివిశేష మెంతయుఁ గొనియాడఁదగియున్నది.

రా.—స్వామీ! ప్రసంగాంతరము చేయుచున్నను. ప్రకృతంబునకు వచ్చినారము. తమదర్శనంబున కెన్నియోదినంబులనుండి వేచియున్నారము.

ప.—ఎందునిమిత్తము?

రా.—మాయబుద్ధిఖాఁ చెప్పలేదా?

ఫ.—లేదు. రాజుగారు తమదర్శనంబుఁ గోరుచున్నారనిమాత్రము చెప్పి నాఁడు. నీయభిలాష మేమియో చెప్పుము.

రా.—ఏమియుంలేదు. తారాబాయిని భార్యఁగా చేకొనవలెనని యున్నది.

ఫ.—మిగుల బాగున్నది. యట్లే చేయుము.

రా.—ఆమె యెన్నివిధముల బోధించినను వినదు. నన్ను వరింపనిష్టపడకున్నది. మీరు మీ ప్రభావంబుచే రమాబాయినబ్దుల్లాకు భార్యగాఁజేసి నారనివిని యట్లే తారాబాయిని నాకుభార్యఁగాఁజేయుందురే మోయనియపేక్షించి యున్నాను. మీరు నాయందు దయయుంచి యిక్కార్యంబు నెఱ వేర్పుఁడు.

ఫ.—ఇంతగాఁ బ్రార్థింపనేల? అట్లుచేయుట నాకు విహితకృత్యమే!

రా.—మీకది విహితకృత్యమెట్లగును? అయిన మావంటిదీనులకార్యంబులం నెఱవేర్పవలయు.

ఫ.—ఏమట్లనుచున్నావు? హిందువులకు మహమ్మదీయమతము నుపదేశించి వారిని మహమ్మదీయులఁగాఁ జేయుటయె నాపని. అందులకేకదా యీహిందూదేశమునకు వచ్చినాను. వివిధంబున నయిన హిందువుల మహమ్మదీయులఁగాఁ జేయవలె. ఇట్టుండ హిందూరాజపుత్రికను మహమ్మదీయునకు భార్యఁగాఁ జేయుటకంటె నాకు విహితకృత్య మేదికలదు?

రా.—(సంతోషముతో) వహ్వారే! బాగుగా సెలవిచ్చినారు. మీరెంతకయిన సమర్థులరే?

ఫకీ రామాటల విని మిగుల సంతసించి, ఓయీ! నీకార్యంబిప్పుడే తీర్తునని చెప్పి తనమూటలోనున్న యొక్కయాకుఁదీసి చుట్టఁజుట్టి రా జానుమతిని తారాబాయి మందిరంబుసొచ్చి యామెతో మంచిమాటలం జెప్పుచు నామెచేతికిఁ గట్టఁబోఁగానామె కోపావిష్టమానసయయి 'ఓతుచ్ఛా! నీవు చండాలుండవు నాదరికి రాకుము. నీప్రాణంబుల నపేక్షింతువేని తిరిగి

పొమ్ము. లేనిచో నీవిక్కడ చచ్చుటసిద్ధం" బని పలుకఁగా నాఫకీరు రమా బాయివలె ఆమె సామాన్యస్త్రీ కాదని యెఱిఁగి యప్పుడు సాహసించి యామె యొద్దకుఁబోయినఁ జాపునేమో యని భయపడి సామముచేతనే కార్యము నెఱవేర్పఁదలంచికొని వెనుకకుమరలి రాజుంగాంచి యిట్లనియె. "రాజా! ఈమె సామాన్యస్త్రీవలెఁ గన్పట్టదు. ఆమె చేతికీ తోరంబుగట్టినచో నామె దుఃఖంబువదలి సంతసింపకమానదు. అందువలన మీకార్యంబు నెఱవేరును. కాని యిది తగినసమయము కాదు. ఆమె గాఢముగా నిద్రించినసమయంబున దీనిని బంధింపవలయుం. అట్టిసమయము కనిపట్టి నాకుఁ దెలియఁజేయుము." అనిచెప్ప రాజందుల కంగీకరించి యట్టిసమయంబునకు వేచియుండె. కాని యాతారాబాయి విచారాతిశయముచే నొకప్పుడైన నిద్రింపలేదు. నిద్రించినను ఒకగడియయయిన హాయిగ నిద్రించియెఱుఁగదు. ఇట్లుండ నొకనాఁడా తారాబాయి శయ్యపై శయనించి యోజించుచుండఁ బెద్దమ్మదేవతయామాళవ రాజు కార్యంబు నెఱవేర్పుటకుఁగాఁబోలు నొక్కపడివచ్చి చిరకాలమునుండి తన్నుఁ జేరనీయకపోవుటవలనఁ గలిగినకోపము తీర్చికొన నామెను గాఢముగా నావహించి మెయిమఱచునట్లుచేసెను. అంత నచ్చటనున్నదాసికాజనముపోయి యావృత్తాంతము రాజునకుఁ దెలుప నతండు ఫకీరునకు వార్తనంపె. అంత నా ఫకీరు పరువుపరువునఁబోయి నిశ్శబ్దముగా నామెమందిరంబుసొచ్చి యామె యెడమచేతి కాతోరమును బంధించి వైకివచ్చి ప్రాణము దక్కించుకొనెను. ఆఫకీరట్లుచేసి రాజునొద్దకువచ్చి "ఇఁక నీకార్యంబగుట సిద్ధంబు. నీవొక కొన్నిదినంబులదనుక నామెనుఁ జూడఁబోకుము. ఆమెయె నీకు వర్తమానమంపించును. ఒకవేళ నామెలేచి నేఁగట్టినతోరమును త్రెంపి పాఱవైచినను దాని వలన మనకు నష్టములేదు" అనిచెప్పి తననివాసస్థలంబునకుం బోయె. అంతఁ దారాబాయి నిద్రనుండిలేచి తనచేత బద్ధమయిన యాతోరంబునుగాంచి నిర్భర కోపంబునుబూని యాతోరంబును త్రెంచికొన సాధనంబుగానక దంతముల కన్న వేఱుసాధనంబులేదని భావించి యది మిగులదృఢసూత్రమయినను మెల్ల మెల్లనఁగొఱికి యొకనిమేషమాత్రమున దానిని త్రెంచి యాకట్టువిప్పి లోపల

మడచి యున్న యాకునుదీసి యాఫకీ రేమివ్రాసెనోయని చూచి యాయాకును ముక్కలు ముక్కలుగాఁజేసి యచ్చటనున్న యగ్నిసమీపంబునకుఁ బోయి యందులోఁ బడవైచి భస్మముచేసి తనకోపంబు దీర్చుకొనియె. కాని యాపని చేసినప్పటినుండియుఁ దారాబాయి వెనుకటికోపంబంతయుఁ బాసి సంతసము నొందసాగెను. పూర్వము చెలికత్తెలను గసరికొట్టెడిదైనను నిప్పుడు వారలఁ జేరఁబిలిచి మాళవరాజుచర్యలను గుణంబులను నడుగ నారంభించె. అదిచూచి చెలికత్తెలందఱు తమరాజుకార్యంబు దీఱుట సిద్ధంబనియుఁ బకీరుకట్టినతోరంబు వలన ఫలంబు లేకపోలేదనియుఁ దలంచి సంతసించి యావార్త తమప్రభువునకుఁ దెలియఁజేయ నతం డమితానందంబు నొందుచుండె. ఇట్లుండఁ దారాబాయిమందిరంబులోనికి రహస్యంబుగా నెవరో పురుషులు వచ్చుచున్నారని తోధాపురంబున నొక ప్రథపుట్టె. అది క్రమముగా మాళవరాజుచెవిసోఁకెను. అంత వారు తారాబాయిని గొనిపోవ శత్రువులు వచ్చుచున్నారని నిశ్చయించి తనకు విశ్వాసపాత్రులగుభటులఁ బిలిపించి తారాబాయి మందిరంబుచుట్టుఁ గాఁపుంచి యచ్చటనుండు చెలికత్తెలు తప్ప మఱియెవ్వరు నామెసౌధంబునకుఁ బోఁగూడదనియుఁ దనయాజ్ఞ లేకుండ నెవరైన నట్లుపోయినచో వారిప్రాణంబులఁ దప్పక తీయింతుననియు దృఢముగా శాసించెను.

---

# ముప్పదియెనిమిదవ ప్రకరణము

మాళవరాజు మహమ్మదీయుఁడయినను నీతికలవాఁడు. న్యాయదృష్టి కలవాఁడు. ఆడినమాటను దప్పనిష్టములేనివాఁడు. ఇతఁడు దుష్టబుద్ధియే యయినచోఁ దారాబాయి దనకుఁ జిక్కినపిమ్మట మాయోపాయముచే దామోదరుని జంపించి యనాయాసముగాఁ దోధారాజ్యంబును బుచ్చుకొనియుండును. కాని యతఁ డట్లుచేయ నిష్టపడక తనలో నిట్లనుకొనె. "పాపము దామోదరుండు మిగుల శ్రమజెందుటయుం నాకు దాసుఁడయియుండుటయుఁ దారాబాయినిగొనివచ్చి యిచ్చుటయుం రాజ్యంబునిమిత్తమేకదా! నన్నుఁ జిరకాలము

నుండి యాశ్రయించియున్నాఁడు. ఆశ్రితునికోర్కె తీర్చుట నాకుఁ గర్త వ్యము. చక్కఁగా నాలోచింప నితఁడు నాకెన్నియో యుపకారంబులఁ జేసినాఁడు. ఆకార్యంబులలోఁ జిత్తూరుజయమె పొసఁగలేదు. కాని తక్కిన కార్యంబులన్నియుం సమకూడినది.

అదియైనఁ జాలమట్టుకు నెఱవేఱినది. కాని దైవము ప్రతికూలమగుటచేఁ జెడిపోయినది. ఈరాజపుత్త్రుఁడు మిగుల నూహాపోహలుకలవాఁ డనిచెప్పవచ్చును. తోధారాజ్యంబవలీలగ యుద్ధముసలుపకయ వశముకావించుకొన్నాఁడు. తప్పించుకొనిపోయినతారాబాయిని దిరిగి గొనివచ్చుటలో నతఁ డుపయోగించిన మాయాచాతుర్య మెంతయుఁ గొనియాడవలసియున్నది. మఱియు నాకు సామంతప్రభువయియుండుట కంగీకరించినాఁడు. ఇతనిసాయంబున ముందు నాకెన్నియో లాభంబులు గలుగునట్లు తోఁచుచున్నది. ఇట్టివాని మన మెంతయుం నాదరించుట మంచిది” అనితలపోసి తారాబాయి ఫకీరుప్రభావంబున మాళవరాజునకు లొంగినదన్నమాట చెవినిబడఁగానేవచ్చి పట్టాభిషేకముచేయ వలయునని దీనాతిదీనంబుగాఁ బ్రార్థించుచున్న దామోదరునిఁజూచి మిగుల గౌరవించి యుచితాసనంబునఁ గూర్చుండనియమించి యతనితో నిట్లు ప్రసంగించె.

మా.—రాజపుత్త్రా! ఇఁక నీవు తోధారాజ్యంబునకు రాజవు కావచ్చు.

దా.—(సంతసించుచు) తమయనుగ్రహముండ నాకేమి లోపము?

మా.—నాకు సామంతుఁడవయి యుండవలెను. ముందుగూడ నాకుఁ గార్యంబులందుఁ దోడ్పడుచుండవలయు.

దా.—ఎంతమాట సెలవిచ్చినారు! ఇదియంతయుఁ దమరు బెట్టినయన్నము. మీరే యీరాజ్యంబు గెల్చి నన్నందు ప్రతిష్ఠితునిఁగాఁ జేయుచున్నారు. నా కింతయుపకారంబు తమ రొనర్చుచుండఁగా నేఁ గృతఘ్నుండనయి తమయానతి నతిక్రమింతునా! తమకు సామంతుఁడనయి యుండి ముందు తాము చేయఁబోవుపనులందు నేఁ గుడిభుజమువలె నుందును, ఇందుల కెంతమాత్రము సందియము లేదు. ఇదె ప్రమాణముచేసెదను.

మా.—వద్దు. వద్దు. నీమాటయొకటియుఁ బ్రమాణమొకటియుఁ గాదు. నీయందు నాకెంతేనియుఁ విశ్వాసముకలదు. నీకు జేసెటిదినమే పట్టాభిషేకమహోత్సవముఁ బ్రవర్తింపఁజేసెదను.

దా.—చిత్తము. తమ యనుగ్రహముండ నాకేమి కొదువ! కాని నాదొక విన్నపమున్నది.

మా.—ఏదియో చెప్పుము.

దా.—సింహాసనమధిరోహించుటకుఁ బూర్వము మహావైభవముతోఁ బురంబంతెల్ల నూరేఁగవలయు నన్నకుతూహలంబున్నది. ఈ యభిలాషం దీర్పుఁడు.

మా.—అట్లె నీ యభిలాష దీఱవచ్చును.

అని యిట్లుచెప్పి భటులను బిలిపించి "దామోదరుని పట్టాభిషేక మహోత్సవ" మని పురమందుఁ జాటింపుఁడు. కారుకులఁ బిలిపించి పురంబంతయు నలంకరింపఁజేయుఁడు. పట్టాభిషేకమునకు వలయు వస్తుజాతమును సమకూర్చుఁడు." అని కావలసినకార్యంబులు జరుపనియోగించె. మాళవరాజు పల్కినవాక్యంబుల కపారసంతోషంబుజెంది దామోదరుండు తనలో నిట్లను కొనె. నాతలంచినకార్యంబు లన్నియుం నెఱవేర్పఁబడినట్లు సంతసింపవలసియున్నది.సూరధానులను గారాగృహబద్ధుం గావించితి.తోధారాజ్యంబు వశంబు గావించుకొంటి తారాబాయిని మాళవరాజున కర్పించితి. నాచేసిన ప్రతిన చొప్పున రమాబాయి నొక మహామ్మదీయున కొసంగి పెండ్లికావించితి. రత్నసింగును మొదలె చంపించితి. ఇఁక నాకు శత్రువు లెవరున్నారు? ఎవ్వరును లేరు. ఇఁక నేను నిరాటంకంబుగా రాజ్యం బేలుకోవచ్చు. నేనొక్కండనయిన నిన్నికార్యంబులు నెఱవేర్చుటకు ముఖ్యకారణంబు భగవదనుగ్రహంబు. "ఓ భగవంతా! నీదయయుండినచో బలరహితుండయినను కార్యము నెఱవేర్చుకొనుననుటకు సందియమున్నదా? నీయనుగ్రహం బెంతకయిన సమర్థమయినది. అది యసహాయుని సహాయునిగాఁ జేయు. నిర్ధనుని ధనవంతునిగాఁ నొనర్చు. సామాన్యునైన రాజుఁగాఁజేయుం. అట్టి నీ యనుగ్రహప్రభావంబు

వర్ణింప నెవ్వరితరంబు ? ఇదె నీకు వందనంబు లర్పించుచున్నాను. నా పట్టాభిషేక మహోత్సవంబు నిరంతరాయంబుగా సమకూడునట్లు సేయుము" అని పలువిధముల భగవంతుని ప్రార్థించుచుఁ బట్టాభిషేకసమయంబున కెదురుచూచుచుండె. అంతట మాళవరాజానుమతిప్రకారము పురమంతయుం నలంకరింపఁ బడియె. పట్టాభిషేకవస్తువులన్నియుం సమకూర్పఁ బడియె. దామోదర సింగు నూరేగించుటకయి మహోన్నతమయిన యొకమదపుటేనుఁగు నలంకరించి తెచ్చి దామోదరునిమందిరము నెదుట నిలుపఁబడియె. శత్రువు లెవరయినవచ్చి దామోదరుని కపాయము కలిగింతురేమోయని శంకించి తన సైనికులకు సేనానాయకులను బిలిపించి యూరేఁగుసమయంబున దామోదరుని కుభయపార్శ్వంబుల నడచుచు జాగరూకులయి రక్షకులయి వర్తించుచుండుండని కఠినముగా శాసించినందున వారాసమయంబున కాయుధంబులుదాల్చి వచ్చి యామదపుటేనుఁగున కుభయపార్శ్వముల నలంకరించిరి. మఱియుం నాతోధాపురవాసులందఱు దమక్రొత్తప్రభువు నభిషేకమహోత్సవమునుజూడ వచ్చి నిలిచిరి. ఇట్లందఱు వచ్చి తమ నూతనప్రభువు నిమిత్తము ప్రతీక్షించి యుండ గొంత సేపటికి దామోదరుండు రాజవేషంబుఁ దాల్చి యొకకత్తి చేతఁబట్టుకొని పెక్కండ్రు సేవకులు వెండిమద్దెఁబట్టికొని యుభయపార్శ్వంబుల నడచుచుండఁగా భట్రాజులు తదీయపరాక్రమసూచకంబులగు పద్యంబులు చదువుచుండ మంగళ వాద్యఘోషంబులు మిన్నుముట్ట పుణ్యాంగనలు మంగళహారతులిచ్చుచుండ మందగమనమున నరుదెంచి యామత్తసింధురంబు నధిరోహించె. అంత మావటీఁడు ప్రభువునకు నమస్కరించి యతని యనుమతివడసి యంకుశంబు కేలఁ గీలించి యామదసింధురంబును నడిపింప దానిననుసరించి తక్కిన వారందఱతని కిరుప్రక్కలను ముందు వెనకలను నడువనారంభించిరి. ఆసమయంబునఁ బురంబున నేమూలఁజూచినను జనసమూహములచే నిండి మిగుల సంకులముగా నుండెను. ప్రజలట్లు నిలిచియున్నను రాజభటులశాసనంబునం జేసి యొకరికొకరు త్రోసికొనుటఁగాని కొట్టుకొనుటఁగాని లేకుండ నెమ్మదిగా నడుచుచుండిరి. అది రాత్రిసమయమైనను కరదీపికాసహస్రంబుల కాంతులు మాళవరాజ సైనికుల

వలెఁ నల్లకల గడలుకొని యుండుటచే శత్రువులకువలెనే చీఁకటి మొత్తము లకుఁ గూడ నడుగిడ వలనుపడకుండె. అట్టి సమయంబునఁ బురకాంతల సౌధ వీథుల నధివసించి యమ్మహోత్సవముఁ జూచుచుండిరి. మఱియుం మాళవరాజు తన సౌధాగ్రంబుననుండి యావేడుక చూచుచుండె. అప్పుడు పురజనులు దా మోదరుని వైభవంబునకు మెచ్చికొని "ఔరా! ఈదామోదరుఁడెంతయుం నదృష్ట వంతుండు. మొదట సామాన్యుఁడయినను తోధానగరరాజ్యంబు సుఖముగా సంగ్రహించినాఁడు. వీనిమాయాచాతుర్యము చేయమకదా! తాఁదలంచిన కా ర్యంబులన్నిటి నవలీల నెఱవేర్చుచున్నాడు. ధర్మమే జయించునని పలుకు చుందురు కాని యిట నధర్మమే జయించినది" అని కొందఱు పలుకుచుండిరి. "అకటా! తనమాటవిననందులకు సూరధాముల నెన్నిచిక్కులఁబెట్టినాఁడు? ఆ తారాబాయి కెంతకష్టము సంప్రాప్తమైనది.ఆయోగ్యురాలికి మహాత్మ్యదియుండు భర్తయా! ఓదైవమా! నీకు యుక్తాయుక్తవివేకములేదు. అదియేయుండిన తారాబాయికి మ్లేచ్ఛుని భర్తగా నిర్ణయింతువా! దుర్మార్గుండగు దామోద రుని కన్యాయముగ మాళవరాజు నాశ్రయించి తోధారాజ్య మాక్రమించి యున్నను శీఘ్రకాలములోనే యాపాపఫలము వానినిఁ దుదముట్టింపక మానునా? ఈ దురాత్ముని పాలనకు లోఁబడియుండుటవలన మనదురదృష్టంబుఁ జేర్వున వలసి యున్నది. అయ్యయో! ఈనీచున కధికారంబు సంప్రాప్తమగుట మన కష్ట ముల సూచించుచున్న"దని మఱికొందఱు పలుకుచుండిరి. ఇట్లు జనంబులకోలా హలధ్వను లప్పటి మంగళధ్వనులకును జయజయ నినాదంబులకును దోడ్పడి లోఁడనీకుహరంబుల నిండించె. అప్పుడు దామోదరుం డధికోత్సాహసమేతుం డై సౌధంబుపైనుండి తన్నుఁ జూచుచున్న తారాబాయి సిగ్గుపడున ట్లామె సౌధంబు నొద్దనుండి పోవునప్పుడు లేనికేవఁదెచ్చికొని కనఁబడసాగెను.మఱియుం దామోదరుఁ డారేగుసమయమందు ప్రశస్తమగు రత్నభూషణంబులను నమూల్యములైన వస్త్రభూషణములను ధరించుటంజేసి నిశ్చేష్టితుండై యుండి చిత్తరుబొమ్మవిధంబునఁ గన్పట్టుచుండె. దామోదరుం డట్లారేఁగి రాజభవ నంబు సమీపించి లోనికిఁ బోవునప్పటి కాతని వస్త్రంబులు రక్తమయంబులయి

చూపట్టుచుండె. కాని వానిశరీరము కూర్చుండునప్పు డెట్లుండెనో యట్లెయుం డెను. అంత నచ్చటి రాజభటు లదేమియోయని తలంచిభయంబున హృదయంబు కంపింప రయంబుగాని యాసింధురంబును నిలిపి పయికిఁబోయి చూచునప్పటికి మెడనుండి రక్తధారలు కాఱుచుండె. వారంద ఱదిచూచి యతనిఁ బిలచిరి గాని నోటమాటలేదు. అంత వారలు గుండెలు తటతటకొట్టుకొనుచుండ హాహా కారంబుఁ బరువుపరువునఁబోయి మాళవరాజున కెఱింగింప నతఁడు మిత్రునకై మిగుల విలపించుచు వచ్చి యాతనిఁగాంచి గాయమును జక్కఁగఁ బరిశీలించి చూడ నొకనిశాతబాణంబు వానికుత్తుకఁదూసికొనిపోయినట్లు గానవచ్చె. అంత మాళవరాజు మిత్రుఁడు చనిపోయినందులకు దుఃఖంబును, బరులకుఁ దెలియ కుండ వాని కుత్తుక దూసికొనిపోవునట్లు బాణము ప్రయోగించిన వాని యస్త్రవిద్యాకౌశలంబునకు నత్యాశ్చర్యంబుఁ జెందుచు శత్రు వెవ్వరో దామోదరునిఁ జంపియుందురని యూహించి వారినిఁ బట్టుకొన నెంతయుఁ బ్రయత్నముచేసెను కాని ఫలము లేకపోయె. అందుచే మాళవరా జేమియుఁ జేయఁజాలక విచారాక్రాంతుఁ డై యుండె. ఆసమయంబునఁ బురజనులు గుంపులుగుంపులుగాఁగూడి "అక్కటా! యీదామోదరుని మాళవరాజే చంపించియుండును. దామోదరుఁడు సౌధంబుననున్నప్పుడు చంపినచోఁ బ్రజ లనుమానపడుదురని యూహించి యీయూరేఁగింపనెడి మిషపన్ని చంపించి నాఁడు. దామోదరుఁడు దుర్మార్గుఁడై నను రాజపుత్త్రుఁడగుటచేఁ గొంత సంతసించితిమి. కాని భగవంతుఁ డాసంతోషంబునుగూడ పోవునట్లు మహమ్మదీయు లరిపాలనకు లోఁబడునట్లు చేసినాఁడని మాళవరాజును నిందింపసాగిరి. మాళవరాజు ప్రజలమాట నాలకించి మిత్రవియోగదుఃఖంబునకుఁ బ్రజల నిందావాక్యంబులు తోడ్పడి మఱింత ఖిన్నునిగాఁజేసెను. కాని కొద్దిదినంబుల కాదుఃఖంబును, మఱచి మిత్రుండు పోయినను తోధారాజ్యంబు తన కనాయాసంబుగా వచ్చినందులకు సంతసము చెందుచుండెను.

---

# ముప్పదితొమ్మిదవ ప్రకరణము

మాళవరాజు తోధాపురంబును వశంబుగావించుకొనిన కొంత కాలమునకు మహమ్మదీయు లత్యుత్సాహంబుతోఁ జేయవలసిన పీర్లపండుగదినంబు లేతెంచె. తురకలాయుత్సవంబు నొనర్ప మిగుల వేడుకగలవారై యుందురు. మఱియు వారు గ్రామంబున రెండుమూఁడుకుటుంబములవారుమాత్రమే యున్నప్పటికి నాయుత్సవంబును జేయకమానరు. వారొకవేళఁ దినఁ దిండి లేనంత బీదవారలైనప్పుడు యాచించియైన ధనంబు సమకూర్చుకొని యాయుత్సవంబు చేయుదురేకాని యూరకుండఁజాలరు. మాళవరాజునకుఁ దోధాపురంబును, దారాబాయియు సంప్రాప్తించుటంబట్టి యత్యంతసంతోషమున మునిఁగి యున్నవాఁడు కావున నాదినంబులురాఁగానే మహమ్మదీయులను బిలిచి యిట్లనియె. ఓయీ! ఇంతకాలము మాళవదేశమందు దీయుత్సవంబును జేయుచుండెడివారము. మన దేశములో పండుగ చేసినది యొకగొప్పకాదు. ఇప్పురంబు నేఁటివరకు హిందూరాజులు పరిపాలించినవారు కావున వారల కుచితములైన యుత్సవంబులఁ జేయుచుండెడివారు. మన కీపురంబు క్రొత్తగా సంప్రాప్తమైనది కావున మన మీపురంబునఁ బీర్లపండుగు మహావైభవంబుతోఁ జేసి హిందువులకు బుద్ధివచ్చునట్లు చేయవలెననిచెప్పి యధికంబగు ద్రవ్యం బొసంగె. ఆద్రవ్యంబును తురకలుగొని యాపండుగునకుఁ దగినవస్తుజాతమును సంపాదించి యథావిధి నిర్వర్తించుచుండిరి. అంతఁ బీర్ల ననుపునట్టి దినం బరుదెంచె. వాఁడు మహమ్మదీయులేకాక హిందువులుకూడ దాని కనుకూలురై తోడ్పడిరి. ఆసమయమునఁ బ్రజలలోఁ గొందఱు తమకుఁ దోఁచినవిధమున నొక్కొకవేషముఁదాల్చి ధనవంతులయాచించి ధనంబు మూటఁ గట్టికొను చుండిరి. వీరు కేవలము ధనవంతులనేకాక మాళవరాజుదర్శనమునకుఁ గూడఁ బ్రయత్నించిరి గాని ప్రభువు లోనికి రానిచ్చునో రానీఁడో యని సందియ పడుచుండిరి. ఇట్లు వేషము వేసికొని జనులు మూఁకలు మూఁకలుగా వచ్చు చుండుట మాళవరాజుకుమారుఁడు గాంచెను. మాళవరాజునకు మూఁడేండ్ల ప్రాయముగల యొక కుమారుండు గలఁడు. మాళవరాజున కతనిపైఁ బ్రేమ.

మెండు. ఆపిల్లవాని నెంతో ప్రేమతోఁ జూచుచు వాఁడు కోరినకోర్కెల నెల్లఁ దీర్చుచుండు. ఒకవేళఁ దనతండ్రి తనకోర్కెలఁ దీర్పనిచో ఱాళ్లయినఁ గరఁగునట్లు రోదనముచేసి తనకోర్కె నెఱవేర్చుకొనుచుండును. తమకార్యంబు సాధించికొన బాలుర కొకయాయుధంబుగలదు. ఆయాయుధ మమోఘ మైనది. విష్ణువుచక్రంబు, శంకరుని త్రిశూలంబు, యమునిదండంబు, వరుణుని పాశంబు నొక్కొక్కప్పుడు వ్యర్థంబులైన గావచ్చుఁగాని బాలురయాయుధ మ దెప్పుడు వ్యర్థముగాదు. ఆయుధంబును వారు ప్రయోగించినచో నెట్టి కఠినహృదయుఁడైన, నెట్టి మహారాజైన చేతులు గట్టికొని వచ్చి వారల యభిలాషంబు నెఱవేర్చుచుందురు. ప్రతిబాలునకు నా యాయుధము కార్యసాఫల్యదాయి యగుచుండునప్పుడు యత్యంతపుత్రవాత్సల్యంబు గలజనకులు గల బాలుర కది కార్యసాఫల్యదాయియని వేఱ చెప్పనక్కఱలేదు. ఆ యాయుధం బేమోయని చదువరు లాలోచింతురేమో? అది యేడుపు. కార్యసాధనములో వారి కదియే బలము. కావుననే "బాలానాం రోదనం బల" మ్మని పండితులు నుడువుదురు. నాఁడు మాళవరాజకుమారుండు తనతల్లి తాఁ గోరినవస్తువు లీయక పోవుటచే నీ యాయుధము ప్రయోగించె. అంత నామె భయపడి యా వస్తువునిచ్చెను. కాని యడిగినక్షణమందే యీయలేదని యేడ్చుచుండెను. ఎవ రెంత యోదార్చిన నూరకుండలేదు. అప్పు డతనిరోదన ముపశమింపఁ జేయ లేక తల్లి దాసిచేతికిచ్చి తండ్రియొద్దకుఁ బుత్తెంచె. ఇంటికప్పెగురున ట్లేడ్చుచున్న తనకుమారుంగాంచి మాళవరాజెదురుగఁబోయి యదియేమని దాసినడుగ నది యచ్చటి వృత్తాంతంబు దెలిపి కుమారకునిచ్చె. అంత మాళవరాజు కుమారు నెత్తికొని మంచిమాటలుచెప్పి యోదార్చెను గాని లాభములేకపోవుటచూచి తనచేతనున్న యుంగరంబును దీసి యందుఁ బొదిగినరత్నంబులఁ జూపుచుండ నాబాలుఁ డాయుంగరంబుగొని యట్టె చూచుచుఁ దనవ్రేలికిఁ బెట్టుకొని యేడ్పు చాలించె. ఆయుంగరమతనివ్రేలికి మిగుల వదలుగానుండుట మాళవరాజెఱిఁగియుఁ బడిపోవు నేమోయని శంకించియుం దానిని బుచ్చికొనిన మరల నేడ్చునేమో యని దానిని తాను గ్రహింపఁడాయె. ఈసమయంబున నీ

బాలుం డావేషంబుల నామోదపడుచుండి చూచి యచ్చటి కంపించవలయు
నని కోరె. అది మాళవరాజునకిష్టము కాకపోయినను దాను వద్దన్నచో మరలఁ
గుమారుండు తన యాయుధంబుఁ బ్రయోగించునేమో యని భయపడి యంగీ
కరించె. అంత నిరువురుపురుషు లొంటినిండ మసిపూసికొని చూపఱులు
భయపడునట్లు కేకలువేయుచు వచ్చి రాజుగారికి వందనంబులు సలిపి తమ
చాతుర్యంబుఁ జూపిరి. ఆరాజు నాఁడు వేషముకట్టినవారికెల్ల నొక్కొక వెండి
నాణెమొసంగ నేర్పాటుచేసినాఁడు. కావున తనయొద్దనున్న నాణెములను
రెంటినిఁదీసి చెఱియొకరికి నొసంగె. అది బాలుండుచూచి కెవ్వనవార్చి తాను
గూర్చుండిన శయ్యపైనుండి క్రిందఁబడి యేడ్వనారంభించె. అచ్చటివా
రందఱు నిశ్చేష్టితులై చూచుచుండిరి. అంత మాళవరాజు కుమారు లేవనెత్తి
యొత్తికొని యోదార్చి కారణంబడుగఁ గొంతసేపటికి వేషములవారికి నాణె
ములఁ బంచిపెట్టెదనని పలికెను. అదివిని రాజు వెంటనే మఱిరెండునాణెంబులఁ
దీసి కుమారునకీయఁగా వాఁడాయిరువురిచేతులలోను బడవైచె. అంత నావేష
ధారులు తమపుణ్యంబులఁ గొనియాడుకొనుచు బాలుని దీవించుచుఁ బోయిరి.
తరువాతఁ గొందఱు పులివేషంబులఁదాల్చి కడుపులనిండఁగడ్డివి వికారచేష్టలు
చేయుచు వింతవింతగ గెంతుచు మాళవరాజును దర్శింపవచ్చిరి. ఇట్లువచ్చి
కొంతసేపు తమనైపుణ్యముచూపి బాలుండిచ్చిన బహుమానంబులఁ గొని
పోయిరి. అంత మాళవరాజు కార్యాంతరాసక్తుండయి లోనికిఁ బోవుచుఁ
దనకుమారుని, నాణెములను సేవకుల కర్పించెను. అంత నాసేవకులు వచ్చిన
వారి కాబాలునిచే బహుమానంబు లర్పించుచుండిరి. అంత నొకపురుషుఁడు
బైరాగివేషమువేసికొని వచ్చి యచ్చటివారిని దీవించుచుఁ జమత్కారవచ
నంబులు పలుకుచు బహుమానమందికొనిపోయె. పిమ్మట నొకపురుషుండు విప్ర
వినోదివేషముదాల్చి వచ్చి హస్తలాఘవాదివిద్యలయందు చాతుర్యముఁజూపి
రాజకుమారుండిచ్చిన పసదన మందికొనిపోయెను. ఇట్లు పెక్కురు పెక్కువేషం
బులతో వచ్చి బహుమానంబులఁ గొనిపోవుచుండిరి. అంత సూర్యుం డస్త
మించినందున వారందఱు ముందుప్రవర్తిల్లవలసినకార్యంబునకయి పోయి

యకార్యంబును గొనసాగించిరి. ఈబాలుండు సంతసముతోఁ దండ్రియొద్దకుఁ బోయి ముద్దుమాటలచే వేషధారులు చూపిన వినోదములఁజెప్పి సంతసింపఁ జేయుచుండెను. అప్పుడు లేఖకుండొకఁడు రాజకీయవ్యవహారపుపత్రమొకటిఁ గొనివచ్చి ప్రభువుగారికిఁజూపి యాతనిముద్ర నందు బొందుపఱుపవలయునని కోరెను. అంత మాళవరాజు తనయుంగరము కుమారుచేతఁ బెట్టినాఁడుకాన నతని చేతిని బరిశీలింప నుంగరంబులేదయ్యె. అంత మాళవరాజు తొందరపడి సేనలఁ బిలిపించి వెదకించెనుగాని యెచ్చటను గానరాదయ్యె. అప్పుడు రాజు కుమారున కాయుంగరంబిచ్చుట తప్పిదంబనిగ్రహించి విచారించుచుండ నొక దాసి పర్వుపర్వునఁబోయి ప్రభువునకు నమస్కరించి తనకొకచోట దొరికిన దనిచెప్పి యాయుంగరమిచ్చె. రాజాదుల కమందానందంబుఁ జెంది దానికి బహుమానంబొసంగ నదియత్యంతసంతోషంబునఁ బోయె. మాళవరాజును దన ముద్రాంగుళీయకము పోయినను వెంటనేలభించినందున కానందంబుఁ జెందుచు నుండెను.

# నలువదియవ ప్రకరణము

" ఏదురాత్ముండు పవిత్రమగురాజపుత్రవంశమును మలినముగావించి నాఁడో, ఏ క్రూరుండు నిర్మలాంతఃకరణులయి రాజభక్తిసముపేతులయియున్న గోపాలసింహాదుల దుఃఖసముద్రమున ముంచివేసెనో, ఏపాపాత్ముండు కులాచారవిరుద్ధమార్గగామియయి పావనవంశోద్భూతయయిన రమాబాయిని మహాత్మదీయునకిచ్చి రాజపుత్రుల గౌరవం బనుచంద్రబింబంబును గ్రసింప రాహుసదృశుండయ్యెనో, ఏకృతఘ్నుండు చిరకాలము మమ్ముల నాశ్రయించి మా క్షొంపఁ జెడఁదిని తుదకు రాజ్యంబు కాంక్షించి నన్నును నాతండ్రిని బలుబాములఁబెట్టెనో, యాతుచ్ఛుం డగుదామోదరసింగును నానిశాతబాణం బున యమనికాంతంబున కతిథింజేసితిఁగదా ! తుదకు నాపాట్లెట్టులున్నను నాకుఁ బరమశత్రువయిన దామోదరుని జంపినందుల కమితానందంబు గలుగు చున్న" దని పలువిధంబులఁ జింతించుచుఁ దారాబాయి యొక్క యుత్తరపుటు

వ్రాసి తన్ను నెల్లప్పుడు సేవించుచున్న యొక చెలికత్తెం బిలిచి యాయుత్తర మిచ్చి దీని మాళవరాజున కిమ్మని పుత్తెంచె. అంత నాదాసియుఁ గడువడిఁ జని మాళవరాజును దర్శించి యాయుత్తరము తారాబాయి తన కిమ్మనియొనని చెప్పి యందించె. మాళవరాజు తనమాట విన్నంతమాత్రముననే మండిపడి నిందావాక్యంబుల పాలు చేయుచు వచ్చిన తారాబాయి తనకు నుత్తరము వ్రాసిన దన్నమాట వినినతోడనే సంతుష్టస్వాంతుండయి యతిగౌరవంబుతోఁ దీసికొని విచ్చి యిట్లు చదువుకొనె. "మహారాజా!, గతించినపనికయి విచారించుట నిష్ఫలంబు. పృథ్వీరాజిఁక వచ్చి విడిపించునన్న యాశలేదు. మీకుఁ బ్రతికూలముగా వర్తించి యావజ్జీవము పలుబాము లనుభవించుటకంటె మీదయనుసంపాదించి సుఖమనుభవించుటె యుచితంబని తోఁచినది. మహాత్మదీయులయినను దమ్మునుఁ బెండ్లాడ సందియంబు లేదు. ఇంతకుముందు రమాబాయి పెండ్లాడినది. లోకాపవాదమంతయు నామెనే చెందును. నాకంతగాఁ గలుగనేరదు. మూర్ఖదర్శికురాలు రమాబాయి. ఆమెననుసరించి పోవుటలో నాతప్పేమియున్నది. కావున నేనిదివఱలో మిమ్ములఁ దృణీకరించి యన్యథా తలంపక నన్ను రాజావసథంబునకుఁ గొనిపోయి రాజపుత్త్రాచారంబు ననుసరించి యథావిధిగఁ బెండ్లియాడుఁడు. కాని తా మొకటి చేయవలసియున్నది. ఇఁకమీఁద తోథానగరంబును రాజధానిగాఁ జేసి యుండే యుండవలె. ఇది నాచేతితో వ్రాసిన యుత్తరము.

విధేయురాలు,

తారాబాయి."

ఆనియున్న యాయుత్తరంబు చదువుకొని మాళవరాజానందసముద్రంబున నోలలాడుచుఁ బకీర్యప్రభావంబుఁ బలుమాఱుఁ గొనియాడుచు నాయుత్తరము తెచ్చినదాసి కనర్ఘభూషణంబులు బహుమానంబుగా నొసంగె. అనంతరము రాజు తనహితుల కాయుత్తరంబు చూపి వివాహప్రయత్నంబుల చేయించుచుండె. అంతట వారేర్పఱుచుకొన్న పెండ్లిదినంబు వచ్చె. అప్పటికి రాజావసథంబును గన్నులపండువుగా నలంకరించిరి. ఆపురంబులోని వారందఱు

రాజాజ్ఞానుమతింబట్టి తమతమగృహంబుల మిగుల రమణీయముగా నలంకరించుకొనిరి. పురంబున నేవంకఁ జూచినను గన్నుల కానందంబు గొలుపని స్థలం బొకటియు లేదు. వివాహమునకుఁ గావలసిన వస్తుజాతంబును సముపార్జింపఁబడియె. ఇఁక రాత్రి వివాహంబు జరుగుట నిశ్చయంబని విన్నప్పుడు రాజపుత్రులందఱు మున్ను రమాబాయిని నిందించి నట్టు లిప్పుడీ తారాబాయిని నిందించుచుండిరి. ఈవృత్తాంతము క్రమక్రమముగా సూరథాన్రాయుల చెవి సోఁకినప్పు డతనికి సంభవించినదుఃఖంబునకును గుమారికను గూర్చి గలిగినకోపంబునకును హద్దులేదు. అప్పుడు రాయ లిట్లనుకొనియె. "అకటా! తారాబాయి కిట్టిదుర్బుద్ధి పట్టినదేమి! ఆమాళవరాజు సేవకురాండ్రామెతో మంచి మాటలాడి యిట్టిదుష్టమార్గంబును జొచ్చునట్లు చేసిరని భావించెద. అయ్యో! దుష్టసాంగత్యమెన్నటికయినఁ జెఱుపకమానునా! ఓకుమారీ! ఎంతపని చేసితివి! నీబుద్ధియుఁ గులాభిమానము, సదాచారము మొదలగుసద్గుణంబుల నెల్ల నేయేటి పాలుగావించితివి? మొదటినుండియు నీప్రవర్తనముం జూచి నీవెంతో యోగ్యురాలవనియుఁ బట్టినపట్టు నెఱవేర్చుకొనఁ బాటుపడు దానవనియు మిగులఁ బితృభక్తిగలదానవనియు నెన్నుకొని నీపై గంపెడాశ పెట్టుకొని పుత్రులు లేరన్నవిచారంబును సైతము వదలుకొని యత్యంతసంతోషమున వర్తిలుచుండఁ దుదకు నన్నిట్లు దుఃఖసముద్రములో ముంచిరి. అకటా! సుజనవందనీయమయిన నీయోగ్యతారత్నం బీమహమ్మదీయుల సంగతి యనెడు నగ్నిహోత్రసంబంధంబు గలిగి నిష్ప్రభమయి తొలంగినదేమి! నీవు తోధారాజ్యంబును గెలిచి మాతండ్రికి నిచ్చు రాజకుమారునిఁదప్ప మఱియొకనిని బెండ్లాడనని శపథంబు చేసితివి. ఆశపథ మెచ్చట నశించినది." తోధారాజ్యంబును గెలువ నక్కఱ లేదు. నాకొసంగ నక్కఱ లేదు. అనురూపుఁడయిన రాజకుమారుని బెండ్లాడినచో నెంతయు సంతసింతునుగదా! అయ్యో! నీజీవంబుగడుప నాటదనూరు చాలక పోయెనే! నశ్వరంబులయిన సంపదల కాసించి కులగౌరవంబులు చెడ మహమ్మదీయునిఁ బెండ్లాడ నుచితమా! తుచ్ఛసుఖంబుల కాశించి శాశ్వతంబగుయశంబు నీటిపాలుచేయలేనని నీవే యెన్నిపర్యాయంబులోఁ బలికితివి! అవివేకమంతయు

నేమయినది! నీయందుఁ బ్రేమాతిశయంబు గలవాఁడ నయి తోడారాజ్యంబు నీకే చెందఁజేయవలెనని పట్టుదలకలిగియుండుటం బట్టియేకదా! నా కిన్నికష్టం బులు సంప్రాప్తమయినవి? నే నా దామోదరునితో స్నేహామే చేసికొన్న చో రాజ్యంబుఁ బాసి బదనూరునందుఁ బరులయింటఁ గృపణత్వంబుల జీవించుటయుఁ, నీ కారాగృహమందు నివసించుటయుఁ సంభవించియుండదుగదా! నే నిన్ని కష్టంబులఁ జెందుట నిన్నుఁగూర్చియేయని నీకుఁ దెలియునుగదా? అట్లు తెలి సియుఁ గృతఘ్నురాలవయి నన్ను విడుచుటయే కాక తురకవుఁ బెండ్లాడి శాశ్వతమగు నపఖ్యాతికి నన్నుఁ బాత్రునిగాఁ జేసితివి? నిన్నుఁ గని పెంచి పెద్దఁజేసి ప్రేమించి యున్నందులకుఁ దుదకు నాకుఁ గలిగెడి ప్రతిఫల మిదియా? అని యిట్లు కుమారిచేసిన నీచకృత్యంబులకు మిగుల వగచుచు గోడకుఁబెట్టి తలపగులగొట్టుకొని ప్రాణంబులువిడిచి యీదుఃఖమును తొలం గించుకొనఁ బ్రయత్నించుచుండఁగా రాయలు తోడాపురంబుఁ జొచ్చినప్పటి నుండియుఁ మాళవరాజు ననుమతిచొప్పున సర్వదా జాగరూకుండయి కాచుచున్న యుబ్దుల్లాఖా నతనియొద్దకుఁబోయి పట్టుకొని యిట్లనియె. "మహారాజా! నీవు మాళవరాజు శాసనంబునఁ గారాగృహమందున్నావు. నిన్ను జాగ్రత్తతోఁ గాపాడవలయునని నాకాజ్ఞాపించినాఁడు. నీవు నాకధీనుండవయి యున్నావు. ఇట్టి సమయంబునఁ బ్రాణంబులు విడుతువేని మాళవరాజు నా ప్రాణంబులు దీయించక మానఁడు. కావున నీవు మరణవాంఛ విడువుము. నీవట్లు విడువవేని చచ్చుటకు వలనుపడనట్లు నీ కాళ్ళేతులు బంధించెదను." అని కఠినముగాఁ బలుక విని "అక్కటా! మీరు నన్నుఁ జావనీరు. అందులకై నాప్రయత్నము సాగదు. కోర్కె నెఱవేఱదని తెలిసియుఁ దానికై ప్రయత్నించి నిష్కారణముగా బాధింపఁబడనేల? అని తలపోసి రాయలాప్రయత్నము మానెను. అఁటవివాహ ముహూర్త మాసన్నమైనందున మాళవరాజెంతయుఁ దొందరపడుచుండెె. ఆ వివాహమహోత్సవము చూడవలసినవారందఱు వచ్చియుండిరి. నాఁడు తోడాపురమంతయుఁ గుఱ్ఱపుబండ్లతోడను గుఱ్ఱములతోడను నిండియుండెె. తారాబాయి నామె చెలికత్తెలందఱుచేరి నామె మందిరమంత యభ్యంజనాది

కములు కావించి మాళవరాజంపిన యమూల్యవస్తువుల నలంకరించి వివాహ సమయంబునకుఁ గొనిపోవలయుననని యెదురుచూచుచుండిరి. తారాబాయి నాఁడు చెందుచున్న సంతసంబునకు హద్దులేదు. మాటిమాటికిఁ బైకివచ్చి తన నిమిత్తము గుఱ్ఱపుబండి వచ్చుచున్నదేమో చూచుచుండె. నాఁడామె యొక్క మాఱైనను నొకచోటను స్థిరముగాఁ గూర్చుండి యుండలేదు. వింతవస్తువుల నెన్నింటిఁజూచుచున్నను, చెలికత్తెలతో నెన్నియాట లాడుచున్నను, నెన్ని చిత్రకథలఁ జెప్పుకొనుచున్నను, మాళవరాజును వరింపవలెనన్న కోర్కెచే మిగుల బాధింపఁబడుచుండుటంగాఁబోలు నాఁడు తారాబాయికిఁ బ్రొద్దుపోవు నట్టె కానరాలేదు. ఏదేని చప్పుడు వినఁబడెనేని తననిమిత్తము మాళవరాజంపిన బండి వచ్చుచున్నదే మోయని భావించి యది నిక్కువమో కాదో యని చూచుటకై చెలికత్తెను బంపుచుండును. ఇట్లు తారాబాయి చెందుచున్న తహతహపాటుఁగాంచి చెలికత్తెలందఱు మొదటి ప్రవర్తనమున కిప్పటి ప్రవర్తనమునకు నింతవ్యత్యాసమేల కన్పట్టుచున్నదో” యని యబ్బురపడుచుండిరి. ఇట్లుండఁ గొంతవడికి సూర్యుం డస్తమించె. చీఁకటు లావరించె. చుక్కలు మొత్తమ్ము లాకసంబు నలంకరించె. అట్టిసమయంబున నొక గుఱ్ఱపుఁబండి తారాబాయి సౌధము నెదుట నిలువఁబడియె. అంత నొకపురుషుండు లోనికిఁబోయి తారాబాయిని గొనిపోవ నెంచుచుండ నాసౌధంబును గాచుచున్న నాజర్ఖా నిట్లనియె. ఓయీ! తారాబాయి నిప్పుడు పంపించుటకు వీలులేదు. మన పురంబున శత్రువులున్నారని తెలిసినది. ఎవ రేకపటోపాయము పన్నియుందురో? మీరు మాళవరాజుభటులైనట్లు నాకుఁ దెలిసినను మిమ్ములనమ్మి తారాబాయిని మీ వెంటఁబంపను. తారాబాయి నీసౌధమునుండి కొనిపోవునప్పుడు శత్రువులేమిచేయుదురో? నాఁడు దామోదరుఁ డూరేఁగుచుండ నేమిజరిగినదో మీరు చూచినారుకదా! ఇంతేకాక మాళవరాజు నాతో, “ఓయీ! నేనుగాని నావ్రాసిన యుత్తరముగాని వచ్చినంతదనుక తారాబాయి నీసౌధమునుండి కదలనీవద్దు. అట్లు చేసితివేని నీతల తీయింతు” నని కఠినముగాఁ బలికి యున్నాఁడు. ఇట్లుండ నతఁడు వ్రాసినయుత్తరంబు లేకుండ నే నీ తారాబాయి నెట్లు పంపుదును? కావున మీరుపోయి యీవృత్తాంతము చెప్పినచో నతండు

తప్పక నాకొక యుత్తరంబు పంపియిచ్చు. అప్పుడు తారాబాయిని బంపెదను మీరు నడిచివెళ్ళినచోఁ గాలవిళంబమగును. ఈ బండినెక్కి వేగముగాఁ బోయి రండని పలుక నామాటలాలకించి మాళవరాజు శాసమును వారుగూడ నెఱింగి యున్నవారు కావున వారు మాఱుమాటాడక తరలిపోయిరి. అనంతరము కొంతవడికి నొక పురుషుఁడు పర్విడివచ్చి యొకయుత్తరమా నాజ్ఞాపకునకిచ్చెఁ. అది వాఁడు చదువుకొని తన ప్రభుముద్రను గాంచి తా నాలస్యము చేసి నందులకుఁ బ్రభువునకుఁ జాలకోపమువచ్చినదని తెలిసికొని భయపడుచు నాసమయంబునఁ బ్రభువునెదుటఁ బడినచో నేమిచేయునోయని శంకించుచుఁ దా నచటనేయుండి తారాబాయిని బండిలోఁ గూర్చుండఁబెట్టి పంపెను. ఆ తరువాత నామె చెలికత్తెలందఱు గలిసి తారాబాయి వివాహమహోత్సవముం జూడఁబోయిరి.

---

# నలువదియొకటవ ప్రకరణము

మాళవరాజు తారాబాయికరగ్రహణంబు సలుప నతికుతూహలంబుతో బంధువర్గంబుచేతను, మిత్రులచేతను, పరిచారకులచేతను బరివృతుండయి యారాత్రి కన్నియయాగమనంబునిమిత్తము ప్రతీక్షించుచుండె. ఆసమయంబున నొకపురుషుండు కడువడివచ్చి మాళవేంద్రుని జేరి నమస్కరించి యొక యుత్తర మందించె. అంత నామాళవరాజు తొందరతో దానినివిచ్చి యిట్లు చదువఁదొడంగె. "ఓయీ! మాళవరాజా! నీవు దామోదరసహితుండవయి చేసినయపరాధంబులఁబట్టి యోజింప సర్వోవధార్హుండవు. అయిన నిన్నుఁ గరుణించి యిట్లు చేయనంగీకరింపక నీకీయుత్తరంబు వ్రాసితిని. నీవు తోధా నాక్రమించుకొనుట యన్యాయము. ఆ నగరము మా చిత్తూరుమండలము లోనిది. కావున మామండలములో నిట్టి యన్యాయంబులు ప్రవర్తిల్లుచుండఁ జూచి సహింపనోప. కావున నీవు తోధాపురంబును సర్వవస్తువులతో విడిచి నీమాళవకుఁ బొమ్ము. అట్లు పోవేని యుద్ధమునకు సిద్ధముగ నుండుము. పిమ్మట నీమాళవరాజ్యక్షేమమును గూర్చి కూడ జాగరూకుండవయి యుండుము. నీ వాలోచించుకొనుటకు రెండుదినములు గడువిచ్చితి. ఈలోపల నాలో

చించి నీతలంపును దెలియఁజేయుము" అని చదువుకొని మిగుల విచారించు కొనుచుఁ దన మిత్ర మంత్రి పరివారంబును బిలిచి యిట్లు ప్రసంగించె.

మా.—ఓయీ! ఒక యాపద యేతెంచినది. దానికి ప్రతీకారమేమో తెలియ కున్నది.

మ.—ఏదియో సెలవిండు.

మా.—పృథ్వీరాజొకయుత్తరంబు వ్రాసినాఁడు.

మ.—ఏమని వ్రాసెను?

మా.—తోధారాజ్యంబును రెండుదినంబులలో విడిచిపోవలెనఁట. లేనిచో యుద్ధముఁ జేయవలెనఁట.

మ.—దీని కాలోచింప నేమున్నది?

మా.—ఎందుచేత ?

మ.—ఇంతకుమున్న పన్నినయుపాయ మున్నదికాదా?

మా.—ఏది! దాడివెడలినచో దారాబాయిని రాయలకు జంపుదమనెడి యుపాయమా !

మ.—అవును. అదియే రక్షణోపాయములలో మంచిది.

మా.—ఇంతకుమునుపా యుపాయము వరిష్ఠమైనదియే ? కాని ప్రస్తుతము బాగున్నదికాదు.

మ.—ఎందుచేత ?

మా.—పూర్వము పృథ్వీరాజునకుఁ దారాబాయి వరింపఁగల దనునాశ యుండెడిది. అందుచేఁ దనకుఁ బ్రియురాలగు తార ప్రాణంబులు తీయింతుమని భయపడి దాడివెడలిరాలేదు. కాని యిపు డాతారా బాయిని నేను పెండ్లాడుచున్నట్లు తెలిసికొని మహాప్మదీయులలోఁ గలిసిన తార యందున్న ప్రేమము తొలంగించుకొనియుండును. అందు వలన నీయుపాయ మాతనికొక నిర్బంధకము కాదు.

అని ఇట్లు మంత్రులతో నాలోచనము చేయుచున్న సమయంబున నొకపురుషుఁడు కడువడిఁజనుదెంచి, నమస్కరించి నిలువఁగా వానింజూచి మాళవరా జిట్లనియె.

మా.—తారాబాయిని గొనివచ్చినారా?

భ.—లేదు. మేము వెళ్లుటకుముందె తమరు కోపించుచున్నారని తెలిసి తారాబాయి నొకబండిలోఁ గూర్చుండఁబెట్టి పంపినాఁడఁట.

మా.—ఎవఁడు?

భ.—తనసేనానాయకుఁ డైన నాజర్ఖాను.

మా.—ఇచ్చటికి రాలేదే?

భ.—ఏమో తెలియదు. మాకంటె ముందుగా నొకకొందఱికొకయుత్తరమిచ్చి మీరు పంపఁగా నాజర్ఖాను తమయాజ్ఞకు బద్ధుండై యాకన్యకను వారివెంటఁ బంపినాఁడఁట.

మా.—మీకుఁదప్ప మఱెవ్వరికి నేను దారాబాయిని గొనిరా నుత్తరముగాని యాజ్ఞగాని యీయ లేదే?

భ.—ఏమో నాజర్ఖా నిట్లు చెప్పినాఁడు.

మా.—ఏదీ! వానిని గడురయంబునఁ గొనిరండు.

భ.—(పర్విడిపోయి నాజర్ఖానుని గొనివచ్చును.) అంత వాఁడు ప్రభువుపాద పద్మములమైఁబడి నమస్కరించి నిలువఁబడియె. పిమ్మట మాళవరాజాతనితో నిట్లు సంభాషించె.

మా.—ఓరీ! తారాబాయి యెక్కడ?

నా.—తమయుత్తరముప్రకార మంపినానే!

మా.—తారాబాయి యిచ్చటికి రాలేదు. ఇంతియకా నాపంపిన సేవకులు కూడఁ దిరిగివచ్చి యిచ్చటనే యున్నారు. ఆరాజకన్యకయేమయినది.

నా.—ఏమో! నాకుఁ దెలిసినవిషయమిది. మొదటఁ దమభటులు గొందఱు వచ్చి, తారాబాయిని బంపుమని చెప్పినారు. కాని తమయాజ్ఞయైనదో లేదో యనుసందియముతో వారలవెంటఁ బంపక తమయొద్దనుండి యొకయుత్తరమును గొనిరండని పంపితి.

మా.—అవును. తరువాత.

నా.—కొంతసేపటికి కొకపురుషుండు పర్విడివచ్చి, నా కీయుత్తర మీయఁగా భయపడి వారివెంబడిని బంపినాను.

మా.—ఏదీ యాయుత్తరము?

ఖా.—(చేతి కందించును)

మా.—(దానిఁజూచి నిజముద్రాంకితంబగుట నెఱింగి యిట్లు చదివెను)

"ఓరీ! దురాత్మా! మేము తారాబాయికై యిట్లు ప్రతీక్షించి యుండఁగా నామెను బంపుటకు విలంబము చేయుచున్నావురా? తత్క్షణము పీని వెంటఁ బంపనిచో నీప్రాణంబులు నీకుఁ దక్కవు." అనియుత్తరము చదువుకొని శత్రువులు తనకుత్తుక నుత్తరించినారని విలపించుచు మంత్రులతో నిట్లనియె.

మా.—అక్కటా! ఇదియంతయు చిత్రముగా నున్నది. ఈముద్ర యెప్పుడు నాయొద్దనే యుండఁగా శత్రువులెట్లీ ముద్రను సృజించినారో తెలియకున్నది! ఏసుందరాంగినిమిత్త మింతకాలముపాటుపడితిమో యామె మనలను తప్పించుకొని పోయినది. ఇఁక మనకాకాంత లభించుట యసంభవము. అయ్యయ్యో! నామిత్రము దామోదరుండున్నయెడ నెట్లయినను దారను గొనివచ్చి యిచ్చునుగదా? (అని విచారించును).

మం.—మహారాజా! విచారింపనేల? తారాబాయిని మరల మనము సంపాదించుకొనఁదగినయుపాయ మొకటి యున్నది.

మా.—(తొందరతో) ఆయుపాయ మేది?

మం.—ఈతారాబాయిని గొనిపోయినవాఁడు పృథ్వీరాజయి యుండును. ఆతారాబాయి పితృభక్తిగలది. కావున మనచేతులలోఁ జిక్కినరాయలు మనకుండఁగాఁ దార మనకు వశ్యయగుటకు లోపమేమున్నది?

మా.—అవును. అది యొక యుపాయము కావచ్చును. (అని యొక భటునిం బిలిచి) నీవు వేగముగాఁ బోయి యబ్దుల్లాతో జరిగినవృత్తాంతము చెప్పి శత్రువులు మనల మోసపుచ్చుచున్నారు. కావున సూరథానులను భద్రముగాఁ గాపాడుము అని చెప్పిరమ్ము (అని చెప్పి వాఁడతిరయంబుగఁ బోయి దిరిగి వచ్చి మహారాజునకు నమస్కరించి)

భ.—మహారాజా! యబ్దుల్లా యచ్చటఁ గానరాలేదు.

మా.—ఏమీ! ఆదుర్మార్గుండచ్చటఁ గాపుండలేదా!

భ.—లేదు.

మా.—ఆనీచాత్ముం డెచ్చటికిఁ బోయినాఁడో యడిగి తెలిసికొనలేదా?

భ.—తెలిసికొంటిని.

మా.—ఏమి చెప్పినారు?

భ.—తారాబాయి వివాహము చూచుటకయి రాయలను వెంటఁ బెట్టుకొని రమ్మని మీరు సందేశమంపినారఁట. తమ యాజ్ఞఁ దలదాల్చి యతం డారాజుతోఁగూడ నిచ్చటికి వచ్చినాఁడని చెప్పినారు.

మా.—(ఆశ్చర్యపడుచు) అయ్యో! నేనట్లు చెప్పి యెవ్వరిని బంపలేదే!

భ.—తా మొకగుఱ్ఱపుబండియు పంపినారఁట.

మా.—అకటా! ఇదియంతయు మోసముగా నున్నది. రాయ లచ్చట లేఁడా!

భ.—లేఁడు. గృహరక్షకులుమాత్ర మచ్చట నున్నారు.

మా.—ఆదురాత్ముండు రమాబాయి యింట నున్నాఁడేమో! పోయి బంధించి కొనిరండు. (అని పలికి కొందఱుభటులఁ బంపును)

అంత నాభటులు పరువుపరువునఁబోయి తిరిగివచ్చి "మహారాజా! తమసెలవు ప్రకారము రమాబాయిగూడఁ బెండ్లిచూచుటకై వచ్చియున్న దఁట. అచ్చట రమాబాయిగాని యబ్దుల్లాగాని కానరాలేదు." అని విన్నవించుకొనిరి. అంత మాళవరాజత్యంతదుఃఖము కలవాఁడయి శత్రువులొనర్చిన మోసమున కచ్చెరువందుచుండె. తక్కినవారు నాసమాచారము విని నోటమాట రాక నిశ్చేష్టితులయి యుండిరి. అంత మాళవరాజిట్లనియె. ఔరా! శత్రువులు చేసిన మోసము మిగుల నబ్బురంబు గొలుపుచున్నది. అకటా! ఎంతపని జరిగినది! ఇదియంతయు నింద్రజాలంబువలెఁ గన్పట్టుచున్నదే! చేతికిఁ జిక్కిన వారందఱు సమయమునకు లీలఁగాఁ దప్పించుకొనిపోయినారు. అకటా! ఆదురాత్ము లెట్లు వంచించినారో చూడుఁడు. ఆతారాబాయి యెంతో నమ్మకముపుట్ట నుత్తరంబు వ్రాయ నెంతయు సంతసించి కార్యము నెఱవేఱినదని భావించితిని. ఆసంతసంబునకు మాఱుగా దుఃఖమే నాకు సంప్రాప్తమయినది. ఓసీ! తారా! ఎంతమోసము చేసితివే? ఓరీ! యబ్దుల్లా! స్వజాతివాఁడ వయ్యు సాధనంబు నపారముగా మెక్కినవాఁడవయ్యు నుంతేనియు విశ్వా

సంబులేక తుదకు మాకే మోసముచేసినావేమిరా? నీవే నాకు మోసము చేసి నప్పుడు రాజపుత్త్రులు మోసముచేయుదురని వేఱ దలంపవలయునా? ఓరీ! దుష్టా! నీవెంతో యోగ్యుండవని నమ్మితినిగాని తిన్నయింటికి కన్నములం త్రవ్వుమూషికమువంటివాఁడవని యెఱుంగకపోతిని. అయ్యయో! ఎంతపని జరిగినది! ఇఁక పృథ్వీరాజు నెదిరించి చేతఁజిక్కిన తోధాపురంబును దక్కించు కొనఁగలనా! ఆదుష్టరాజపుత్త్రుండు నాఁడు చిత్తూరునకుఁ బోయినప్పుడు నన్నవమానపఱచ్చినఁజేసి పాఱఁదోలెఁగదా! ఈపర్యాయము జీవములనే తీయునేమో! అని యిట్లు వివాహమహోత్సవానంద మనుభవింపవలసిన మాళవరాజు విచారపరీతస్వాంతుండయి యుండెను.

---

# నలువదిరెండవప్రకరణము

కమలమియరుదుర్గంబున రాజమందిరములో సభాభవనంబునఁ దారాబాయియుఁ బృథ్వీరాజును రాయలు కూర్చుండియున్న సమయంబున పరభసంబునఁ బకీరు నేతెంచె. అతఁడు సభాభవనంబున బ్రవేశించుట చూచి తారాబాయియుఁ బృథ్వీరాజును లేచి నమస్కరించిరి; కాని సూరధాన్రాయలు తోధానగరంబునఁ గారాగృహమందున్న తన్నుఁ గమలమియరుకోట కెవ్వరుగొనివచ్చినారో యని యాలోచించుచున్నవాఁ డగుటచేతనో, లేక యుత్తమరాజవంశమందు జన్మించి తాను మ్లేచ్ఛజాతివాఁడయిన పకీరునకు నమస్కరింప నిష్టములేకయో నమస్కరింప మానుటయేకాక యాసనంబున నుండియైనను లేవలేదు. మఱియు సూరధానుఁడు దారాబాయినిదప్ప తక్కిన వారి నెవ్వరి నెఱుఁగకపోవుటచేతను, మఱియు నాదుర్గంబు తనకుఁగ్రొత్త దగుటచేతను మాళవేంద్రుని గెలిచి తన్నును తనకుమారికను మఱియొకరాజు చెఱఁబెట్టెనేమోయని సందేహించుచు నేదిపలుకుటకుఁ దోఁచక కుమారికను జూచుచుఁ గోపంబు నిలుపుకోలేక యామెతో నిట్లు ప్రసంగించె.

రా.—తారా! నీవు మాళవరాజును వరించిన తుచ్ఛురాలవు. నన్ను విడిచి దూరముగాఁ బోవేమి?

తా.—(తనలో) మాళవరాజు నన్నుఁ బెండ్లాడె నన్నమాట యీతనిమనంబున దృఢంబుగా నాటుకొని యుండుటంబట్టి యిట్లనుకొనుచున్నాఁడు. (ప్రకాశముగా) నాయనా! మన మిప్పు డెచ్చట నున్నామో తెలియునా?

రా.—తెలియదు. దానికేమి నీవు యోగ్యురాలవని భావించుచుండఁ దుచ్ఛుం డగు మ్లేచ్ఛునిఁబెండ్లాడి నాకపఖ్యాతి సంపాదించుచున్నావు. ఇఁక నీజన్మము కాల్పనా?

తా.—నాయనా! ఏమి నీ వట్లు పలుకుచున్నావు? తారాబాయి కొక్కటే నాలుకయని తమ రెఱుఁగరా?

రా.—ఎఱుంగుదు. అందుచేతనే మొదటఁ జేసిన ప్రతిజ్ఞ నతిక్రమించి మాళవ రాజు నేల పెండ్లిచూడితివని విచారించుచున్నాను.

తా.—శివ, శివ, తారాబాయి కంఠములో జీవములుండ నట్టిపని జరుగ నేరదు.

రా.—(ఆశ్చర్యముతో) మాళవరాజును బెండ్లాడలేదా?

తా.—నాయనా! నేనింతగాఁ జెప్పుచున్నను భ్రమపడుచున్నా రేమి?

రా.—తోధాపురజను లెందుల కిట్లు చెప్పి నిన్నును నన్నును నిందించినారు!

తా.—మాళవరాజునుండి తప్పించుకొనవలెనని యెన్నియుపాయములు పన్ని నను ఫలించినవికావు. అందుచే మాళవరాజునకు నేనొకయుత్తరంబు వ్రాసితిని.

రా.—ఏమని వ్రాసితివి?

తా.—పెండ్లి యాడెదనని.

రా.—అట్లు వ్రాసినంతమాత్రమున నెట్లు తప్పించుకోఁగలిగితివి?

తా.—మాళవరాజు వివాహమాడ సిద్ధముగానుండి నానిమిత్తము బండి పంపిం చెదనని చెప్పె. కాని యతఁడు బండిపంపకమునుపే ఈ మహాపురు షుఁడు బండిగొనివచ్చి నన్నిచ్చటికిఁ గొనివచ్చినాఁడు.

రా.—ఈతని నెట్లు నమ్మెను?

తా.—మాళవేంద్రుని ముద్రతోనున్న యొకయుత్తరమును గొనిపోయి నన్ను సర్వదా కాచుచుండిన నాజరుఖానున కిచ్చె.

రా.—ఇతని కాముద్ర యెక్కడిది?

తా.—తోధాపురమందు మాళవరాజు పీర్ఠండుగ చేయించుచుండ నితఁ డొక విప్రవినోదివేషము తాల్చి పోయి మాళవరాజును దర్శించి చాతుర్యము చూపి మాళవరాజకుమారుం డిచ్చుచున్న బహుమాన మందుకొనుచున్నప్పుడు వానిచేతనున్న మాళవరాజు ముద్రికను గ్రహించి ముద్ర వేసికొని యాముద్రికను రహస్యముగాఁ దిరిగి రాజునకుఁ జేరునట్లు చేసె.

రా.—(సంతోషముతో) ఈపరోపకారి యెవఁడు?

తా.—ఏమహాత్మునికి నీవు చిరకాలమునుండి నన్నర్పింపఁదలంచుచున్నావో! యతండే యీమహానుభావుండు.

రా.—పృథ్వీరాజా!

తా.—అవును.

రా.—(లేచి పృథ్వీరాజును కౌగిలించుకొని) నాయనా! నీవు పూర్వము మే మానందవనంబునుండి వచ్చుచున్నప్పుడు దొంగలనుండి నా కుమారికను గాపాడితివి. నీ కెంతయుఁ గృతజ్ఞుండనయి యుందును

పృ.—మహారాజా! ఇందు నేఁ జేసినది సుంతేనియు లేదు. మిమ్ములను మమ్ములను రక్షించినమహానుభావుం డితండు. ఇతనికి మనమందఱము గృతజ్ఞులమయి యుండవలె. (అని ఫకీరును చూపును)

రా.—(ఆశ్రమముతో) నాయనా! ఇతఁ డెవండు.

పృ.—ఇతఁడు పూర్వాశ్రమమున రాజపుత్త్రుండే. ఇప్పుడు సన్న్యాస మవలంబించియున్నాఁడు. ఈతనినామము సదాశివయోగి.

తా.—(తనలో) అయ్యో! మహాత్ముదీయుం డని భావించి నమస్కరింపమానితిని. (అని లేచి) క్షమింపుఁడు. (అని యతనిపాదములపయిఁ బడి నమస్కరించె).

పృ.—(అతని లేవనెత్తి పీఠముపయిఁ గూర్చుండఁబెట్టి) మహారాజా! మేము మందఱము నీకు నమస్కరింపఁదగినవారము కాని నీకు వందనీయులము కాము.

రా.—పీఠముపయిఁ గూర్చుండి, సదాశివునిమాట వినిపించుకొనకుండ పృథ్వీరాజుం జూచి) అంతయుం బాగున్నది. కాని రమాబాయి తురకను వరించుట మిగుల నసంగతముగా నున్నది.

పృ.—(నవ్వుచు) లేదు. లేదు. రమాబాయి రాజపుత్త్రునే పెండ్లియాడినది.

రా.—అదెట్లు.

పృ.—అబ్దుల్లాఖాను రత్నసింహుఁడు.

రా.—(ఆశ్చర్యముతో) రత్నసింహుఁడు భిల్లులచేఁ జంపఁబడెనఁట.

పృ.—లేదు లేదు. ఆభిల్లులు దామోదరునియానతిచొప్పున, మీచే నవమానితుండయి యొకచో నిద్రించుచున్న రత్నసింహుం గొనిపోయి, గ్రామదేవతకు బలియిచ్చుటకు సిద్ధముగా నుండఁగా నీయోగీంద్రుండు నాకావృత్తాంతంబు తెలిపె. అంత నీమహాత్ముండును నేనును గలసిపోయి దాసుని జంపి రత్నసింహుని రక్షించి మాళవరాజు నాశ్రయింపుమని పంపితిమి.

శా.—(తండ్రిం జూచి) నాయనా! నాఁడు బనసూరునందు పృథ్వీరాజిచ్చిన యుత్తరంబు నీకిచ్చినప్పుడు నీవొక ప్రశ్న వేసితివి. స్మరించుకొన్నావా?

రా.—అవును. నాకు జ్ఞాపకమున్నది. ఆరక్షింపఁబడిన రెండవవారెవరని యడిగితి.

శా.—ఆరెండవపురుషుండె రత్నసింహుఁడు.

రా.—వాఁడు దామోదరునికి హితుండయి శత్రుకోటిలోఁ జేరినవాఁడు వాఁడేమయిన మనకేమి?

శా.—నాయనా! మనము మిగుల హేయమగుకార్యము చేసినాము.

రా.—అదేమిటి?

శా.—రత్నసింగును నిష్కారణముగా నవమానించి పురంబునుండి వెడలనంపుట.

రా.—ఏమట్లాడెదవు. వాఁడు వ్రాసిన ద్రోహపుటుత్తరము చూచినావు కావా?

తా.—చూచితిని. నిక్కవము గ్రహింపలేకపోతిని. రత్నసింగుండినయెడఁ దనమాటలు సాగవనియెంచి దామోదరుండు మనకు రత్నసింగునకు భేదము పుట్టింప నిట్టియుత్తరము మాధవసింగుచే వ్రాయించె. దానిని మనము నమ్మి రత్నసింగు ననుమానించితిమి. అతనికోపము పోవునట్లు మన మతని వేఁడికొనవలెను.

రా.—(పరితాపమును జెందుచు) అతం డెచ్చటనున్నాఁడు?

తా.—ఇచ్చటనే యున్నాఁడు. (అని పిలువఁబంప రమాబాయియు రత్నసింహుండును బ్రవేశించి రాణులకు నమస్కరింతురు)

రా.—రత్నసింగును (కౌఁగిలించికొని) నాయనా! నాయవివేకత్వము క్షమింపుము. నీకిట్టికష్టము కలిగించుటచేతనే మాకును దైవ మనేకకష్టములఁ గుడిపినాఁడు ఆదురాత్ముండు దామోదరుఁ డెన్ని యిడుములు గలిగించినాఁడు. పోనిమ్ము. ఆదురాత్ము నెవ్వరో చంపి పుణ్యముఁ గట్టుకొన్నారు. లోకము సుఖించినది.

ర.—ఆదామోదరుని జంపినది మీతారాబాయియే.

మా.—(అబ్బురమందుచు) ఎట్లు చంపినది?

ర.—దామోదరుం డూరేఁగుచున్నప్పుడు పృథ్వీరాజు తనకు రహస్యముగాఁ గొనితెచ్చియిచ్చిన విలువమ్ములఁ గొని.

రా.—కుమారి! నీవు లోకంబున కెంతయుపకారంబొనరించినావు?

తా.—నేనేమియుఁ జేయలేదు. ఇంతకుఁ గారణభూతుం డీసదాశివయోగియని గ్రహింపుము.

రా.—(పృథ్వీరాజుం జూచి) నాయనా! ఈయోగీశ్వరుం డెవఁడో మమ్ముల రక్షించుటయందు నితఁ డింతదీక్షవహించుటకుఁ గత మేమో! తెలియఁ జెప్పినఁగాని నామనంబునందలి యారాటం బడఁగదు.

పృ.—మహారాజా! ఈ మహానుభావుండు మనకుఁ జేసిన యుపకారములకు లెక్కలేదు. నేనీదేశమునుండి పోవుచుండ నన్ను మఱలించి గద్వారున

కధిపతిగాఁ జేసెను. దామోదరుండు పన్నుచున్న మాయోపాయము లకుఁ దగిన యుపాయము లాలోచించి నన్నుఁ గొనిపోయి వాని కార్యంబులఁ జెఱిచె. మొట్టమొదట దామోదరుఁడు భిల్లవాటికకుఁ బోవునప్పుఁ డతనియుంగరము పుచ్చికొని దాని మూలమున మహమ్మ ద్ఖానుని మోసపుచ్చి మాళవదేశమునకుఁ గొనిపోఁబడుచున్న మిమ్ముల బదనూరునకుఁ గొనివచ్చి విడిచినాఁడు. తరువాత నాయవివేకత్వము వలన మిమ్ములను దామోదరునిచేతులలో విడిచిపెట్టఁగా నిమ్మహాత్ముండు నాకుఁ గొన్ని యుపాయంబులు చెప్పి తోధాపురంబునకుఁ గొని పోయె. అచ్చటఁ జేసిన కార్యంబు లనేకంబులు. అవియన్నియు నత్యద్భుతంబులు. తాఫ్ఖానబుడ్ఢావేషముతో నున్న రత్నసింహును జంపి రమాబాయిని గొనిపోవుటకు వచ్చినప్పుడు నిమ్మహానుభావుండు చేసినకృత్యం బెంతని వర్ణింపఁగలరు ? ఇమ్మహాత్ముండు తన్నుదాఁ గాఁచి కొనుచు నిన్నును, నీకుమారికను, రమాబాయిని, రత్నసింగును, నన్నును సర్వదా కాపాడుచు మేఘబృందంబులవలె విఱియుచున్న యాపదలను దనయుక్తిమారుతంబుచే లవలీలఁ దూలించుచుఁ దనరహస్యంబుల నొరులకుఁ దెలియకుండఁ గాపాడుచు మనలనందఱను రక్షించినాఁడు. ఈపూజనీయుండే మాకాలోచనచెప్పుచుఁ గార్యంబుల మాచేఁ జేయించి మాకుఁగూడఁ గొంతయశంబు గలిగించినాఁడు. ఇతని యుదారగుణంబు లాదరణీయంబులు. ఇతని ప్రవర్తనము వందనీయము. ఇతనికిఁగలరాజ భక్తియుఁ బరోపకారిత్వము, యోజనాశక్తియు మఱియొకరికి లేవని నొక్కి వక్కాణింపఁగలను. రాజనీతియం దితనికి సాటివచ్చువా రొకరు లేరు. ఈమహాత్ముండు నీకుమంత్రియైయుండెడి గోపాలసింగు. దామోద రుని దురాలోచనవిని యితనిఁ జంపింపఁగా నితఁడు దండనాయకుల మంచిమాటలాడి తప్పించుకొని సన్యాసివేషమునఁ దిరుగుచు నీయందును నీరాజ్యమందును మిగుల నభిమానంబు గలవాఁడయియున్నవాఁ డగుటచే నిట్టికార్యంబు లొనరించినాఁడు.

అని పృథ్వీరాజు గోపాలసింగువృత్తాంతముచెప్పినప్పుడు రాయలాశ్చర్య సముద్రమున మునింగి పారంబెసయ లేకయుండి కొంతవడికిఁ దెలివితెచ్చి కొనిలేచి గోపాసింగు పాదములపైఁబడి వానిఁ బట్టికొని "ఓమిత్రమా! ఈ తుచ్ఛుండు నీకొనరించిన యపకారంబు సహింపుము, సహింపుము, అని యిట్లు విలపించుచుండ గోపాలసింగు రాయలను లేవదీసి పీఠంబుపైఁ గూర్చుండఁ బెట్టె. అంత తారాబాయి గోపాలసింగు పాదంబుల కభివందనంబుచేసి తన తండ్రి చేసిన యపరాధంబు సైరింపుమని ప్రార్థించె. అంత గోపాలసింగు తన కార్యంబులన్నియుఁ దీరినందులకు భగవంతునికి నమస్కరించుచు వారలను చిత్త వాక్యంబుల నోదార్చుచు నిట్లనియె. మహారాజా! కాలము ప్రతికూలమయి నప్పు డెట్టివారలకయిన నాపదలు రాకమానవు. కాలము నతిక్రమింపనెవ్వ రాదులే సమర్థులుకారు.ఇట్లుండ మనుష్యుల మగుమన మేపాటివారము? కావున విచారంబుతో నీకుఁ బనిలేదు. శీఘ్రంబుగాఁ దోధానగరంబునకుఁబోయిన నీవు రాజ్యంబు చేకొని తారాబాయిని బృథ్వీరాజునకొసంగి వివాహము గావింపుము. అని పలుక నందఱు సంతసించి యతనిం గొనియాడిరి. పృథ్వీరాజుకుఁ దారాబాయి ప్రతిజ్ఞ నెఱవేర్పవలసియున్నది. అందుచే నితండు గద్వారునుండి తనమిత్రుని నోజుని సాయమడిగి కొంతసైన్యము తెప్పించుకొని తోధాపురంబును ముట్టడింపఁబోయెను. ఆసమయమున రాయలును, రత్నసింగును, గోపాల సింగును నున్నతహయంబులెక్కి పృథ్వీరాజునకుఁ దోడుచూపిరి. అప్పుడు రమాబాయియుఁ దారాబాయియుఁగూడఁ బురుషవేషంబులుదాల్చి యుత్తుంగ తురంగంబుల నధిరోహించి పృథ్వీరాజునకుఁ దోడ్పడిరి. ఇట్లుపృథ్వీరా జపార సైన్యసమేతుండయి తోధాపురంబుఁజేరి ముట్టడింప సిద్ధముగానుండె. ఈయుదంతము మాళవరాజు విని మిగుల భయపడి యచ్చటనున్న ప్రాణంబులుదక్కవని నిశ్చయించి యెరులకుఁ దెలియకుండ మాళవదేశమునకుఁ బాఱిపోయె. తమరాజు పాఱిపోవుటఁజూచి యతనిసైన్యములన్నియు భయంబునఁబాఱిపోయి మాళవదేశమును జేరెను. అంతఁ బృథ్వీరాజు ప్రయాసపడకుండనే తోధారాజ్యంబు వశపఱచుకొని పురప్రవేశంబొనర్చి రాయలను సింహాసనమందు

కూర్చుండఁబెట్టి మరలఁ బట్టాభిషేకముగావించె. ఆసమయంబునఁ దోధాపుర వాసులు తమపూర్వప్రభువు వచ్చినందులకు నమితానందంబుచెంది తమతమరాజ భక్తిని వెల్లడించుచుఁ దగినకానుక లర్పించిరి. అందులకు సూరధానుండు సంతసించి ప్రజలయందుఁ బ్రేమఁజూపుచు నుచితమర్యాదల నొనర్చి సంతసింపఁ జేసె. అనంతరము సూరధాన్రాయలు గోపాలసింహునకు సేనానాయకత్వము నొసంగి వారల సంతసింపఁజేసెను. పిమ్మటఁ దనకుమారిక ప్రతిజ్ఞ నెఱవేర్చిన పృథ్వీరాజునకుఁ దారాబాయినొసంగి పెండ్లిచేయవలెననినిశ్చయించి పురంబునఁ జాటఁబంచె. మఱియుం నీశుభసందేశంబును చిత్తూరు పురాధిపతియగు రాయమల్లునకుఁ దెలుప నతఁ డమితానందంబుఁజెంది ధైర్యసాహసాదులచేఁ బ్రసిద్ధికెక్కిన తనకుమారునివివాహమును గన్నులపండువుగాఁ జూడవలెనని యచ్చటికేతెంచె. ఇంతియకాక యుభయపక్షములవారిబంధువులును, మిత్రులును, బరివారంబులతో వచ్చి తోధాపురంబున రాయలుచూపినమందిరంబులందువిడిసి వివాహమహోత్సవమునకయి ప్రతీక్షించుచుండిరి. ఇట్లుండ వివాహముహూర్తముంచినదినం బేతెంచె. అంత పురోహితు లేర్పఱిచిన ముహూర్తమందుఁ దారాబాయిని పృథ్వీరాజున కొసంగి వివాహంబు జేసె. ఆవధూవరులనుజూచి పురజనులును బంధువులును నమితానందంబునొంది యాశీర్వదించిరి. మఱియుం గుణంబులను, సుస్వభావంబునను బరాక్రమంబునను, ధైర్యసాహసాదులను, సౌందర్యముల కనురూపులయిన వధూవరులను గూర్చినట్టి బ్రహ్మచాతుర్యంబు నెంతయుం గొనియాడిరి. ఇట్లు నిరంతరాయముగాఁ దారాబాయీపృథ్వీరాజులవివాహమయిన పిమ్మట బంధుగులందఱు రాయల ననుమతిఁ గొని పోయిరి. ఆసమయంబున రాయమల్లు దనకుమారుని బిలిచి యిట్లనియె. నాయనా! నన్ను జరావస్థ చుట్టుముట్టుచున్నది. నాజరాభారంబు నేను మోయఁజాలకున్నాను. రాజ్యభారం బెట్లు భరింపఁగలను. ఇఁక సంగుఁడు వచ్చి రాజ్యమేలు నన్నయాశ లేదు. కావున నీవు వధూసంయుతుండవయి చిత్తూరువచ్చి, రాణాపదవి చేకొని నీకమీఁద శత్రువులబారిఁ బడకుండఁ గాపాడుచు దానిపూర్వపుకీర్తిని గాపాడుము. అని పలుకుచున్న

తండ్రి వాక్యంబులు విని పృథ్వీరా జిట్లనియె. నాయనా! సంగుఁడు సజీవుఁడయి యుండుట నిశ్చయము, పెద్దవాఁ డతఁడుండ నే రాజ్యంబేలఁజాలను అతఁడు వచ్చునందాఁక మీరు నిమిత్తమాత్రులయి చిత్తూరుఁ బరిపాలించుచుండుఁడు. నేను సర్వదా దానిని రక్షించుచుందును. అనిప్రార్థింప నతనిమాటలకలరి రాయమల్లు చిత్తూరున కరిగె. అనంతరము పృథ్వీరాజు వధూసంయుతుండయి రాయలను సమీపించి కమలమియరుకోటకుఁ బోవ ననుమతింప వేఁడుకొనెను. అంత రాయలు పృథ్వీరాజుంజూచి యిట్లనియె. ఓయీ ! ఈరాజ్యంబు నాకేల? నా కుమారికకు రాజ్యంబు లభించుటకేకదా యిన్నికష్టంబు లనుభవించితి. కావున మీరిట నుండకతీరదు. నావుడుఁ బృథ్వీరాజు, ఓమహారాజా! తమయభిప్రాయంబు తరువాత నెఱవేఱవచ్చును. మేము కమలమియరుదుర్గమునకుఁ బోయి యుందుము. కొంతకాలము దనుక నీ పీరాజ్యం బేలుచుందుము. తరువాత నీ కోర్కి దీర్చెద మనిచెప్పి యొప్పించి వధూసంయుతుండయి కమలమిరుదుర్గంబునకుఁబోయి యపారసౌఖ్యమ్ము లనుభవించుచుండెను.

ASAFIYA

తారాబాయి సమాప్తము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
"వావిళ్ల" ప్రెస్సున ముద్రితము.—1954.